



ఆతిథ్యము—పెమ్మరాజు లక్ష్మీపతిగారు ... ... ౧-౨

ఆంధ్రకవిత్వచరిత్రము—భోగరాజు నారాయణమూర్తిగారు ... ... ౩-౧౪

మహాసతిసీత—కలువలపల్లి రంగనాథశాస్త్రిగారు ... ... ... ౧౫-౧౬

శ్రీనాథుని భీమేశ్వరపురాణము—మామిడిపూడి వెంకటరంగయ్యగారు ... ౧౭-౨౩

పరాన్వేషణము—దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు ... ... ... ౨౩-౨౪

శాకుంతలనాయకుడు—గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు ... ... ౨౫-౩౫

కృష్ణానది—జి. జాషువకవిగారు ... ... ... ... ౩౬

సావిత్రి—కాశీసోమయాజుల సుందరరామమూర్తిగారు ... ... ౩౭-౪౬

దీపావళినాడు—వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు ... ... ౪౭

ఇల్లరికము—పాలపర్తి ఆంజనేయులుగారు ... ... ... ౪౮-౬౩

అంత్యసంప్రార్థన—నాదెళ్ల వెంకట్రావుగారు ... ... ... ౬౪

ఇదియేనా పునర్వివాహము?—శ్రీ వాసుదేవరావుగారు ... ... ౬౫-౭౮

లోకాలు నాకేలనే—తురగా వేంకటరామయ్యగారు ... ... ౭౮-౭౯

ఉద్భటారాధ్యచరిత్రము-పీఠిక—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ... ... ౮౦-౮౯

కాపుఁబడుచు—నిడమర్తి సత్యనారాయణమూర్తిగారు ... ... ౮౯

మొదటి జయసింహవల్లభుని నిడమఱ్ఱు శాసనము—మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ౯౦-౧౦౦

ఋతులక్ష్మి—మిత్తింటి నరసింహమూర్తిగారు ... ... ... ౧౦౧

ఫైజీ పారసీవచనమా?—ఉమర్ అలిషాకవిగారు... ... ... ౧౦౨-౧౦౪

పల్లవులు—న్యాయమూర్తి వేపారామేశంగారు ... ... ... ౧౦౫-౧౦౮

నేనె!—కంచర్ల బసవకోటిలింగంగారు ... ... ... ౧౦౮-౧౦౯

వేంకటేశ్వర వచనములు ... ... ... ... ౧౧౦-౧౧౧

బ్రహ్మగీతము—చేపూరు సింహాచలముగారు ... ... ... ౧౧౨-౧౧౪

వనవాసి—దుర్గమహంతి సీతారామశర్మగారు ... ... ... ౧౧౮
తేజోలేఖనము—పింజమూరి కృష్ణమాచార్యులుగారు ... ... ౧౧౯-౧౨౦
సేనాతివాక్యంబు—అధికార్ల సూర్యనారాయణరావుగారు ... ... ౧౨౦
వేదాంతవిమర్శ—సుసర్ల రామశాస్త్రిగారు ... ... ... ౧౨౧-౧౨౮
ప్రణయకలహము—త్రిపురాన వేంకట సూర్యప్రసాదరాయ కవిగారు ... ౧౨౯
ప్రాచీనభరతవర్షమునందు శూద్రులకుగల యధికారము—వేలూరి శివరామ
శాస్త్రిగారు ... ... ... ... ... ౧౩౦-౧౩౭
నాటకకళాసంస్కరణము—దుప్పూరి రామిరెడ్డిగారు ... ... ౧౩౮-౧౪౭
సుకవి—శ్రీ శేషాద్రి రమణకవులు ... ... ... ౧౪౭
సప్తమాంధ్ర ఆయుర్వేదమహాసభ—అధ్యక్షోపన్యాసము ... ... ౧౪౮-౧౫౩
తుమ్మెద—మిత్తింటి అన్నప్ప సోమయాజిగారు ... ... ౧౫౪-౧౫౬
శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులు—శ్రీ దై. కోటీశ్వరశర్మ శాస్త్రిగారు ౧౫౭-౧౬౦
శంకర స్తవకళానిధిః—నాగపూడి కుప్పుస్వామయ్యగారు ... ... ౧౬౦ త.
సాభిప్రాయవిశేషములు ... ... ... ౧౬౧-౧౬౭

## చిత్రములు

వర్ణచిత్రములు:—ప్రలోభనము; ప్రేమ—వేణుగానము.

సాధారణచిత్రములు:—బుద్ధుడు—అజశిశువు, యజ్ఞము; బుద్ధుడు—గోపగాలుడు-క్షీర పానము, బుద్ధుడు—సుజాత; బుద్ధనిర్వాణము, బింబిసారమహీపతి; కే. శే. సర్ పిట్టి త్యాగరాయ శెట్టిగారు, శ్రీయుత పి. టి. కుమారస్వామిగారు, బి. ఏ., అఖిలభారత దేవాంగమహాసభా హ్వానసంఘాధ్యక్షులు, శ్రీయుత యస్. సి. వెంకటప్పగారు, బి. ఎ., బి. యల్. అఖిలభారత దేవాంగమహాసభాధ్యక్షులు, సప్తమాంధ్ర ఆయుర్వేదమహాసభ, కపాలేశ్వరస్వామి రథోత్స వము-మైలాపూరు; మూకబధిరపాఠశాల (శ్రీ చిత్ర [illegible] శ్రీమతి కమలా బాయమ్మగారు, శ్రీమతి రాజామణి అమ్మగారు—వెండిరాటము [illegible] పొందుట; శ్రీమచ్ఛంకరభగ వత్పాదాచార్యులు, ఇతరచిత్రములు.




చెన్నపట్టణము మే ౧౯౨౫

సంపుటము ౨. క్రోధన సంవత్సరము వైశాఖమాసము సంఖ్య ౫.


# ఆతిథ్యము


పెమ్మరాజు లక్ష్మీపతి గారు


దయసేయుమో వసంతా ! వినూతనపల్ల,వారుణంబైన దేహంబు మెరయ
రావయ్య యోఋతురాజ! రాజితపుష్ప, మయకిరీటద్యుతుల్ మలసియాడ
విచ్చేయుమయ్య! వేవేగ దక్షిణమంద, మారుత! ప్రకటవిమాన మెప్ప
తరలిరావోయి! నిత్యానూనయౌవన, శ్రీవిశేషప్రభాజృంభితాంగ !

గీ. కోకిలాలాపములతోడ గుసుమసార, భములతోడను మత్తభృంగములతోడ
సుమపరాగంబుతోడ విశుద్ధతేజ, మడరఁ జనుదెమ్ము స్వాగతం బందుకొమ్ము.

చ. కొనుమిదె పాద్య మల్లచెఱకుంగడలం జెలువారువారి, చే
కొనుమిదె యర్ఘ్య మీకుసుమగుచ్ఛములందు స్రవించుతేనె, కై
కొనుమధుపర్క మిద్ది నవకోమలపల్లవనిర్మితంబు, నా
సనమిదె చందనార్ద్రసుమజాలవిరాజిత మిందు రమ్మికన్.

చ. తనువున హాయిగా వికసితప్రసవాళిపరాగరేణువుల్
గొనబుగ బూయువాడ గయికో[illegible]ంచుక యూడిగమ్మ, నీ
కనుగొనలందు [illegible] మెరుగారు [illegible]శచూపులన్
గొని తమి [illegible] నూతనయుగోదయరాగము లాలపించెదన్.

ఉ. వ్రాసిన వ్రాతలే తిరిగి వ్రాసియు నీవు వినూత్న వైభవో
ల్లాసము లాస్యమాడగ నిశాంతల మెల్ల నలంకరించ దే
రీ సరిపార లిట్లు రసస్పృష్టినొనర్చి? గ్రహింపుమోయి! నా
చేసిన సేవ, నూతనవిశేషము లేమియు లేకపోయెనన్.

చ. లలితములైన పల్లవములారగిని కోయిల కూయుగాక, ని
ర్మలకుసుమాసవంబు గొని త్రాగి మిళిందము మ్రోయుగాక, స
త్ఫలరస మానుచుగ్ మధురభాషలు కీరము వల్కుగాక, నా
కలవియె నీవిలాసము లతాంతమృదూక్తులఁగూర్చి పాడగన్ ?

గీ. శ్రావ్యతరముగ కుసుమమంజరుల మధ్య, గోకిలాలాపముల నీవు కూయుచుండ
నలరియాడెడు లేతవయస్సునందు, 'కో'యనక బాలు డెవ డూరకుండగలడో!

గీ. వసుమతీదేవిపావనవదనసీమ, భాసిలుచునున్న నవదరహాసవీథి
వ్యక్తమైనట్టి సౌందర్యభావ మీవ, పాడుకొనియెద నీకీర్తి భవ్యమూర్తి!

ఉ. మందసమీరుడేల? సుమమంజరులున్ బికగాన మేటికో
సుందరరూప! యొంటిమెయి జూడగ వచ్చిన నొప్పుగాక, ని
ట్లిందరి దోడితెచ్చి తిదియే రసికత్వము? చాలుజాలు నీ
చందము వింతగొల్పెడు వసంత! యొకింతయు జింత సేయవో!

చ. అలరుల జేరుగాత నవయౌవనమెల్లను నీపికాంగనా
కలరవ మస్మదీయమగుగానము జేకొనుగాక; మారుతా
వళిగొనుగాక కైత రసవార్ధిమునింగి యనంగవైఖరిన్
నిలిచెదమోయి శేషమయి నీవును నేను వసంతలీలకున్.

# ఆంధ్రకవిత్వ చరిత్రము

భోగరాజు నారాయణమూర్తి గారు

## X

## ఆంధ్రకవితాపోషకులు

మనుమసిద్ధితరువాతఁ దిక్కనయే యీ యుగమునందలి సుప్రసిద్ధకవితా పోషకుఁడు. ఇంతవఱకు రాజులే కాని రాజాస్థానములలోని యున్నతోద్యోగస్థులు కృతిపతిత్వమును వహించు నాచారములేదు. ఇట్టి కృతికర్తలలో మొదటివాఁడు తిక్కనయే. మనయాంధ్రకవిత్వచరిత్రమునందుఁ జేర్కొనఁబడినరాజు లేయేమహాగుణములచే విఖ్యాతిఁగాంచిరో యాయా మహాగుణములేకాక, తిక్కన యంతకంటె నెక్కుడు సద్గుణసంపన్నుండగుటచే సామాన్యమంత్రిమాత్రుఁడని యూహించుటకు వీలులేదు. మఱియు రాజ్యభ్రష్టుఁడైన సిద్ధిరాజునకు రాజ్యప్రాప్తి గలిగించిన మహనీయుఁడగుటచే వానిని రాజరాజని చెప్పవలసి యున్నది. సిద్ధిరాజరాజ్యస్థాపనాచార్యుఁడగుటవలన నతఁడు నాఁటిరాజులందఱచేఁ బూజింపంబడుచుండుటఁబట్టి,

'నృపమాన్యుఁడు'
'భూ విను తిపాత్రుఁడు'
'తేజోరాజిత సర్వలోకుఁడు'
'పారావారపరీత విశ్వవసుధాభాగంబునంగీర్తికాధారంబై వెలుగొందువాఁడు'

ఈమొదలైన సామాన్యరాజుల కుపయోగింపరాని విశేషణములతోఁ గేతన తిక్కననువర్ణించెను. మఱియు సుప్రసిద్ధకవితాపోషకులైన రాజులలో ననేకులతోఁ దులఁదూఁగుటకుఁగాని యనేకుల నతిశయించుటకుఁగాని యాచంద్రతారార్కమైన వాని భారతరచన మొక్కటియే కారణముగాదు. రాజనరేంద్ర కృష్ణరాయాది మహారాజులు కవితయెడలను గవులయెడలను వర్తించిన వర్తనముతోఁ దిక్కనవర్తన మన్నివిధములఁ బోలియున్నదని వానిజీవితాంశవిశేషములను వర్ణించిన కేతనకృతులవలన స్పష్టమగుచున్నది.

"౧. సుకవీంద్ర బృందరక్షకుఁ డెవ్వఁడనిన వీఁ
డనునాలుకకుఁ దోడపైనవాఁడు.

౨. కృతులు రచింపఁగ సుకవుల
కృతు లొప్పఁ గొనంగ నొరునికిం దీరునె వా
కృతినిభుఁడు వితరణశ్రీ
యుతుఁ డన్నమసుతుఁడు తిక్కఁ డొకనికిఁ దక్కన్.

3. సరసకవీంద్రుల సత్ప్రబంధము లొప్పఁ
గొనునను టధికకీర్తనకుఁ దెరవు.

౪. అర్థిమైఁ బెక్కూళ్ల నగ్రహారంబులఁ
గా నిచ్చుననుట పొగడ్త పోలము."

ఇంతియేకాక కవీంద్ర లోకాధారుఁడ నియు,పోషిత సత్కవీంద్రుఁడనియు, సారకవి తానిర్మాణచాతుర్యుఁడనియు, ఆర్యభోజుఁడ నియు, కవితాధన్యుఁడనియు, కవిలోకచాతక వ్రజనవజలద స్తనితభాషణ ప్రకరుఁ డనియు, ననేకవిధముల, రాజనరేంద్రునిఁగూర్చి నన్న యయుఁ, గృష్ణరాయలం గూర్చి పెద్దనయు నుపయోగించిన విశేషణములకుఁ దక్కువకా నివిశేషణములు కవిబ్రహ్మంగూర్చి యభినవ దండి యుపయోగించుటచేతఁ గవితాపోషణ మునం దమ్మహామహుఁడు సుప్రసిద్ధకవితా పోషకులైన రాజరాజాదులకుఁ దక్కువకాఁ డని నిశ్చయింపవచ్చును. అందుచే నాంధ్ర కవితాపోషకులైన మహారాజులలోఁ దిక్కన కిరీటములేని మహారాజు.

నందూరి గుండనమంత్రి

తిక్కనతరువాత నీయుగములో గణింపఁ దగిన కవితాపోషకుఁడు నందూరి గుండన మంత్రి. ఈతఁడు మంచన రచించిన కేయూర బాహుచరిత్రమునకుఁ గృతిపతి. గుండనమంత్రి బ్రాహ్మణుఁడును, మంత్రికుటుంబములోనివాఁ డును, గవితాప్రియుండునునైనను, దిక్కనతో నుపమించుట కేవిషయమునందును దగిన ఘన తగలవాఁడుగాఁ గన్పట్టఁడు. కాని మంచన వర్ణించిన గుణవిశేషణములంబట్టి గుండన మంత్రి యాంధ్రకవితాపోషకులలోఁ జేర్పఁ దగియున్నవాఁడు.

1 "తోడఁ బుట్టఁ గట్టఁగ నిడఁ గల్గునట్లుగ
సహకుటుంబులఁ గవిజనులఁ బ్రోచు"

2 "గర్జితదానవృష్టి కవిగాయక పోషకదృష్టి యుష్మహీన్"

3 "సరససుకవిగోష్ఠీ సంభవానందచేత స్సరసిజుఁడు"

4 "భ్రాజితమృదుమధురకావ్య పరిణతుఁడు"

కృతిపతిత్వమును వహించిన యీగుం డనమంత్రి మొదలుగ నించుమించుగ రాయల వఱకుంగల కవితాపోషకులలో ననేకులు మంత్రులును సేనానాయకులు నగుటచేతను, సుప్రసిద్ధులైన రాజులు మిక్కిలి తక్కువ గానుండుటచేతను, గుండనమంత్రి నాఁటికే యాంధ్రకవిత్వమునకు రాజాదరణదశ యిం చుక తప్పినదని చెప్పవలసి వచ్చుచున్నది. గుండనమంత్రివలెనే యీ యుగమునందుఁ జేర్కొనవలసిన కవితాపోషకుఁడు కాకతి ప్రతాపరుద్రుని సేనానియగు నాగయగన్నఁడు.

నాగయగన్నడు

ఈతఁడు వ్రాయించిన గ్రంథము సుప్రసిద్ధ మగుమారనమార్కండేయ పురాణము. ఈ నాగయగన్ననికృతిస్వీకారము, ఆంధ్రకవిత్వ ము రాజాదరణదశనుండి తప్పినదనుటకు మఱి యొక సాక్ష్యమగుచున్నది. కాకతిప్రభువులు మహాసామ్రాజ్యధురంధరులు. వారికాలములో రచింపఁబడిన కావ్యములకెల్లఁ గృతిపతులు తత్సేనానులు, మంత్రులేకాని, గాకతీయ రాజులు స్వయముగ వ్రాయించి కృతి వహిం చిన యాంధ్రకావ్యము లెవ్వియును గాన రావు. చాళుక్యచోళరాజాదులవలెఁ గాకతీ యరాజులుసైతము నాంధ్రకవితోద్ధారణము నకై స్వయముగాఁ బూనుకొనియుండినయె డల మనవాఙ్మయ మింతకంటెను నెక్కుడు ప్రసిద్ధిగాంచియుండును.

విఖ్యాత పురుషులగు భారతకవులలో నొకఁడైన యెఱ్ఱాప్రగడసైతము మొట్టమొదట వేమభూపాలునితమ్ముఁడును, సేనానియు నగు మల్లనాయకునిచే నాదరింపఁబడినవాఁడగుటచేత నెఱ్ఱనయుగమునందలి కవిత్వము గూడ రాజాదరణదశతోఁ బ్రారంభించియుండలేదు. ఎఱ్ఱన కొంతకాలము మల్లనాయకుని పోషణముక్రిందనుండినట్లును, వానియాశ్రయమునందు గొప్ప యైశ్వర్యవంతుఁడైనట్లును, పిదప మల్లనాయకునిచే నాతఁడు వేమభూపాలున కప్పగింపఁబడినట్లును, హరివంశములోని యీ క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

"నాతమ్ముండు ఘనుండు మల్లరథినీ
నాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁజేసి యెలమిం
జేపట్టి మాకిచ్చుటన్."

మల్లనాయకుని పోషణము క్రింద నున్న కాలములో నెఱ్ఱాప్రగడ కొంత గ్రంథరచన గావించియుండకపోఁడు. ఎట్టి కావ్యరచనకును బ్రోత్సహింపక యే యొకానొకకవి నొకప్రభువు వ్యర్థముగాఁ గూర్చుండఁబెట్టి పోషింపఁడుగదా? అందుచే మల్లసేనానియాశ్రయమున నున్న దినములలో నెఱ్ఱన రచించినకావ్యముగాని కావ్యములుగాని వానిరామాయణమువలెనే మనకులభింపలేదని యూహింపవలసియున్నది. మఱియు నెఱ్ఱనంగూర్చి చెప్పఁబడిన

"సకలభాషాకవిత్వ విశారదుఁడవు
సాధుసమ్మతుఁడవు నిత్యసౌమ్యమతివి"

అను వాక్యములవలన నతఁడొక్క తెనుఁగు కవిత్వమే కాక పెక్కుభాషలయందుఁ గవితాసామర్థ్యము గలవాఁడని తెలియుచున్నది. కావున మల్లనాయకుని కృతినాయకత్వమున రచించిన కావ్యములు ప్రాకృత సంస్కృతాది భాషలలోనివై యుండును.

### వేమభూపాలుఁడు

ఇట్లు మల్లసేనానిచేఁగొంతవఱకుఁ బ్రోత్సహింపఁబడినవాఁడైనను వేమభూపాలునికొలువునందే యెఱ్ఱన కెక్కుడు ప్రసిద్ధి వచ్చినది. అన్నిదశలకంటె రాజాదరణదశయే యాంధ్రకవిత్వమున కున్నతమైన దశ. తనతమ్మునిచేఁ దనకప్పగింపఁబడిన శంభుదాసు నాదరించి వేముఁడు మొదట వానిచే రామాయణమును వ్రాయించెను. మఱియుఁ దద్రామాయణకృతిపతిత్వమునుగూడఁ దానే పొందినట్లీక్రింది పద్యభాగమువలన స్ఫురించుచున్నది.

"చేతోమోదముతోడ రామకథ
మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం గాంచితి నింకనుం దనియ
నేఁ గావ్యామృతాస్వాదనన్"

రామాయణము తరువాత వేముఁడు కృతిపొందినకావ్యము హరివంశము. ఈ హరివంశమున కాంధ్రవాఙ్మయమున నున్నతస్థానమొసంగఁబడుటచేతఁ దత్కృతిపతియైన వేముఁడు మనకవితాచరిత్రమునందు సుప్రసిద్ధకవితాపోషకులలోఁ జేర్పఁబడుచున్నాఁడు. కవితాపోషణమునందేకాక పాండిత్యమునందుఁ గూడ వేముఁడు గొప్పప్రసిద్ధుఁడు. సంస్కృతాంధ్రములయం దత్యంత ప్రతిభగలవాఁడు. అమరుకకావ్యమునకు సంస్కృత వ్యాఖ్య వ్రాయుటచేతఁ గవితాపోషకులైన రాజులలో

నిట్టి పండితరాజులు లెక్కకుమాత్రమే కల రని చెప్పవలసియున్నది.

బుక్కరాయలు

వేమభూమీశ్వరుని తరువాత నీయుగ ములో స్మరింపఁదగిన కవితాపోషకుఁడు విద్యా భిధాననగరపరిపాలకుఁడైన బుక్కరాయలు. ఈబుక్కరాయల కాంధ్ర వాఙ్మయముతో సంబంధమున్నట్లు మొన్న మొన్నటి వఱకు నాంధ్రదేశ మూహించియుండలేదు. ఇటీవల మైసూరురాజ్యమునందలి కోలారు మండలమున నూతనముగా లభించిన యొక తామ్రశాసనమువలన నీరాజు నాచనసోము నకుఁ బోషకుఁడైనట్లు తెలియవచ్చుచున్నది. అనఁగా- పెంచుకలదిన్న యను పూర్వనామ ముగల గ్రామ మొకటి బుక్కరాయపుర మను నూతననామముతో నూటపదిభాగము లుగాఁ జేయఁబడి వానిలో ముప్పదియాఱు భాగములు బుక్కరాయలచే సోమున కొసం గఁబడెనట! ఇంతకంటె నీశాసనమునుబట్టి బుక్కరాయల కవితాపోషకత్వమునుగూర్చి గాని, సోమునకును వానికింగల సంబంధవిశే షముం గూర్చిగాని వివరించునాధారము లేమి యును గానరావు. ఉత్తరహరివంశముగాక సోముఁడు వసంతవిలాసమను ప్రబంధమును గూడ రచియించినాఁడని వీరేశలింగముపంతు లుగారు వ్రాయుచు, దానియందలివని మూఁ డుపద్యములనుమాత్రమే యుదాహరించిరి. ఆ వసంతవిలాసములోనియట్టిపద్యములెన్ని లభించెనో యెచ్చటలభించెనో, పంతులుగారు వివరించియుండలేదు. పైశాసనములోఁ గవికి జరిగిన సన్మానమునుబట్టి యీవసంతవిలాస మునకు బుక్కరాయలు కృతిపతియైయుండు నేమో యని తోఁచుచున్నది.

విశ్వేశ్వరరాజు

రాజనరేంద్రునిసంతతివాఁడైన చాళు క్యవిశ్వేశ్వరుఁడు బుక్కరాయల కంటెను బ్రశంసింపందగిన కవితాపోషకుఁడు. ఇతఁడు విన్నకోటపెద్దనచేఁ గావ్యాలంకార చూడా మణి యను లక్షణగ్రంథమును వ్రాయించి కృతినొందినవాఁడు. ఈవిశ్వేశ్వరుని విద్యా వ్యాసంగమును గూర్చియుఁ గవితోద్ధారణ ప్రయత్నముం గూర్చియు, పెద్దన చెప్పిన యీపద్యములవలనఁ దేటపడుచున్నది.

"సి. వేదశాస్త్రరహస్యవిధులెల్లఁ బరికించి
సమ్యఁ జతుర్వర్గపశక్తి నొంది,
రాజవిద్యాతంత్రశక్తి సంభావించి
వర్ణక్రమంబుల వల నెఱింగి,
జ్యోతిషాయుర్వేద సంగతి నెగడొంది
సంగీత సాహిత్యసరణి నేర్చి,
తురగేభరోహణాదుల విశ్రుతికి నెక్కి
యాయుధవిద్యల నతిశయిల్లి,
యచట నచ్చటనున్న కావ్యాగమములఁ
జెలఁగి సత్కవిసౌకర్యసిద్ధికొఱకు
నొక్కచోటనె యొడగూర్ప నుత్సహించి
సత్కళావర్తి విశ్వేశచక్రవర్తి.

ఉ. భావరసప్రపంచమునఁ బర్వ నలంకృతిలక్షణంబు,ఛం
దోవిచితిప్రచారము గుతూహలదస్ఫురదంధ్రదేశభా
షావిధిప్రసంగముల చందము నందముగా నొనర్చి వి
ద్యావిధి గానిపించుటగదాచతురత్వమనంగ మేదినిన్."

కందనమంత్రి

విశ్వేశ్వరరాజు తరువాత నీయుగము లోని కవితాపోషకులు మంత్రులేకాని రాజు

వారు గానరారు. అట్టి మంత్రి శేఖరు
లలో ముఖ్యుఁడు కందనమంత్రి. గోదా
వరికి దక్షిణమునందున్న సబ్బినాటి రాజ్య
మును రామగిరి పట్టణము రాజధానిగాఁ
బరిపాలించిన ముప్పరాజున కీకందనమంత్రి
మంత్రిగానుండెను. ఇతఁడు మడికిసింగన్నచేఁ
బద్మపురాణమును భాగవతదశమస్కంధ
మును వ్రాయించి కృతిపతిత్వమును బొందెను.

వల్లభరాయఁడు

వీనితరువాత వినుకొండ వల్లభరాయఁడు
క్రీడాభిరామ మనుపేర దశరూపకములలో
నొకటియైన వీధినాటకమును రచించి, యాం
ధ్రకవిత్వమున కొకనూతనశోభ గలిగించెను.
తెనుఁగున దృశ్యకావ్యములు రచించు నా
చార మీవల్లభరాయఁడు తప్ప మఱియెవ్వరు
నవలంబించియుండలేదు. ఏతత్క్రీడాభిరామ
కృతి కర్తృత్వము శ్రీనాథునియందారో
పించిన యప్పకవిమతమును వీరేశలింగము
పంతులుగారు యుక్తియుక్తముగ ఖండించి
కృతికర్త శ్రీనాథుఁడే యని సిద్ధాంతము చేసి
నారు. ఈకవిశేఖరుఁడు హరిహరరాయల
రత్నభాండారాధ్యక్షుండగుటయేకాక,

'మూఁడుగ్రామగ్రాసములతోడఁ గూడంగ
మోపూరు పాలించె ములికినాట'

అను క్రీడాభిరామములోని పద్యభాగము
వలన ములికినాటను మూఁడుగ్రామగ్రాసము
లతో మోపూరు పరిపాలించినట్లు తెలియు
చుండుటచే నితఁడు కవిమాత్రమేకాక సామం
తుఁడుగూడ నైయుండునని కవితాపోషకు
లలోఁ జేర్పవలసివచ్చినది.



ఈ వల్లభామాత్యునితో నీయెఱ్ఱనయు
గము ముగిసి పోతన శ్రీనాథయుగము
ప్రారంభించుచున్నది. శ్రీనాథుఁడు రెడ్లయా
స్థానకవీశ్వరుండనియు నాంధ్రకవిత్వోద్ధార
ణమునకై రెడ్డిరాజులు మిక్కిలి పాటుపడి
రనియు నాంధ్రదేశమునఁ బారంపర్యముగా
వాడుకగలదు. కాని శ్రీనాథునినాఁటి రెడ్డిరా
జులలోఁ గృతిపతియైనవాఁడు శ్రీనాథకృత
కాశీఖండకృతిపతియైన వీరభద్రారెడ్డి యొ
క్కఁడే. తక్కిన శ్రీనాథకృతిపతు లెల్లరును
గూడ రెడ్డిరాజుల మంత్రులో సేనానాయ
కులో భాండాగారాధ్యక్షులో యగుచు
న్నారు.

౧. పండితారాధ్యచరిత్రము కృతిపతి, వేమారెడ్డి సేనానాయకుఁడైనమామిడి, ప్రెగ్గడయ్య.
౨. శృంగారనైషధము కృతిపతి, వేమారెడ్డి సేనానాయకుని తమ్ముఁడైన మంత్రి సింగన్న.
3. భీమఖండము- కృతిపతి, వీరభద్రారెడ్డిమంత్రియైన బెండపూడి యన్నామాత్యుడు.
౪. కాశీఖండము- కృతిపతి, వీరభద్రారెడ్డి.
౫. హరవిలాసము-కృతిపతి, వేమారెడ్డి సుగంధభాండారాధ్యక్షుఁడైన సిరియాల తిప్పయ్య.

తనకృతిపతులైన యీమంత్రి సేనానాయ
కాదులసాహాయ్యమువలన శ్రీనాథుఁడు రెడ్డి
రాజుల దర్శింపఁగలుగుటయేకాక తన యద్భు
తకవితాశక్తి ప్రదర్శించి మెప్పించుచు వారి
నుండి యనేక బహుమానములను బొం
దుచుండెను. కృతి యొసంగుటచేఁ గాక,
కేవల కవితాప్రదర్శనముచేతనే కదా
ప్రౌఢదేవరాయలచేఁ గవిసార్వభౌమబిరు

దము శ్రీనాథుఁడు సంపాదింపఁగలిగెను! మొత్తముపై నెల్లనయుగములోని వేమభూపాలునివలె నీయుగమునందుఁగూడ రెడ్డిరాజులే సుప్రసిద్ధకవితాపోషకులని చెప్పకతప్పదు. కృతిపతిత్వమును బొందినను బొందకపోయినను గవితాభిమానముచే శ్రీనాథు నేయేరాజులేయేవిధముగ సన్మానించుచుండిరో యీ క్రిందిపద్యమువలనఁ దెలిసికొనవచ్చును.

సీ. కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయఁడిచ్చు
కైలాసగిరిఁ బండె మైలారువిభుఁ డేగి
దినవెచ్చ మేరాజు దీర్పఁగలఁడు
రంభఁ గూడెఁ దెనుంగురాయరాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలదు
భాస్కరుఁడు మున్నె దేవునిపాలికరిగెఁ
గలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు
దివిజకవివరుగుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి.

### సిద్ధనమంత్రి

రెడ్డిరాజుల తరువాత నీపోతనశ్రీనాథయుగమునందలి కవితాపోషకులలో సిద్ధనమంత్రి ముఖ్యుఁడు. ఈసిద్ధనమంత్రి కర్ణాటకరాజ్యాధీశుండైన దేవరాయ మహారాజునొద్ద మంత్రిగా నుండెను. ఈతఁడు జక్కన యను కవిచే విక్రమార్కచరిత్రమును వ్రాయించి కృతిఁబొందినవాఁడు. తద్గ్రంథమునందు వర్ణింపఁబడిన యీతని యాస్థాన వర్ణనముం బట్టి యీసిద్ధనమంత్రి నిరంతరకవిపండితాదరణైకశీలుండని తెలియుచున్నది.

సీ. నవరసోజ్జ్వల కావ్యనాటకాలంకార
నికషోపలవివేక సుకవివరులు
శ్రీమహాభారతరామాయణాదిపు
రాణపారీణ పౌరాణికులును
వేదాంతవైశేషికాదిషడ్దర్శన
తర్కకర్కశులైన తార్కికులును
దత్తిలభరతమతంగ కోహళమత
ప్రముఖసంగీతపారంగతులును
మహిమఁ గొలువంగ నాస్థానమండపమున
జనితసాహిత్యసౌహిత్యసరసగోష్ఠిఁ
జిత్త మిగురొత్త జన్నయసిద్ధమంత్రి
కొలువుకూర్చుండి నను వేడ్కఁ బిలువఁబంచి.

### గంగయామాత్యుఁడు

పిదపఁ బేర్కొనవలసినవాఁడు చెందలూరి గంగయామాత్యుఁడు. ఇతఁడు భారతానుశాసనికపర్వములోని కథ ననుసరించి నాచికేతూపాఖ్యానమను కావ్యమును, శ్రీనాథునిశిష్యుఁడును మఱఁదియు నగు దగ్గుపల్లి దుగ్గయ్యకవిచే వ్రాయించి కృతిఁబొందెను. విజయవాటీ కనకదుర్గా కటాక్షవీక్షణమును బడసిన మాధవవర్మ సంతతిలోని వాఁడును, కొండవీటి రాజ్యాంతర్గతానేక దుర్గాధ్యక్షుఁడును నగు పూసపాటి బసవభూపాలున కీగంగయామాత్యుఁడు మంత్రిగా నుండెను. ఈ మంత్రియేకాక వీనిప్రభువైన బసవభూపాలుఁడును దూబగుంట నారాయణకవికృతమగు పంచతంత్రమునకుఁ గృతిపతియై కవితాపోషకులైన రాజులలోఁ నొకఁడుగ బరిగణింపఁబడుచున్నాఁడు. మంత్రియైన గంగయామాత్యుఁడత్యంత కవితాప్రియుం డగుటచే నొక్క

...బోధోపాఖ్యానము నేకాక, * నందిమల్ల ... ఘంటసింగయ్య యను జంటకవులచేఁ ...బోధచంద్రోదయమును వ్రాయించి దాని ...దానే కృతిపతియయ్యెను. ఈ మంత్రిశేఖ ...ుడు సాళువగుండ నృసింహరాజునకు మిత్రుఁ ...నట్లు ప్రబోధచంద్రోదయములోని యీ ...క్రింది పద్యము చెప్పుచున్నది.

క. శ్రీకరవీక్షణదాన
శ్రీకర నరసింహనృపవశీకర నయవి
ద్యాకరణ చతుర్దశ వి
ద్యాకర ధీరంగమతి యనంతయగంగా!

ఇంతియెకాక యీ మంత్రిసత్తముఁడు సామాన్యమంత్రిమాత్రుఁడుగాక ప్రఖ్యాత పురుషుఁడై యుండియుండునని యూహింప నవకాశములు గానవచ్చుచున్నవి.

నరసింహరాయలు

ప్రబోధచంద్రోదయముగాక పైని బేర్కొనిన జంటకవులు రచించిన మఱియొక గ్రంథమగు వరాహపురాణమునకుఁ గృష్ణరాయల తండ్రియైన తుళువ నరసింహరాయలు కృతినాయకుఁడయ్యెను. అప్పటి కీనృసింహరాజు రాజుగాక, సాళువగుండ నరసింహరాజుకడ దండనాథుఁడుగాఁబని సేయుచుండెను. ఈతుళువ నరసింహరాయ లొక్కయాంధ్రకవిత్వము నే కాక,

"అష్టభాషాకవిత్వాబ్జసంభవులైన
సుకవిపుంగవులు సంస్తుతులు సేయ"

అను వరాహపురాణములోని పద్యభాగము వలనఁ దదితరభాషాకవులకు సైతము పోషకుఁడై యుండినట్లు తెలియుచున్నది. కృష్ణరాయల కవితాభిమానము వానితండ్రి నుండియు వచ్చుచుండినదియే కాని వానినాఁడే జనించినది కాదు.

సాళువగుండ నృసింహరాజు

ఈనృసింహరాయలకుఁ బ్రభువైన సాళువగుండ నృసింహరాజు సైతము ప్రసిద్ధకవితాపోషకుఁడని చెప్పఁ దగియున్నాఁడు. ఈతని కాశ్రితుఁడైన కవి ప్రసిద్ధాంధ్రకవిశేఖరుండైన పిల్లలమఱ్ఱి పినవీరన యన్ని చెప్పుటకంటె వీనిఘనత వేఱుగ వర్ణింపనక్కఱలేదు. ఇతఁడు కృతిపొందిన కావ్యరత్నము జైమినిభారతము. కవితారచనం గూర్చియుఁ గావ్యరచనావిధానముం గూర్చియు నీతని యభిప్రాయములు కనుఁగొనినయెడల నీ నృసింహరాజు, కవితయందు మిక్కిలి పరిణతి చెందినవాఁడే కాని సామాన్యుఁడుగాఁడని తెలియఁగలదు.

---

* ఇరువురుకవులు కలిసి యొక కావ్యమును వ్రాయు నాచారమునకు వీరే మార్గదర్శకులు. నన్నయనారాయణభట్టు సాహాయ్యమును బొందినను భారతకృతికర్తృత్వముమాత్ర మొక్క నన్నయపేరనే యున్నది. పైని బేర్కొనిన జంటకవులనాఁటినుండి నేఁటివఱకుం గల మధ్యయుగములలో నిట్టికవులున్నట్లు కానరాదు. మన వీరేశలింగయుగమునందలి జంటకవులగు తిరుపతి వేంకటేశ్వరకవీశ్వరులు, కొప్పరపుసోదరకవీశ్వరులు, రామకృష్ణకవీశ్వరులు, వేంకటపార్వతీశ్వరకవీశ్వరులు మిక్కిలి సుప్రసిద్ధులు. ఇందు వేంకటపార్వతీశ్వరకవీశ్వరులు ఆశుకవితావధానాదికములు విడిచి ... ప్రసిద్ధజీవితములను గావ్యరచనమునందే వినియోగించుచున్నారు. వీరి కవితాపటుత్వము ప్రకృతి సౌందర్యాభివ్యక్తి ... చెలిమికత్తె. ఈ వివరములను వీరేశలింగయుగకవిత్వ చరిత్రమును వ్రాయు సందర్భమున వ్రాయు

" ఉ. ఆహుస ప్రసంతతుల
యందును నొక్కొకకాలమందు వి
చ్ఛేదముగల్గు నాఁటిటికిఁ
జెప్పవిపర్యయ మేయుగంబునన్
లేదు కవిత్వసంతతికి
నిక్కము తత్కవితావిలాసమున్
జాదులు నిప్పదేవము
ప్రసాదమునా హరికీర్తనంబునన్.

క. నామది నిరతము భారత
రామాయణకథలఁ బ్రేమ రంజిలు నందున్
జైమినిభారత మనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్.

గీ. ఆపురాణము గనఁ దెనుఁగయ్యె నేనిఁ
జెప్ప నేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁడేనిఁ
దేనుఁగు నుడికారమున మించుగనియె నేనిఁ
గుందనము కమ్మవలచిన చందమగును."

చిల్లర – వెన్నయ్య

పినవీరభద్రుఁడు రచించిన మఱియొక కావ్యమగు శకుంతలాపరిణయము, ఒకరాజుగాని మంత్రిగాని కాక సామాన్యగృహస్థుఁడగు చిల్లర వెన్నయ్యయనువాని కంకిత మీయఁబడెను. ఈవెన్నయ్య నియోగి బ్రాహ్మణుఁడు. వీని వాసస్థానము నెల్లూరిమండలములోని బిట్రగుంటకు సమీపమునందున్న సోమరాజుపల్లి. కవితారసజ్ఞులైన రాజాధిరాజులు గ్రహింపఁదగిన శకుంతలాపరిణయమువంటి మహాకావ్యమొక సామాన్యగృహస్థున కంకితమీయఁబడుటకంటె, రాజాదరణదశనుండి యాంధ్రకవిత్వము ప్రజాదరణదశలోనికి మాఱుచుండెననుట కింకెట్టి తార్కాణము కావలెను? వెన్నయ్య కావ్యరచనంగూర్చి కవికిఁ జెప్పిన విధానములఁబట్టి రసజ్ఞుఁడనియు గొప్పసంస్కారియనియుఁ దేటపడుచున్నది.

"సీ. సరపువ్వులుగ మాలకరి పెక్కు తెఱఁగుల
విరుల నెత్తులుగఁ గావించినట్లు
కర్పూరకస్తూరికావస్తువితతిచే
శ్రీఖండచర్చ వాసించినట్లు
ఒడికంబుగాఁ గందవొడికి నానాసూన
పరిమళంబులుగూడఁ బరచినట్లు
సరఘులు వివిధపుష్పమరందలవములు
గొనివచ్చి తేనియఁ గూర్చినట్లు
భారతప్రోక్తకథ మూలకారణముగఁ
గాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోక్తికి నభినవశ్రీ వహింపఁ
గూర్చిఁ గృతిసేయు నాకు శాకుంతలంబు."

రాఘవభూపాలుఁడు

ఈపోతన శ్రీనాథయుగములోని కవితాపోషకులలోఁ గడపటివాఁడు రావ్రూరి రాఘవభూపాలుఁడు. ఈతఁడు రెడ్డికులస్థుఁడు. నెల్లూరుమండలములోని పాకనాటిసీమయందలి కందుకూరుతాలూకునందుగల గుడ్లూరున కధీశ్వరుఁడు. ఈరాఘవరెడ్డి ప్రసిద్ధకవిసత్తముండగు వెన్నెలగంటి సూరనచే విష్ణుపురాణమును వ్రాయించి కృతిపొందెను. విష్ణుపురాణములోని,

" వేదాంతవిదులైన విద్వాంసు లొకవంక
నుభయభాషాకవు లొక్కవంక"

అను పద్యపాదమువలన రాఘవరెడ్డి యుభయభాషలయందును నభిమానము కలవాఁడనియు వేదాంతమునందును బ్రవేశమున్నవాఁడనియుఁ దెలియుచున్నది. ప్రస్తుతయుగమునకు సంబంధించినట్టియు, చారిత్రకాంశములయందు సందేహాస్పదులైనట్టియు, అంతగాఁ బ్రసిద్ధపురుషులుగానట్టియు, సామాన్యకృతి

[illegible] గ్రంథవిస్తరభీతిచే నిచ్చటవిడుచు
చున్నాను.

పెద్దనయుగము – కృష్ణదేవరాయలు

మహాభారతాంధ్రీకరణమునకై నన్న
పార్యునిచే రాజరాజు శ్రీకారమును జుట్టించి
నది మొదలు రమారమి యైదువందలసంవత్స
రముల కాలపరిమితిగల యీనాలుగుయుగ
ములయందును, ననేకాంధ్రరాజులచే ననేక
విధముల నాదరింపఁబడుచుఁ గ్రమక్రమము
గా రాజాశ్రయపటుత్వము నుదప్పి, రాజ
మంత్రులు, రాజసేనానులు, తదితరరా
జోద్యోగస్థులును, గడకు సామాన్యగృహస్థు
లుఁగూడఁ దనకొసంగు కైదండలకాసించుచు,
నింకఁ బ్రజాదరణముపైనే ప్రాణములు నిలువఁ
బెట్టుకొనవలసివచ్చునను నవస్థ తనకుఁ దటస్థిం
చునేమో యని యున్నదుస్థితియందు, అట్టి
యాంధ్రకవిత్వమును సముద్ధరింపఁ జక్రధరుని
వలెఁ గర్ణాటకరాజ్యచక్రధరుండగు శ్రీకృష్ణ
దేవరాయలు సమకట్టి కర్ణాటకాంధ్రరాజ్య
ములను నాంధ్రకవితా ప్రవాహమునందుఁ
దెప్పలుగాఁ జేసి, రాజరాజునాఁటి గౌరవోన్న
తులు మరల నాంధ్రవాఙ్మయమున కొనగూ
ర్చుటచే నిమ్మహనీయుఁడు మనకవితాపోషకు
లలో నెంతటి యగ్రస్థానము నలంకరింపవల
సినవాఁడో వివరింప నక్కఱలేదు. నన్నయ
యుగమునందు రాజరాజునుంబోలెఁ బెద్దన
యుగమునందు రాయలను స్మరింపక కవితా
ప్రసంగమే లేదు. ఇప్పట్టున నీతఁ డవతరించి
యుండకపోయినయెడలఁ బ్రబంధయుగ మింత
తోఁబ్రారంభించి యుండదేమో యని తోఁచు
చున్నది. ప్రారంభించియుండినను బ్రబంధ
ముక్తాహారమున మేరువుపూస యనందగిన
మనుచరిత్రమువంటి సర్వలక్షణ లక్షితంబగు
సుప్రసిద్ధ ప్రబంధము మాత్రము ప్రబంధరచ
నకు మార్గదర్శకముగా వెలసియుండకపోవును.

ఆంధ్రదేశ రాజ్యాంగచరిత్రమునందును,
ఆంధ్రకవితా చరిత్రమునందునుగూడ నత్యం
తవిఖ్యాత పురుషుండగు రాయ లాంధ్రుఁడే
మోయను భ్రమ పొడమకమానదు. కాని
విమర్శదృష్టితోఁ జారిత్రకపరిశోధనము గావిం
చునెడ నట్టిభ్రమ తొలంగి రాయలు కర్ణాట
కుఁడేయని నిశ్చయము కాఁగలదని తోఁచుచు
న్నది. కృష్ణరాయల సుప్రసిద్ధిం దలంచి
యాంధ్రులవలెనే యావలఁ గర్ణాటకులుఁ
గూడ గర్వపడుచున్నారు. తెనుఁగునం దేకాక
కర్ణాటభాషయందును నాతని శాసనములు
గలవు. నాంధ్రకవిత్వమునేకాక కర్ణాటకవిత్వ
మును సైతము నతఁ డెంతయుఁ బ్రోత్సహిం
చెను. తెనుఁగున మనుచరిత్రాదిప్రబంధముల
నేకాక, కన్నడమున భారతాదిగ్రంథములను
వ్రాయించి, కృతిపతిత్వమును వహించెను.
మఱియు రాయలచరిత్రలయందు, రాయలం
గూర్చిన వ్యాసములయందు, రాయలతో
సంబంధించిన యుపన్యాసములయందు, రాయ
లపేరనొప్పు గ్రంథాలయములయందు, మొత్త
ముపై రాయలప్రసంగము వచ్చినప్పుడెల్ల
'దేశభాషలందుఁ దెనుఁగు లెస్స' యను
వాక్య మవిచ్ఛిన్నముగాఁ గనఁబడుచున్నది.
వినఁబడుచున్నది. ఏతత్సుభాషితకర్తృత్వగౌ
రవమంతయు రాయలకే సమర్పించుట యన్యా

యమని నామనవి. రాయలకంటె రమారమి నూఱుసంవత్సరములు ముందుండినవాఁడైన వల్లభామాత్యుఁడు 'దేశభాషలందుఁ దెనుఁగు లెస్స' యను నీసుభాషితంబునకుఁ గృతికర్త. ఈవాక్యార్థమునందలి గౌరవాతిశయముచేత నీపద్యపాదము నున్నదియున్నట్లు లే తనపద్యపాదముగా రాయ లుపయోగించెన నుటకు దృష్టాంతముగా నుభయులపద్యములు నిందుఁ బొందుపరుపఁ బడినవి.

"ఆ. వె. జనని సంస్కృతంబు సకలభాషలకును
దేశభాషలందుఁ దెనుఁగు లెస్స
జగతిఁ దల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చు టాడుబిడ్డ మేలు గాదె?"

(వల్లభామాత్యుఁడు—క్రీడాభిరామము.)

ఆ. వె. తెనుఁగదేలయన్న దేశంబు తెనుఁ గేను
తెనుఁగువల్లభుండఁ దెనుఁ గొకండ
యెల్ల భాషలందు నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెనుఁగు లెస్స."

(రాయలు— ఆముక్తమాల్యద.)

వివిధభాషాతత్త్వవిదుండగు రాయలు తన మాతృభాషయగు కర్ణాటభాషతో సమానముగను గొన్నివిషయములయందెక్కుడుగను నాంధ్రభాష నాదరించుటచే నతఁ డాంధ్రుఁడని రూఢిపఱిచినయెడల మనదేశమునకును మనసాహిత్యమునకును నాంధ్రులైన రాజరాజాదులనాఁటికంటె నెక్కుడు గౌరవ మెట్లు కలుగునో నాకుఁ దెలియదు. రాయలాంధ్రుఁడై యాంధ్రభాషనుద్ధరించెనని చెప్పుటకంటె, రాయలు కర్ణాటకుఁడై వివిధభాషాతత్త్వవేదియై 'దేశభాషలందుఁ దెనుఁగు లెస్స' యని గ్రహించి యద్దాని నుద్ధరించెనని చెప్పుటయే దేశభాషలలో నాంధ్రభాష కెక్కుడు ఘనత యని నావిన్నపము. ఈరాయలనాఁడే యాంధ్రకవితాస్థాన మాంధ్రదేశమునుండి కర్ణాటకరాజ్యమునకు మార్పఁబడెను.

చారిత్రకభాషావిశేష సత్యాసత్య విమర్శనాయత్తచిత్తులైన బుధసత్తములు పైవాక్యములవలన రాయలయందు గౌరవాభావము నాకారోపింపకుందురుగాక!

ప్రథమభాగంబగు నుపోద్ఘాత సంపుటంబు



రాయల తరువాతఁ జేర్కొనఁదగిన యుదారచిత్తులగు కవితాపోషకులు మఱికొందఱ
నీక్రింది పట్టికయందుఁ జేర్చుచున్నాఁడను

| నంబరు | కవితాపోషకుఁడు | తేదీ (సం) | స్థానము | వ్రాయించిన గ్రంథములు | వ్రాసిన కవి | కృతిపతి విశేషములు |
|---|---|---|---|---|---|---|
| 1 | నాదెండ్ల అప్పయామాత్యుఁడు | 1540 | కొండవీటిసీమ | రాజశేఖర చరిత్రము | మాదయగారిమల్లన | తిమ్మరుసునకల్లుఁడు |
| 2 | గొబ్బూరి నరసరాజు | 1560 | విజయనగరరాజ్యము | రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుఁడు | రామరాజు మేనల్లుఁడు |
| 3 | చినవేంకటాద్రి మహీపతి | 1560–70 | ఆకుపీడు (కర్నూలు) | కృష్ణరాయవిజయము | కుమారధూర్జటి | |
| 4 | కృష్ణరాజు | 1560 | నంద్యాలసంస్థానము | కళాపూర్ణోదయము | పింగళిసూరన | |
| 5 | పెదవేంకటాద్రి మహీపతి | 1560 | ఆకుపీడు (కర్నూలు) | రాఘవపాండవీయము | పింగళిసూరన | |
| 6 | మలికిభరామ్ | 1550–80 | గోలకొండ | తపతీసంవరణము | అద్దంకి గంగాధరకవి | గోలకొండ నవాబు [నివాఁడు |
| 7 | అమీనుఖాను | 1550–80 | డిటో | యయాతి చరిత్రము | పొన్నికంటి తెలగన్న | గోలకొండనవాబు కొలువులో |
| 8 | తిరుమల దేవరాయలు | 1560 | విజయనగరము | వసు చరిత్రము | రామరాజభూషణుఁడు | [ల మేనల్లుడు |
| 9 | నరసరాజు | 1570 | విజయనగరరాజ్యము | నరసభూపాలీయము | రామరాజభూషణుఁడు | రామరాయతిరుమలదేవరాయ |
| 10 | వేంకటాద్రి | 1570 | డిటో | పరమయోగివిలాసము | తాళ్లపాక తిరువేంగళనాథుడు | తిరువలదేవరాయలతమ్ముడో, కొడుకో? |
| 11 | శ్రీరంగరాయలు | 1575–85 | విజయనగర రాజ్యములోని | లక్ష్మీవిలాసము | రాయసం వేంకటపతి | తిరుమల దేవరాయలకొడుకు |
| 12 | వేంకటపతిరాయలు | 1585 | చంద్రగిరి [పెనుగొండ | చంద్రభాను చరిత్రము | తరిగొప్పుల మల్లన | తిరుమల దేవరాయలకొడుకు |
| 13 | శ్రీరంగనాయకుఁడు | 1560 | విజయనగరరాజ్యము | సాంబోపాఖ్యానము | రామరాజు రంగప్ప | రామరాజు పెదతండ్రికొడుకు |
| 14 | మట్లు ఎల్లభూపాలుఁడు | 1550–80 | నవఖండనాడ | కాకుత్స్థవిజయము | అనంతభూపాలుడు | కృతికర్త కృతిభర్తకుమారుడే |
| 15 | పులిజాల సోమామాత్యుఁడు | 1580 | విజయనగరరాజ్యము | సుదక్షిణాపరిణయము | తెనాలి అన్నయ్య | కోనేటి రామరాజుమంత్రి |
| 16 | పెమ్మసాని పెదతిమ్మరాజు | 1574–614 | డిటో | చారుచంద్రోదయము | చెన్నమరాజు చెన్నమరాజు | శ్రీరంగరాయల మంత్రి |
| 17 | పెమ్మసాని చినతిమ్మరాజు | డిటో | డిటో | ఇందుమతీ పరిణయము | చిత్రకవి అనంతకవి | పె. పెదతిమ్మరాజు తమ్ముడు |
| 18 | విరూరి వేదాద్రిమంత్రి | 1611 | విజయనగర రాజ్యములోని యొకసంస్థానము | పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణుడు | పెదసంగమరాజుమంత్రి |
| 19 | ఈసూరి యెల్లన్న | 1611 | గోదావరిజిల్లా కొర్కొలను | హరిచంద్రోపాఖ్యానము | శంకరకవి | ఇతడు కరణము |
| 20 | పెద్దనమంత్రి | 1614 | విజయనగరరాజ్యము | చిత్రభారతము | చరిగొండ ధర్మన్న | వీనిప్రభువు మానభూపతి శ్రీ |
| 21 | జూపల్లి వేంకటాద్రి | 1614 | నైజాములోని పర్తియాల | చంద్రికాపరిణయము | ఎలకూచి బాలసరస్వతి | [రంగరాయల సామంతుడు |
| 22 | రఘునాథభూపాలుఁడు | 1630 | తంజావూరు | విజయవిలాసము | చేమకూర వెంకటకవి | |

| నెంబరు | కవితాపోషకుడు | తేది(సం) | స్థానము | వ్రాయించిన గ్రంథములు | వ్రాసిన కవి | కృతిపతి విశేషములు |
|---|---|---|---|---|---|---|
| 23 | చెరుకు లక్ష్మణామాత్యుఁడు | 1630 | — | కూర్మపురాణము | రాజలింగకవి | ఈకృతిపతియెచ్చటివాఁడో? |
| 24 | తిరుమలరాజు | 1650 | విజయనగరరాజ్యము | బాలభాగవతము | దోనూరు కోనేరుకవి | తి. దే. పెదతండ్రికొడుకు |
| 25 | కోదండరామరాజు | 1660 | డిటో | నరపతివిజయము | అందుగుల వెంకయ్య | తి. దే. మనుమని మనుమఁడు |
| * | | | | | | |
| 26 | వెలుగోటి రాయభూపాలుఁడు | 1620 | వేంకటగిరి | భానుమతీ పరిణయము | రెంటూరి గంగరాజు | |
| 27 | కొలిపాక ఎఱ్ఱనామాత్యుఁడు | 1660 | కంబముమెట్టు [మపురము | వరాహ పురాణము | హరిభట్టు | కృతిపతి యెప్పటివాఁడో తెలి |
| 28 | దాసరి చిన్నగంగయ్య | 1660 | కొండపల్లి దరి పురుషో_త్త | వాయుపురాణము | బద్దెపూఁడి పెద్దయ్య | ఇతఁడు కమ్మచౌదరి [యదు |
| 29 | ముద్దలగరి నృపాలుఁడు | 1680 | పాండ్యరాజధాని మధుర | సత్యభామాసాంత్వనము | కామేశ్వరకవి | |
| 30 | వత్సవాయ తిమ్మనృపాలుఁడు | 1600 | పెద్దాపురము | శేషధర్మములు | వెణుతురుబల్లి విశ్వనాథకవి | |
| 31 | వె. బంగరుయాచమనాయడు | 1690 | వేంకటగిరి సంస్థానము | విష్ణుమాయావిలాసము | రోసనూరి వేంకటపతి | |
| 32 | వంగల సీనయార్యుఁడు | 1704 | పాండ్యరాజధాని మధుర | శశాంకవిజయము | శేషము వేంకటపతి | |
| 33 | రావు మాధవరాయనింగారు | 1720 | పిఠాపురము | వాసవదత్తాపరిణయము | వక్కలంక వీరభద్రకవి | |
| 34 | బిక్కవోలు కామారెడ్డి | — | గోదావరిజిల్లా | స్కాందపురాణ సూతసం | పట్టమట్ట సోమనాథకవి | ఎప్పటివాఁడో ఎక్కడివాడో |
| 35 | ముసుర్ల మళువాగళుప్రభువు | 1710 | బళ్లారి | శివరహస్యఖండము [హిత | కోడూరి వేంకటాచలకవి | [తెలియదు |
| 36 | వత్సవాయి గోపరాజు | 1760 | పెద్దాపురము | రామవిలాసము | ఏనుఁగు లక్ష్మణకవి | |
| 37 | రఘునాధరాజు | 1740 | పాండ్యలోని మధుర | ఆంధ్రభాషార్ణవ నిఘంటు | కోటి వెంకనార్యుడు | |
| 38 | పూ. విజయరామమహారాజు | 1750 | విజయనగరము | | అడిదము సూరకవి | |
| 39 | నిడిమామిళ్ల దాసయామాత్యుఁడు | 1760 | బందరు | వేదాంతరసాయనము | మంగళగిరి ఆనందకవి | |
| 40 | చేకూరి రామస్వామిమంత్రి | 1760 | — [ము | రత్నావళి పరిణయము | ధూర్జటి వెంకటరాయకవి | ఎక్కడివాఁడో తెలియదు |
| 41 | కొండ్రాజు వేంకటరాజు | 1770 | కర్నూలులోని ఎఱ్ఱపాలె | రెట్టమతము | అయ్యలరాజు, అయ్యల భాస్కరకవులు | |
| 42 | మల్రాజు రామారాయనింగారు | 1790 | కృష్ణాజిల్లా,నర్సారావుపేట | రంగరాయవిజయము | దిట్టకవి నారాయణకవి | |
| | * | * | * | * | * | * |

# మహాసతి సీత

కలువలపల్లి రంగనాథ శాస్త్రి గారు

(సంపుటము ౨, సంచిక ౪ తరువాయి)

ఉ. తుంటతనమ్మునన్ మదికిఁ దోఁచినభంగి సతీలలామ నా
వంటికులాంగనన్ బలిమిఁ బట్టఁగఁ బూనిన దిట్టవైన నీ
కంటికి నన్యకాంత లనఁగా నొక లెక్కయె దుర్మతీ! జగ
త్కంటకవృత్తివైతి విది కాదను వాఁడొకఁడైన లేఁడుగా.

ఉ. విన్నదనంబుదోఁప నడవిన్ దెసమాలి వసించుసాధ్విన్
నన్నిటు బల్మిఁ దెచ్చితి మనంబు గరంబుఁ గలంగునట్టు లో
చెన్నఁటి! నీతలల్ దునిసి చెచ్చెర నేలను రాలకుండునే
తిన్ననిదారి మాని కుమతీ! నినుబోంట్లు యశంబుఁ గాంతురే.

ఉ. చివ్వకుఁ గాలుద్రవ్వి పలుసేనల మార్కొని పోటుబంటవై
క్రొవ్వణఁగించి దివ్యశరకోటుల దాయలగెల్వ నేర్చియుం
బువ్వుల వింటివాని గెలుపుం గొననేరకపోయి తక్కటా!
నవ్వకయుందురే! దనుజనాయక! రావణ! ధీరసత్తముల్.

శా. కైలాసాద్రిఁ గదల్చినాఁడననుచున్ గర్వింతువౌరౌర? యా
కైలాసాధిపు విల్లురెండు తునియల్గాఁ ద్రుంచె రాముండు వే
యేలా, పోరెడువేళలం దెలియకున్నే తారతమ్యంబు? వా
చాలా! రావణ! నాకడం బొగడ నీశౌర్యంబు పెంపారునే.

ఉ. పందవుగాక నీవు నెఱబంటవె వీరులు రామలక్ష్మణుల్
మందిరమందు లేనితఱి మాయపు జోగుల వేసమూని నా
డెందము తల్లడంపడఁ గడింది బలంబున దొంగకైవడిన్
వందురుచున్ననున్ విడక నన్నిటు దెచ్చితి దుర్వినీతుఁడా!

ఉ. రాముని శాత్రవోత్కరవిరాముని సంగరభీమునిన్ ఘన
శ్యాముని సార్వభౌముఁ దనుచారిమనిర్జితకామునిం బరం
ధాముని మానిహృత్కమలధాముని సంతత రక్షితాశ్రిత
స్తోముని రావణా! కనినచోఁ బలుచెట్టలు సేయఁ జూతువే.

ఉ. రామునివంటి శూరుఁ డన రాజిలు లక్ష్మణుఁ డుండెనేని పా
యామునివేషధారి నిను నాక్షణమందున గిట్టిపట్టి నీ
యీమటుమాయలెల్ల హరియించి నినుం గడ తేర్పఁ జూడఁడే?
నీమద మింతగాఁ జెలఁగునే? నను దెత్తువె? యిట్లు టక్కరీ!

చ. విమతుల రూపుమాపు బలవిక్రమశాలి రఘూద్వహుండె స
ద్మమున వసించియున్నయెడఁ దాపసవేషముఁ దాల్చి వత్తువే
నిముసము సేపు సైతమును నిల్వఁగ సైతువె నాథుమ్రోలఁ? దు
త్తుమురయిపోక ప్రాణములతో నిలు సేరఁగ నేర్తె? దుర్మదా!

చ. వెడఁగుఁదనంబునన్ మరులు వేఁదుఱు గొల్పఁగ నిర్విశంకతన్
జడమతివై మదించి నను సాధ్విని స్వైరిణిఁ బోలె నాడఁ గాఁ
దొడఁగితివౌర! నీదు బలుత్రుళ్ల డఁగించెడు లెమ్ము రామభ
ద్రుఁడు జగదేకవీరుఁ డల రుద్రుఁడు బాసటయైన రావణా!

ఉ. చెల్లెనుగాని నీతులువచేతలు మున్నిఁక మీఁదఁ జెల్లనే
చెల్లవు నీదుదుండగముఁ జెల్లగనిచ్చునె రామభద్రుఁ డీ
త్రుళ్లుట మాని మేలయిన త్రోవ మెలంగుమి దైత్యనాయకా!
బల్లిదుతోడిపోరు పలుభంగుల శ్రేయముగాదు చూడఁగన్.

చ. దురమున రాము నోర్వఁగల దోర్బలశాలురు లేరు సుమ్ము దు
ర్భరమదులైన చెన్నఁటులపాలిటి కాతఁడు వేరువిత్తు త
త్వరతఁ దదీయపూజ్యపద తామరసంబులు గొల్వఁ బొమ్ము నీ
సిరియును రాజ్యమున్ నిలుచుఁ జేటు ఘటిల్లదు నమ్ము రావణా!

చ. చలమరి నిన్నుఁ బట్టి చెఱసాలను బెట్టిన కార్తవీర్యునిం
గలన జయించి మేటి విలుకాఁడను పేరును గాంచినట్టి దో
ర్బల గరిమాఢ్యునిం బరశురాముని గెల్చిన రాఘవేంద్రు ముం
గల నిలువంగ నీతరముగాదిఁక వేయును నేల ప్రేలరీ?

చ. పలుమరు దాడి నేఁగి సురవర్గము నొంచి జయించి వారికిం
జెలఁగుచు మూఁడుప్రొద్దులను సేవలు సల్పఁగ నాజ్ఞయిచ్చియున్
కళవళ మొందఁ జేసితివి కారియ పెట్టుచు నయ్యొ! సజ్జనా
వళి మదినొచ్చనేని పలువా! పలుకీడులు మూఁడకుండునే.

# శ్రీనాథుని భీమేశ్వరపురాణము

మామిడిపూడి వెంకటరంగయ్యా గారు, యం. ఏ., యల్. టి.

మహాకవి యగు శ్రీనాథునిచే రచితమైన భీమేశ్వరపురాణము ఈవ్యాసమందు రెండు మూడుద్దేశములతో విమర్శింపబడినది. (1) ఆంధ్రదేశ చరిత్రము వ్రాయదలచువారికిగల ముఖ్యాధారములలో మన పూర్వకవులు వ్రాసిన గ్రంథసముదాయ మొకటి. చిలుకూరి వీరభద్రరావుగారి "ఆంధ్రులచరిత్రము"రంగస్వామి సరస్వతిగారిచే సంగ్రహింపబడి మద్రాసు విశ్వవిద్యాలయమువారిచే ప్రచురింపబడిన"విజయనగరచరిత్రమునకుగల ఆధారములు" (Sonrces of Vijayanagar History) అనుగ్రంథములను చదివినవారి కిది తెలిసిన విషయమే. కాని ఇందునిమిత్తమై మన మింకను ఎంతో పరిశోధన చేయవలెను. ఆంధ్రదేశమునందు వ్రాయబడిన సంస్కృతాంధ్రగ్రంథములలోని చరిత్రాంశముల నన్నిటిని మన మింకను క్రోడీకరించియుండలేదు. ఈసందర్భమున శ్రీనాథుని గ్రంథములు మనకు కొంతవర కుపచరించగలవను నుద్దేశముతో అతని భీమేశ్వరపురాణ మిచట విమర్శింపబడియున్నది. (2) శ్రీనాథుడు ప్రౌఢకవిగ పరిగణింపబడుచున్నాడు. తర్వాతకాలపుకవు లనేకు లతనిశైలి ననుకరించిరి. కాని అతడు వ్రాసిన గ్రంథములలో ముఖ్యములైనవియు విస్తారమగు ప్రచారము గాంచినవియు అగు భీమఖండ కాశీఖండ నైషధాదులుసంస్కృతమునకాంధ్రీకరణములుగాని స్వతంత్రకావ్యములు కావు. వాటికిగల గౌరవము వాటిని సంస్కృతమున రచించిన కవులకు చెందవలయునుగాని వాటిని తెనిగించిన శ్రీనాథునికి చెందజేయుట సరికాదు. స్వకల్పితములగు కావ్యములగూర్చిన వారుమాత్రమే మహాకవులను బిరుదును వహించుటకు తగియుందురు గాని భాషాంతరీకరణముజేసినవా రిట్టిఘనత ననుభవించుట కర్హులగుదురా? శ్రీనాథుని గ్రంథముల విమర్శించువారందరికి ఇట్టిసందేహము కలుగకమానదు. ఒక శ్రీనాథునిగురించి అననేల? భారతాది పురాణేతిహాసముల తెనిగించిన నన్నయాదులవిషయమునకూడ నిది వర్తించును. ప్రస్తుతకాలమున బంగాళీ, హిందీ, ఇంగ్లీషు మొదలగుభాషలనుండి నాటకములను నవలలను మనవారు తెనిగించుచున్నారుకదా? శ్రీనాథాదులు కూడ నిట్టివారేనా? కానియెడల వారికిగల ఆధిక్యమేమి? ఇటువంటి ప్రశ్నల కన్నిటికి సమాధానము చెప్పవలయు ననిన వీరి గ్రంథములకు మాతృకలగు సంస్కృతములను విమర్శపూర్వముగ పరిశీలింపవలెను. సంస్కృతమునకును తెనుగునకును గల తారతమ్యములను తెలుసుకొనవలెను. భీమేశ్వరపురాణవిషయమై కొంతవర కిట్టివిమర్శ ఇచట చేయబడి యున్నది. శ్రీనాథుని భీమఖండము సంస్కృతమునకు సరియగు తెనుగా? అందు అతనిచే స్వయముగ కల్పింపబడిన భాగములేవైన ఉన్నవా? అట్టివాటిని వేరుపరచిన యెడల శ్రీనాథుని కవిత్వధోరణి యెట్టిదో నిర్ణయించుటకు కొంతవీలగును. (3) స్వకల్పితములుగాక భాషాంతరీకరణభాగములను తెనిగించుటలో శ్రీనాథుడుత్రొక్కిన మార్గమెద్ది? మూలమునకంటె తెనుగు స్పష్టముగను స్ఫుటముగను ఇంపుగను ఉన్నదా? తెనిగించుటలో శ్రీనాథుని పద్ధతికిని తక్కిన ఆంధ్రకవుల పద్ధతికిని గలభేద మెట్టిది? ఇట్టి విషయములను విమర్శించినయెడల మన ప్రాచీనకవుల "ఆంధ్రీకరణశైలి" ఇట్టిదని నిరూపించుట సులభమగును.

ఈవిషయములను వివరించుటకుపూర్వముసంస్కృతభీమఖండమునుగురించి రెండుమూడుమాటలు చెప్పవలసియున్నది. (1) ఇదో ప్రస్తుతపు గోదావరిజిల్లా రామచంద్రపురంతాలూకాలోని దాక్షారామమందుండు భీమే

శ్వర దేవుని మాహాత్మ్యమును వర్ణించు స్థలపురాణము. ఇందు దక్షారామమేకాక దాని చుట్టుపట్లనుండు దేశము కూడ వివరింపబడియున్నది. పిఠాపురము, కుమారారామము, సర్పవరము, మొదలగు క్షేత్రముల ప్రశంస విస్తారముగ గలదు. వీటిని వర్ణించుటలో దేశముయొక్క నైసర్గిక స్వరూపములను వ్యవసాయపద్ధతులను పంటలను గ్రంథకర్త పేర్కొనియున్నాడు. ఈవర్ణనలను చదివినప్పుడు స్థలజ్ఞుడును దేశానుభవము కలవాడును గోదావరిమండల నివాసియు అగు ఆంధ్రుడీగ్రంథమును రచించెనని తోచకమానదు. గ్రంథమునకు గౌరవము కల్పించుటకై దాని కర్తృత్వము వ్యాసునియందారోపింపబడెనుకాని నిజముగ దానినివ్రాసినవాడు దక్షారామ ప్రాంతమందలి ఆంధ్రుడే. కావున దేశస్థితిగతులను తెలుపు భాగములు చాలవరకు విశ్వసనీయములు. (2) కాని, ఇందు వివరింపబడిన స్థితిగతు లేకాలమునాటివి? అను విషయముకూడ కొంచె మాలోచింపవలసియున్నది. భీమఖండము స్కాందపురాణములోని ఏబదిఖండములలో నొక్కటి. కాని ఈ పురాణ మెప్పుడు రచింపబడినదో మనకు తెలియదు. అయినప్పటికిని ఏబదిఖండములను రచించినవాడొక్కడు కాడనియు, వీటిని అప్పుడప్పుడు భిన్న గ్రంథకర్తలు వ్రాసిరనియు, పండ్రెండవ శతాబ్దముననో పదమూడవ శతాబ్దముననో వీటినన్నిటిని స్కాందపురాణములోగలిపిరనియు తోచుచున్నది. సంస్కృతభీమఖండము పండ్రెండవ శతాబ్దమునకుముందు వ్రాయబడలేదని చెప్పవచ్చును. ఈయూహకు కొన్ని కారణములు కలవు. దక్షారామమందలి భీమేశ్వరాలయములో పదునొండవశతాబ్దమునకు పూర్వ మనుశాసనములు లేవు.[1] పండ్రెండు పదమూడవ శతాబ్దములశాసనము లెక్కువగనున్నవి. దీనినిబట్టి పదునొకండవశతాబ్దమునకుపూర్వము దక్షారామ క్షేత్ర మంత ప్రసిద్ధిగాంచినదికాదనియు, పండ్రెండవ శతాబ్దమునుండి దానిప్రఖ్యాతి అధికమగుచు వచ్చెననియు, అందుచేత యాత్రికు లనేకు లచటికి వెళ్లి దానధర్మముల చేయుచుండిరనియు చెప్పవచ్చును. ఈప్రసిద్ధి హెచ్చుకానుకాను క్షేత్రమాహాత్మ్యమును వర్ణించి దానికిగల కారణముల నిరూపించుటకై భీమఖండ మను గ్రంథము వ్రాయబడియుండును. అనగా, ఇది పండ్రెండవశతాబ్ద గ్రంథమని చెప్పదగును. ఇదిగాక తృతీయాధ్యాయమందు కుమారారామవర్ణనసందర్భములో రాజ నారాయణస్వామి యొక్కయు భీమేశునియొక్కయు ప్రశంస కలదు. శ్రీనాథు డీభాగమును తెనిగించుచు "భీమేశం" అను సంస్కృతమును "చాళుక్యభీమేశ్వరు"[2] నని తెనుగులోనికి తర్జుమా చేసెను. దీనికికారణము కుమారారామములోని భీమేశ్వరుని చాళుక్యభీముడనురాజు ప్రతిష్ఠించుటయే. లింగములను వాటిని ప్రతిష్ఠించినవారిని బట్టి నామము లేర్పడుట సాంప్రదాయసిద్ధము. భీమఖండము తృతీయాశ్వాసమందు పేర్కొనబడిన "ఇంద్రేశ్వరుడు," "సిద్ధేశ్వరుడు," "యోగీశ్వరుడు," "బ్రహ్మేశ్వరుడు," "వరుణేశ్వరుడు" మొదలగునవి దీనికి దృష్టాంతము. కుమారారామమందు ఈశ్వరునిప్రతిష్ఠించిన చాళుక్యభీముడు వేంగిదేశమును పాలించిన రెండవచాళుక్యభీముడు. ఇతడు క్రీ. శ. 934 మొదలు 945 వరకు రాజ్యముచేసెను.[3] కావున ఇతనిని పేర్కొనుచుండు భీమఖండము క్రీ. శ. 934 కుపూర్వము వ్రాయబడినదికాదని స్పష్టము. ఇట్లే పై నుదహరింపబడిన "రాజనారాయణస్వామి" రాజనారాయణుడనుబిరుదును వహించినట్టి కులోత్తుంగ చోళచక్రవర్తిచే నెలకొల్పబడిన దైవము.[4] ఈకులోత్తుంగుడు క్రీ. శ 1070 మొదలు 1118 వరకు రాజ్యముచేసెను. దీనినిబట్టి భీమఖండము 1100 ప్రాంతముననో అటుతర్వాతనో వ్రాయబడినదని చెప్పుట కవకాశము కలుగుచున్నది. మరియొక హేతువుచేగూడ నిది పండ్రెండవ

---

1. Inscriptions of the Madras presidency Vol. I లో క్రీ. శ. 1038 సంవత్సరపుశాసనమే ప్రాచీనతమముగ నున్నది. South Indian inscriptions Vol. IV లో ఇంతకంటె ప్రాచీనమగు శాసన మున్నదేమోకాని, ఆసంపుటము నాకిచట లభింపమిచే నేను దానినుండి ఉదాహరింపలేకున్నాను.

2. ద్వితీయాశ్వాసము. పద్యము 63.

3. ఆంధ్రులచరిత్ర 1. సంపుటము. పు 284.

4. S. I. Inscriptions Vol. III, Part II, P. 130.

[illegible]ంటె తర్వాతిగ్రంథమనిఋజువుచేయవచ్చును. [illegible] జగన్నాథము శ్రీకూర్మము సింహాచలము [illegible] వైష్ణవక్షేత్రములు వర్ణింపబడియున్నవి. [illegible]యములబట్టి శ్రీకూర్మమునకుగాని సర్పపురమునకుగాని పండ్రెండవ శతాబ్దమునకు ముందు విశేషఖ్యాతియుండి [illegible]ట్లు కనుపించదు. జగన్నాథ మొకప్పుడు బౌద్ధక్షేత్ర [illegible]యుండెననియు కాలక్రమమున నది వైష్ణవక్షేత్రముగ [illegible]రినదనియు అందలివిష్ణ్వాలయమును క్రీ. శ 1078-1150 [illegible] పాలించిన అనంతవర్మ చోడగంగచక్రవర్తి కట్టి [illegible]ట్లు తెలియుచున్నది.[1] దీనినంతనుబట్టిచూడ సంస్కృత భీమేశ్వరపురాణము పండ్రెండవ శతాబ్దమునకు పూర్వపు గ్రంథముకాదని స్పష్టమగుచున్నది.

శ్రీనాథుడు భీమేశ్వరపురాణమును 1428 సంవత్సరమునకు తర్వాత వ్రాసెనని, "దక్షవాటికయందుఁ దరుణేందుమౌళికి మొగలివాకిట ధామమును రచించె,"[2] అను సీసపద్యపాదమును

శ్లో. శాకే పుష్కరబాణవిశ్వగణితే సంవత్సరే కీలకే
కార్తిక్యాంశనివాసరే సుకృతధీ శ్రీయన్నమంత్రీశ్వరః,
దాక్షారామజ భీమలింగపురతః శ్రీసప్తగోదాతటే
ప్రాచీగోపురమండపంసమకరోద్రమ్యంశిలానిర్మితమ్.

అను దక్షారామశాసనములోని శ్లోకముతో[3]సమన్వయించి చూచినయెడల మనకు తెలియుచున్నది. అనగా సంస్కృత భీమఖండము రచింపబడినతర్వాత సుమారు మూడువందల సంవత్సరములకు తెనుగు భీమఖండము వ్రాయబడెను. మనము సామాన్యముగ పూర్వాచార పరాయణులమై యున్నాము. మనపూర్వులకు మనకంటెకూడ నధికముగ పూర్వాచారములందు గౌరవముండెడిది. ఇప్పటివలె పూర్వకాలమున ఆర్థిక సాంఘికస్థితులందు వేగముగ మార్పులు కలుగుట కవకాశముండెడిదికాదు. కావున సంస్కృత భీమపురాణమును వ్రాసిన కవియొక్క కాలమందలి ఆంధ్రదేశపు స్థితిగతులకును, శ్రీనాథునికాలము నాటికీనాటికిని విశేషభేద ముండియుండదు. అనగా క్రీ. శ. 1150 మొదలు 1450వరకు గోదావరీ మండలమందలి ఆర్థిక సాంఘికవిషయములు భీమఖండమునుండి తెలుసుకొనుట కవకాశమున్నదని చెప్పవచ్చును. ఈ క్రింద వివరింపబడిన అంశములు ముఖ్యముగ శ్రీనాథుని భీమఖండము నాధారముగ జేసుకొని వ్రాయబడినవి.

## II

సంస్కృత భీమఖండరచితకాలమునాటికి తెనుగు దేశమునకు ఆంధ్రదేశము, త్రిలింగదేశము అనుపేర్లు సర్వసాధారణమై యుండెను. ఎప్పటినుంచి ఈదేశమునకు ఆంధ్రమనుపేరు వ్యవహారములోకి వచ్చెననువిషయమై అభిప్రాయభేదము కొంతకలదు. ఏడవశతాబ్దమునుండి ఆంధ్రదేశములో చాలభాగమును పాలించిన తూర్పు చాళుక్యరాజుల శాసనములందును వారికి సమకాలీనులగు పశ్చిమచాళుక్యులయొక్కయు రాష్ట్రకూటుల యొక్కయు చోళుల యొక్కయు శాసనములందు – అనగా సుమారు క్రీ. శ 600 మొదలు 1000 వరకు లిఖింపబడిన శాసనములందు – ఆంధ్రదేశమనుపేరు కనుపించుటలేదు. "వేంగీ," "వేంగీమండలం," "వేంగీదేశం," "వేంగీమహారాజ్యం," "వేంగై నాడు" లోనగు ప్రయోగములే కనుపించుచున్నవి.[4] పదకొండవశతాబ్దపు శాసనములలో కొన్నిటియందుమాత్రము "ఆంధ్ర" మనుమాట యున్నది. పండ్రెండవశతాబ్దమునుండి ఈమాట విశేషముగ వ్యవహారములోనికి వచ్చినది. పదకొండవ శతాబ్దమందు వ్రాయబడిన భారతమందుకూడ "ఆంధ్ర" శబ్దప్రయోగము కానరాదు. రాజరాజనరేంద్రుని "వేగీ విషయాధీశ," "వేగీనాథ," "వేగీభూవల్లభ"[5] అనియు, రాజమహేంద్రవరమును, "వేంగీదేశమునకు నాయకరత్నంబునుం బోని" అనియు నన్నయ వర్ణించియున్నాడు.[6] అర్జునునితీర్థయాత్రకథను తెనిగించుచు సంస్కృతభారతములోలేని "వేగీదేశము"నకు కూడ అర్జునుడు వచ్చినట్లు"[7]

1. Gazetteer of Bengal Vol. II
2. 1 ఆశ్వాసము, పద్యము 75.
3. South Indian Inscriptions Vol. IV No 1381 of India Vol 1, P. 39; 45; Nellore Inscriptions P. 164.
4. Ind. Antiquary VI, 68; XII, 219. Arch Survey Nilganda Inscription of Amogavarsha I
5. ఆదిపర్వము ఆశ్వాసము II పద్యము 1
   " " 5 " 1
   " " 8 " 1
6. ఆదిపర్వము ఆశ్వాసము I పద్యము 8
7. " " 8 " 139

నన్నయ చెప్పియున్నాడు. కాని ఆంధ్రదేశమునకు వచ్చినట్లు చెప్పలేదు. ఇట్లే భాషను గురించి చెప్పుచు "తెనుగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్," "నన్నయభట్టు తెనుంగున మహాభారతసంహితారచన బంధురుఁడయ్యె"[1] అను వాక్యములలో "తెనుగు" అనుమాటయేకాని ఆంధ్ర మనుమాట లేదు. ఈ కారణములను ఇటువంటి హేతువులు మరికొన్నిటిని బట్టి తెనుగుదేశమునకు మొదటినుండి ఆంధ్రదేశమనియు తెనుగుభాష కాంధ్రభాష అనియు తెనుగువారికి ఆంధ్రులనియు వ్యవహారము లేదని కొందరి అభిప్రాయము.[2] పదకొండవశతాబ్దమునుండియే ఈదేశమునకు ఆంధ్రదేశమను పేరు వచ్చినదని వారి మతము. ఈ వాదములోని గుణలోపముల చర్చచేయుట కిది సమయముకాదు. మొదటినుండియు "ఆంధ్రులు" "తెనుగు" వారు ఒక్కరే అని నా యభిప్రాయము. దానికిగల కారణములను మరియొకవ్యాసమున నేను నిరూపించియున్నాను.[3] తూర్పుచాళుక్యుల కాలమున "ఆంధ్రదేశ" మనుమాట వ్యవహారములో కాన్పించకపోవుటకు కారణమొకటి యని తోచుచున్నది. ఈరాజులు మొట్టమొదట ఆంధ్రదేశములో నొకభాగమగు వేగీమండలమును మాత్రము జయించి వశపరచుకొనిరి. అందుచే వీరికి వేగీశ్వరులనియు వీరిరాజ్యమునకు వేగీరాజ్య మనియు పేరు వచ్చెను. కాలక్రమమున ఆంధ్రదేశములోని మరికొన్ని భాగములను జయించినతర్వాతకూడ ఆ పేరే రూఢమయ్యెను. ప్రస్తుతకాలమున మనదేశమందుండి అమెరికాకువెళ్లువారిలో మహమ్మదీయులు, క్రైస్తవులు, హిందువులు ఉన్నను వారందరిని హిందువు లనియే అమెరికావారు పిలుచుచుందురు. దీనికి కారణము మొదట అమెరికాకు వెళ్లినవారు హిందువులగుటయే. అట్లే దక్షిణాఫ్రికాలోని మనవా రందరిని అక్కడివారు "కూలీ" లనియే పిలుచుచుందురు. ఇదేవిధముగ ప్రాచీనకాలమున ఆంధ్రదేశమున కంతకు వేగీదేశ మనుపేరు ప్రచారములోనికి వచ్చియుండును. ఇదిగాక తూర్పుచాళుక్యరాజులు ఆంధ్రులుకారు. వారు కర్ణాటదేశమునుండివచ్చినవారు. రాజరాజనరేంద్రుని కాలమువరకు వారికి ఆంధ్రమందు పరిపూర్ణ మగు నభిమానము లేకుండెను. అతని కాలమునుండి ఆంధ్రములో గ్రంథములు వ్రాయించుట ప్రారంభమయ్యెను. ఈయభిమానముతో కూడ దేశమునకు చాళుక్యులు రాకపూర్వము ప్రచారమందుండిన ఆంధ్రదేశమను పేరు వ్యవహారములోనికి వచ్చెను. నన్నయకాలమందు ఆంధ్రదేశమునకంతకు వేగీదేశమను పేరు చెల్లుచుండెననుట కగ్గుని తీర్థయాత్రసందర్భమున అతడు వ్రాసినపద్యమే సాక్షి. అందు కళింగదేశమునకు దక్షిణమునకుండినట్టియు భీమేశ్వర శ్రీశైల క్షేత్రములతో కూడినట్టియు దేశము వేగీదేశమని అతడు చెప్పెను. కాళేశ్వరముతో కలిసి ఈరెండు క్షేత్రములు ఆంధ్రదేశమునకు సరిహద్దులను ప్రతీతి కలదు. గదా? వేగీదేశపు హద్దులుకూడ నివియే. అందుచేనన్నయ దృష్టిలో ఆంధ్రదేశము వేగీదేశము ఒక్కటే యని స్పష్టమగుచున్నది. చాళుక్యులు దేశభాషాభిమానులగుటచేతను దేశభాషయందు గ్రంథములవ్రాయు నాచారము ప్రారంభమగుటచేతను బహుకాలమునకు పూర్వము ప్రచారములోనుండిన ఆంధ్రదేశమను పేరు తిరిగి ప్రచారములోనికి వచ్చెను. పండ్రెండవశతాబ్దమందో అటుతర్వాతనో వ్రాయబడిన భీమేశ్వరపురాణమందు ఆంధ్రదేశ మను పేరు ప్రఖ్యాతమై వ్యవహారమందుండుటలో ఆశ్చర్య మేమియు లేదు.

కాని సంస్కృతగ్రంథమునం దుదహరింపబడిన ఆంధ్రదేశపుహద్దులకును శ్రీనాథునిచే నుదహరింపబడిన దానికిని కొంచెము భేదముకలదు. పిఠాపురము త్రిలింగోత్కళదేశముల సంధియందున్నదని సంస్కృతమున వ్రాయబడినది. దాని నదేవిధముగ శ్రీనాథుడు తెనిగించెను.[4] కాని మొదటిఆశ్వాసములో రెడ్డిరాజ్యమును వర్ణించుచు "సింహాద్రిపర్యంతసీమాంధ్ర మేదిని" అనిన ఆంధ్రదేశమునకు సింహాచలము సరిహద్దుగ చెప్పెను. దీనిని బట్టి

1. ఆదిపర్వము ఆశ్వాసము I. పద్యము 8, 16

2. Indian antiquary 1913. ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలలో నొకదానియందు మ. రా. శ్రీ వేమూరు విశ్వనాథశర్మగారు ఈఅభిప్రాయమును వ్యక్తపరచిరని నాజ్ఞాపకము.

3. గతక్రిస్మసులో మద్రాసునందు జరిగిన Oriental Conference లో నేనీవిషయమును గురించి వ్యాసము చదివియుంటిని.

4. II ఆశ్వాసము 55, పద్యము.

5. I ఆశ్వాసము, 29 పద్యము.

...పదునాలుగవశతాబ్దములో కళింగదేశములో నొక భాగ మై ...ంచబడుచుండిన పిఠాపురమునకును సింహాచలము నకు మధ్యనుండుమండలము తర్వాత మూడువందల సం వత్సరములకు ఆంధ్రదేశములోని భాగమయ్యెనని స్పష్ట మగుచున్నది. ఆంధ్రులు సింహాద్రివరకు వ్యాపించుటచేతను శుద్ధాంధ్రులగు రెడ్డిరాజులీభాగమునంతను జయించుట చేతను ఈభాగమునకుకూడ ఆంధ్రత్వ మేర్పడెను.

భీమఖండమందు త్రిలింగశబ్దము ఆంధ్రశబ్ద పర్యా యముగ వాడబడియున్నది. కీర్తిశేషులగు కొమర్రాజు లక్ష్మణరావుగారు విద్యానాథ మహాకవికి పూర్వము త్రిలింగశబ్ద మీయర్థమున వాడబడియుండలేదని వ్రాసిరి. విద్యానాథమహాకవి క్రీ. శ. 1295 మొదలు 1321 వరకు పాలించిన రెండవప్రతాపరుద్రుని కాలమునాటి వాడు. లక్ష్మణరావుగారివాదమే సరియైనయెడల భీమఖండము పదునాలుగవశతాబ్దమున వ్రాయబడినదనియు సంస్కృత భీమఖండమునకును శ్రీనాథుని గ్రంథమునకును నూరుసం వత్సరములకంటె నెక్కువ వ్యవధి లేదనియు చెప్పవలసి వచ్చును. కాని ఇంతస్వల్పకాలములో సంస్కృతగ్రంథ మునకు విస్తారమగుగౌరవము కలుగుటయు, అది దేశమందు ప్రతీతిగాంచుటయు జరిగియుండదు. శ్రీనాథునికి దాని యందుగల గౌరవమునుబట్టిచూడ అదిఅంతకంటెప్రాచీన మైనదిగ నుండవలెనని తోచును. అనగా త్రిలింగశబ్దము విద్యానాథునికి నూరు నూటయాభై సంవత్సరము లకు పూర్వమునుండియే వ్యవహారమందుండెనని చెప్పుట కవకాశమున్నది.[1]

శ్రీనాథుడు భీమఖండమందు పేర్కొనిన తక్కిన దేశములలో ననేకము లతనికాలమందాపేర్లతోనుండెనా యను సందేహము కలుగుచున్నది. భోటఅంగవంగమరుకు కురుకుంతల అవంతి లాటదేశములిట్టివి.[2] ఏవియో కొన్ని దేశముల పేర్లను చెప్ప నుద్దేశించి అతడీ జాబితాను తయారుచేసెను. వీటిని గురించిన చారిత్రకవిషయము లేవియు లేవు. ఇట్లుగాక, ఆంధ్రదేశమునకు సమీపమం దుండిన ఉత్కళ కళింగ ఒడ్డెరాజ్యములు, కర్ణాటరా జ్యము యవనరాజ్యము అతడెరిగినవి. ఉత్కళ, కళింగ, ఒడ్డెపదములు ఇప్పటి గంజాం ఒరిస్సా మండలములను సూచించుచున్నవి. కర్ణాటమనగా విజయనగరసామ్రా జ్యము. శ్రీనాథుని భీమఖండకాలమునాటికి ఆంధ్రదే శములోని నెల్లూరు కడప కర్నూలు బళ్లారి అనంతపుర చిత్తూరుజిల్లాలు దానిలో చేరియుండెను. యవనదేశ మనగా బహామనీరాజ్యము. దానికప్పుడు అహమ్మదు నేను సుల్తానుగ నుండెను. ఈమూడును స్వతంత్రరాజ్య ములు. వీటిని పాలించుచుండిన వారిలో రెడ్డిరాజులు సఖ్యము గలిగియుండిరి. వీరుగాక పండువా సుల్తాను కూడ వీరికిమిత్రుడే. పండువారాజ్యము బంగాళరాష్ట్ర ములో నుండినట్లు తోచుచున్నది.[3]

యవనకర్ణాటోత్కళములలో చేరని ఆంధ్రదేశ మునకు — అనగా ఇప్పటి గోదావరి విశాఖపట్టణ జిల్లా లకు, అల్లాడ వీరభద్రారెడ్డి రాజుగనుండెనని శ్రీనాథుడు చెప్పియున్నాడు. ఇతడు అల్లాడరెడ్డియొక్క రెండవ కుమారుడు. ఇతనికి వేముడను అగ్రజు డుండెను. వేమా రెడ్డి జీవించియుండగా వీరభద్రారెడ్డికి రాజ్య మెట్లు వచ్చెనో శ్రీనాథుడు స్పష్టపరచలేదు. వీరభద్రారెడ్డి భార్యయగు అనితల్లియొక్క కలువచేరు శాసనము మూల మున రాజ్యమామెదియనియు ఆమెద్వారా వీరభద్రునికి రాజను బిరుదు లభించినదనియు వీరభద్రుని తండ్రియగు అల్లాడరెడ్డి ఆమెకు సహాయము చేసినవాడేకాని రాజు కాడనియు రాజ్యముకూడ ఆమె పేరనే కొంతవరకు జరుగుచుండెననియు (వినతనరపాలపాళీ, కనదురుమాళిప్ర గుదితగంధపదాబ్జా అని తల్లీ - అను కలువచేరుశాసనము లోని శ్లోకపాదమును గమనించునది.) మనకు తెలియు చున్నది. ఈవిషయములను కప్పిపెట్టుటయేగాక వీటికి విరుద్ధముగను వీటితో సమన్వయించుటకు వీలులేనివియు నగువాటిని కొన్నిటిని శ్రీనాథుడు భీమఖండమున చేర్చి యున్నాడు. (1) "తత్సంబంధబాంధవంబున......... విజయధాటీసమాటీకనంబుల దిశలల్లాడ నల్లాడ భూవల్ల భుండు రాజమహేంద్రంబు రాజధానిగా సింహాద్రి

1. ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలలో నొకదానియందు "త్రిలింగముమండి తెనుగుపుట్టెనా, తెనుగు నుండి త్రిలింగముపుట్టెనా" అనువ్యాసములో లక్ష్మణరావుగారు ఈవిషయమును విమర్శించియున్నారు.

2. 1 ఆశ్వాసము. 19 పద్యము.

3 D. C. Sen History of Bengali language and literature

పర్వతంబు..........విశ్వవిశ్వంభరా భువన మండలంబు బరిపాలించె" (1, ఆశ్వాసము 82). తత్సంబంధ బాంధవ మనుటలో పోలయవేమ అన్న పోత అన్న వేమకుమార గిరీశ్వరాదులగు కొండవీటిరెడ్ల సంబంధ మని శ్రీనాథుని యుద్దేశము. కాని కలువచేరు శాసనములో అనితల్లితండ్రి యగు కాటయవేముని బంధువగుటచేత అల్లాడరెడ్డి అతని తల్లికి సహాయముచేసెనని చెప్పబడియున్నది. కాటయ వేముని బాంధవ్యము మిగుల సన్నిహితమైనది. కొండవీటి రెడ్ల బాంధవ్యము దూరమైనది. అల్లాడరెడ్డి అధికారమునకు రాకపూర్వమే అతనివియ్యమగు కాటయవేముడు రాజమహేంద్రవరమునకు పరిపాలకుడైయుండెను. కాటయవేమునికి అల్లుడగుటచేతనే వీరభద్రునికి రాజ్యములభించెను. ఇట్టిసందర్భములో కాటయవేముని కొంచెముకూడ స్మరించక అల్లాడరెడ్డి స్వతంత్రరాజైనట్లును అతని నుండియే వీరభద్రునికి రాజ్యమువచ్చినట్లును వర్ణించుటమిక్కిలి యసంగతము. ఇట్లుచేయుటలో శ్రీనాథుని యుద్దేశమేమి? భార్యమూలమున రాజ్యము లభించినదని చెప్పిన యెడల గౌరవహానియని అతడు తలచియుండును. సాధారణముగ మనకవులు ముఖస్తుతిచేయుటయందత్యంతోత్సాహము కలవారు. శ్రీనాథుడుకూడ ఇట్టివాడే. అతిశయోక్తి వారికి సహజము. ఇదిగాక ఇంతకంటె ప్రబల కారణ మింకొకటియుండనోపును. (2) శ్రీనాథుని భీమఖండమును చదివినను ఆకాలపుశాసనముల పరిశోధించినను వీరభద్రుడు "అగస్త్యభ్రాత"గ కనుపించును. రాజ్యమునకు హక్కుదారాలు అనితల్లి; అధికారమునుచెలాయించుచుండినవాడు అన్నయగు వేమారెడ్డి "రాజ్యభరణస్థితిబట్టముగట్టి"1 వీరభద్రుని "ధాత్రియేలింప" జేసినవాడు వేముడు.2 బెండపూడన్నమంత్రి యవనరాజసు అహమ్మదు సేనునకు వ్రాయులేఖలలో వేమ మహీసురేంద్ర రాజ్యోన్నతిని వర్ణించుచుండెనుగాని వీరభద్రుని అధికారమును కాదు.3 అన్నమంత్రి "వేమ భూపాలరాజ్య భారధురంధరుడు," "వేమభూధవ కృపాసంవర్ధిత ప్రాభవుడు"4 రాజధానియగు రాజమహేంద్రవరము "వేమ భూపాల రాజ్యాభివృద్ధికరము.5 పండువాసురతాణి యిచ్చినవేనుగులు, ఒడ్డెరాజిచ్చిన స్త్రీలు, కర్ణాటభూపతి పంపిన ముక్తాతపత్రమ్ము, యవనరాజొసగిన హయములు లోనగువాటిని అనుభవించువాడు వేముడు; రెడ్డిరాజ్యమందు సామంతరాజులై కప్పము చెల్లించుచుండిన బారహదొంతి మన్నె సప్తమాడియ రాజన్యులందరు వేముని మ్రొక్కుచుండిరి. అధికారమంతయు వేమునియందుసంక్రమించియుండుటచేతనే అనితల్లి కలువచేరు గ్రామమును "భావుకసన్నిధియందు" దానముచేయవలసివచ్చెను. (3) అనితల్లితండ్రియగు కాటయవేముడు 1416 కు తర్వాత జీవించియుండినట్లు లేదు. ఆమెయొక్క కలువచేరుశాసనము 1423 సంవత్సరము నాటిది. భీమఖండము 1428 తర్వాత వ్రాయబడినది. కాటయవేముని తర్వాత అతని కుమారుడు కుమారగిరి విస్తారకాలము రాజ్యము చేయలేదు. కుమారగిరిమరణానంతరము శత్రురాజులతనిరాజ్యముపై దండెత్తిరాగా అతనిసోదరి యగు అనితల్లిపక్షమున అల్లాడరెడ్డి యుద్ధముజేసి రాజ్యము నామెవశము గావించెను. ఇది 1416 న జరిగినది. అప్పటికే అనితల్లి వీరభద్రారెడ్డిని వివాహమాడియుండెను. ఇట్టి సందర్భములో రాజమహేంద్రరాజ్యమునకు 1416 మొదలు వీరభద్రుడు రాజాగనుండవలసియుండగా అల్లాడరెడ్డి మరణానంతర మతని పెద్దకుమారుడగు వేముడు తమ్ముడగు వీరభద్రునికి పట్టముగట్టినట్లు శ్రీనాథుడు చెప్పియున్నాడు. అల్లాడరెడ్డి 1425 వరకు జీవించియుండినట్లు తెలియుచున్నది. 1416 మొదలు 1425 వరకు వీరభద్రారెడ్డి సింహాసనార్హుడు కాకుండెనా? అల్లాడరెడ్డిఅతనికేలపట్టముగట్టలేదు? అనుసంశయమొకటిగలుగుచున్నది. దీనినంతను చూడగా శాస్త్రసమ్మతమగు హక్కు అనితల్లిదైనను కాటయవేముని తర్వాత రాజ్యముచేసినవాడుఅల్లాడరెడ్డి అనియు, అతనితర్వాత అతని కుమారుడు వేముడనియు చెప్పవలసివచ్చుచున్నది. అల్లాడరెడ్డి బ్రతికియుండినంత వరకు అనితల్లి తనభర్తయగు వీరభద్రునికి పట్టాభిషేకము చేయవలయునని పట్టుపట్టియుండలేదు. అట్టి పట్టుదలకు కూడ అప్పుడవకాశ ముండినదికాదు. అల్లాడరెడ్డి శత్రురాజులవలన గలిగిన ఆపదనుండి రాజ్యమును రక్షించు

1. 1 ఆశ్వాసము 34
2. ,, 41
3. ,, 74
4. ఆశ్వాసము 118,5 ఆశ్వాసము 198
5. ,, 43

... మంత్రియగు అరియేటిలింగన యొక్క సహా ... వసప్త మాడె బారుహాదొంతి మొద ... రాజ్యములను జయించి రెడ్డిరాజ్యమును విస్తరించుచుండెను. అట్టిమహామహుల నెదిరించి భర్తను సింహాసనమునం దుంచుటకై ప్రయత్నించుట నష్టకరమని ఆమె భావించియుండెను. అతడు చనిపోయిన పిమ్మట మొగమోట పడవలసిన యగత్యము లేకపోవుటచే భర్తగౌరవమును తగువిధముగ నిలిపి పట్టాభిషిక్తుని గావించెను. వేమారెడ్డి మనఃపూర్తిగ దానికి సమ్మతించినట్లు కనపడదు. పౌరుషవంతుడును బలవంతుడును అగుటచే తమ్ముడు రాజగుటయు తాను సామాన్యుడుగ నుండుటయు అతని కంగీకారమై యుండదు. అందుచేతనే తండ్రివలె అతడు కూడ సర్వాధికారముగలవాడై యుండెను. (4) రెడ్డిరాజులు పంటకులములోనివారు. ఇప్పటికికూడ నెల్లూరి జిల్లాయందలి ప్రముఖులను కాపులందరుపంటరెడ్లే. పిత్ర్యమగు ఆస్తిని పంచుకొనక, తరతరములవరకు బంధువర్గముతో నొక కుటుంబమందు కలసి వ్యవహారము చేసుకొనుచుండుట వారిలో ఇప్పటికికూడ ఆచారమై యున్నది. అల్లాడరెడ్డి వేమారెడ్డి వీరభద్రారెడ్డి అనితల్లి మొదలగు వారందరు కలిసి రాజ్యము చేయుచుండుటచూడ ఈయాచార మనాదిగనున్నదని స్ఫురించకమానదు. కొంతకాలమువరకైన రాజమహేంద్ర రెడ్డిరాజ్య మున్నతస్థితియం దుండుటకు బంధువులలోగల ఈయైకమత్యమేకారణము.

అప్పటిపరిపాలనక్రమమును గురించి శ్రీనాథుడు వివరముగ నేదియుచెప్పలేదు. బలపరాక్రమముల గలవారలై శత్రువుల ఖండించి రాజ్యమును విస్తరింపజేయుట, వితరణగలవారై దేవునియందును బ్రాహ్మణులయందును భక్తిచూపుచు పంచారామాది పుణ్యక్షేత్రములందలిదేవాలయములకు భూదానములను యోగ్యులగు బ్రాహ్మణులకు అగ్రహారదానములనుచేయుట రాజులకు ప్రధాన కర్తవ్యములుగ నెంచబడుచుండెను. "నరేంద్రసారణీ సలిలవివర్ధమాన బహుసస్యసమాకుల మగ్రహారము" అని చెప్పుటచే కర్షకులకు వలయుసదుపాయముల కల్పించుట ప్రభువులకు సహజమై యుండెనని చెప్పవచ్చును.



# పరాన్వేషణము

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ గారు

ఆశ్రితాభీష్టదాయకులైన వసుమతీ, నేతల నవ్వు వెన్నెలల యందు;
సౌందర్యవిభ్రమాస్పదలైన జవరాండ్ర, సరసకటాక్ష వీక్షణములందు;
లలిమూగి వాఙ్ముఖంబులు ప్రీతి విని మెచ్చు, తత్ జ్ఞుల సాధువాదములయందు;
తత్త్వజ్ఞుడను ప్రవాదము నమ్మి డగ్గఱు, శ్రితముముక్షుల నమస్కృతులయందు;
తే. అరసితినిగాని కననేరనైతి నిన్ను, విశ్వమునలేవొ? కాక యన్వేషి జనుల
తమకపెట్టుటె నిత్యవ్రతమ్మొ నీకు? శాంతిసీమంతినీ! చిత్రచరితవార!!.

సీ. రవిరశ్మి చొరని సాంద్రద్రుమహారణ్యాసీ, మలలో నివసించెదేమొ?
జలచరంబులకైన మెలగంగరాని వార్ధిగర్భముల సంచరించెదేమొ?

తరళవాయుతరంగ తతినిర్మితములైన, లలితంపుఁ బుట్టముల్ గట్టెదేమొ ?
శరదిందుచంద్రికా చ్ఛాయామయంబైన, గంధంబు మేన నలందెదేమొ ?
తే. అమలగంధర్వనగరహర్మ్యాగ్రసీమ, మృదుగగనపుష్పశయ్య నిద్రించెదేమొ?
ఎవ్వఁడెఱుఁగు నీకలరూప మిట్టిదనుచు, శాంతిసీమంతినీ! చిత్రచరితవార!!.

చ. కెలఁకుల నిల్చినట్లు, పలికింపఁదొడంగినయట్లు, చేరఁగాఁ
బిలిచినయట్లు నెయ్యమునఁ బేర్చినయట్లు స్ఫురింపఁజేసి యా
వలినిముసంబులోన, ధృతివాపి తిరోహితవయ్యె దక్కటా!
యలతొలికాఱు చంచలలకంటెను జంచలవీవు కోమలీ!.

సీ. మూర్ధాభిషిక్తుఁడౌ భూమీశ్వరుఁడు మొదల్, బిచ్చమెత్తెడు నిఱుపేదవఱకు;
గగనచారసమర్థుఁడగు నాగరకుఁడాది, మయిగప్పుటెఱుఁగని మలినువఱకు;
యజనయాజనపరుండైన ద్విజుఁడుదొట్టి, యేపియెఱచి నంజు పాపివఱకు;
విభుతోన చితిఁజొచ్చు వీరసాధ్వీదొడంగి, వెఱచవిఁబతిఁజంపు జఱభివఱకు;
తే. ఆపిపీలిక మాబ్రహ్మ మఖిలజగము, తావకాద్భుత రూపనిధ్యాన పరమె!
యెల్లరఁ గలంచి యలయించె దేకరీతి, శాంతిసీమంతినీ! చిత్రచరితవార!!.

సీ. పరుగెత్తనేల భాస్కరుఁడభ్రవీథి నీ, తరళాకృతిఁగను నాతురతఁ గాక;
క్షయమందనేల నిచ్చలు సుధాకరుఁడు నీ, పదదర్శనము లభింపమినిగాక;
కడలు మూలలుదూరఁగానేల పవనుండు, నీయునికి నరయు పూనికను గాక;
జ్వాలనుండు శిఖలఁబైఁ బైఁబ్రాఁకనేల నీ, చరణాంబుజయుగంబు దఱియఁగాక;
తే. ఖచర నక్షత్ర తారకా నిచయమెల్ల, మింట ననవస్థితిఁ బరిభ్రమింపనేల?
త్వత్కటాక్షైక పాత్రమె వఱలుఁగాక, శాంతిసీమంతినీ! చిత్రచరితవార!!.

సీ. పరమతద్వేష మేభంగిఁ బైకొనివచ్చు, నఖిలమతము లొక్కఁడైనచోట
పరరాజిగీష యేకరణిని దలసూపు, నఖిలరాజ్యములొక్కఁడైనచోట
పరజాతినింద యెప్పాటఁ బ్రవర్తిల్లు, నఖిలజాతులు నొక్కఁడైనచోట
పరజీవహింస యేవరుసను వర్ధిల్లు, నఖిలజీవులు నొక్కఁడైనచోట
తే. ఈదృశమహానుభావ సమృద్ధియుతుఁడు, వరభవత్స్వయంగ్రహ పరిష్వంగరసికుఁ
డతులతావకమహిమ మే మనఁగవచ్చు, శాంతిసీమంతినీ! చిత్రచరితవార!!.

# శాకుంతల నాయకుఁడు

గొల్లపూడి శ్రీరామ శాస్త్రి గారు

ప్రాచీన సంస్కృతనాటక సమాలోచన చేయఁ దలంచితిమిగాన, ప్రథమమున ‘కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసః’ ‘నాటకేషు శకుంతలా’ అను నానుడులఁబట్టి కవికులతిలకుఁ డగు కాళిదాసుని నాటకరాజమగు శాకుంతలమునుగుఱించి ముచ్చటించుట కర్తవ్యమై యున్నది.

ఒకకావ్యమును విమర్శించుటకష్టము. దానికంటెఁ గష్టతరము కవిహృదయమెఱిఁగి నిష్పాక్షికముగ విమర్శించుట. కష్టతమము మఱొకటిగలదు. తనవిమర్శనముచేఁ బాఠకుల మెప్పించుట. కృతివలెఁ దద్విమర్శనమును నొకవ్యక్త్యధీన మైనదగుటచే వానివాని యూహాపోహల ననుసరించి యుండును. అయినఁ బాఠకులలోఁ గావ్యము నాక్షేపించు వారికంటెఁ దద్విమర్శనము నాక్షేపించువారే యధికముగ నుందురు. విమర్శకునకువలె దాని నాక్షేపించువానికి, విశేషపరిశ్రమగాని, విశేషాలోచనగాని యనవసరము. ఎట్లన ? ఒకరు కొంతవడి విచారించి, యెట్టకేల కొకవిధముగ నిర్ధారణచేసికొని ‘దూరముగ నాకనఁబడుచున్నది గుఱ్ఱముగనుండనోపును’ అనియనినచో శ్రోతగనుండువాఁడు దానిసమగ్రముగ వినకమునుపే, యావ్యక్తిని గుఱించి విచారణ చేయకయే ‘యయ్యది గాడిద యేల కాఁగూడదు ?’ అనివెంటనే యాక్షేపించును. ఇంతదూరము మథనపడి చెప్పినదానిని దృటిలోఁ దృణీకరించినాఁడే. గుఱ్ఱము గాడిద యొకటైనదిగదా యని రోషముద్భవించి, యదివరలో ‘నుండనోపును’ అనిచెప్పినయాతఁ డున్నవి కొన్ని లేనివికొన్ని సమకూర్చి, ‘యయ్యది మామ్మాటికిని గుఱ్ఱమేయగు’నని ఱాయిగ్రుద్దును. గాడిదపక్షము పూనినవాఁడు తక్కువవాఁడుగనుండునా? నీవుచెప్పినకారణముల చేతనే యది గాడిద యని నిర్ణయించును. ఈవివాదములో జయము పాక్షికము. ఒకవేళ నాక్షేపకుఁడు విజయము నొందినను, దనబుద్ధిబలముచేఁ దొలుత నొకయాకారము నేర్పఱిచినవాఁడగు మొదటివిమర్శకుఁడు గణనీయుఁడు గాకపోఁడు.

ఇంతకు నేఁజెప్పవచ్చిన దేమన? విమర్శాక్షేపముల కవినాభావసంబంధము గలదని. కనుకనే విమర్శనముచే లోకుల మెప్పించుట కష్టతమమని చెప్పుటకు హేతువు. అయినఁ గావ్యమునకంటెను దద్విమర్శనమే భాషాప్రపంచమునకు మహోపకారకమని చెప్పవలసి యుండును. ఇట్టికష్టతమమును, నత్యంతోపయుక్తమును నగుకృత్యమును జేయఁబూనిన విమర్శకుఁడు కవివలెఁ బండితుఁడును, ప్రతిభా విశారదుఁడును, రసజ్ఞుఁడును నగుట యేకాక నిష్పాక్షికుఁడును, నక్రోధనుఁడునునై తనకృత్యమును నిర్వహింపవలయును. కవికిని బాఠకునకును మాధ్యస్థ్యము వహించిన విమర్శకుఁడు గుణదోషములలో నన్యతరమున కధీనుఁడుగాక, యావిషయమై తనకుఁ బూర్వు లెవరైనఁ బ్రయత్నించియుండినచో నద్దానిపై నాధారపడక, తానోపినకొలఁది పూర్వాపరసమన్వయముతో విషయమును బరిశీలించి, తనయూహ మెమ్మాటికిని దృఢమని విశ్వాసము జనించినపిమ్మటనే తనయభిప్రాయమును వెలిఁబుచ్చినచో, నది విశేషజ్ఞునిచే నొకప్పు డాక్షేపితమైనను, హృద్యమై యుపకారజనకము గాకపోదని నా నమ్మకము. ఈవిశ్వాసముతోడనే ప్రాచీనసంస్కృత నాటకములను గొన్నిటిని విమర్శింపఁ బూనితిని.

మనము తొలుత విమర్శింపఁబూనిన శాకుంతల నాటక మసంఖ్యాకులచే నాఁడుమొదలు నేఁటివఱకును విమర్శింపఁ బడుచున్నది. ఇట్లే విశ్వమున సారస్వత మున్నంతకాలమును విమర్శింపఁబడుచునే యుండునని

చెప్పవచ్చును. మహాకవియగు కాళిదాసు సంస్కృతవాఙ్మయ ప్రపంచమున శాకుంతలనాటకమను దివ్యజ్యోతి వెలిఁగించి, కేవల మావాఙ్మయమునే కాక భారతభూమిని సయితము విలసిల్లఁజేసి యున్నాఁడను విమర్శనములు గలవు. రఘువంశాది కావ్యరత్నరచనచే 'విశ్వశ్రేయఃకావ్య'మనునది సార్థకము నొందించి, కవిలోక గణ్యుఁడైన మహాకవి, యంతటితో నూరకయుండలేక, శాకుంతలాది నాటకములను, అందు విశేషించి శాకుంతలమును రచించి తనయవజ్ఞతను వెల్లడించి యున్నాఁడను విమర్శనములును విద్యమానకాలములో లేకపోలేదు. అయ్యవి పండితవర్య కృతములగుటచేఁ జాతకులకు దేనికది యాదరణీయముగనే యుండుననుటయు సత్యదూరము గానేరదు. కానియతివృష్ట్యనావృష్టులు రెండును హానికరము లనియే తలంపవలసియుండును. ఇట్టివిమర్శనములు తద్గ్రంథమును దెప్పించి చూచుటకుఁ బూర్వమే కారణాంతరముచే నిదమిత్థమని, (అనఁగా నాతఁడీగ్రంథమునుగుఱించి యీవిధముగవిమర్శించియున్నాఁడుగదా. మనమద్దానికి వ్యతిరిక్తముగ నీవిధముగ విమర్శింపవలయునని) నిర్ణయించుకొని చేయఁబడిన వని చెప్పనగును. ఇట్టివానిచే భాషకుఁ గలుగు ప్రయోజనమును గుఱించి నే వేఱుగఁ జెప్పవలసినపనిలేదు.

సర్వజ్ఞుఁడగు నీశ్వరకల్పితములలోనే యొక్కొక్కటియు గుణదోషముల కాకరమై చూపట్టుచుండ, కించిజ్ఞుఁడగు మానవకల్పితము లట్లుండుట కేమియాశ్చర్యము? ఎవరైన నొకవస్తువునుగుఱించి మాటలాడుచో నది నిర్దోషమనినను, నిర్గుణమనినను నతిశయోక్తియనియే కదా భావింపవలసియుండును! ఏమన, నట్టిది ప్రత్యక్షానుభవ విరుద్ధము. అయిన నట్లు నుడువుట గుణదోషముల యాధిక్యానాధిక్యముల నుద్దేశించియేయైనచో నాక్షేపణీయముగాదు. అట్లే శాకుంతలమును గుణభూయిష్ఠమై యుండుటచే, తక్కినవానికంటె నిత్యాది శ్లాఘాపాత్రమై యగ్రగణ్యముగ నెన్నఁబడుచున్నదని నాభావము. అయిన నిందును నెఱసులు లేవనుటకు వీలులేదు. వాని గుఱించి తరువాత విచారించెదము.

మహాకవి భారతములోని శకుంతలోపాఖ్యానమును గైకొని కొన్ని మార్పులతో 'అభిజ్ఞాన శాకుంతల'మను నాటకమును రచించియున్నాఁడు. మూలములో భారతోత్పత్తి కణ్వాశ్రమముననే యైనట్లుండ, మనకవి రాజు మారీచాశ్రమములో నైనట్లుకల్పించియున్నాఁడు. అట్లే శకుంతలా దుష్యంతుల పునస్సమావేశము రాజసభలోనే యైనట్లు భారతములో వర్ణింపఁబడియుండ, మారీచాశ్రమముననైనట్లు మహాకవి మార్చియున్నాఁడు. అన్నియంశములకంటె నీ నాటకమునందు విలక్షణములైన మార్పులు 'అభిజ్ఞాన'ముని శాపము'లనునవి. ఈనూతనకల్పనలచే నాయకుని ధర్మచ్యుతినుండి కాపాడి నానాగుణాలంకృతునిగ మహాకవి యొనర్చియున్నాఁడని తెల్లమగుచున్నది. ఇట్లే పండితాభిప్రాయమును నై యున్నయది.

## భారతదుష్యంతుఁడు

స్థూలముగ విచారించినచోఁ గొన్ని యంశములలో వ్యాసదుష్యంతునకును, కాళిదాస దుష్యంతునకును విశేషభేదమున్నట్లు కానఁబడదు. భారత దుష్యంతుఁడును, కణ్వాశ్రమమున శకుంతలనుజూచి మోహించి, కాళిదాస దుష్యంతునివలెనే తనమానసమునే ప్రమాణముగఁ గొని (యీమెయందుఁ బూజ్యమైన నామనస్సు లగ్నమగుటచే నీమె క్షత్రియార్హ యగుటయే నిక్కము' అనుభావమునే యీక్రిందివిధమున వెల్లడించియున్నాఁడు.

శ్లో. నమేఽన్యత్ర క్షత్రియాయాః మనోజాతు ప్రవర్తతే;
ఋషిపుత్రీషు చాన్యాసు నావరాసు పరాసు చ.
తపాత్త్వత్ప్రణిహితాత్మానం విద్ధి మాం కలభాషిణి;
యస్మాన్మేత్వయిభావోఽస్తి క్షత్రియాహ్యసి కావద.

మఱియు, లాలసుఁడయ్యు భారతదుష్యంతుఁడు కాళిదాసదుష్యంతునివలెనే శకుంతలను గాంధర్వవిధిఁబరిణయమాడఁదలఁచి, యామె జన్మవృత్తాంతమునడిగి తెలిసికొని నిశ్చితుఁడై సర్వవిధముల నాకన్య నొడఁబఱిచి వివాహ మాడెను. ఇంతవఱకే వ్యాసకాళిదాస దుష్యంతులు కొంతవఱకు దుల్యులనఁదగియున్నారు. భారతదుష్యంతుఁడు శకుంతలను బరిణయమాడునంతవఱకు నిష్కపటియగు నొకవీరుఁడుగ నెన్నఁదగియున్నను అతనితరువాతిచరిత్రమును బట్టి విచారించినచో నాతఁడు క్రూరకర్ముఁడనియే చెప్పవలసియుండును.

అభము శుభము తెలియని కన్యకను, మీఁదుమిక్కిలి ఋష్యాశ్రమమునఁ బెరిగినదాని నోరు లెఱుంగకుండ

దుష్యంతునివంటి చక్రవర్తి స్వప్రయోజనార్థము ధర్మభ్రష్టునిగ నొనర్పఁ దలఁచి, 'నేనంతవాఁడ నింతవాఁడ. నా సర్వస్వము నీయధీనము. నిన్ను పట్టపురాణినిగ నొనర్చెదను. నేను నీదాసుఁడను.' అని యేమేమో మాయలు నుడివి, యామెకన్యాత్వ భంగమొనర్చి 'నిన్నుఁ ద్వరలోఁ బట్టణమునకు రప్పింపకొనెద'నని చెప్పిపోయి, యావల నాస్మృతియే లేకయుండుటచే నెంతయు నీచకార్యమొనర్చెననియే తలంచుట కవకాశముగలదు. ఆతఁడు శకుంతలను మఱచినాఁ డనుటకంటె, మనుష్యత్వమునే మఱచినాఁడనుట యుక్తము. ఈ యమానుషకృత్యముచే నాతఁడు స్త్రీలంపటుఁడనియు, శూన్యచిత్తుఁడనియు నేర్పడుచున్నది. వెనుకటి కొక న్యాయస్థానములో విచారణావసరమున, నొక పెద్దమనుష్యుని ప్రతివాదిపక్షపున్యాయవాది 'మీ కెంతమంది బిడ్డ'లని యడుగ, నాతఁడు మీసములమెలవేయుచు, 'మాకేమి తెలియును? మాగుమాస్తానుపిలిచి యడుగుఁడని' చెప్పినాఁడట. భారతదుష్యంతుఁ డీపెద్దమనుష్యునకు అన్నయో! తమ్ముఁడో! యైయుండును.

ఇంకను నాతని దుష్కృత్య మరయుఁడు. పాపమాచిన్నది క్షణమొకయుగముగఁ గొన్నివత్సరము లెట్లో గడపి, యావల పితృనానతిని బుత్రునిఁదోడ్కొని కొండంతాశతో రాజసభకువచ్చి, మనయప్పటి వివాహమును స్మరించి, పుత్రసహితయగు నన్నుఁ బరిగ్రహింపుమనుచు, నాదుష్యంతుఁడు పరిణయవృత్తాంతముస్మృతికివచ్చియు, లోకులేమైన ననుకొనిపోవుదురేమో! యను శంకచే, నామెగొంతుకోయఁదలచి, 'ఏనెరుగ నిన్ను; నెక్కడిదానవు? మిన్నకయ యనుచితంబులు పలుకంగా నేల? యరుగుమంబురు, హీనన! యెందుండివచ్చితందులకువడిగా' అని నిరాకరించెను. ఇట్టియవివేకిశిఖామణి, యిట్టిక్రూరకర్ముఁడు విశ్వశ్రేయః ప్రదంబగు నాటకమునకు నాయకుఁడుగనుండినఁ దత్ప్రయోజనము సిద్ధింపదను తలంపుతో మహాకవి దన ప్రతిభావిశేషముచే నొకటిరెండు మార్పులతో నాతనిప్రవర్తనమును సంస్కరించి 'సెబాస్' అని యనిపించి యున్నాఁడు.

## కాళిదాస దుష్యంతుఁడు

కాళిదాసు భారతదుష్యంతుని ప్రవర్తనమును సంస్కరించి తననాటకమునకు నాయకునిగ గ్రహించి నన్ను కళంకములకెల్లఁ బుట్టినిల్లగు నాతని బహుభార్యాత్వమును సంస్కరింపకపోవుటచే నాతనిచరిత్రము నిష్కళంకము గాకపోయినది. ఆలోచించినచో మహాకవి యద్దాని నిరసించియుండెనేని యాచరిత్రము పురువంశోద్భవుఁడగు దుష్యంతునిది కాకపోవునేమో! యని తోఁచెడి. రాజులకీబహువల్లభత్వము వెన్నుతోఁబుట్టి గౌరవాస్పదముగ కాళిదాసుకాలమునకే యుండియుండవచ్చును. అట్లేయైనచోఁ గవి దానిఁ దప్పించిన, నాగ్రంథము విశ్వజనీనముగునా? శ్రీరామచంద్రమూర్తి చరిత్రమును వ్రాయుచు నాతని యేకపత్నీత్వము నుల్లంఘించినచో నాకవియు, నాగ్రంథమును, బరిహాసపాత్రములుగావా? ఇంతయేల? సంస్కృత వాఙ్మయములోని శృంగారరూపకములలో దక్షిణనాయకవంతముగాని రూపక మరుదుగఁ గానరయ్యెడిగదా! ప్రాచీనకవివర్యులందఱును సామాన్యముగ నొకరినొకరు అనుకరించుటచేఁ దద్విరచితములగు కావ్యము లన్నియంశములతోను తుల్యములైనవి. ఈవిషయమై పిమ్మట విచారించెదముగాక!

శాకుంతల సమాలోచనావసరమున, ఏకపత్నీవ్రతుఁడగు శ్రీరామచంద్రమూర్తి చరిత్రమునుగాని, సత్యవాక్యబద్ధుఁడై సర్వమును దృణప్రాయముగ నెంచిన హరిశ్చంద్రుని చరిత్రముగాని, పితృమనోరథసిద్ధికై యాజన్మబ్రహ్మచర్యమునుబూనిన భీష్మాచార్యుని చరిత్రమునుగాని, తార్కాణముగఁ గైకొనక, మహాకవియుద్దేశము ననుసరించి, పురువంశసంభూతుఁడును, బహుపత్నీకుఁడును, నగు దుష్యంత సార్వభౌమునిచరిత్రవిమర్శనమని తలంచుచు, నట్టియాతనిచరిత్రమును మహాకవి యెట్లు చిత్రించి హృదయంగమముగ నొనర్చియున్నాఁడను నంశమును గనియానందించెదముగాక.

ఈనాటకనాయకుఁడు సుక్షత్రియసంభూతుఁడును, బహుపత్నీకుఁడును నగు చక్రవర్తి. ప్రాచీనసాహిత్యవేత్తల యభిమతము ననుసరించి యీనాయకుఁడు ధీరోదాత్తలక్షణలక్షితుఁడు. నాయిక, క్షత్రియుఁడగు విశ్వామిత్రునకు దేవవేశ్యయగు మేనకయం దుద్భవించి, పుట్టిననాఁటినుండి తపోవనములో నాజన్మబ్రహ్మచర్యనిష్ఠుఁడగు కణ్వమునియాశ్రమమున మునికన్యకలసాహచర్యమున వర్ధిల్లుచున్నది. జన్మమునుబట్టియు, సహవా-

షమునుబట్టియు, గుణములు పట్టువడునుగనుక శకుంతల యందు, తల్లి గుణములును, తండ్రిగుణములును, తపోవన వాసముచే వారిగుణములును, లేకపోవని తలంపవచ్చును. ఈనాయికనుగుఱించి యావల నిర్ధారించెదము. ఇట్టినాయికతో దుష్యంతునివంటిచక్రవర్తికిఁదపోవనమున సమావేశమునుగల్పించుట కష్టసాధ్యము. కష్టసాధ్యమన నేల! కత్తిమీఁదిసామని చెప్పవలసియుండును. కవీశ్వరుఁడేమాత్రమైనఁ బ్రమాదపడిన, నాయకుఁడు అట్లు రసికతకును, నిట్లుసత్ప్రవర్తనమునకును దూరుఁడై రెంటికిఁజెడిన రేవడ కావలసివచ్చును. మీఁదుమిక్కిలి ప్రథమసమావేశమును గల్పించుటయే బ్రహ్మరొడ్డు. 'తలవంచుకొని కూర్చుండిన నిట్టియద్భవిష్యుఁడా శకుంతలవంటి కన్యకకు నాయకుఁడు ?' అనియందురు. కొంచెమంతమిగిలిన 'నిట్టివ్రాత్యుఁడా'! యనిపోవుదురు.

మహాకవి తన నాటకనిర్మాణమున కిట్టి యితివృత్తమును గైకొని, తన ప్రతిభావిశేషముచే నాయకుని ధార్మికశ్రేష్ఠునిగను, రసికవతంసునిగను, కర్తవ్యపరాయణునిగను కొనర్పఁదలఁచి కృతార్థత నొందియుండుటచేతనే కవియు, కావ్యమును నాఁడుమొదలు నేఁటివఱకును బ్రశంసాపాత్రము లైనవని చెప్పనగును.

రసజ్ఞతకు భూషణము శీలము. దానికలంకారము అధర్మభీతి. కనుకనే దొలుత నాయకుని యధర్మభీరుత్వమునుగుఱించి ముచ్చటింపవలసియున్నది.

## దుష్యంతుని యధర్మభీరుత

దుష్యంతుఁ డొకనాఁడు వేటకై చతురంగబలంబులతో బయలువెడలి యరణ్యమున బ్రవేశించి వేటాడుచు, కొంతవడికి నొకమృగమును దఱుముకొనిపోవుచుఁ దపోవనమును బ్రవేశించెను. ఇంతలో వైఖానసులేతెంచి, యిది యాశ్రమ మృగము. బాణ ముపసంహరింపు మని వేఁడిరి. రాజట్లుగావించె. మునులును సంతసించి, దీవించి, 'కణ్వాశ్రమము సమీపముననే యున్నది. కార్యాతిపాతము కాదేని, విచ్చేసి, యాతిథ్యమును గైకొనిపొం' డని నుడివిరి. 'కులపతు లాశ్రమమున నున్నారా?' యని వారిని రాజడిగెను.

"ఇదానీమేవ దుహితరం శకుంతలా మతిథి సత్కారాయ సందిశ్య...సోమతీర్థం గతః"

('వారిప్పుడే తనయయగు శకుంతలను అతిథి సత్కారమునకై నియోగించి సోమతీర్థమున కేగిరి') అని మునులు వాక్రుచ్చిరి.

అంత దుష్యంతుఁడు,

(ఆత్మగతం) భవతు తాంద్రక్ష్యామి (ప్రకాశం) సైవ విదితభక్తిం మాం మహర్షేః కరిష్యతి.

(తనలో) పోనీ! యామెనే చూచెదగాక. (ప్రకాశముగా) (ఆమెయే నాభక్తినిగుఱించి మహర్షికి విన్నవింపఁగలదు.) అని యనును.

ప్రసంగవశమున నిచట నొకవిషయము మనవి చేయవలసియున్నది. పండితపర్యు లిరువు రీసందర్భము నిట్లు విమర్శించియున్నారు. ఆవిమర్శనములు గ్రంథరూపమున ప్రచారములో నుండుటచే మన కవశ్యవిచారణీయము లని తోఁచెడి.

"కణ్వాశ్రమమున నతిథిగానుండుట కంగీకరించిన దుష్యంతునకును 'దుహితరం శకుంతలా మతిథి సత్కారాయ నియుజ్య' అను వైఖానసోక్తికిని జాల సంబంధము గలదు. ఈ యాకారాంత శకుంతలాశబ్దము రాజును ముగ్ధునిఁజేసెను. కనుకనే మంచిది 'తాంద్రక్ష్యామి.' అను జబాబును దుష్యంతుఁ డుదాసీన భావముతో నీయలేదు."

మఱియొకపండితులును పైభావమునే భంగ్యంతరముగ—సూచించి యున్నారు. ఈయభిప్రాయమునకు అనురూపముగనే తక్కినగ్రంథమును గొంతవఱకు విమర్శింపఁ బడియున్నది.

'కూఁతు శకుంతల నతిథిసత్కారమునకై నియోగించి' అనువైఖానసోక్తి నాకర్ణించినంతనే దుష్యంతుని మావసము చలించుట కవిహృదయమైనచో, నీ దుష్యంతుని కంటె 'దర్శనాదేవహి శుభేత్వయా మే ఒపహృతం మనః' అనినభారతదుష్యంతుఁడే నూఱుమడుంగు లీవిషయమునఁ బూజ్యుఁడనఁదగియుండును. ప్రస్తావవశమున నందుఁదపోవనమున స్త్రీవాచకమగు నాకారాంతశబ్దమును యాదృ

చ్చికముగ వినినంతనే మనశ్చాంచల్యము నొంది మధనపడు మనుజునికంటెను, మనోహరాకారమును సందర్శించిన వెంటనే యుక్తాయుక్తవిచారణలేక మానసమున నువ్విళ్లూరుమానవుఁడు మహాపురుషుఁడనికదా చెప్పవలయును. పైగణములో నిట్టివాఁడుజితేంద్రియుఁడుగఁ బ్రశంసింపఁబడుటనిక్కముగదా. స్త్రీవాచకాకారాంతశబ్దమునాకర్ణించి యాకులపడునట్టి యీపరమయోగ్యుఁడు శకుంతలా ప్రత్యాఖ్యానావసరమునఁబలికిన, 'అనిర్వర్ణ్యం పరకళత్రవ్యపదేశే మావిలయితుం' లోనగుపలుకులు, బూటకములని కదా యెంచఁదగియుండును. అట్లైయెనచో మహాకవియగుకాళిదాసుమూలములో లేని 'అభిజ్ఞాన,మునిశాపము' లను నూతనకల్పనలఁ గావించి యొనర్చినఘనకార్యమేమి? ఇట్టి నిష్ప్రయోజనమగు కల్పనఁగూర్చియేనా ప్రాచీన విమర్శకులగు కుంతలాదులు సయితము వేనోళ్ల శ్లాఘించి యుండుట?

పైభావమును ప్రదర్శించిన విమర్శక మహాశయులే మఱొక సందర్భమున 'కాళిదాస దుష్యంతునకు ఋషులపై భక్తివిశ్వాసములు మెండు'అని వాక్రుచ్చియున్నారు.

'ఆ మునీశ్వరు లింటిలోనున్నారా! యని కనఁబడినవారి నెవరినైన నడిగి ఎచటికో వెళ్లినారు. వారి యమ్మాయిమాత్ర మింటిలోనున్నదని వారు చెప్పగానే అట్లైన నిదేసమయమని యింటిలో జొరఁబడుటయేనా కాళిదాస దుష్యంతునకు ఋషులయెడఁగల భక్తివిశ్వాసములకుఁ దార్కాణము?

ఇట్టి యీవిమర్శన మసంగతమని నేనన సాహసింపనుగాని, ఈభావము కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసుని దనుటమాత్ర మయుక్తమని చెప్పకతప్పినదికాదు.

అయిన 'తాంద్రక్ష్యమే' అను దుష్యంతుని మాటలలోని భావమేమని యడుగుదురేమో! మనమచటికి వెళ్లియు, ఋషిసత్తముని దర్శనము లభింపదేమో! యని తొలుత శంకించి, పోనీ! మనము వెళ్లి యాతిథ్యమును గైకొని వచ్చితిమేని పసంపడి మునిచంద్రుఁడు తనపుత్రిక వలన నారాకనువిని సంతసించును. అదియే మనకుపదివేలు అని దుష్యంతుఁ డనుకొనినట్లు విదితమయ్యెడి. అంతియే కాని మఱొకవిధముగ నాతనియప్పటిభావము నూహించి జట్కాబండివానికంటె నాతని నికృష్టునిగఁజేయ సాహసించుట యనుచితము. దుష్యంతునిప్రవర్తనము నింకను బరిశీలించెదముగాక.

ఆతఁడట్లనుకొని, యాశ్రమోచిత వేషముతోఁ దపోవనమును బ్రవేశించి, యాశ్రమ ద్వారము డాసెను. ఇంతలో వృక్షవాటికకు దక్షిణపువైపున సంభాషణము వినఁబడెను. అదేమా యని యాతఁడు పరికించునంతలో మువ్వురు మునికన్యకలు చెట్లకు నీరుపోయుటకై చేతజల కలశములధరించి, రాజున్నవైపునకే వచ్చుచుండిరి. తటాలున రాజు వారింగని యిట్లనుకొనెను.

అహో, మధురమాసాం దర్శనం!

శ్లో. శుద్ధాంత దుర్లభ మిదం వపు రాశ్రమ వాసినో, యదిజనస్య, దూరీకృతాః ఖలు గుణై రుద్యానలతా వనలతాభిః.

(ఆశ్చర్యము,. ఏమీసౌందర్యము! అంతఃపురస్త్రీలకును దుర్లభమైన యిట్టిసౌందర్యము వనవాసుల కబ్బనేని నిజముగ వనలతలు తమగుణములచే నుద్యానలతల నధఃకరించునుగదా!) అని.

తపోవనములో మునివృత్తితో నుండుశకుంతల వంటి సౌందర్యయువతి గనఁబడినచో, నిచ్చోట నిట్టినారీరత్నముండుటకుఁ గారణమేమనితలంచి యాశ్చర్యపొందుట సర్వసామాన్యము. అట్లే దుష్యంతుఁడును, వనవాసినులును, వల్కలధారిణులును, నవయస్కలును, నత్యంతలావణ్యవతులును, నగుమువ్వురుకన్యకలు చెట్లకు నీరుపోయుటఁ గనినపుడు, అత్యంత సౌకుమార్యనిధులును, ననూర్యంపశ్యలును, నగునంతఃపురస్త్రీలకును, వీరిసౌందర్య మరుదుగనున్నదే. యనియాశ్చర్య మగ్నుఁడైనందులకు మనమన్యథా యూహించుట దోషావహము.

ఈమువ్వురిలో నొకరితగదా యైయుండవలయు శకుంతల? గనుక:

'యావదేనాం తరుచ్ఛాయా మాశ్రిత్య ప్రతిపాలయామి '(చెట్టుమఱుగుననుండి, చేష్టావచన కులాచారాది సర్వవిషయములఁబట్టి యీమెను తెలిసికొందును) అని రాజు తలంచెను.

దొంగవలె దాగియుండుట యేమి పెద్దరికము? అనియడుగుదురేమో ?

ఆతఁడాతిథ్యమునకై వచ్చినవాఁడుగాన, 'శకుంతల ఫలానా' అని తెలిసికొనుట యాతనికి ముఖ్యకర్తవ్యమై యున్నది. తపోవనము, తపస్వికన్యలు, గాన సంకోచము ములేక యెకాయెకినపోయి యడిగి తెలిసికొనఁగూడదా యనియుందురేమో? వారు వనవాసినులుగాని, యీతఁడు పట్టణవాసియేకదా, సంకోచ మేలయుండకపోవును? గనుక నొకరికిమువ్వురు యువతు లెదురుగ వచ్చుచుండుటచే వారిని దటాలున సమీపింప జంకి, చెట్టుమరుగుననుండి సమాచారమును దెలిసికొందునని తలంచుట యొకతప్పులో నిదికాదు.

అంత శకుంతల పాదపములకునీరుపోయుచుండ ననసూయ శకుంతలనుద్దేశించి, 'సఖిశకుంతల! నిన్నీ పనియందు నియోగించుటచేఁ దండ్రిగారైనకాశ్యపునకు నీకంటెను నీయాశ్రమవృక్షములయందు నెక్కుడుప్రీతియని తలఁచెదను.' అనియెను. శకుంతల యామాటకు 'కేవలము తండ్రిగారి యానతిచేతనే నేనీవృక్షములకు నీరుపోయుట లేదు! నాకును వీనియందు సోదరభావముగలదు' అని బదులు చెప్పినది.

కోమలహృదయయగు శకుంతలముఖకమలమునుండి తేనెలొలుకు నీగంభీరవచనముల నాకర్ణించినప్పుడు ఒక దుష్యంతునికే యననేల? ఎట్టివానికైన మానస మానందమగ్నమై జాలినొందుట సహజము. కనుక దుష్యంతుఁ డానందభరితుఁడై తొలుత నట్టి లావణ్యవతి యగు నీమె కణ్వపుత్రిక యెట్లని వితర్కించుకొని శకుంతల చేయు కార్యము నింకను గన్నులారఁ జూచుచు నేయున్నవాఁడు గాన, మానసమున నొకవిధమగు విసుగుజనించి,

అసాధుదర్శీఖలు తత్రభవాన్ కాశ్యపః
య ఇమా మాశ్రమధర్మే నియుంక్తే.

(ఇట్టి యామెను నాశ్రమధర్మమునందు నియోగించుటచేఁ బూజ్యుఁడగు కణ్వముని యుచితజ్ఞుఁడు గాఁడు.) అని తలంచెను.

దుష్యంతుఁ డిట్లు తలంచుట కనికరముచేతనేయని విదితమయ్యెడి. 'ఆయనగారు పూజ్యులు; అనగూడదు. కాని యిటువంటిబిడ్డ నిట్లుశ్రమపెట్టుట మంచిపద్ధతిగాదు' అని విచారించెనని తోఁచెడి. ఇంకను నీతనిమానసమును బరీక్షించెదము.

ఇట్లుండఁ, బ్రియంవదచే గట్టిగబిగింపఁబడిన సైకత ముడిని వదలింపుమని శకుంతల యనసూయ నడుగ, నామె యట్లుచేయుచుండెను. ప్రియంవద తనభాషితనను మెఱయఁ బరిహసించినది. వీని నన్నిఁటిని దుష్యంతుఁడు యథార్థదృష్టిఁ గనుచున్నను నెట్లు తలపోయుచున్నాఁడో కనుఁడు:

శ్లో. సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి;
ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్.

(పద్మము నాచుతోఁగూడియు నందముగనే యుండును గదా. చంద్రునకుఁ గళంకము మలినమైనను శోభాకరమగుచుండుటలేదా? అట్లే లావణ్యవతియగుశకుంతల నారచీర ధరించినను మనోజ్ఞగనే కనఁబడుచున్నది.) ఈమాటలు అనసూయ శకుంతలయొక్క స్తనవల్కలమును వదలించుటఁ గనినపుడు దుష్యంతుఁ డనుకొనినవి. అప్పటి కాతఁడు పరిశుద్ధాంతఃకరణుఁడనియే చెప్పనగును. ఆమె కట్టుకొనిన వల్కలము కంటఁబడినపుడు, మన రాణులవలె నీమెయు బనారసుచీర కట్టుకొనిన నెంతయో దర్శనీయముగ నుండెడిది; యని దుష్యంతుఁడనుకొని వెంటనే స్వతస్సిద్ధమగు సౌందర్యమున్నచో, నేచీరధరించిననేమి? అని యూహించినట్లు తెల్లమయ్యెడి.

తొలుత నేను నుడివిన విమర్శకమహాశయులు క్రమముగ దుష్యంతునిలోలుపత్వమును నిరూపించుచు, నీపై సందర్భము నిట్లు విమర్శించియున్నారు.

ఆతఁడు పాదపాంతరితుఁడై యాతపస్వి బాలికను గాంచుచు నిట్లు తలపోయును:

శ్లో. ఇదముపహిత సూక్ష్మగ్రంథినా స్కంధదేశే
స్తనయుగ పరిణాహాచ్ఛాదినా వల్కలేన,
వపు రభినవ మస్యాః పుష్యతి స్వాం నశోభాం
కుసుమమివ పినద్ధం పాండుపత్రోదరేణ.

(మూపునచిన్నముడివేసి కట్టఁబడిన వల్కలముచే స్తనమండలమంతయుఁ గప్పఁబడి యున్నది. అభినవమగు నీమె శరీరము పండుటాకుచేఁ గప్పఁబడిన పుష్పమువలె స్వీయశోభను ప్రకటింపఁజాలకున్నది.) దుష్యంతునిలక్ష్యము

ముఖ్యముగ నెచ్చటనున్నదో! చదువరులు దిలకించెదరు గాక." అని.

ఈ విమర్శకు ఉదాహరించిన 'ఇదముపహిత' అను శ్లోకము, పైన నేనుదాహరించిన 'సరసిజ మను విద్ధం' అను ప్రసిద్ధశ్లోకమునకుఁ బాఠాంతరముగ 'బొంబాయి' ప్రతిలో నడుమభాగమున ముద్రింపఁబడియున్నది. తమభావమున కనురూపముగ నుండుటచేఁగాఁబోలు ఆమహాశయు లప్రసిద్ధమై పాఠాంతరముగ నెచటనో మూలఁబడియున్న శ్లోకమును సందర్భానుసారముగ నుదాహరించియున్నారు. ఆలోచించినచో నీపాఠాంతరము కాళిదాసీయమనుట కవకాశము గాన్పింపదు. ఈశ్లోకము ఆకారాంతశబ్దము నాకర్ణించినంతనే మోహితుఁడైన దుష్యంతునకుఁ దగునట్లే కాళిదాసుచేతనో రచింపఁబడి సందర్భానుసారముగ గ్రంథమునఁ బ్రవేశపెట్టఁబడినట్లు స్పష్టమయ్యెడి. కాకున్న వల్కలముచే మూపునఁ గట్టఁబడిన చిన్నకుఁడి మన కాళిదాసునకుఁగాని, మన దుష్యంతునకుఁగాని, కనఁబడుట కలలోనివార్త.

దుష్యంతునకు శకుంతల యెవరైనది చక్కఁగ బోధపడినది. కొంతవడి వారిమాటలను వినిన వాఁడగుటచే, మనస్సులోనున్న జంకును దీరియుండవచ్చును. కనుక నింక వారినిసమీపించి యాతిథ్యమును గైకొని యాతఁడు నిజపురాభిముఖుఁడు గావచ్చును. కాని, యట్లుచేయ లేదు. ఇంకను నేమనుకొనెదరో వినదమని యాతఁడట్లే యచటనుండెను గాఁబోలు! మనస్సున కుండుదుర్గుణమే యయ్యది. దాని కేవిషయమునను దృప్తియనునది పూజ్యము. ఇట్టిసందర్భమున నద్దానిసంకల్ప మమోఘము. కనుకనే 'బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి' అను వచనమునుగుఱించి యాలోచించి, 'కర్షతి కర్షతి కర్షత్యేవ' అని పెద్దలు సిద్ధాంతీకరించి యుండుట. క్రమముగ వారిమాటలు కోటలుదాఁటుచుండ, మనదుష్యంతునిమానసము మిన్నుదాఁట నారంభించినది.

ఈడువచ్చినకన్యక లొకరికి మువ్వు రొకచోటఁ గూడినచో వారి సంభాషణము మన మెఱుఁగనిదియా? వారేసమాచారము మొదలిడినను తుదకు మగలసమాచారములలోనికేఁబోయి ముడిపడునుగదా! అందుఁ బ్రియంవద వంటి గయ్యాళిగంప యొకతె యందుండెనేని, చెప్ప వలసినదియే లేదు.

వారిసంభాషణమాకర్ణించుకొలఁది రాజుయొక్క మానసికదృష్టి శకుంతలపై ననివార్యముగఁ బ్రసరించుచున్నట్లు తోఁచెడి. 'పౌలంతిదానవహ్నౌ పురుషుఁ డాజ్యఘటంబు, కదియరాద'ని చెప్పిన భాగవతగ్రంథకర్త వెఱ్ఱివాఁడా యేమి? 'హా! శ్రీహరీ! యంచుఁ ... ఓరమోమిడి తదీయాంసద్వయం బంటి పొమ్మంచుఁ ద్రోచుటకు' దుష్యంతుఁడు ప్రవరాఖ్యుఁడా? అయినను మనదుష్యంతుఁ డుచితజ్ఞుఁడు గాన, నంతలోనే బయలుపడునా!

ప్రియంవద శకుంతలనుగని 'సఖి! శకుంతల! నీవచట నించుక సేపుండుము. ఆబాలకేసరము లతతోఁగూడినట్లు ప్రకాశించును' అని పరిహాసమొనర్చినది. 'కనుకనే నీవు ప్రియంవద' వని శకుంతల యనినది. ఆమాటకు దుష్యంతుఁడు,

'నపునః ప్రియంవదా! ప్రియమపి తథ్యమాహ,

శ్లో. అధరః కిసలయరాగః కోమల విటపానుకారిణౌ
బాహూ, కుసుమమివ లోభనీయం యౌవన మంగేషు సన్నద్ధమ్.

(ఈమె కేవలము ప్రియంవదయే కాదు. యథార్థవాదినియు నగును. ఎట్లన? ఈశకుంతలయొక్క యధరము కిసలయముయొక్క రక్తిమగలిగియున్నది. బాహువులు విటపానుకారులు. సర్వావయవములయందును సన్నద్ధమగు యౌవనము కుసుమమువలె స్పృహణీయమై చూపట్టెడి) అని, తనలో ననుకొనసాగెను. ఈయాకృతి పరీక్షచే దుష్యంతునిచిత్తము పూర్తిగ మారినదనియే చెప్పవచ్చును. కాని విచారణలోఁ బెట్టినచో మనసిద్ధాంత మెగిరిపోవునేమో! బుద్ధిమంతులు మనస్సులో నెట్లున్నను దుదివఱకు గోడమీఁది పిల్లినాటముగఁ దమయభిప్రాయమును వెలిఁబుచ్చుచుందురుగదా!

శకుంతల తనకత్యంతప్రియతమమైన 'వనజ్యోత్స్న' యనులత బాలసహకారమునకుఁ బ్రాఁకి దర్శనీయముగ నుండుటచే, దాని వీక్షించుచుఁ గొంత సేపట్లే నిలిచినది. ఈదృశ్యమునుగని ప్రియంవద నవ్వుచు 'అనసూయ'ను పిలిచి, 'సఖి! అనసూయా! మన శకుంతల యీ వనజ్యోత్స్న నంతగాఁ జూచుచున్నదో గనిపెట్టి

తివా!' అనియడిగి, యామె యాకేమియుఁ దెలియదన, 'ఎట్లు వనజ్యోత్స్న యనురూప పాదపముతోఁ జేరినదో యట్లే తానుగూడఁ దనకనురూపుఁడైన భర్తను బొందవలయునని' తలంచుచు నట్లున్నదని వ్యాఖ్యాన మొనర్చినది. అంత రోషముతో శకుంతల 'ఇదంతయు నిశ్చయముగ నీమనస్సులోనికోరిక' యనిపలికి, చేతనున్న ఘటమును గ్రిందవైచినది. కొందఱకు ఈయీడులో నిట్టి గడుసుదన ముండుట సహజము.

దుష్యంతుఁడు దీనినంతయుఁ గనుచుఁ దనలో 'నీ కోరిక దుర్లభముగదా,' అనియనుకొనెను. తనమనస్సులోనికోరిక దుర్లభమో శకుంతల మనస్సులోని కోరిక దుర్లభమో తెలిసికొనుట కాతనిఁగల్పించిన యాకవిబ్రహ్మకుఁగూడ దుర్లభమనితోఁచెడి. అయిన నిఁకమీఁదటఁగొన్ని నిమిషములలోనె యీతని రంగు బయటపడకపోదని తలంపుఁడు:

"అపినామ కులపతే రియమసవర్ణ క్షేత్రసంభవా స్యాత్
అథవా కృతం సందేహేన.

శ్లో. అసంశయం క్షత్రపరిగ్రహ క్షమా
యదార్య మస్యా మభిలాషి మేమనః;
సతాంహి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః.

(ఈమె కణ్వునికి అన్యజాతిసంభూతురాలగు భార్యయందు జన్మించినదిగా నుండవచ్చునా! ఏల యీసందేహము? పూజ్యమైన నామనస్సు ఈమెయం దత్యంతాభిలాష గలదగుటచే నిజముగ నీమె క్షత్రియార్హయే యైయుండవలయు. సంశయాత్మక విషయములయందు సజ్జనుల యంతఃకరణప్రవృత్తియేకదా ప్రమాణము.) అని నిశ్చయకుఁడయ్యెను.

దుష్యంతుఁడు తపోవనమునందలి కణ్వాశ్రమమునకు వెళ్లినకార్యమొకటియు, అచటనైనది మఱొకటియు అనిమనముదీర్ఘాలోచనచేఁ దెలిసికొంటిమి. రాజు శకుంతలపై మనసుపోనిచ్చినది యెంతయు ననుచితకార్యమనియందుమో! ఆతఁడు మనసుపోఁనిచ్చినాడనుట సాహసము, అవిచార మూలకమునగును. ఆతనిమానస మనివార్యముగ నామెయందుఁ బ్రసరించినదనుట యుక్తము. 'భవితవ్యానాం ద్వారాణి భవంతిసర్వత్ర' (కాఁదగినకార్యముల కెచటనైన ద్రోవలేర్పడును) అని యాతఁడే మొదట ననుకొనినట్లు, కార్యాంతరము నుద్దేశించి యాతఁడచటికి వెళ్లినను, నొకదానికొకటి యొనఁగూడి తుదకచట నిట్లుపరిణమించినదని తెల్లమగుచున్నది. కనుకనే ప్రథమమున దుష్టసంకల్పములేని మనదుష్యంతుఁడు నిరపరాధిగణములోనే చేర్పఁదగినవాఁడని తోఁచెడి. తుదకాతని సంకల్పమే ధ్రువపడుటచే తత్త్వమరసినపిమ్మట, పూజార్హుఁడని యేర్పడును. ఒకనిజంపవలయునని యింటినుండియే ఖడ్గపాణియై వెడలి యాకార్యమున కుద్యమించువాఁడు కఠినశిక్షార్హుఁడుగను, తొలుతఁబ్రయత్న మేమియు లేక తటాలున నట్టి ఘోరకృత్యమునకుఁ బాల్పడినవాఁడు స్వల్పదండనార్హుఁడుగను, నొకప్పుడు నిరపరాధిగఁగూడ, నెన్నఁబడుట రాజనీతిజ్ఞులకుఁ గ్రొత్తగాదు. దీనింబట్టి దుష్యంతుఁడు సత్ప్రవర్తనుఁడనియే చెప్పనగును.

మఱియు నిట్టిసందర్భములో దుష్టుఁడుగాక సామాన్యజనుఁడైనను గిఱ్ఱునఁదిరిగివచ్చి, 'ఛీ! ఈదినము లేచినవేళ మంచిదికాదు. విధవమనస్సు గడ్డితినినది. ఘోరపాపమున కొడిగట్టినది.' అని పరిపరివిధములఁ జింతించి, పాపపరిహారార్థము దీపారాధనచేసి దండముపెట్టుకొని యుండెడివాఁడు. మనదుష్యంతుఁడు సజ్జనవర్యుఁడు గాన, మానసము చలించినతోడనే, దూరాలోచనాపరుఁడై, 'యీామెయే మునిపుత్రిక యని వారిమాటలనుబట్టి యవగతమయ్యెడి. అట్లయినను నీమె మునిచంద్రున కన్యజాతి భార్యయందు జనించినదిగా నుండనోపును. లేనియెడల, పూజ్యమైన నామనస్సు ఈమెయందుఁ బ్రసరించునా?' అని యనుమానప్రమాణముచే నిర్ధారణము చేసికొనెను.

దుష్యంతుని మహోదారత యీపైమాటలయందే సువ్యక్తమగుచున్నది. ఆతని సత్ప్రవర్తనమున కియ్యది జయపతాక యనియే చెప్పనగును. 'ఈతఁడు శిరచ్ఛేదార్హుఁడు. కారణము నామానసమట్లు సంకల్పించుటయే' యని యెవరైన ననినచో నాతఁడు ప్రశంసాపాత్రుఁడా! అట్లైన లోకము దుఃఖభూయిష్ఠము గావలసివచ్చునుగదా యని యాక్షేపించెదరేమో! అట్టి తలంపుకల్పించుట సర్వసామాన్యముగ భావించుట యవిచారమూలమనుటకంటె విశేషించి వ్రాయఁబనిలేదు. ఇంకను నాతని సత్స్వభావము నరయుఁడు. 'తథాపి తత్త్వత ఏనా ముపలప్స్యే'

(ఈ యనుమాన ప్రమాణముచే నాకు దృఢమైన నమ్మక ముండినను; ప్రత్యక్ష ప్రమాణము చేతనే యామెను గూర్చి తెలిసికొనవలెఁగాక) అని తలంచెను.

ఇంతలో లతలకు నీరుపోయుటచే, నందుండి యొక తుమ్మెద వెడలి శకుంతలమోముపై నాడ నారంభించెను. అద్దానికి భీతిల్లి యామెయు దానినే యనుసరించెను. ఆ జాతి కది నైజమగుటచే నీజాతి కిది సహజమైనది. ఆసమయమున రాజు సంతసముతో 'ఏమిది? యిట్టి సమయములోను నీమె యెంతదర్శనీయగనున్నది! తుమ్మెద యెట్లెట్లు తిరుగుచున్నదో యీమెయు లోలలోచనయై యట్లట్లే ప్రవర్తించుచున్నది. అకామయయ్యు భయమువలన దృష్టివిభ్రమమును శిక్షించుచున్నదిసుమా!' యని యుత్ప్రేక్షించెనుగాని, యేమైనఁ దొణికినాఁడేమో చూడుఁడు.

ఆతని మానసములో పూర్ణమైన విశ్వాసము లేకపోలేదు? అయినను నేమో యనుసంశయము. సజ్జనుల చిత్తము లనవరత మధర్మభీతిచేఁ గంపించుచుండుననుట కిద్దే నిదర్శనము.

ఆ దృశ్యమును వీక్షించినపుడాతని చిత్తమెట్టి కష్టములపాలయినదో కాని, పాప మాతఁడు తుమ్మెదనుద్దేశించి యనుట నాకర్ణింపుఁడు:

"వయం తత్త్వాన్వేషాన్మధుకర! హతాః త్వం ఖలు కృతీ" (ఓ భ్రమరమా! నీవు యుక్తాయుక్తపరిశీలనము లేనిదానవగుటచే నిశ్శంకముగ శకుంతల మోమును డాసి సద్యస్సౌఖ్య మనుభవించుచున్నావు. తత్త్వాన్వేషులమైన మాకు అట్టిది చాలమి రమ్యగదా! శకుంతలపై మానసము ప్రచరించినను జాతి వినిశ్చయాభావముచే, మాకు వెనుకంజ వేయుట తటస్థించినది.) యుక్తాయుక్తవిచారణ లేకపోవుట యనుచితమని యాతని యుద్దేశమైనట్లును పైమాటలలోఁ దెల్లమగుచుండుట లేదా?

ఇట్లుండ నా భ్రమరబాధ సహనయింపమిం జేసి నామె చెలులొప్పంగిన యవకాశ మాతని కంతయొదవెను, వెంటనే యా వేషముతో వారినిడాసి, కొంతసేపటి కేదోవిధముగ శకుంతలాజన్మవృత్తాంతమును వారివలనఁ దెలిసి పిమ్మట నాతఁ డనుకొనుట వినుఁడు.

శ్లో. భవ హృదయ సాభిలాషం సంప్రతి సందేహనిర్ణయో
జాతః, ఆశంకసే యదగ్నిం తదిదం స్పర్శక్షమం రత్నమ్.

(ఓ హృదయమా! ఇఁక సాభిలాషవు కమ్ము. సందేహనివృత్తియైనది. నీ వింతవఱకెద్దాని నగ్నియని శంకించుచుంటివో యదియ స్పర్శనీయమగు రత్నము.)

ఇంతదనుక దుష్యంతుఁడు శకుంతలావిషయమున నెట్లు ప్రవర్తించెనో యీపైమాటలవలన స్పష్టమగుచుండుట లేదా? తనమానసమా మునికన్యకపైఁ బ్రసరించినందులకు నాతఁ డాందోళన మనస్కుఁడై యెట్టి పశ్చాత్తాపము నొందెనో యామాటలలోని యొక్కొక్క యక్షరమందును సాక్షాత్కరించుట లేదా? "నా, కరణుల్ దర్భల నగ్ను లన్ ప్రియములైన ట్లన్యముల్ గావో తిరస్కృతిన్" అనిన పరమచ్ఛాందసుఁడగు ప్రవరాఖ్యుని మాట నటుండనిండు. రమణీవిహారలోలుఁడై, రసికవతంసుఁడై, రమణీయరూపుఁడై, రాజసగుణ ప్రధానుఁడై, రాజర్షియైన వానికిట్టిపట్టున నింతటి నిబ్బరమును, నింతటి దూరాలోచనయును నుండు నెంతటి యాశ్చర్యజనకమో యాలోచింపుఁడు. కనుకనే యీ దుష్యంతుఁడు ధీరోదాత్తుఁడనుట కెట్టిసంశయము లేదని మరల నొకపర్యాయము మనవిచేయుచున్నాను.

దుష్యంతుఁడు సమయపూర్వకముగ శకుంతలను వివాహమాడి, నిజపురంబునకేగి, యావృత్తాంతమును సర్వమును విస్మృతినొందెను. ఆతఁడు శాపదోషమునఁ బడి యట్లు గావించెనని మన మెఱిఁగినవారమగుటచే నాతనియమ్మై యాతనిపై దోషమారోపింపఁజాలము. శకుంతలకుఁ డట్టి విస్మృతిసమయమునను నా దుష్యంతుని కోమలహృదయమును దన నైపుణ్యముచేఁ బాఠకులకు సాక్షాత్కరింపఁజేసియున్నాఁడు.

దుష్యంతుఁ డొకనాఁడు సభలో నాసీనుఁడై, నేపథ్యమందలి గీతమును నాకర్ణించి, యిట్లు చింతించెను:

"శ్లో. రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతరసౌహృదాని."

(లోకములోని ప్రాణులు సుఖముతోఁ గూడినవయ్యు, మనోహరవస్తువులఁ గాంచియు, మధురశబ్దముల నాకర్ణించియు, ఉత్కంఠితులగుట చూడ, నిజముగ

జన్మములందు మానసంబుల స్థిరముగ నాటుకొని విస్మృతి పాలైన సుహృద్భావమును స్మరించుమన్నది.) దీనింబట్టి యాలోచించినచో రాజు శకుంతలావృత్తాంతము మనసునకువచ్చియు, నవ్యక్తమై 'యిదమిత్థ'మని తెలియకపోవుటచే తహతహపడుచుండెను అని విదితమయ్యెడి. మఱియు రాజునకు శకుంతలయం దుండు ప్రేమాతిశయము మునిశాపమునుసయిత మధఃకరింపనట్లుద్యోతకమయ్యెడి.

మునిశిష్యులు శకుంతలను దోడ్కొని, రాజు నా నతి నాతని సమీపింతురు. అవకుంఠనవతి యగు శకుంతలను గాంచి రాజు విచారించుచుండ, కంచుకి సమీపించి, 'యీమె యెవరో మనోహరాకృతిగలదై కన్పట్టెడి,' అని యన దుష్యంతుఁడు 'భవతు, అనిర్వర్ణ్యం పరకళత్రం' (అవుగాక! పరస్త్రీ ప్రశంస తగ)దని యనును. మునులు తామువచ్చినవృత్తాంతమును జెప్పి శకుంతలను బరిగ్రహింపు మనుడు శాపోపహతుండగు నా దుష్యంతుఁడు నివ్వెరపోయి, 'ఏమిటి' యని యనెను. అంత వారు పెక్కుచందంబుల దూరుచున్న సమయమున, తనపై నేదోగొప్ప యపాంతర మొకదానిమోపి, తన్ను ధర్మభ్రష్టుం జేయవచ్చియున్నట్లు వారివిషయమున దనకుం నమ్మకమున్నను, శాంతముపహించి, యాతఁడు వారియెడ నాసమయమునను జూపిన గౌరవ మద్వితీయము.

మఱియు గౌతమి శకుంతలయొక్క మేలిముసుగు దీసినపుడాతఁ డామె సౌందర్యమును గని యనుకొనుట నరయుదుము.

శ్లో. ఇద ముపనత మేవం రూపమక్లిష్టకాంతి
ప్రథమ పరిగృహీతం స్యాన్న వేత్యవ్యవస్యన్;
భ్రమర ఇవ విభాతే కుంద మంతస్తుషారం
నచఖలు పరిభోక్తుం నైవ శక్నోమి హాతుం."

(అంచిత సౌందర్యముతో నొప్పుచున్న దీరూపము; దీని ముందు నేను పరిగ్రహించితినో; లేదో యెఱుంగను. కాని! యంతర్భాగమున మంచుతో నిండిన కుందమును తేటివలె ననుభవించుటకును, బరిత్యజించుటకును నేను నేరనైతి.) ఇందాతని సౌజన్యమెట్లు వెల్లడియగుచున్నదో గనుఁడు. ఆతనికేమి! రాజు తనంతట నింటికి వెదకుకొనుచువచ్చిన రత్నమును బరిగ్రహింపవచ్చును గదా! ఆతని మానసములో జరుగు ద్వంద్వయుద్ధములో నధర్మభీతి లోభమును దలయెత్తనిచ్చినది కాదు.

మునిశిష్యు లతని పూరికింగొనక 'ఏమి, మాటలాడవు?' అనుడు దుష్యంతుఁడు 'తపోధనా! యెంతవిచారించినను నీమెను బూర్వము పరిణయమాడినట్లు స్మృతికి వచ్చుటలేదు. గర్భవతియగు నీమెను నేనెట్లు భార్యగ స్వీకరింపగలను?' అనెను. అంత శకుంతల 'పౌరవా! తొలుత నాశ్రమమున సమయపూర్వకముగ నన్ను వివాహమాడి యిప్పు డిట్టుల నిష్ఠురవచనములచేఁ బ్రత్యాఖ్యాన మొనర్పు టుచితమా!' అనుడు, దుష్యంతుఁడు (చెవులు మూసికొని) "శాంతం పాపం శాంతం పాపం".

శ్లో. వ్యపదేశ మావిలయితుం కిమీహసే జన మిమంచ పాతయితుమ్, కూలంకషేవ సింధుః ప్రసన్న మంభః తటరుహంచ.

(ఏమీ! కూలముల నొరయు ప్రవాహము, అందలి నిర్మలజలమును, దరులయందుండు వృక్షములను గూల్చు చందంబున నీవును, నాశీలమును నాశనముచేయుచు నన్ను ధర్మభ్రష్టుం జేయందలంచితివి గాఁబోలు) అని కసరును.

పదంపడి శకుంతల యంగుళీయకమును జూపెద నని నుడివి, యట్లు చేయఁజాలకపోవుటచే రాజున కపనమ్మకము మఱింత హెచ్చును. అయిననువిలాసశూన్యమై రోషారుణిత మగు నామె మోమును గాంచినపుడు మరల సంశయగ్రస్తుఁడై,

మయ్యేవ విస్మరణదారుణ చిత్తవృత్తౌ
వృత్తం రహః ప్రణయ మప్రతిపద్యమానే;
భేదాద్భ్రువోః కుటిలయో రతిలోహితాక్ష్యాః
భగ్నం శరాసనమి వాతిరుషా స్మరస్య.

(విస్మృతిచే కఠినచిత్తుఁడనగు నేనువివాహవృత్తాంతము నుపేక్షింపఁగాఁ గోపారుణితలోచనయగు నీమెకుటిలములైన తన కనుబొమలను, రోషముతో మన్మథబాణమును (ద్రుంచులాగున విఱిచెడి) అనియనుకొనెను. కల్మషరహితమగు మానసమునకు నిట్టిసందర్భములలో సంశయ పరంపరలు గలుగుచుండుట సహజముగదా! అతఁ డాకల శకుంతలనుజూచి జాలిఁగొని,

'భద్రే! ప్రథితం దుష్యంతచరిత్రం తథాపి నలక్ష్యతే.'

(కల్యాణి! దుష్యంతు చరిత్రము జగత్ప్రసిద్ధము; అందు నిట్టిది కానంబడదు) అని యనునంతలో శకుంతల రోదనము చేయుచున్న.

ఋషులయెడ నింతటిభక్తినిఁజూపినదుష్యంతుఁడు వారి మాటలను నమ్మి, శకుంతలను నేల పరిగ్రహింపఁ గూడ దను నొక యాక్షేపము గలదు. శాపకారణము చే నావృత్తాంతమించుకయైన జ్ఞాపకము లేకయుండ, నెచటినుండియో ఋషు లొకయువతిని వెంటఁబెట్టుకొని వచ్చి, 'యీమె నీధర్మపత్ని' గ్రహింపుమనిన తోడనే 'మహాప్రసాద' మని వెంటనే యామె నంతఃపురమునకుఁ బంపునంతటి యవివేకము కాళిదాస దుష్యంతుని చరిత్రములోఁ గానఁబడదు. ఈతఁడు బహుపత్నీకుఁడైనను, గుమస్తానుబిలిచి, యడుగునంతటి దుస్థితిలో లేఁడు. అట్లుండెనేని పైకార్య ముచితము గావచ్చును.

మునులు చెప్పవలసినదానిఁ జెప్పి తుద కాతనితో 'నీమె నీధర్మపత్ని గాన నీవిషయమున నీకు సర్వాధికారము గలదు. ఇష్టమున్నఁ బరిగ్రహింపుము. లేదా, వదలి పెట్టుము. ఇదో మేము వెళ్లుచున్నాము'అని పోనుంకింప,

శ్లో. కుముదాన్యేవ శశాంకః
సవితా బోధయతి పంకజాన్యేవ,
వశినాంహి పరపరిగ్రహ
సంశ్లేష పరాఙ్ముఖీవృత్తిః.

సాధ్వికి సర్వవిధముల భర్తృకులమునం దుండుటయే శ్రేయము. ఒకప్పుడు గాకపోయిన, మఱొకప్పుడైన భర్త యంగీకరింపఁగలరు. అనుభావమును మునులు సూచించినట్లు గ్రహించి దుష్యంతుఁడు, ఇట్లు చెప్పెను. (కుముదపంకజము లేకసరస్సులోనున్నప్పటికిని చంద్రుఁడు తన యుదయాస్తమయములచేఁ గుముదములనే బోధించుచున్నాఁడు. అట్లే సూర్యుఁడు పంకజముల బోధించుచున్నాఁడు; గనుక, కేవలము నాకేకాక, జితేంద్రియుల కందఱికును నన్యకళత్రసమాగమవైముఖ్యముసహజ) మని.

తుదకాతఁడు వీరిధాటి కోర్వఁజాలక తన పురోహితునిఁజూచి చెప్పినవచనముల వినుఁడు:

భవంతమేవాత్ర గురులాఘవం పృచ్ఛామి.
శ్లో. మూఢస్స్యామహ మేషా వా వదేన్మిథ్యేతి సంశయే;
దారత్యాగీ భవామ్యాహో! పరస్త్రీస్పర్శ పాంసులః.

(ఈవిషయమున నెక్కువ తక్కువల [illegible] మిమ్మే యడిగెదను. నిజముగ నీయామెను వివాహమాడి యీసమయమున మఱచి మూఢుఁడనైతినో, కార్యానుకూలమునకై యీమెయే యసత్యము నాడుచున్నదో యెఱుంగనైతి. ఈసందర్భమున భార్యను విడుతునో, పరదారను గ్రహించి నరకకూపమునఁ బడుదునో?)

మఱియు నింద్రునిచేఁ బంపఁబడిన మాతలి శకుంతలావిరహానలసంతప్యమానాంతఃకరణుఁడగు దుష్యంతునిఁ జింతాక్రాంతచిత్తునిగ నెఱిఁగి యాతఁడన్యమనస్కునిగావించుపొంటె, నదృశ్యరూపముతో నాతని చెలికాని బాధించుచుండ నాతఁడాక్రోశించుచు, రాజును శరణు వేఁడెను. ఆసమయమున దుష్యంతుఁడాతనికభయ మొసంగి, ధనుర్ధరుఁడైలేచి, యచట నేమియుఁగానక విదూషకుని బాధాకారణము నరయుచు నిట్లు తలపోయును:

శ్లో. అహన్యహన్యాత్మన ఏవ తావత్ జ్ఞాతుం ప్రమాద
స్ఖలితం నశక్యమ్, ప్రజాసు కః కేనపథా ప్రయాతి
త్యశేషతో వేదితు మస్తి శక్తిః.

(ప్రతిదినము ప్రమాదవశమునఁ దాను చేయుదోషములనే కనుగొనుట యశక్యమైయుండె, లోకములోని ప్రజలలో నెవరేమార్గమునఁ బ్రవర్తించుచున్నది యెట్లు తెలిసికొననగును) అని.

తానేమైనఁ దెలియక దోసఁగులు నేయుచుంటి నేమో యని యాతని కనవరతము మానసమున నుండు భీతి పైమాటలలోఁ దెల్లమగుచున్నదిగదా! ఇట్టి యధర్మభీతి కొనియాడఁదగినది. మనమహాకవి తన నాటకనాయకుని నెట్టి ధార్మికశ్రేష్ఠునిగఁ బోషించెనో యిప్పటికిఁ గొంతవఱకవగతమైన దనవచ్చును.

ఏదోయొకసందర్భమును గల్పించుకొని యేపురాణమునుండియో కొన్నిధర్మముల నేకరువుపెట్టుట సర్వసామాన్యము. అదొక సామర్థ్యమని చెప్పుటకు వలనుపడదు. నాయకునియందిట్లనివార్యముగను, స్వాభావికముగను, సామాజిక శిక్షార్హమగు నీతిని మేళన మొనర్చుటయే ప్రతిభావిశేషమునకు నిదర్శనము. ఇట్టి ప్రజ్ఞాధురీణులలో మన మహాకవి యగ్రగణ్యుఁడనుట నిర్వివాదాంశము. ఇక దుష్యంతుని రసజ్ఞతనుగూర్చి విచారించెదము గాక.

# కృష్ణానది

జి. జాషువ కవిగారు

గిరిరాజకందరాంతరవాసులైనట్టి, మునిచంద్రు లరసి దీవెనలొసంగ
తటవివర్ధితపుష్పితక్షోణిరుహములు, పువుఁదేనియల ముదశ్రువులు గురియ
దృక్పర్వముగఁబండి యొండి యెన్నులువంచి, కేదారములు నమస్కృతు లొనర్ప
సతతంబుఁ దలమీఁద జలవిహంగముల బృందములు పత్రాతపత్రములు నిల్ప

గీ. మవ్వపుందమ్మి పూవు లమందభక్తి, సమధికామోదమిళితభాస్వద్రజంబు
కోర్కెతో నీకు దోసిళ్ల గ్రుమ్మరింప, నలరుచున్నావు కృష్ణా మహాస్రవంతి!

సీ. పగలురాత్రియులేక ప్రాక్పశ్చిమములకుఁ, బారుచున్నావు కూపారమునకు
సుఖదుఃఖములులేక శుభ్రజలంబులు, మోయుచున్నావు జీవులకు నీయ
జీతబత్తెములేక సితతరంగరథంబు, నడపుచున్నా వబ్ధినాయకునకు
కాలుసేతులులేక ఘనభూములకు నీవు, పంచుచున్నావు నీవారిధార

గీ. ఇల్లువాకిలిలేక నీ వెసఁగుచుండి, ముందు సాధించినావు, సముద్రశాల
విశ్రమింతువుకాఁబోలు విభునితోడ, నందుఁ గొలువుండి కృష్ణా మహాస్రవంతి!

సీ. కంఠహారం బానకట్ట, భాసిల్లుకొండలు రెండు వలుదగుబ్బలయుగంబు
ప్రక్కలఁ బారుకాల్వలు చెలికత్తెలు, భటులు కంబంబులు పదియునొకటి
దివ్యాతపత్రంబు దీపించుసేతువు, విశ్రమస్థానంబు విజయవాడ.
హిందూమహావార్ధి హృదయవల్లభుఁడు. తైర్థికకోటి పుత్రకప్రకర మరయ

గీ. నచలవాసిని కనకదుర్గాంబ పడమటింటివేలుపు, కొఱంత నీ కెందుఁగలదు ?
ధరణిఁ బ్రవహింపు మాచంద్రతారకముగ, అమ్మ! రావమ్మ! కృష్ణామహాస్రవంతి.

సీ. పశ్చిమాహార్యదివ్యన్మాతృవామాంక, సీమానివాసంబు చెంగలించి
దర్శనాగతసముద్యజ్జలావహములౌ, నుపనదీసఖులతో నుద్యమించి
క్రీడావనంబులై కెలఁకులఁ బెంపారు, నుగ్రకాంతారంబు లుత్తరించి
ఆత్మయాత్రావరోధార్థమై పొడసూపు, పర్వతంబుల నెల్లఁ బగులఁదన్ని

గీ. యనఘుగాంధీమహాత్ముదర్శనము సేయ, భీమభంగారవాచ్ఛగీతామృతప్ర
దీప్తశంబరభరితదిగ్దేశ మగుచు, నరుగుచున్నది కృష్ణామహాస్రవంతి.

(కల్యాణి! దుష్యంత చరిత్రము జగత్ప్రసిద్ధము, అందు నిట్టిది కానంబడదు) అని యనునంతలో శకుంతల రోదనము చేయుచున్న.

ఋషులయెడ నింతటిభక్తి నీఁజూపినదుష్యంతుఁడు వారి మాటలను నమ్మి, శకుంతలను నేల పరిగ్రహింపఁ గూడ దను నొక యాక్షేపము గలదు. శాపకారణము చే నావృత్తాంతమించుకయైన జ్ఞాపకము లేకయుండ, నెచటినుండియో ఋషు లొకయువతిని వెంటఁబెట్టుకొని వచ్చి, 'యీయామె నీధర్మపత్ని' గ్రహింపుమనిన తోడనే 'మహాప్రసాద' మని వెంటనే యామె నంతఃపురమునకుఁ బంపునంతటి యవివేకము కాళిదాస దుష్యంతుని చరిత్రములోఁ గానఁబడదు. ఈతఁడు బహుపత్నీకుఁడైనను, గుమస్తానుబిలిచి, యడుగునంతటి దుస్థితిలో లేఁడు. అట్లుండెనేని పైకార్య ముచితము గావచ్చును.

మునులు చెప్పవలసినదానిఁ జెప్పి తుద కాతనితో 'నీమె నీధర్మపత్ని గాన నీవిషయమున నీకు సర్వాధికారము గలదు. ఇష్టమున్నఁ బరిగ్రహింపుము. లేదా, వదలి పెట్టుము. ఇదో మేము వెళ్లుచున్నాము' అని పోనుంకింప,

శ్లో. కుముదాన్యేవ శశాంకః
సవితా బోధయతి పంకజాన్యేవ,
వశినాంహి పరపరిగ్రహ
సంశ్లేష పరాఙ్ముఖీవృత్తిః.

సాధ్వికి సర్వవిధముల భర్తృకులమునం దుండుటయే శ్రేయము. ఒకప్పుడు గాకపోయిన, మఱొకప్పుడైన భర్త యంగీకరింపఁగలరు. అనుభావమును మునులు సూచించినట్లు గ్రహించి దుష్యంతుఁడు, ఇట్లుచెప్పెను.
(కుముదపంకజము లేక సరస్సులో నున్నప్పటికిని చంద్రుఁడు తన యుదయాస్తమయములచేఁ గుముదములనే బోధించుచున్నాఁడు. అట్లే సూర్యుఁడు పంకజముల బోధించుచున్నాఁడు; గనుక, కేవలము నాకేకాక, జితేంద్రియుల కందఱకును నన్యకళత్రసమాగమవైముఖ్యము సహజ) మని.

తుదకాతఁడు వీరిధాటి కోర్వఁజాలక తన పురోహితునిఁజూచి చెప్పినవచనముల వినుఁడు:

భవంతమేవాత్ర గురులాఘవం పృచ్ఛామి.

శ్లో. మూఢస్స్యా మహమేషావా వదేన్మిథ్యేతి సంశయే;
దారత్యాగీ భవామ్యాహో! పరస్త్రీస్పర్శ పాంసులః.

(ఈవిషయమున [illegible] మిమ్మే యడిగెదను. నిజముగ నేనామెను వివాహమాడి యీసమయమున మఱచి మూఢుఁడనైతినో, కార్యానుకూలమునకై యీమెయే యసత్యము నాడుచున్నదో యెఱుంగనైతి. ఈసందర్భమున భార్యను విడుతునో, పరదారను గ్రహించి నరకకూపమునఁ బడుదునో?)

మఱియు నింద్రునిచేఁ బంపఁబడిన మాతలి శకుంతలావిరహానలసంతప్యమానాంతఃకరణుఁ డగు దుష్యంతునిఁ జింతాక్రాంతచిత్తునిగ నెఱిఁగి యాతఁడన్యమనస్కునిగావించుపొంటె, నదృశ్యరూపముతో నాతని చెలికాని బాధించుచుండ నాతఁ డాక్రోశించుచు, రాజును శరణు వేఁడెను. ఆసమయమున దుష్యంతుఁ డాలేనికభేదు నెఱింగి, ధనుర్ధరుఁడై లేచి, యచట నేమియుఁగానక విదూషకుని బాధాకారణము నరయుచు నిట్లు తలపోయును:

శ్లో. అహన్యహ న్యాత్మన ఏవ తావత్ జ్ఞాతుం ప్రమాద
స్ఖలితం నశక్యమ్, ప్రజాసు కః కేనపథా ప్రయాతీ
త్యశేషతో వేదితు మస్తి శక్తిః.

(ప్రతిదినము ప్రమాదవశమునఁ దాను చేయు దోషములనే కనుగొనుట యశక్యమైయుండ, లోకములోని ప్రజలలో నెవరేమార్గమునఁ బ్రవర్తించుచున్నది యెట్లు తెలిసికొననగును) అని.

తానేమైనఁ దెలియక దోసఁగులు చేయుచుంటినేమో యని యాతని కనవరతము మానసమున జనించు భీతి పైమాటలలోఁ దెల్లమగుచున్నదిగదా! ఇట్టి యధర్మభీతి కొనియాడఁదగినది. మనమహాకవి తన నాటకనాయకుని నెట్టి ధార్మికశ్రేష్ఠునిగఁ బోషించెనో యిప్పటికిఁ గొంతవఱకవగతమైన దనవచ్చును.

ఏదోయొకసందర్భమును గల్పించుకొని యేపురాణమునుండియో కొన్నిధర్మముల నేకరువుపెట్టుట సర్వసామాన్యము. అదొక సామర్థ్యమని చెప్పుటకు వలనుపడదు. నాయకునియందెట్లనివార్యముగను, స్వాభావికముగను, సామాజిక శిక్షార్హమగు నీతిని మేళవనమొనర్చుటయే ప్రతిభావిశేషమునకు నిదర్శనము. ఇట్టి ప్రజ్ఞాధురీణులలో మన మహాకవి యగ్రగణ్యుఁడనుట నిర్వివాదాంశము. ఇక దుష్యంతుని రసజ్ఞతనుగూర్చి యించుక ముచ్చటించెదము గాక.

# కృష్ణానది

జి. జాషువకవిగారు

గిరిరాజకందరాంతరవాసులైనట్టి, మునిచంద్రు లరసి దీవెనలొసంగ
తటవివర్ధితపుష్పితక్షోణిరుహములు, పువుఁదేనియల నుదశ్రువులు గురియ
దృక్పర్వముగఁబండి యెండి యెన్నులువంచి, కేదారములు నమస్కృతు లొనర్ప
సతతంబుఁ దలమీఁద జలవిహంగముల బృందములు పత్రాతపత్రములు నిల్ప
గీ. మవ్వపుందమ్మి పూవు లమందభక్తి, సమధికామోదమిళితభాస్వద్రజంబు
కోర్కెతో నీకు దోసిళ్ల గ్రుమ్మరింప, నలరుచున్నావు కృష్ణా మహాస్రవంతి!

సీ. పగలురాత్రియులేక ప్రాక్పశ్చిమములకుఁ, బారుచున్నావు కూపారమునకు
సుఖదుఃఖములులేక శుభ్రజలంబులు, మోయుచున్నావు జీవులకు నీయ
జీతబత్తెములేక సితతరంగరథంబు, నడపుచున్నా వబ్ధినాయకునకు
కాలుసేతులులేక ఘనభూములకు నీవు, పంచుచున్నావు నీవారిధార
గీ. ఇల్లువాకిలిలేక నీ వెనఁగుచుండి, ముందు సాధించినావు, సముద్రశాల
విశ్రమింతువుకాఁబోలు విభునితోడ, నందుఁ గొలువుండి కృష్ణా మహాస్రవంతి!

సీ. కంఠహారం బానకట్ట, భాసిల్లుకొండలు రెండు వలుదగుబ్బలయుగంబు
ప్రక్కలఁ బారుకాల్వలు చెలికత్తెలు, భట్టులు కంబంబులు పదియునొకటి
దివ్యాతపత్రంబు దీపించుసేతువు, విశ్రమస్థానంబు విజయవాడ.
హిందూమహావార్ధి హృదయవల్లభుఁడు. తైర్థికకోటి పుత్రకప్రకర మరయ
గీ. నచలవాసిని కనకదుర్గాంబ పడమటింటివేలుపు, కొఱంత నీ కెందుఁగలదు ?
ధరణిఁ బ్రవహింపు మాచంద్రతారకముగ, అమ్మ! రావమ్మ! కృష్ణామహాస్రవంతి,

సీ. పశ్చిమాహార్యదివ్యన్మాతృవామాంక, సీమానివాసంబు చెంగలించి
దర్శనాగతసముద్యజ్జలావహములా, నుపనదీసఖులతో నుద్యమించి
క్రీడావనంబులై కెలఁకులఁ బెంపారు, నుగ్రకాంతారంబు లుత్తరించి
ఆత్మయాత్రావరోధార్థమై పొడసూపు, పర్వతంబులనెల్లఁ బగులఁదన్ని
గీ. యనఘగాంధీమహాత్ముదర్శనము సేయ, భీమభంగారవాచ్ఛగీతామృతప్ర
దీప్తశంబరభరితదిగ్దేశ మగుచు, నరుగుచున్నది కృష్ణామహాస్రవంతి.

# సా వి త్రి

కాశీసోమయాజుల సుందరమూర్తి గారు, ఎం. ఏ.

## మొ ద టి ర ం గ ము

పర్ణశాల: సావిత్రి, దేవినిపూజించి, యిలాగుపాడును.

ముఖారి - మిశ్రగతిచాపు.

శంకరీ గౌరి మహేశ్వరీ

కరమభయ మొసగగదే, స్ఫురదఖిల

సురమహితే! శం.

హిమశైలజా, నినునమ్మితీ

ననుబ్రోవవే కరుణ, జననీ!

ఓ శైలజా నినునమ్మితీ

నను బ్రోవవే కరుణ, వరదాయకీ, భవతారకీ,

బృహన్నాయకీ, పరమహోదారివి,

దురితముఖారి హా! శం.

[నటకునికిష్టమైనది ఏకృతైనాసరే, దేవిపరమైనది పాడవచ్చును. దీనితరువాత దేవిని స్తోత్రముచేసే సంస్కృతశ్లోక మొకటి, తెనుగుపద్యమొకటి రాగవరసమ చదువవచ్చును.]

జననీ, సావిత్రీ! ఈనాడే నాభర్తమరణం. వారు అడవిలో బయలుదేరడానికి సిద్ధపడుతున్నారు. తల్లీ, మేమిద్దరమూ తిరిగీ కలిసి మాపర్ణశాలకు వచ్చేటట్టు చేయవా? నిన్ను నమ్ముకొనేవారిని వరించినాను. నీవు నీభర్తను, విశ్వేశ్వరుని, ఒకనిమిషమయినా విడువలేక, సగముశరీరము పుచ్చుకొన్నావే; నీపేరు మోసుకొని ధన్యురాలనైన నాకు భర్తృవియోగము సంభవించనిస్తావా, జననీ? నాకు మద్రరాజ్యముకంటె, సాళ్వరాజ్యముకంటె, ఈ యరణ్యరాజ్యమే సౌఖ్య మనిపించినారు. నా కాపదవి నిలబెట్టవా, జననీ? [సాష్టాంగపడి, పువ్వులు తలలో నుంచుకొనును](తెర.)

## రెండవరంగము

అడవి: ఈలాగుపాడుచూ నారదుడు ప్రవేశించును:—(నటకుని కిష్టమయినది ఏదైనపాడవచ్చును.)
(యముడు తొందరగా అత్రోవను పోవుచుండును)

నారదుడు:—ఏమి, యమధర్మరాజా, ఎక్కడికాపరుగు?

యముడు:—(ఆగి తిరిగిచూచి) ఓహో, నారదమహామునా! ఏమంటావ్?

నా:—"ఎక్కడి కాపరుగూ?" అన్నాను.

య:—సత్యవంతుని ప్రాణం తీసుకపోవడానికి.

నా:—నీవే స్వయంగా వెళ్లవలెనా? ఈవరదలలోనూ, భూకంపాలలోనూ, యుద్ధాలలోనూ, మహామ్మారీఉద్రేకములోనూ, క్షామంలోనూ, జమాబందీతోట్రుపాటులో, భటులు చాలినారు కారేమిటి?

య:—చాలకేమి? తోకచుక్క భూమితో టాకులాడినా చాలును. మహాప్రళయము వచ్చినా చాలును.

నా:—మరి నీవేల స్వయముగా వెళ్లవలెనూ?

య:—నాభటులు ఆపొలిమేరకే వెళ్లలేకపోయినారు. అంత పవిత్రుడు సత్యవంతుడు.

నా:—(తనలో పురెక్కించి గెంతిస్తాను...) అయితే, నీవు వెళ్లినా, ఏమిజరుగునో గదా?

య:—ఏమిజరుగుతుంది? నీకా అనుమాన మెందుకు కలుగవలెనూ?

నా:—(నలుసుకుచూ) మరేమీ లేదు. ఆమధ్య మార్కండేయుని ముచ్చట జ్ఞాపకం వచ్చి ఏమో అనుకొన్నాను.

య:—అక్కడ మహాదేవు డడ్డుపడినాడు.

నా:—ఇక్కడ సావిత్రీదేవి అడ్డుపడుతుందేమో? అతనిభార్య, సావిత్రీదేవి వరప్రసాదినికాదూ? మూడుదినములు నిద్రాహారములులేకుండా సావిత్రీదేవిని పూజ చేసినది. నేను పాడుతూ దగ్గరనుంచి వెళ్లుతూఉన్నా, నావైపు చూపే లేదు. దేవి పాదములపై మనస్సు అంత లగ్నముచేసినది. అంతభక్తి ఊరకే పోవునా? దేవి అడ్డుపడుతే?

య:—ఇంతమాత్రానికే అడ్డుపడుతే, మరి నేనెందుకూ?

నా:—అది అటుండగా.—

య:—ఇంకా ఏమిటి?

నా:—సావిత్రి పాతివ్రత్యమే చాలును.

య:—ఎందుకు? తనభర్త నాచేతిలో పడకుండా చేయడానికా?

నా:—తినబోతూ రుచి అడగడ మెందుకు? కాని, నీయావచ్ఛక్తీ వినియోగపర్చు, ఎవరడ్డుపడినా.—

య:—కనపర్చి తీరుతాను. ప్రాణాలు పుచ్చుకోకుండావస్తా ననుకొంటున్నావా యేమి?

నా:—మళ్లీ కలుసుకొంటాముగదా?

య:—మరి నేను వెళ్లవలెను. [నిష్క్రమించును.]

[నారదుడుపాడుకొనుచూ నిష్క్రమించును.]

## మూడవరంగము

అడవి: ప్రవేశము, సావిత్రి-సత్యవంతుడు.

సా:—ఇంతసొగసైనఅడవి ఇంతవరకూ చూడలేదే నేను ఇక్కడఉండి కూడా!

స:—వెళ్లినకొలదీ ఇంకా సొగసుగా ఉంటుంది. కాని, సావిత్రీ, నాచెయ్యిపట్టుకొనికాదు, నాభుజంమీద ఆనుకొని మరీ నడువు-మూడుపవాసాలు చేసినావు, నీళ్లైనా త్రాగకుండా! కాళ్లు తేలిపోతున్నాయి కాబోలు ఎత్తుకొందునా?

సా:—అక్కరలేదు, నాథా, నేను నడవగలను.

స:—ఏమి నడుస్తావో, సాయం చేస్తానంటె, వద్దని అన్నిపనులూ నీవే చేసినావు!

సా:—నాథా, తమరు మొదలు నొప్పిట్టట్టు అంతమోపు ఎంతదూరంనుంచో వగర్స్తూ తెచ్చి, సాయంచేస్తానంతే, ఏమని ఒప్పుకోనేది? బరువులు మోయడములో ఒంటెకూ మనిషికీ తారతమ్యం ఉండ వద్దూ?

స:—నీవు పదేపదే బ్రతిమాలుతే, ఎన్నడూ అడగనిదానవు అడిగినావని, నీమాట త్రోసి వేయలేక, కూడా రానిస్తున్నాను. ఎంతో దూరము వెళ్లవలెనంటే, అయితేనేమ న్నావు! ఈనీరసమేమిటి? ఆదూరమేమి టి? నీవు నడవడమేమిటి?

సా:—నాథా, నాకేమీ నీరసము లేదు, నమ్మండి. ఉపవాసమంటే సమీపమందు వ సించడము. నేను ఈమూన్నాళ్లూ దేవి సమీపములో వసించినా నన్నమాట. వారు నామనస్సులో ఉన్నప్పుడు, నాకు నీరసమనగా ఏమిటి? నేను వెనుకబడ కుండా ఎంతదూరమైనా, తమతో సరిగ్గా నడుస్తాను చూడండి.

స:—మరి నీయిష్టం.

సా:—కాని, నాథా, ఎక్కడా దుష్టజంతు వులు కనబడవేమీ, ఈయడవిలో లేవా యేమి?

స:—లేకేమి? మనశాలలో ఉన్న పులితోళ్లు ఎక్కడివనుకొన్నావు?

సా:—మీరుకొట్టినజంతువులవే అవన్నీ? కాని, లేడిచర్మాలు లేవేమీ? ఇక్కడ లేళ్లు లేవాయేమి?

స:—అడివే అడివి, లేళ్లు లేకుండానా? కాని, నేనెప్పుడుకొట్టినా,దుష్టజంతువుల్నే. నేను—

సా:—ఆహా, ఏమిటా లేళ్ల కదుపూ; ఎందుకు పరుగెడుతున్నాయి, నాథా, ఆలాగూ?

స:—పులి వెంట తరుముతూన్నదన్నమాటే. నాపులివేటచూడవలెనన్నదా, సావిత్రీ? కావలిస్తే—

సా:—అదుగో పట్టింది ఒక లేడిని!—

స:—ఇదుగో కొట్టాను పులిని! [బాణము వేయును]

సా:—ఎలా కాండ్రుమంటూందో!—సరి, మరిలేదు! చచ్చినట్లున్నది! చూడండీ. ఆలేడి కదులుతూంది కాదూ?—అదుగో నిల్చుంది! నాథా! దాన్ని మృత్యువునో టనుండి ఊడ బెరికినారే! [ధనస్సుముద్దు బెట్టుకొని, తనలో] నానాథునికూడా ఆలాగే కాపాడవా, జననీ, సావిత్రీ? కా లము సమీపిస్తున్నది.

స:—ఏమిటి, సావిత్రీ, ఏమో ఆలోచిస్తున ట్టున్నావు, ముఖము పైకెత్తి?

సా:—సావిత్రీదేవిని స్మరించినాను.

స:—సావిత్రీ, ఇందాకా ఎత్తుకోవద్దన్నావు కాని, ఇప్పుడు తప్పదు. చూచినావా, ఆ తాటివంతెన?

సా:—తమరు వేసిన దేనా అది?

స:—అవును. క్రిందను ఎంతలోతుగా ఉన్న దో చూచినావా?—ఆఁ! ఆఁ! దగ్గిరా వెళ్లకు; ఇక్కడనుండే చూడు.

సా:—అది రోజూ దాటుతారేమిటి?

స:—దాటకతప్పదు. ఉన్న అడివంతా అటే ఉన్నది.

సా:—అందులో పడుతే మరేమున్నది?

స:—(సావిత్రిని ఎత్తుకొని దాటి) ఇంకా కళ్లు మూసుకొన్నావా? అయ్యో, పిరికిదానా, నాచేతుల్లోఉంటె, నీకేంభయమూ?— కళ్లింకా బెదురుతున్నాయే, బెదిరిన లేడిక

ళ్లలాగు! ఇప్పుడుగదా వాటిశోభ! ప్రతి వెంటబడ్డప్పుడు, ఇందాకా ఆలేళ్లు ఇంత కంటే ఎక్కువ బెదిరుంటాయా?

సా:—అబ్బా, దాటాం! [తనలో] ఇలాగే జననీ, ఎలాగుదాటిస్తావో, దగ్గిర్పడు తూన్నమృత్యువును?—ఆహా! ఎక్కడి దీపరిమెళం? రుప్పివేస్తుందే! ఇది మాలతి కాదూ?

స:—మీదచూడూ, సావిత్రీ, ఆకులు కని పించకుండా ఆమఱ్ఱిచెట్టుని ఎలాగు అల్లుక పోయిందో, ఆమాలతి!

సా:—ఇలాగుకాదూ, నాథా? [తన చేతులు వానిమెడను చుట్టివేయును] [తనలో] ఆ మాలతిని ఆచెట్టువలె, నన్నూ కాపా డవా, లోకమాతా?

స:—ఆమాలతి లేకుంటే, ఆచెట్టుకు అంత శోభ ఉండునా? నీవు నాకూ అలాగే.

సా:—ఆమాలతి పువ్వులమధ్య పొగడాలవలె ఆమర్రిపళ్లు ఎంతబాగసుగా ఉన్నవో!

స:—అల్లటుచూడూ, ఆరావిచెట్టూ వేపచె ట్టూ ఎలాగు కలిసిపోయినవో, పార్వతీపర మేశ్వరులవలె!

సా:—[తనలో] నన్నూ, నానాథునీ అలాగే ఉంచు ఎప్పటికినీ, మాతా, సావిత్రీ!— నాథా, ఏమిచూచినా, మీకు భగవం తుడే జ్ఞాపకంవస్తూంటాడే!

స:—ఇటువంటిసృష్టిని చూచినప్పుడుకూడా జ్ఞాపకంరాడా సృష్టికర్త? దేనిని చూచినా భగవంతుడు జ్ఞాపకం రావడం, మొదటి మెట్టు; అంతా భగవంతుడే అనుకోవడం ఆపైమెట్టు; అదిఅనుభవంలోకి తేవడం, భగవంతునితో ఐక్యం అయిపోవడమే— అల్లా సెలయేరుచూడూ.

సా:—ఎక్కడ?—అవునన్నను, అల్లాబయల్ని.

స:—మనము తాగుతూన్నవి అనీళ్లే.

సా:—ఏమి, నాథా, అంతదూరంనుంచి రోజూ నీళ్లుతేవడమే! పోనీ, మరొకపర్ణశాల అక్కడే వేసుకొంటే, ఇన్నిమైళ్లూ రోజూ నడవడం అవసరం లేకపోవునే.

స:—తోటవేసుకొన్నామే! అవల్లే మనకు ఆహారముగదా, ఏమిటిచేయడం?

సా:—మానిమిత్తంఎంతశ్రమపడుతున్నారో!

స:—అలవాటైనది ఆశ్రమ కేమిగాని, ఇప్పుడు శ్రమనిపిస్తున్నది—ఆహా! పరమేశ్వరా!

సా:—ఏమి, నాథా, గుండెలుపట్టుకొని వంగి పోతున్నారేమి? అయ్యో! అయ్యో! సంజ్ఞచేస్తున్నారు, మాటరాదా యేమి? గుండెభారమా? తలఊపుతున్నారే! నాకేమిసాధనం? పరుంటారా? దానికీ త లూపుతున్నారే! పరుండండి నాతొడ మీద తలుంచుకొని. [అట్లుచేయును] నాథా!— అయ్యో! పలకరేమి?[తనలో] వేళవచ్చినట్టున్నది! సావిత్రీ, నీవేదిక్కు, తల్లీ! నీభరవసాచూచుకొనే వరించినాను, జననీ—నాథా, నాథా, ఏమదీ? గుండెలువి డిచితలపట్టుకొన్నారే! తలభారమా? పట్టుదునా?— అయ్యో, సంజ్ఞైన లేదే! కదలలేదేమీ? కొట్టుకొని, కొట్టుకొని

ప్రాణంపోయినదా? యేమిటి?— శరీరము వెచ్చగానే ఉన్నదే!—నాడి అందుచున్నదే!—ఊపిరున్నదే! నాథా!—

స:—హా, శంకరా!

సా:—ఏమికావలెను, నాథా?

స:—అమ్మా! [దొర్లును]

సా:—నాథా, సరా? నన్నడవిపాలుచేసిపోవడమేనా? జననీ, సావిత్రీ! నామొర్రవినవు?—కదలకుండా, ఎలాగుపరున్నారో! నాథా, ఇప్పుడిప్పుడేకదా ఆలేడిని పులి నోటనుండి బ్రతికించినారు. అదొక్కటి చాలదా, మీకడ్డుపడడనికి? మీసత్యమైన కాపాడదా? మీభూతదయ జూచి, భూతాత్ముడు—మళ్లీ కదులుతున్నారే! అది మరణబాధా? తెలివిరావడమా? రోగికి నిద్రపట్టుతే, మాంద్యమో, నిద్రో తెలియనట్టు—ఎవరా వచ్చేది? యముడా యేమి?

యముడు ప్రవేశించును

యమ:—అవునమ్మా, నేను యముడనే.

సా:—ఏమి, దేవా, ఎవరికొరకు?

య:—నీభర్త, సత్యవంతునికొరకు.

సా:—నాకొరకుకూడా కాదూ?

య:—కాదమ్మా, నీవేళ యింకా రాలేదు.

సా:—దానికేమి? నానాథునివేళయిత్తే, నావేళా అయినది. అది నాచేతిలోపని. శిరస్సుపోయిన శరీరము ఎంతకాలముండగలదు?

య:—అతణ్ని తీసుకపోతానమ్మా!

సా:—వస్తువుతోనీడ, నేనెక్కడికిపోతాను? —అయ్యో, పాశం సద్దుకొంటున్నారే! వేయడానికేనా? (చేతులతోభర్తనుకప్పును.)

య:—అవునమ్మా! (పాశము వేయును)

సా:—సరీ! అయిపోయినది! ఆహా! శరీరము ఎంతట్లో చల్లపడిపోయినదో! కలవకాడ చేతులూ, కాళ్లూ!

య:—అయిపోయినదమ్మా. నేను వెళుతున్నా. ఆకర్రలు సత్యవంతుడు కొట్టి ఎండబెట్టినవె. వాటితో సంస్కారము చేసి ఇంటికి వెళ్లు—

సా:—ఇంటికి కాదు, మింటికే; ఇదుగో నేనూ వస్తున్నాను.

య:—నీ వెక్కడికి రాగలవు కుమారీ, పర్వతాలూ, నదులూ, అడవులూ దాటి? (నిష్క్రమించును)

సా:—చూస్తారుగదా, రాగలనో, రాలేనో? ఓవనదేవతలారా, ఇదుగో నాభర్తశరీరము. మీకప్పగించి వెళుతున్నా; జాగ్రత్త! ఇక్కడ ఏడుస్తూంటే ఏమున్నది? ఏడ్పో; నవ్వో, మళ్లీ వచ్చినతరువాతే. (తెర)

## నాలుగవరంగం

(నారదుడు పాడుచు ప్రవేశించును; యముడు తొందరగా పోవుచుండును.)

నా:—మిత్రమా, అంతకా! నీముఖంచూస్తే కార్యం అయినట్టున్నదే!

య:—ఇదుగో, సత్యవంతునిప్రాణాలు! సావిత్రీ అడ్డుపడలేదూ, ఎవరూ అడ్డుపడలేదు.

నా:—కాని, దొరికింది, చెయిజారిపోకుండా మట్టుకుచూసుకో—

య:—సత్యవంతునిఆత్మ కైలాసానికి పంపించేవస్తున్నాను. దొరికింది పోవడమేమిటి? (నిష్క్రమించును)

నా:—చూస్తావుగదా? (సావిత్రి తొందరగా పోవుచుండును) ఎక్కడికమ్మా, సావిత్రీ, ఆలాగు పరుగెడుతున్నావు?—ఏమమ్మా, పిలుస్తూంటే, పలక్కుండా, మీదికిచూస్తూ పరుగెడుతున్నావు? నేనెవరినో ఎరుగవా?

సా:—[తిరిగిచూచి] నారదమహామునివారా నమస్కారము. ఏమినా అదృష్టం! సముద్రములో మంచినీళ్లు దొరికినట్టు!

నా:—కుమారీ, యముడు నీభర్తప్రాణాలు పట్టుకొని, ఇప్పుడిప్పుడే పోతున్నాడు. నీవు నీభర్తను పునర్జీవితునిగా చేయించలేవా?

సా:— బయలుదేరగానే తమ దర్శనలాభమయినది. ఇంతగొప్పశకున మయినందుకు చేయించలేకేమి? నాకు తమదయవల్లనే అట్టివారిని వరించునంతటి మహద్భాగ్యము కలిగినది. వారిని బ్రతికించుకొనే సామర్థ్యముకూడా తమదయవల్లనే కలుగవలెను.

నా:—నీవు సావిత్రీదేవిభక్తురాలవు. నీబలమంతా కనపడ్చి ఎన్నిశ్రమలుపడినా, యమునితో ఖోరాడి సాధించు. మార్కండేయుని శివుడు కాపాడలేదా? భక్తివంటిది ఏదీ కాదు. దేవియెడల భక్తియుంచి యముని యెడల యుక్తికనపర్చు. అక్కడేనీశక్తి. నీకు ఒకమహామంత్రం ఉపదేశిస్తున్నాను. అదిపఠిస్తూవెళ్లు. [చెవులో చెప్పును]

సా:— చిత్తం. మహాప్రసాదం!—జననీ సావిత్రీ, నీవే దిక్కు! ఆమహామంత్రము వినేసరికి నాకు ఎప్పుడూలేని వింతబలము వచ్చినదే! (తెర)

## అయిదవరంగము

కొండ, దరియ: ప్రవేశము, యముడు, సావిత్రి.

య:—నిజముగా వస్తున్నదే వెంటతగిలి, అన్నికొండలూ, నదులూదాటి! ఏమమ్మా, సావిత్రీ, ఎందుకువస్తావు?

సా:—దేవా, యమధర్మరాజా, నాభర్త ప్రాణం తీసుకపోతూ ఎందుకువస్తావూ అంటే ఏమిచెప్పేది? నావస్తువును నాకిచ్చివేస్తే మరి రమ్మనేవరకూ రాను.

య:—నీవు పరమసాధ్వివి గనుక, నీకు దర్శనమిచ్చినాను, ఎవరికీ ఇవ్వ[illegible].

సా:—దర్శనమిచ్చిన లాభమేమి, అందరినీ చూచినట్లే నన్నూచూస్తే? తమదర్శనము అమోఘమౌతుంది చివరకు అందరికీ ఇప్పుడే దర్శనము ఇచ్చినదయామయులు, దానిలాభముకూడా కనపర్చరా? మహనీయులదర్శనము ఊరకేపోవునా? పోతే, దానిలో విశేషమేమి?

య:—అమ్మా, నీభర్తను ఇచ్చివేయమంటావా?

సా:—అవును, దేవా!

య:—అందుకేనా వెంట బడుచున్నావు?

సా:—అవును, దేవా! ఈ ప్రశ్నలు వట్టినే ఎందుకువేస్తారు, నాకోరిక తీర్చవలెనని లేకుంటే?

య:—కొన్ని ప్రశ్నలు వేస్తాను వాటికి స మాధానము చెప్పతే—

సా:—చెప్పతేనే ఇవ్వండి, దేవా!

య:—అమ్మా, ఆనాడు నీవు కలలోచూచిన సత్యవంతునిగురించి నారదుడన్నది — అతడల్పాయుష్మంతుడని, అడివిలో కాపుర మని, అవన్నీ విన్నావుగదా—

సా:—మరి ఇప్పుడు ఈపనిఏమిా అని అడుగు తారు కాదూ?

య:—అవునమ్మా, దానికేమంటావు?

సా:—ఏమనడానికీ ఏమున్నది అందులో? చనిపోయినతర్వాత నానాథుని తిరిగీ తెచ్చు కోవడానికి ప్రయత్నము చేయనని అన్నా నా? చేస్తే అందులో తప్పేమున్నది?

య:—అమ్మా, ఎవరైనా ఆలాగు ప్రయ త్నించినారా?

సా:—ఎవరూచేయకుంటే, నేను చేయకూడ దని ఎక్కడున్నది? నేను తక్కినవారివంటి దానను కానని తమరే తేటపర్చినారే?

య:—అదేలాగు?

సా:—ఎవరికీ ఇయ్యని దర్శనము నాకిచ్చె. నేను సావిత్రీదేవి వరప్రసాదిని కావడ మేమిటి, తమ దర్శనము కావడమేమిటి? నేను చేతులు నలుపుకొంటూవృథాగా కూ ళ్లడమేమిటి? వట్టిమాట, దేవా, వట్టిమాట.

య:—[తనలో] ఏమి ఈ మెదృఢచిత్తత!— అదలాగుంచు. అందరికీ ఆయుర్దాయం నిర్ణయించేవాడు, భగవంతుడేకదా?

సా:—అవును. దానికి సందేహమేలా?

య:—వారియాజ్ఞ చెల్లవలసినదేకదా?

సా:—ఎవరనగలరు, ఎవరన్నారు, కాదని?

య:—వారియాజ్ఞ నడిపించుట నాపనేగదా?

సా:—అవును, తమదే.

య:—మరేమి? వారియాజ్ఞప్రకారము జరి గినది. ఈనాడు నీభర్త చనిపోవలసినదని శాసించినారూ, నీభర్త చనిపోయినాడూ; మరెందుకమ్మా, ఈవృథాశ్రమ?

సా:—భర్త చనిపోయినారు; భగవంతుని ఆజ్ఞ జరగనే జరిగినది; జరగకుండా నేను ప్రయత్నించిడంలేకదా, తమరడుగవలసి నది అలాగు! కాని, ఇది చిత్తగించండి దేవా:—నాభర్త ఈనాడు చనిపోవలసి నదని భగవదాజ్ఞ అయినది కాని, తిరిగి నాభర్త బ్రతుకకూడదని వారియాజ్ఞ అయినదా, దేవా?

య:— లేదే.

సా:—మరి అందుకే నాప్రార్థన; బ్రతికించు మని.

య:—అమ్మా, నీభర్తవంటిపాపరహితుడు శాశ్వతముగా స్వర్గసౌఖ్యము జూరగొం టాడే! ఇప్పుడతని ఆత్మ కైలాసములోనే ఉన్నదే! ఆసౌఖ్యమున కడ్డుపడతావా, మహాపతివ్రతాశిరోమణివైయుండి, తల్లీ?

సా:—ఎంతమాట? నేనా అడ్డుపడే దానను? కాని నేనువారికి అర్ధాంగిని. వారు ఏది అనుభవిస్తే, అదినేనూ అనుభవించవలెను. అది నాహక్కు కాదా దేవా?

య:—అవునమ్మా, నీహక్కే.

సా:—మరేమి? నా హక్కు ప్రకారము అడిగినాను నన్నువారితో తీసుకపోతారో, వారిని ఇక్కడ ఉంచుతారో; తమచిత్తం దేవా! మాయిద్దరినీ కలిపిఉంచుమనే నా ప్రార్థన.

య:—నీభర్తతోకూడా వెళ్లిపోవడం నీచేతిలోనే ఉన్నదంటివే?

సా:—అన్నాను, మళ్లీ అంటాను. సహగమనము నాచేతిలోనిదే. బ్రతికి ఉన్నంతకాలము ఇక్కడ భర్తతో సౌఖ్యమనుభవించి, భర్తపోయినతరువాత, సహగమనముచేసి, అక్కడ వానితో ఎడతెగని సౌఖ్యమనుభవించడానికి సిద్ధముగానున్న పతివ్రతకు, భర్తపోతే ఖేదమేలా! దేవా?

య:—సరే, మరెందుకమ్మా, ఈఖేదము? ఎందుకీప్రయత్నము?

సా—చనిపోయిననాభర్తగురించిఖేదపడలేదు; బ్రతికున్న నాగురించీ కాదు; కాని నాఅత్తమామలకు కళ్లులేవు; వయోవృద్ధులు; అరణ్యవాసం; నాపెనిమిటే ఆధారము; వారికొరకు నాఖేదము.

య:—సరే, నీవడుగకుండా వారికి కళ్లు ఇచ్చినాను చాలునా?

సా:—దేవా, ఇచ్చిన సార్థకమేమిటి? కొడుకునూ, కోడలనూ చూచుకోవడమేకదా? కొడుకంటే, అట్టికొడుకు, మాతృభక్తి, పితృభక్తి ఆయనను చూచినేర్చుకోవలసినకొడుకు, తమరు శలవిచ్చినట్టు, పాపరహితుడైనకొడుకు; కోడలంటే, అట్టిదైవసమానుడు అర్ధాంగిగా అంగీకరించి చెట్టపట్టిన ధన్యురాలను, బ్రతికుండగా, అప్రయత్నముగా, తమదర్శనలాభముపొందిన స్త్రీలలో అగ్రగణ్యురాలనైన దానను; నమ్ములను చూచి ఆనందించడమేకదా సార్థకము, వారికి దృష్టి ప్రసాదించినందుకు? కళ్లిచ్చి దీపమార్పివేయడమా?

య:—వారికి కళ్లిచ్చినాను. నీవుపోయి—

సా:—మరింత ఏడ్పించడానికా, విధవకోడలుగా, కళ్లలో కంపకొట్టినట్టు? లేక కొడుకుశవమును కనపర్చి, మేము ముగ్గురమూ నాభర్తమంటలో పడడానికా? దానముచేస్తే, సార్థకమైనదానము చేయవలెను. తమకు తెలియనిదా, దేవా?

య:— నీభర్తనుతప్ప ఏమయినాకోరుకొను.

సా:—[తనలో] మనస్సు మళ్లినట్టున్నది,. దేవా, మాతల్లిదండ్రులకు పుత్రసంతానములేదు. వారుకోరినందరిని, చిరాయువులైన కుమారులను, ప్రసాదించు, దేవా

య:—సరే, ఇచ్చినాను, మరివెళతాను.

[తనలో] ఇన్నిదాటివచ్చినది. కాని వైతరణి ఏలాగుదాటగలదో చూస్తాను. దాటే

వద్దో, [illegible]వేయగలదే. (నిష్క్రమించును)

సా:—ఇంతవరకు తెచ్చినావు, జననీ, సావిత్రీ ఇటుపైనికూడా నీదేభారము. ఆమహామంత్రము పఠిస్తూఉంటే, కార్యము కాకేమి? (తెర)

## ఆరవరంగము

యమలోకప్రాంతము – ప్రవేశము, యముడు

య:—వైతరణిదాటినాను. ఇక్కడికేమి? మానవులేమి? స్థూలశరీరముతో రావడమేమి? [సావిత్రి ప్రవేశించును] కాని, వెనుక ఆచప్పుడేమిటి? [తిరిగిచూచును] అదుగో, వస్తున్నదే, సావిత్రి! ఏమి! ఏమాసామర్థ్యము! వైతరణి ఎలాగు తావిచ్చివేస్తున్నదో ఆమెకు! సరీ, గట్టెక్కినది!

సా:—దేవా, నేనుగట్టెక్కినానని సెలవిస్తున్నారే? గట్టెక్కినదానిని గంగలోముంచివేస్తారా! నన్ను వెంటనే ప్రజలలో కలపండి, దేవా!

య:—సావిత్రీ, నీచరిత్ర అత్యద్భుతము!

సా:—తమదయ ఉండవలెనుగాని, ఇంకా అద్భుతముగా నుండగలదు, నేను నాభర్తను చేరగానే—

య:—నీభర్తనుగాక ఏమైనా అడుగుఇస్తాను.

సా:—నాకూ కుమారులు కావలెను, దేవా!

య:—సావిత్రీ, నీవు భర్తను అడిగినావన్నమాటే! సాధ్వికి నీతిమార్గమున సంతానము కలుగుటకు భర్తకావలెనే! భర్తను గాకఏమైనా [illegible] ముగా భర్తనేఅడుగుచున్నావే!

సా:—నన్ను వారితో తీసుకపోమ్మంటే, నావేళ యింకా రాలేదన్నారు. నేను పోయి సహగమనముచేస్తే, ఆజ్వాలలు నన్నుకూడకడ తేర్చవా? అప్పుడు నావేళ రాలేదా? నాభర్తను బ్రతికించినాకివ్వడము సులభమో, నాకాలమురాకముందు నేను నాభర్త మంటలోపడి సహగమనముచేయకుండా ఆపడము సులభమో, ఆలోచించడము తమపని. తమను మరి బ్రతిమాలి శ్రమపెట్టను. సూర్యుడుండగానే నేను మాయిద్దరినీ సంస్కారము చేయవలెను. జననీ, సావిత్రీ, నన్ను నాభర్తతో చేర్చు. అయ్యా, సెలవు. (వెనుకకుతిరిగి నాలుగడుగులు వెళ్లును.)

య:—అమ్మా, ఉండు, ఉండు. (తనలో) నన్ను యుక్తివల్ల ఎలాగు త్రోసి రాజు చేసినదో! వేళైనప్పుడు ప్రాణముతీయుట నా కెంత విధో, కాలమురాకముందు ఆత్మహత్య చేసుకోకుండా చేయడముకూడా అంత విధే "నేనే పతివ్రతనైతే, నాభర్తమంటలు నన్నుకూడా తీసుకోపోవలెను!" అని మంటలోపడితే ఏమిచేయగలను? ఇప్పుడు సావిత్రీదేవి యాజ్ఞకూడా [illegible] చున్నదే! నారదుడు చెప్పితే చెప్పనీగాని యివ్వక తప్పదు—

సా:—అయ్యా, [illegible] ఆలస్యమగుచున్నది. [illegible] సెలవా? వెళ్లనా?

య:—కుమారీ, పతివ్రతాశిరోమణీ, నీసత్యవంతునికూడా నీకిచ్చినాను చాలునా?
(పుష్పవర్షము కురియును.)

సా:—దేవా, తమనెంతనికొనియాడగలను? నాయానందము బాష్పవారిశక్తిని మీరినది. మరి మాటలమాట చెప్పవలసినదేమి? అందుకేనా, నాబాష్పవర్షమువంతు ఆపుష్పవర్షము? వారితో నేను స్వర్గసౌఖ్యము అనుభవిస్తూన్నప్పుడు, నాకు ఎప్పుడూ మృత్యుస్మరణే! వారు మృతినొందినప్పుడు, జీవస్మరణే! ఇటుపైని ఎప్పుడూ తమస్మరణే! దేవా, నాకృతజ్ఞను ఎలాగు కనపర్చగలను?

య:—మీరందరూ చిరకాలము సకలసౌఖ్యములూ అనుభవించుటవల్లనే! కుమారీ, నీభర్తను ఇంతకుముందే ఇచ్చియుందును. కాని, ఇచ్చినయెడల, ఆ సంతోష పారవశ్యమున, నీవు తక్కినవి అడిగియుందువా? నీవూ, నీభర్తా, మీపర్ణశాలకు పోయి, ఆయంధులనే చూచియుందురు. అందుకూ ఇలాగుచేసినాను. మరిఒక సంగతి, నీదగ్గిర దాపరిక మెందుకు? నీ యుక్తి వినడానికి, నిరాశలో నీవు ఏమి చేస్తావో చూడడానికి ఇంతవరకు తెచ్చినాను. నీవుపోయి నీభర్తశవమును ముట్టుకొంటే, వెంటనే బ్రతుకగలడు.

సా:—నేను ముట్టుకొంటే, నాభర్త బ్రతుకునని సెలవిస్తిరే?—

య:—అవును. దానికేమి సందేహామా?

సా:—దేవా, తమమాట సందేహించినపాపమునకు తగినశిక్ష ఇప్పటినరకములో ఉన్నదా? కాని, నేను వెళ్లేసరికి శవమును ఏదైనా జంతువు తినివేసియుంటే?

య:—అమ్మా, వనదేవతలకు అప్పగించి వచ్చినావు. నీయాజ్ఞను అతిక్రమించడమేనా? శవము, నీవువిడిచినచోటనే ఉంటుంది. నీవుపోయి ముట్టుకో. నీవు ఇక్కడే ఉండగానే, బ్రతికించిఉందును. కాని, లేచి నిన్ను వెతుకుతూ అతడు, అతన్ని వెతుకుతూ నీవు, చెరిఒకత్రోవా అయిపోతే ఆమహారణ్యములో? నేను చేసినదంతా సావిత్రీదేవి ఆజ్ఞానుసారము చేసినాను. నీవు కోరినవాటినన్నీ ఇమ్మని వారి సెలవు. నాపని ప్రాణములు తీసివేయడమే కాని, ఇవ్వడము కాదు. నీవు సావిత్రీదేవి వరప్రసాదినివి. నీకు వారు తోడు నీడ. నీకు మరొకరు వరములియ్యపనిలేదు. నీవుపోయి నీభర్తతో చిరకాలము సుఖముగా నుండుము. (తెర)



# దీపావళినాడు

వేదుల సత్యనారాయణ శాస్త్రి గారు

నిశీధిని

జగతి యీనాటి యీమహోత్సవమునందు
మునిగి యానందమున పొంగిపోవుచుండ
ఇటు రగులుకొల్పి రెవరు నీహృదయమందె
ణచికొనియున్న ఘోరదుఃఖాగ్ని నిపుడు"

నేను

కారుకొన్న యమాస చీకటుల నడుమ
నొకండనె యీశూన్యగృహము నందు
దురువడిపోయి మరణవాద్యంబులట్లు
ండియలు కొట్టుకొన, ఏడ్చుకొనుచునుంటి.

తగ దహించుకొనిపోవు ఈమెదంద
ాప్పనులు ారిపడి చల్లబడునొ యనుచు
ాసికొనిపోయె నానేత్రములు తమంత
త్రియే యింక బహిరంతరములనాకు.

విస్తృతోదంతములు శూన్యవీథు లందు
వలెనె హానముగ వెళ్లిపోవుచున్న
నిశీధిని! నీగభీరోదరమున
రికె, ఈదురదృష్టవంతునకు చోటు"

చిమ్మట

బాణసంచుల ఫెళఫెళార్భటులు విరిసి
దిశాంతరముల ప్రతిధ్వనుల నీన
పేదపడియున్న హానజీవితపు టాశ
లిపుడు మ్రోగించుకొనుచుంటివేల నీవు"

నేను

"నన్ను నిరసించువారి యానందమందు
నాకు భాగంబువల దొక్కనాటికైన
చీకటుల జీల్చుకొని వచ్చుమీకరాళ
గానరవములనే నాసుఖంబు గలదు.

దినములు పరస్పర ప్రతి ధ్వనులు గాగ
ఇరువదైదేండ్లు నాబ్రతు కిట్టె గడచె
ఈరహోదుఃఖవీథులందే నరుంగ
సఖుల యడుగులజాడ లీసరికిగూడ.

మృత్యు గర్జాప్రవాహ గంభీరమైన
విధి, నిదురపుచ్చు ప్రేమజీవితమునందు
సంభవించు, ప్రవాస దుస్స్వప్న వ్యథల
మడతలను సర్దుకొనుచుందు మాయకుండ.

తెగిపడిన పూలదండ లెత్తుగనమర్చి
యంధకారంబు సందిట నదుముకొనుచు
ఎవరికొరకొ పదేపదే యెదురుచూచు
నాయెద కొనర్తు కృత్రిమానందభిక్ష.

మ్రొక్కన కొలంది కాలితో ద్రొక్కివేయు
ఈకఠినలోకమెల్ల బహిష్కృతంబె
రండు, చిమ్మటలార, ఈ రాత్రులందు
నావలెనె పాడుకొను మీరె నాకు సఖులు."



# ఇల్లటికము

పాలపర్తి ఆంజనేయులు గారు

II

(సంపుటము ౨, సంచిక ౮ తరువాయి)

౧

నరసింహరాజు అత్తగారిల్లువిడిచి వెళ్లిపోయి మూఁడుసంవత్సరములైనది. కాలగర్భమున నేమి దాగియున్నదో యెవరుచెప్పఁగలరు? నాఁటిరాత్రి సరాసరిచిట్టివలస వెళ్లి తన తల్లిని దీసికొని చెన్నపట్టణము వెళ్లిపోయెను. ఒకనాఁడుచిత్రపఠనాలయమున "హిందూపత్రిక" జదువుచుండఁగా రామనాథరాజుగారు తమ పిల్లలకుఁ జదువుచెప్పుటకు మంచి యోగ్యతాపత్రములుగల గ్రాడ్యుయేటు (Graduate) కావలెనని ప్రకటించిన ప్రకటన కనఁబడెను. వెంటనె నరసింహరాజు మద్రాసులో రామనాథరాజుగారి గృహమునకు వెళ్లెను. శ్రీరాజుగా రతని యోగ్యతను, బి.ఎ. పరీక్షలో మొదటి క్లాసులో మొదటివాఁడుగ జయమొందుటను విచారించి నెలకు నూఱురూప్యములు జీతము నేర్పాటుచేసెను. మూఁడునెలలు గడచిన పిమ్మట అతని బుద్ధికుశలతను, గుణసంపదను స్వయముగ నెఱిఁగినవాఁడగుటచే నతనిని 'అంతరంగకార్యదర్శిగ' నేర్పాటుచేసి వారి స్వంత వ్యవహారములనన్నిటిని నరసింహరాజు చేతనే చేయించుచుండెను. శ్రీరాజుగారు విద్యావంతులును, సుగుణవంతులును, ఉత్సాహవంతులునునై రాజకీయ, సాంఘికాది ప్రజాహిత కార్యములందు ప్రవేశముకల్పించుకొని పని చేయు స్వభావముగలవారు. ఈ పనులన్నిటి యందును, యెస్టేటు పరిపాలనయందును శ్రీ రాజుగారికి కుడిభుజమువలె నరసింహరాజు పని చేయుచుండెను. ఇట్లొకసంవత్సరము గడచినది ఇంతలో శ్రీరాజుగారి దివాను వృద్ధుఁడై కాలధర్మము నొందెను. శ్రీరాజు రాజకీయాది విషయములం దభిమానముతోఁ బని చేయ నుత్సాహము గలవా రగుట జమీా వ్యవహారముల స్వయముగాఁ జూచు కొనుట కవకాశము లేదు. ఆకారణమున యెస్టేటు వ్యవహారములను జక్కఁగా గ్ర హించి పరిపాలన సామర్థ్యముతోఁ జేయఁగల విశ్వాసపాత్రుఁడైన దివానుకావలసియుండెను. ఈగుణములన్నియుఁ గలవాఁడు వారియుద్యోగస్థులలో నొక్క నరసింహరాజు మాత్రమే కనుపించుచుండెను. అంతట శ్రీరాజుగారు నరసింహరాజును నెలకు రు. 500. జీతము మీఁద దివానుగా నియమించెను. మఱుసంవత్సరము యెస్టేటుమీఁద నొకగొప్ప వ్యా

ముఁవచ్చెను. ఆవ్యాజ్యములో నరసింహారాజు మిక్కిలి సామర్థ్యముతోఁ బనిచేయుటచేత జయముకలిగెను. నరసింహారాజుచేసిన సహాయమునకు శ్రీరాజుగారు చాలకృతజ్ఞత గలవారై పదివేలరూపాయల బహుమానముచేయుటయేకాక జీతమును సహిత మభివృద్ధి చేసెను.

౨

ఒకనాఁడు శ్రీరాజుగారును, నరసింహారాజును మద్రాసుకాస్మపాలిటన్ క్లబ్ వసారాలో పడక కుర్చీలు వేసుకొని యిష్టగోష్ఠిని మాట్లాడుచుండిరి. ఇంతలో యిద్దరువకీళ్లు ప్రక్కనుండిపోవుచు అందులోనొకరు నరసింహారాజుమాట సవ్వడిని విని వెనుకకుఁదిరిగి చూచి లోపలికి వెళ్లిపోయెను. నరసింహారాజిదివఱ కెప్పుడును క్లబ్బుకు వచ్చియుండలేదు. మద్రాసులో తరుచుగ నుండెడువాఁడుగాని క్లబ్బుకుమాత్ర మెప్పుడును వచ్చియుండలేదు. అందుకు కారణము లేకపోలేదు. ఇంతలో శ్రీరాజుగారు మోటారునెక్కి బీచికి షికారు వెళ్లిరి. అంతట నరసింహరాజు క్లబ్బు చూడవలెనని లోనికి వెళ్లెను.

గోపాలరావు:—అయ్యా! తమరి నిదివఱ కెచటనో చూచినట్లున్నది. తమ రెవరో నే దెలుసుకొనవచ్చునా?

నరసింహారాజు:— (తెల్లబోయిన ముఖముతో) బహుశః యిచటనే చూచి......

గో:—ఓయి! దాచుచున్నావా నరసింహారాజు!—ఒరే, అప్పలరాజు. మన నరసింహారాజిడుగోనోయ్!

అప్పలరాజు ఆతురతతో వచ్చి నరసింహారాజును గౌఁగలించుకొని ఆనందబాష్పములు విడిచెను. అప్పలరాజు గోపాలరావు యిద్దరును నరసింహారాజుకు విజయనగరములో సహాధ్యాయులు మాత్రమేకాక మిక్కిలి ప్రేమాస్పదులైనమిత్రులు. గోపాలరావు క్రొత్తగ మద్రాసులో న్యాయవాదివృత్తి మొదలుపెట్టినాఁడు. అప్పలరాజు విశాఖపట్టణములో ప్లీడరి చేయుచున్నాఁడు. అంతట వారుముగ్గురును బయటకువచ్చి దూరముగ నొకచో కుర్చీలు వేసుకొని కూర్చుండిరి.

అప్పలరాజు:—నీవెచటికో పాఱిపోయినావని విని మేమందఱము చాలదుఃఖించినాము. నేఁడు నిన్నుచూచుట తోడనే నాప్రాణములు లేచివచ్చినవి.

గో:—సరేకాని, యిందాక రామనాథరాజుగారితో చాలచనువుతో మాట్లాడుచుంటివేమిటి. నేను లోపలికి వచ్చునప్పుడు నీమాట ఆనవాలుపట్టి తిరిగిచూచి గుర్తింపజాలక యెవరోయని వెళ్లిపోయినాను. నీకు వారు పరిచయ మెట్లు?

నర:—నేను రాజుగారి దివానుగా నున్నాను.

అప్ప:—ఏమిటి! చెప్పవు! చదువులోనేకాక ఉద్యోగములోగూడ మమ్ములను తలదన్నినావుగా! నిన్నుగాక యింకెవరిని భగవంతుఁడనుగ్రహించును. నీవంటి యోగ్యుడికి కలిగినకష్టమునకు మేమందఱము విచారించినాము. ఇంక గోపాలరావు నడుగు.

పురాణకాలక్షేపమో చేయుచుండునట.
ఎంతటిభోగియో అంతటి విరాగియైనదని
యందఱు నాశ్చర్యముతో జెప్పుకొందురు.
ఈ మాటలు వినినప్పుడు సాత్వికగుణ
ప్రధానుడగుటచే కనులు నీరుగప్ప తల
వాలిచి రెండు అశ్రుకణముల విడచెను.

అప్ప:—ఇదిగో, నరసింహరాజు! నీమనస్సుకు
కష్టముగనుండునని చెప్పలేదు. కాని నీవు
వెళ్లినతర్వాత రెండుమూడు నెలలు మంచ
మెక్కి నీభార్య అన్నపానీయములు లేక
యెటులెట్లులనో జీవించినది. కాని మనిషి
మాత్రము పూర్తిగ మారిపోయినది. మును
పటివలె స్తురులేదట నాభార్యకూడ అనేక
సార్లు 'ఆ అమ్మాయి కేమిటి మీ స్నేహి
తుడు అంటిరిగద; మీరైన కనుక్కోకూ
డదా ఆయనజాడ' యని యనుచువచ్చెడిది.
నేనుమాత్ర మేమిచేయను? ఎవరి కేమి తెలి
యదాయె. దీనిలో కల్పించి చెప్పినదేమి
లేదు. అబద్ధ మొక్కపిసరైనను లేదు.
నీమనస్సు త్రిప్పవలెనని చెప్పుటలేదు.
మనమందఱ మన్నదమ్ములవలె నొక్క
చోనుండి చదువుకొనినాము గనుకను
నేను వూరివాడను గనుకను వున్నయథా
ర్థము చెప్పినాను.

గో:—అతని మనస్సుకు కష్టముగా వున్నట్లు
న్నది. మావాళ్లు వూరిలోలేరు. మన
మందఱ మిచటనే భోజనము చేయుదము.
నరసింహరాజు! యిది కాస్మపాలిటన్
క్లబ్బని నీకు తెలిసినదేగదా! కాబట్టి నీవు
కూడ యీపూట యిచటనే మాతో
కలిసి విందారగించవలె.

3

అంతట ముగ్గురును లేచి భోజనమునకు
వెళ్లిరి. మిత్రు లొకరి నొకరు, పరిహసించు
కొనుచు భుజించుచుండిరి. చూచుటకది పెండ్లి
బువ్వముబంతివలె నున్నది. నరసింహరాజు
కలిపిన అన్నము సరిగా తినక అటునిటు త్రోసి
రెండు మెతుకులు కొరికి లేచెను. నాడు వేసవి
కాలపు వెన్నెలరాత్రి యగుటచే సౌధోపరి
భాగమున శయనించుటకు ముగ్గురును వెళ్లిరి.
సముద్రమునుండి మలయానిలము మెల్ల
మెల్లగ వీచుచుండెను. ఆకసమున మేఘ
ములు బారులుతీర్చి పర్యాలిడుచుండెను.
గోపాలరావు నవనాగరికుఁ డగుటచే, కిల్లిలు
సిగరెట్లు తీసికొనివచ్చి నరసింహరాజున కివ్వఁ
బోయెను. కాని అతని కట్టి అభ్యాసము
లేవియు లేనివాఁడగుటచేఁ బుచ్చుకొనలేదు.

గో:—అప్పటికిప్పటికి నీ వొక్కలాగున్నావు.
మేమందఱము ఎన్ని అవతారము లెత్తి
నామో చూడు!

అప్ప:—కాబట్టియె మన బ్రతుకిలావున్నది.

గో:—కాకపోతే యేమిటి, ఉన్న నాలుగు
రోజులు సరదాగా టింగు రంగా అంటు
వుండవలె గాని లేకపోతే యేమిటి.

అప్ప:—నీకేమిరా బాబు! మీబాబు సంపా
దించి యిచ్చిపోయినాడు. ఏవో నాలుగు
ముక్కలు చదువుకొనినావు. షోకుగా
లైఫులీడ్ (కాలముగడపుట) చేస్తున్నావు.

అందఱ కేలావస్తుంది? బాలుగాని నీకబుర్లు కట్టిపెట్టు. నరసింహరాజు, యేమనెదవు?

నర:—ఏమిఅనేటందుకు యేమివున్నది.

అప్ప:—నేను క్లబ్బుప్యూనుచేత మీ మామగారికి అర్జంటువైరు యివ్వవలెనని అనుకొన్నాను. నీతో చెప్పకయిచ్చుట బాగుండదని మానినాను.

నర:—కొంపదీసి యిచ్చినావుకావు. ఇంకనయము!

అప్ప:—అయితే నీవుద్దేశ మేమింటి? నాకు బోధపడ లేదు.

నర:—అయినదేమో యైనది. నేను వారికి లేను; నాకు వారు లేరు.

అప్ప:—లేకపోవు టేమికర్మము. ఇప్పుడు మించిపోయినదేమి? గృహచ్ఛిద్రము లెవరికైన నున్నవే. ప్రపంచములో పోట్లాడుకొనని ఆలుమగలున్నా ఆ సామాన్యవిషయము పట్టుకొని యింత బాధాంకసిద్ధాంతము చేయుట నాకేమాత్రము బాగుండ లేదు. నీవు వొప్పుకొనిన నరి, లేకపోయిన రేపుప్రొద్దున మీ మామగారికి వైరిచ్చుట తప్పదు.

నర:—సంగతి సందర్భముల దెలియక నీవనుకున్నావుగాని లేనిచో నీవిట్లు మాటలాడవు. ఇప్పుడాకథనంతయు దలచుకొనిన నామనస్సుకు గష్టము దోచును.

అప్ప:—నీమనస్సుకు నొప్పిగలిగించుట మాకును యిష్టములేదు. కాని వారుచేసిన తప్పెంత క్షమింపరానిదా?

నర:—క్షమింప దగినదైనను, కాకపోయినను ఎందుకా ప్రశంస?

అప్ప:—ఓహో! ఇంతవఱకు మేముచెప్పిన దంతయు అనవసర ప్రశంసయేనా? నీకు నీ మామగారిపై కోపముండిన ఉండవచ్చును. ఇల్లరికములలో నీగోలయెపుడు వున్నదియె, కాని ఆపిల్ల నేల బాధపెట్టవలె? ఆమెతప్పేమి?

నర:—ఏమైనను మీరు ప్లీడర్లు. నాచేత చెప్పింపక విడువరు.

అప్ప:—నీవాలా అనుకొనవద్దు.

నర:—మిత్రభావ మాలోచించియె చెప్పచున్నాను. మా మామగారు నాకోర్కెను తిరస్కరించినసంగతి మాత్రమే మీకు దెలియును. అంతియెకాదు. నాటిరాత్రి నాభార్యసహితము మేము బీదవారలమనియు, తనను పోషింపజాలమనియు, తాను రానదియు, నేను వెళ్ల కూడదనియు అతి సాహసమున బలికినది. అట్టి స్త్రీతో నే జేయదగినదేమో నీవే యాలోచించవచ్చును.

అప్ప:—నిజము. నీమనస్సు చాల నొచ్చియుండవచ్చును.

నర:—అందువలననె తిరిగి వారిగడప త్రొక్కకూడదనుకొనినాను.

అప్ప:—నీవుచేసినది తప్పని నే జెప్పుటలేదు. అయితే అవి తెలిసియాడిన మాటలని యేనా నీ యభిప్రాయము. కేవల మజ్ఞానముచేతను, చిన్నదనముచేతను ఆడిన మాటల నంతగా పాటింపకూడదు.

నర:—నీవు చెప్పెడి సబబు చాల బాగున్నది. ఇంతకన్నను అవమాన మేమికావలె?

అప్ప:—భార్యాభర్తలొకరినొకరనుకొనరా?

నర:—కావచ్చు. అయితె, యిదియేనా సరసము?

అప్ప:—సరసము కాకపోయిన విరసమే యనుకొనుము. అంతమాత్రమున చేసెడి కాపురము పాడుచేసుకొందువా?

నర:—నూరుచెప్పు, వెయ్యిచెప్పు. నా మనస్సు విరిగిపోయినది.

గో:—నాకిష్టములేదని మొఱపెట్టినను బలవంతమున కట్టిపెట్టెదవా?

అప్ప:—ఏదో సామెత చెప్పినట్లున్నది. [illegible]......

గో:—చాలు, సరె. అయినదేమోఅయినది. [illegible]గ వివాహమేల చేసుకొనకూడదు?

అప్ప:—నీ పిచ్చి సిద్ధాంతముల దయచేసి కట్టిపెట్టుము. ఇంటిలో మాట మాట యనుకొనినపుడెల్ల యింకొక పెండ్లి చేసుకొనుచుందురా?

గో:—చేసుకొనిన తప్పేమి?

అప్ప:—భార్య వికలాంగికాని, దోషికాని కానప్పుడు బహుపత్నీత్వము నార్యధర్మ మొప్పుకొనదు.

గో:—మన ప్రాచీనార్యులలో బహుపత్నీత్వము, బహుపతిత్వముకూడ వ్యాపించియున్నది. యూరపుదేశములలో 'మేరేజి కంట్రాక్టు' పద్ధతి వున్నది. ఇప్పుడిప్పు డుదయించుచున్న నవభావములు యింకను విచిత్రములుగ నీకు దోపవచ్చును. స్త్రీ పురుషు లెవరయినను కూడి నివసించవచ్చుననియు, ఇష్టములేనపుడు కోర్టులతో నిమిత్తములేకనే విడిపోవచ్చుననియు, వారి సంతానమును ప్రభుత్వము పోషింపవలె ననియు నుడువుచున్నారు. కార్పెంటర్ లిటూర్నో వ్రాసిన గ్రంథము నీవుమాత్ర మెఱుగవా? ఇందులో నాకు విపరీత మేమియు కనుపించలేదు. ఈ భావములు మనదేశమందు మాత్రము వ్యాపింపవా?

నర:—నీవు చాల వివాదాంశమును పైకి దీసినావు. నేను నీతో వాగ్వివాదమునకు దిగ తలచుకొనలేను. కాని, నాకు దోచిన ఒకటి రెండు విషయములు మాత్రము చెప్పెదను. పశ్చిమదిక్కున మిణుకు మిణుకుమని వెలిగెడి చుక్కలు తూర్పున నుదయించిన ప్రచండ భానుతేజము ముందర కాంతిహీనములగుట నీకు దెలియని విషయముకాదు. మఱియు ధర్మము దేశకాలబాధితము కాదు. అది పరమసత్యము. పాశ్చాత్య ధర్మశాస్త్రములు సహితము ఏకపత్నీత్వమునే గ్రహించినవి. తదితరములు శాసన విరుద్ధములు. పాశ్చాత్య సాంఘిక పరిస్థితులజూచి యెడలు పులకరించును. అవి మన మానసిక ప్రవృత్తికి ధార్మికభావమునకు విరుద్ధములై యున్నవి. మఱియు, స్త్రీ పురుషుల జీవిత ధర్మమునుబట్టియు, ప్రాకృతిక స్థితినిబట్టియు, సాంఘిక సౌలభ్యమునుబట్టియు, నైతికాధ్యాత్మిక ధర్మ

ముఖుబట్టియు, ఏకపత్నీత్వముసే శాస్త్ర
జ్ఞులు సహిత ముత్తమధర్మముగ నంగీక
రించి యున్నారు. ఏకపత్నీత్వము మానవ
పరిణామమందును, సభ్యతయందును
సమాజ పరిణామముగా వెంచదగియున్నది.
లిటూర్నో సహితము ఏక పత్నీత్వము
కంటె ఉత్తమధర్మము గాన్పించుటలేదని
ఒప్పుకొని యున్నాడు. తాము గన్న
పిల్లలను తాము పెంచు బాధ్యతను
దప్పించుకొన జూచుటకంటె నీచమును,
గర్హ్యమును,స్వార్థపరము నైన విషయము
వేరులేదని చెప్పవచ్చును. మానవ ధర్మ
మును నిర్మూలము చేయుచున్నా మని
చెప్పవచ్చును. మనకు సమిష్టిబాధ్యతలు
కొన్ని గలవని గుర్తించవలెను. అందు
శిశుపోషణము ముఖ్యము. విషయలోల
తచే దీనిని దప్పించుకొనజూచుట ఆత్మ
హత్యయే యగును. ఇక సంఘమెక్కడ?
సభ్యతయెక్కడ? కావున నీవు చెప్పుపద్ధతి
యెప్పుడును సామాన్య ధర్మమై ప్రచా
రము చెందనేరదు.

అప్ప:—నాధారము తప్పిపోయినది. వైవా
హిక ధర్మము నింత చక్కగా దెలిసిన
నీకు మేము ధర్మోపన్యాసము లివ్వదలచ
లేదు. కాని అగ్నిసాక్షిగ పరిణయమాడిన
పత్నిని విడచుట నీకెట్లు ధర్మమైనదో నాకు
కొంచెము తెలియజెప్పుము.

నర:—మన గోపాలరావుపాశ్చాత్యవ్యామో
హ మిప్పటితో దొలగునట్లు లేదు.
పాశ్చాత్య సభ్యత, సాంఘికజీవనము
విద్య నచ్చినట్లు మనవి నచ్చవు. అందు
వలన ప్రస్తావవశమున నట్లు మాటాడితి
గాని, మీకు దెలియని ధర్మములు నా
కెక్కువ దెలిసినవి లేవు.

గో:—ఒక్క సబ్బుబిళ్లగాని, మైనపువత్తి
గాని చేయుట చేతగాదు. ఊరక ప్రగల్భ
ములు కొట్టిన నేమి ప్రయోజనము?

అప్ప:—నీవు చెప్పిన రెండువస్తువులు కూడ
ఇహపరసాధనములు! చాలు నీప్రస్తావన
కట్టిబెట్టు! ప్రస్తుతాంశ మదికాదు. పది
గంటలు కావచ్చుచున్నది. ఇంతకు నే
నడిగిన ప్రశ్నకు జవాబురాలేదు.

నర:—మనస్సులు భేదించిన పిమ్మట మరల
కలియుట కష్టముకదా!

అప్ప:—నీవు సమ్మతించిన యందుకు జరగవల
సిన తంతు నేను జరిగించెదను. నీ ఆత్మ
గౌరవమునకు భంగము రానివ్వను. ఈ
విషయము తర్కముచే తేలునది కాదు.
ఉదారభావములతోను, ధర్మబుద్ధితోను,
స్వల్పవిషయముల పాటింపక యేదోయొక
నిశ్చయమున కిప్పుడు రావలెను. నేను
నీకు ప్రాణమిత్రుడ నని నీవు తలంచుచో నా
మాటలు నీకు విశ్వాసపాత్రములైనచో
నాయభీష్టమును నెరవేర్చెదవని తలచుచు
న్నాను. ఇక నే జెప్పవలసినది లేదు.
నీవు పరమయోగ్యుడవనియు, యుక్తా
యుక్త విచక్షణ గలవాడవనియు నింత
లెక్క నీతో ప్రసంగించితిమి.

నర:—మీరిట్టి నిర్బంధమును చేయుదురనియే
నేనింతకాల మజ్ఞాతవాసము చేసితిని. మీ

యెదుట పడిన పిమ్మట మీ యాజ్ఞ నను ల్లంఘు నీయమురా!

గో:—వెరీగుడ్! వాదము కొఱకు నే నట్లు మాట్లాడితినిగాని మీరిద్దరు కలిసియుండుటకంటె మాకు కావలసిన దేమి?

అప్ప:—(నరసింహరాజును కౌగిలించుకొని) నాకు పరమానందము కలుగ జేసితివి.

నర:—నా ఆనందమునకు నీయానందమునకు నీవే కారణభూతుడవు. నా ఆప్తబంధువులకన్న నెక్కుడుగా నీవు నా క్షేమము కోరి న న్నింతగా ఖలవంత పెట్టితివి. నీ ఋణము నే దీర్చుకొనజాలను.

అప్ప:—ఇందు నేజేసిన దేమున్నది. నీ వెంత యోగ్యుడవో నీభార్య అంత యోగ్యురాలు. ఆమె విచారమును, వైరాగ్యజీవనము ను సౌశీల్యమును, స్వయముగ నెఱిగినవాడనై నీవు చేజిక్కినప్పుడునహితము చేత జేసిన పాపమున బడుదు నేమో యనుభయమున నీతో నింతగా సాహసించి చెప్పితిని. నీవు నామాట త్రోసివేయక నన్ను గౌరవించితివి. నేను కృతార్థుడను.

నర:—(దుఃఖమును సూచించు గద్గద స్వరముతో) ఇట్టి అవ్యాజమైన కరుణ నే నెప్పుడు చవి చూచియుండలేదు. నీ హృదయ మెంత కోమలము! నిజముగ మిత్రుడన్న నీవుగదా! నేను వ్యర్థుడను. నీకు నే నేమి చేయగలను?

అప్ప:—నీవు చేయవలసినది నాతో విశాఖ పట్టణము వచ్చుటయె.

నర:—అలాగాదు.

అప్ప:—మరేలాగు? నింకేమి యా యభ్యంతరము జెప్పుచున్నావే.

నర:—ఇంక నభ్యంతర మేమున్నది? నేను రెండు నెలలు సెలవు పుచ్చుకొని మాచిట్టివలస వచ్చి యుండదలచినాను. అప్పుడు నేను వచ్చి నాభార్యను తీసికొనిపోయెదను. ఎట్టివారికైనను జన్మస్థలము (అది కుగ్రామమైనను) ప్రేమాస్పదము గదా. మరియు నీసందర్భమున నొక సంగతి విచ్చటించవలసియున్నది. కలిమి లేములు, సుఖదుఃఖములు శాశ్వతములుగావు. మన మెల్లప్పుడు సిరిసంపదలతో దులతూగుదుమని నుడువజాలము. కావున మన మీ సంపదను నమ్ముకొనియుండదగదు గదా! మన కెప్పటికే స్థితిప్రాప్తించినను యా[illegible]ముగ జీవితమును గడుపగలిగి యుండవలెనని పెద్దలు చెప్పుదురు. మన మెట్టి మహాభోగముల ననుభవించుచున్నను వానినన్నిటిని నిస్సంగ బుద్ధితో ననుభవించవలెననియు లేనిచో క్షణికములైన యీ భోగములు ఏ కారణముచేనైన నంతరించిన మన జీవితము దుర్భరమ్ము, దుస్సహము నగునని అనుభవజ్ఞులు నుడువుచున్నారు. కావున కష్టములు సహితము సుఖములుగ జేసుకొన గలిగినప్పుడే మనము శాశ్వతానంద మనుభవింప గలుగుదుము. కావున నేనిప్పుడు [illegible]చుంటిడనని చెప్పి సెలవు గల్పించి నాభార్యను దీసికొని వచ్చుటకు

నాకిష్టములేదు. నిజముగ నన్నామె ప్రేమించుచో, నా సాంగత్య మభిలషించుచో నాతో నాలేమిని సహితము వరించవలెను. నేనిప్పుడు గొప్ప యుద్యోగము చేయుచున్నానని యాశపెట్టదలచ లేదు. ఇట్టి స్థితిలో నా మామగారు నా భార్యను పం[illegible]యని శంకించుచున్నాను. నీవు చెప్పిన[illegible]బట్టి నా భార్య నిజధర్మమును గ్రహి[illegible] [illegible]హించుచున్నాను. మాకులాచా[illegible] ననుసరించి మా[illegible]యాడవాండ్రు కూపస్థ[illegible]ములవలె నాలుగు గోడలమధ్యను [illegible]యుండ చదువు లేక పోవుటయే కాక ప్రపంచజ్ఞానమును సహితము కోల్పోవుచున్నా[illegible]. నీ దురాచారము తొలగినగాని మా గృహములు ఆనంద ప్రదములు కాజాలవు. నేను రెండు మూడు రోజులలో మామగారి పేర యుత్తరము వ్రాసెదను. మీరు తొందరపడి యేమియు చెప్పవద్దని నా ప్రార్థన. నేను మీయాంతరభీష్టము నెరవేర్చెదనని మాత్రము విశ్వసింపవచ్చును.

అప్ప:—నీకుచిత మని తోచిన రీతిని, జేయవచ్చును. నీవు మాట ఇచ్చిన తర్వాత తప్పవాడవుగావని నాకు దెలియక పోలేదు. అనవసర శంకలమాత్రము కల్పించుకొనకుము. నీ చెప్పిన సంగతులు నాకు పరమానందము గలిగించినవి. నేడు చాల సుదినము. ఎన్నాళ్లో కెన్నాళ్లకో నిన్ను తిరిగి జూచుటయు, మీరిద్దరు కలసియుండుట కేర్పాటు జరుగుటయు మితిలేని సంతోష మొసగూర్చినవి. ఇప్పటికే చాల ప్రొద్దుపోయినది. ఇక విశ్రమించెదము.

౪

జగపతిరాజు కచ్చేరిసావడిలో స్వంతవ్యవహారములఁ జూచుకొనుచుండెను. ఇంతలో టపావచ్చెను. అందొక యుత్తరము చింపి చదువబోవ "ప్రియమైన మామగారికి నరసింహరాజు అనేక వందనములు"లని యుండెను. ఆశ్చర్యానందములు మొలకలెత్త అది యల్లుని యుత్తర మవునా కాదా యని అటు నిటు రెండు మూఁడు పర్యాయములు త్రిప్పి చూచి, సమగ్రముగఁ జదువుకొని యల్లుని క్షేమమునకు సంతోషచిత్తుఁడై, తనయనంపుట కయిష్టముదోఁప భార్యకడ కేగి యుత్తరమిచ్చి (కొంతతడవాగి)

జగ:—దగ్గరా, దూరా, కాని దేశము వ[illegible] పిల్లను బంపుటెట్లు?

భార్య:—రామనాథ మెక్కడ?

జగ:—దక్షిణ దేశమునకు చివర రామేశ్వరము పోవు దారిలో నున్నది.

భార్య:—అబ్బా! అంతదూరమా! మనమాటా? పలుకా? ఏంతు కీయుద్యోగము? ఇక్కడ తన క్షేమైన తక్కువా?

జగ:—ఆముష్టి యుద్యోగము చేయుటయె నా కవమానముగా నున్నది. తా నిచట సుఖముగా నుండకూడదు? ఉద్యోగము మాని యింటికి రమ్మని వ్రాయుదునా?

భార్య:—ఉండండి. మన ప్రేమ యుద్దేశమేమో తెలిసికొనియెదను.

లను, కష్టసుఖములను జెప్పి సమాధాన
పరుపఁజూచెనుగాని లాభము లేకపోయెను.
అంతట నామె భర్తయొద్దకు వెళ్ళి జరిగిన
యుదంతమునంతను జెప్పి కాంతు నల్లు
నొద్దకు బంపుట కొప్పించెను.

౫.

నరసింహరాజు అత్తవారింటికి వచ్చెను.
జగపతిరాజు, మనమున నెట్టికోపభావమున్నను
యల్లుని కుచిత సత్కారము చేసెను. రాత్రి
భోజనానంతరము పరుండుటకు శయనగృహ
మునకు వెళ్లెను. ఆగది మునుపటివలె నలం
కరింపఁబడి యుండలేదు. ఒక్కగోడపైఁ బుష్ప
మాలాలంకృతమైన తన భార్యాపటముఁజూచి
నరసింహరాజు, వివిధభావములు మనమున
మొలకలెత్త మోహధనాపహృతుఁడై యొక కుర్చీ
పైఁ గూర్చుండి యుండెను. పళ్లెరమునఁ దాం
బూలమును బండ్లను నిడికొని ప్రేమావతి
వచ్చుచుండెను. ఆమె సామాన్య వసనముల
మాత్రమె ధరించియుండెను. ఆమె మోమున
మునుపటి యుత్సాహముగాని విలాసము
గాని గానరాదు. కాని మహాదీక్షావ్రతమైన
మునికన్యకమాడ్కిఁ జూపట్టెను. ఆమె నేత్రము
లందుండు నవ్యతేజస్సు ప్రకాశించుచుండెను,
మోమున వినయ సౌశీల్యము లుట్టిపడుచుం
డెను. శరీర మొకించుక కృశించియుండెను.
మందగమనమున నథోవదనయై లోనఁ బ్రవే
శించి పళ్లెరము బల్లపై నునిచి నరసింహరాజు
ప్రక్కకొంచెము దూరముగ నిలిచియుండెను.
ఆమె పతిని దాను దూలనాడినపాటి రాత్రి
దృశ్యము జ్ఞప్తికి వచ్చుటచే [illegible] హృద
యము కంపింప, దుఃఖము పొంగఁ గన్నులనీరు
గ్రమ్మ "ఈ నిర్భాగ్యురాలిపై నింతటి కరుణ
జూపిన నీధర్మమూర్తి నే నేమొగము పెట్టు
కొని పలుకరింతు. నేనేమని శరణుజొత్తు.
ఏమని క్షమాపణ వేడుదు" నని యేమియుఁ
దోఁపక శిలాప్రతిమవలె తలవాల్చుకొని
నిలువఁబడియుండెను.

నరసింహరాజునకు నయిత మేమియుఁదోఁచ
లేదు. మొదట ఆమె వచ్చినదే గమనించలేదు.
పిమ్మట తెలుసుకొనినను వ్యాకులపడఁజొచ్చెను
"అజ్ఞానముచే నోరుజారి యాడిన మాటలకు
కఠినహృదయుఁడనై పంతమూని నీమె నెడబా
సితిని. నన్నె నమ్ముకొని నాకై పరితపించుచు
కృశించి వన్నెదక్కి పోల్చుటకైన శక్యము
గాకయున్న యీనాసతిని నేనేమని పలుక
రించువాడ? నేనెంతటి మూర్ఖుడను! కఠిన
హృదయుడను! ఇంకను మానమేల?" యని
భార్యవంకఁజూచి "ప్రేమ....." ఇంతలో
ప్రేమావతి తటాలున నేలకొరిగి పతిపాదముల
తన కరకమలములం దిడుకొని వానిని దన
కన్నీటిధారలచే అభిషేచనము చేసి "దుర
హంకారమైన యీదుష్టురాలిపై నింతటి ప్రేమ
గలదని నే గలలోనైన నెఱుగనైతి. ఇప్పటికై
నను నన్ను క్షమించితిరి. నే ధన్యురాలనైతిని.
నేటికి మీపాదదర్శన భాగ్యమబ్బినది.
నేను మీదానను. మీశరణు చొచ్చినాను."
అని కన్నీరు కార్చుచుండెను. అంతట నరసిం
హరాజు శోకభారముచేఁ గంఠము స్తంభించి
పోవ, మాటాడలేక ప్రేమావతిని లేవనెత్తి
తన బాహులతలచే నామెను బంధించి

ముపై మోముంచి తన కన్నీరు సామె కన్నీటితో నేకమై ప్రవహింపఁజేసెను.



"దురహంకారయైన యీదుష్టురాలిపై నింతటి ప్రేమగలవని నే కలలోనైన నెఱుగనైతి........నేటికి మజల మీదర్శనభాగ్య మబ్బినది. నేను మీదానను. మీ శరణు జొచ్చినాను."

దనియు, పంపెడి దాసీలను బోషించుటకుఁ దనకు శక్తిచాలదనియు వానిని స్వీకరించక భార్యను, ఆమెకు మిక్కిలి యవసరములైన యొకటి రెండు పెట్టెలను మాత్రము తీసికొని స్వగ్రామమునకుఁ బయనమయ్యెను.

చిట్టివలసలోఁ గొడుకు కోడలు వచ్చుచున్నారని పడిపోయిన మట్టి గోడలను మెత్తించి, బూజు దులిపి, సున్నము కొట్టించి, యిల్లలికి ముగ్గులుపెట్టి యాతురతతో నరసింహరాజు తల్లి యెదురుచూచుచుండెను. కొడుకు కోడలు రాగానే యెఱ్ఱనీళ్లుదీసి హారతి నిప్పించి వారిని తల్లి లోపలికిఁ దీసికొనివెళ్లెను. 'ఇన్నాళ్లకు సతీసమేతుఁడై నరసింహరాజు వచ్చినాఁడని ఆనందముతో నూరి అమ్మలక్కలందఱు వచ్చి "ఈడుజోడుగ, ముద్దు ముచ్చటగ సీతా రాములవలె కొడుకు కోడలు నట్టింటికి వచ్చినారు. మహారాజువలె దోసిళ్లతో సంపాదించుచున్నాడు. నీకేమి? యదృష్టవంతురాల" వని నరసింహరాజు తల్లిని శ్లాఘించి పోవుచుండిరి.

౬

ప్రేమావతి నత్తవారింటికిఁ బంపునపుడు తమ హోదాకు, గొప్పదనమునకుఁ దగినటుల బంపునుద్దేశముతో మంచములు, కుర్చీలు, మేజాబల్లలు, అల్మారులు, పెట్టెలు వివిధములైన పాత్రసామానులు, దాసీలను నాయత్తముచేసెను. నరసింహరాజు మాత్రము వానినన్నిటిని ఉంచుటకు తనకు గృహము చాల

నరసింహరాజు యింటిలో నౌకర్ల నెవ్వరిని బెట్టలేదు. కోడలిపైఁగల ప్రేమాతిశయముచే నామె నేపని చేయకుండఁ జేయవలెనని యెంత యత్నించినను బ్రేమావతి యత్తగారి కన్న ముందుగలేచి యింటిపనియంతయు నామెయె చక్కఁబెట్టుచుండెను. ఇల్లు పూరిల్లని కాని, మట్టిగోడలని కాని, దాసీ లెవరు లేదని కాని నొక్కనాఁడైనను ప్రేమావతి విసుగు

కొని యెఱుఁగదు. భర్త యామెను విడనాడి పోయిన దాదిగ నెక్కువ దూరదృష్టితో నీపనులనన్నిటిని బుట్టింటియొద్దనె కొలఁదిగనో గొప్పగనో నేర్చియున్న సంగతి మనకుఁ దెలియును. ఆర్యసతికి గృహనిర్వాహకము, పతిసేవ యుత్తమధర్మములని గ్రంథపరిచయముచే నామె దెలుసుకొనియుండెను. గృహకృత్యము లొకించుక భారముగ నున్నను నవి యున్నియు పతియొక్క ప్రేమరసాస్వాదనముచే మఱుపునకు వచ్చుచుండెను. ఇట్లు తల్లితోను, భార్యతోను స్వగృహమున రెండు నెలలు సుఖముగ నరసింహరాజు గడపెను.

౨

ఒకనాఁడు సాయంతనము నరసింహరాజు భార్యను గ్రామమునకు దక్షిణపువైపుననున్న ఉద్యానవన మొకటి చూచు నెపమున విహారమునకుఁ దీసికొని వెళ్లెను. వారు ఊరిచివరకు వచ్చిరి. పశ్చిమాంబుధిని గ్రుంకుచున్న దినకరుని కెంజాయలచేఁ దళతళ మెఱయుచున్న వృక్షశాఖాగ్రములనుండి యొక నూతన హార్మ్యము వారికనులకు గోచర మయ్యెను. ఆ ఉద్యానవనమునకు ముందు చిత్ర విచిత్రముగ నిర్మింపఁబడిన యొక యినుప కవాటముండెను. ఆద్వారమునుండి యొక బాట తోఁటలోపలికిఁ గలదు. ఆ బాట కిరువైపులను వివిధ వర్ణములతో వెలుంగు ఆకు ఫసందు చెట్లును, మనోహర సౌరభము వెదచల్లెడి పూలమొక్కలును వరుసలు తీరియుండెను. అటునిటు నున్నతములైన - చూతనారికేళ పనసాది ఫలవృక్షము లుండెను. ఆ బాటను కొద్దిదూరము నడువ నూతన ప్రాసాదము చేరిరి. ఆప్రాసాదము మన ప్రాంతపు మేడలవలెఁగాక నూతనపక్కిని కట్టఁబడియుండెను. ప్రేమావతికి మేడలు గాని, ఉద్యానవనములుగాని క్రొత్తవికావు. కాని యిట్టి కుగ్రామమున యట్టి విచిత్ర నూతన హార్మ్యముండుటఁ జూచి యాశ్చర్యపడఁజొచ్చెను. విశ్రాంతికొఱ కప్పుడప్పుడు వచ్చియుండుట కొఱకు వేళ విజయనగరమహారాజులు కట్టించుకొని యుండవచ్చు. నని యామె తనలో సమాధాన పఱుచుకొనుచుండెను. అయినను నట్టి చోటికిఁ దన్నుఁ దీసికొని వచ్చుటకుఁ గారణమేమి యైయుండునా యని వ్యాకులపడుచుండెను. మేడంతయు పచ్చని తోరణములతో నేదియో యొక శుభకార్యమున కలంకరింపఁబడినట్లుండెను. రెండుమూఁడు మెట్లుపైకి యెక్కునప్పటికి డవాలు వేసుకొనిన బంట్రౌతులు, కొందఱు పనివారలు తొందర తొందరగవచ్చి నరసింహరాజుకును, ప్రేమావతికిని వంగి వంగి నమస్కృతులు చేయ దొడఁగిరి. ఆబంట్రౌతులఁజూడ మన దేశమువారి వలెఁ గన్పట్టలేదు. ఇదంతయు, స్వప్నమా నిజమా, యని యాశ్చర్యముతోఁ దెల తెలఁబోయి ప్రేమావతి చూచుచుండెను. క్రీగంటితోఁ బ్రేమావతియందుఁగలుగుచున్న మార్పులను నరసింహరాజు కనిపెట్టుచుండెను. అంత నరసింహరాజు లోనికిఁ బోవుదము రమ్మని ప్రేమావతిని వ్రేలు బట్టుకొని లోనికిఁ దీసికొని వెళ్లెను. లోపలి కచ్చేరి సావడి చిత్ర విచిత్రములయిన చిత్తరువులతోను, ఫోటో

గ్రాఫులతోను నలంకరింపఁబడి, కుర్చీలు బల్లలు మొదలగువానిచే నమర్పఁబడియుండెను. అంత కొంచెము లోనికరుగునప్పటికి నొక మండువా యుండెను దానికిఁ గుడివైపున నొక విశాలమైన గదియుండెను. ఆగదియు నత్యంతరమణీయమైన పనితనముతోఁ జేయఁబడిన యొక పందిరి మంచము, సోఫాలు, అల్మార్లు, చిత్తరువులు మొదలగునవి యుండెను. ప్రేమావతి భీతిచేతను, లజ్జచేతను వెనుకాడుచుండుటఁ జూచి నరసింహరాజు ఆమె చేయిఁబట్టుకొని లోనఁ బ్రవేశించెను. ఆశయన గృహమునఁ బర్యంకమున కెదురుగ రెండు పెద్దఛాయాపటములు తెరలచేఁ గప్పఁబడియుండెను. ఇతరులెవరు నచట లేమింజేసి వినోద భావమున నాపటములఁజూడఁ గౌతూహలంబు జనింప, వానినుండి వ్రేలాడు కుచ్చులను బట్టుకొని లాగెను. తెరలు విడిపడెను. ఆపటముల జూచునంతనె ఆశ్చర్యానందములు మనమున నుప్పొంగఁ దన బాహులతలను భర్తకంఠముపై వైచి గాఢాలింగనము చేసుకొని ఆనంద బాష్పములు విడిచెను.

ఛాయాపటములందలి మూర్తులు ప్రేమావతి నరసింహరాజని వేఱుగఁ జెప్ప నవసరము లేదు. ఇదంతయు జరుగుట కెంతో కాలమ్ము పట్టలేదు. అందువలన ప్రేమావతి కా ఉద్యానవనము, మేడ యెవరివైనవి యడుగుట కవకాశము చిక్కలేదు. అంత నిద్దఱును సమీపమునయున్న సోఫాపైఁ గూర్చుండి యిట్లు సంభాషించిరి.

ప్రేమా.—అబ్బా! మగవారెంతటి దిట్టలు!

నర:—దిట్టతన మేమిటి?

ప్రేమా:—అబ్బా! ఇంక నటన యేనా?

నర:—నటన యెవరిది?

ప్రేమా:—మీదె. ఎంతటి గట్టి మనస్సు! ఈమేడ యెవరిది?

నర:—నా స్నేహితునిది.

ప్రేమా:—ఇంకను నన్ను పిచ్చిదానిని చేయవలెననియేనా మీయుద్దేశము. మీ స్నేహితునిదేయైనచో మన పటములేల యిచట నుండవలెను?

నర:—ఒక స్నేహితుని యింట వేరియొక స్నేహితుని పటములేల యుండకూడదు అదియు దప్పేనా? ఇక స్నేహ మేమిటి?

ప్రేమా:—ఇంకను నన్ను మోసపుచ్చ నెంచెదరా? మీదియుండిన నుండవచ్చుగాని, నాపటము పరపురుషుని యింట నుండుటకు కారణమేమి? సామాన్యమగు ఫోటోగాదె; పెద్ద చిత్తరువె. అందులో శయనగృహముననె. అది మీకెట్లు సమ్మతమయ్యెను? ఇంకను నన్ను పరీక్షింప నెంచుచుంటిరా? (పూర్వచరిత్ర జ్ఞప్తికిరాగ కన్నులనుండి నశ్రువుల రాల్చుచు) మూఁడువత్సరములు మీచరణ సేవకై కఠిన వ్రతము పూని యుంటిగదా! ఇంకను నాపై దయరాలేదా? మీమనస్సు కరుగలేదా? మీ విశ్వాసమున కింకను పాత్రురాలను కాజాలకపోతినిగదా! ఏమి నాదౌర్భాగ్యము! అని విలపింపఁ దొడఁగెను. అంతట సహజ కరుణార్ద్ర హృదయుఁడైన నరసింహరాజు

ప్రేమావతి దీనాలాపములకుఁ జలించిన వాఁడై నేత్రయుగ్మమునుండి బాష్పబిందువులు స్రవింపఁ బ్రేమావతిని దగ్గరకుఁ దీసికొని కౌఁగిలించుకొని "ప్రేమావతీ! నీపై నాకనుగ్రహము తప్ప నాగ్రహ మెప్పుడును లేదు. నీపై ప్రేమ గోరంతయైనను కొఱంతవడియుండ లేదు. దైవవిధిని దప్పించుకొనుటకు దైవసములైన సీతారాములకుగాని, పంచపాండవులకు గాని శక్యము కాలేదు. అట్టి యెడ మనమేపాటివారము! నీవజ్ఞానముచే నాడిన మాటలను గూడ నేనంతగ పాటింప లేదు. నాకట్టకడపటి యుత్తరమునందు సహితము దైవము 'నిన్ననుగ్రహించుగాక' యనియే దీవించియుంటి. ధర్మవర్తనులకె దైవము కష్టముల ప్రాప్తింప జేయును. నేను మీ యింట బడగాపునై పడియుండుట యధర్మమని యెంచియె దైవము మన కావియోగమును, మన దాంపత్యానురాగము దినదిన ప్రవర్ధమానమై నవనవరీతుల బ్రకాశించుటకే భగవంతుడు మరల యీ సంయోగమును సమకూర్చినాడు. విద్యాబుద్ధులం దారితేరిన వాడనై చేతులు ముడుచుకొని యాడుదానివలె విందులుగుడుచుచు వ్యర్థుడనై పరులపంచ పడియుండుట పౌరుషమా? నీభర్త చేతగానివానివలె నత్తవారింట ఇల్లరికముండుట నీకుమాత్రము గౌరవప్రదమా? నీభర్త గృహమునకు రాజ్ఞివై స్వాతంత్ర్యజీవనము చేయుటకు నీవుమాత్ర మభిలషింపవా? స్త్రీపురుషులిద్దరు ఆత్మార్పణ చేసినగదా ప్రణయమహిమ మనుభూతమగును. ఇందెవ్వ రస్వతంత్రులైనను బ్రణయమూర్తి నిజస్వరూపము గోచరము కాజాలదు. మన యిద్దరిమధ్యను న్యూనాధిక్యములుండుటచేతనే పరస్పరము ప్రేమసాగరమున నోలలాడజాలకపోతిమి. నే నస్వతంత్రుడ నగుట నా హృత్పేటికాసీనుడైన ప్రేమమూర్తి నిజరూపమున నీకు ప్రసన్నము కాలేదు. నీవు గర్వితమతి వగుటచే నీయందు ప్రేమ మరుభూమియందలి జలమువలె శూన్యమయ్యెను. ప్రేమ శూన్యమైన నీహృదయక్షేత్రమున నా యనురాగ బీజములు మొలకెత్తలేదు. నేడు మన బంధములు వీడినవి. మనము సర్వస్వతంత్రులము. మన ప్రేమవాహిని ఉత్తుంగ తరంగములతో ప్రవహించుట కెట్టి యడ్డకట్టలును లేవు. ఇది నీగృహము; నేను నీవాడను.

ఒక్కసంగతిమాత్రము మనము మఱువదగదు. ధనధాన్యములు, యిండ్లు వాకిండ్లు శాశ్వతములు కావు. లక్ష్మి చంచల స్వభావ. ప్రణయలక్ష్మికి సవతి. నేడొకరిని రేపొకరిని చేపట్టును. నేడు మనకు గల యీయైశ్వర్యమును జూచి మోసపోకుము. సిరితళుకు బెళుకుల జూచి మోహించినవారి మోహ మది పోయినవెంటనే పోవును. నీవు నాతో నాదారిద్ర్యమును సహితము ప్రేమించినావు గనుక నీప్రేమ అకుంఠితము, అనంతము. భగవానుడు మనల ననుగ్రహించుగాక!

ఇక నీకు నా నిజవృత్తాంతె మెఱింగిం చెదననని నరసింహరాజు తాను ప్రేమావతి శయనగృహము నదలిపోయిన దాది జరిగిన యావద్వృత్తాంతమును నెఱింగించి శ్రీరాజుగారు తనకు బహుమానముగా నొసంగిన ధనముతోఁ దా నీమేడ కట్టించి తిననియు, మఱునాఁడు గృహప్రవేశమనియు బంధువులు, అత్తగారు, మామగారు, మిత్రులు అందఱు వచ్చెదరనియుఁ జెప్పి ప్రేమావతిని నానందసాగరమున ముంచి తేల్చెను.

౮

శకుంత సంతానముయొక్క కలకలారావములు, కోకిలల "కూ, కూ" ధ్వనులు, కేకముల కేకలు వినఁబడఁ జొచ్చెను. తూర్పు దెసఁ బ్రాభాతరక్తచ్ఛాయ లింపుగ వ్యాపింపఁజొచ్చెను. ఇంట బందుగుల గుబగుబలు, గబగబలు, శిశువుల రోదన ధ్వనులు, తల్లుల బెదరింపులు, బాల బాలికల విలాస చేష్టలు హెచ్చిపోవుచుండెను. ఇంతలోఁ బురోహితుఁడువచ్చి స్నానము చేయుమని తొందరపెట్టఁ జొచ్చెను. నరసింహరాజు మిత్రులతోను, బంధువర్గముతోను ముచ్చటించుచు గచ్చేరిసావడిలోఁ గూర్చుండి యుండెను. ఇంతలో బయట నేదియో బండిచప్పుడయ్యెను. ఎవరో వచ్చుచున్నారని నరసింహరాజు లేచి బయటకువచ్చెను. అంత అత్తగారు, మామగారు వచ్చుటఁజూచి యెదురుగా నేగి నమస్కరించి లోనికిఁ దోడ్కొని వచ్చెను. వెనుకనుండి గోపాలరావు, అప్పలరాజు, శ్రీ రాజాగారి తరఫున వచ్చిన యుద్యోగస్థులు బండ్లు దిగివచ్చిరి.

భజంత్రీలు మంగళతూర్య నినాదంబులు మిన్నుముట్ట మ్రోగించుచుండిరి. నరసింహరాజు, ప్రేమావతియు మంగళస్నానంబుల నాచరించి వచ్చి పీటలపై నాసీనులై యుండిరి. దంపతులిద్దఱుఁ బీతాంబరములు ధరించి పార్వతీ పరమేశ్వరుల మరపించుచుండిరి. అట్టి సమయమున నాసతీపతులఁ జూచి యానందించని వారుగాని, మనఃపూర్వకముగనాశీర్వదింపనివారుగాని యా సభాభవనమున లేరు. అంతటఁ బురోహితుఁడు మంత్రసహితముగ గృహప్రవేశ మహోత్సవమును జరిపించెను. అంతట సదస్సునఁగల విప్రవరులందఱు "ఆయురారోగ్య యశోబలాభివృద్ధిరస్తు, ఆచంద్రతారార్కవంశాభివృద్ధిరస్తు, నిత్యకళ్యాణమస్తు, సర్వేజనా స్సుఖినోభవంతు" అని మంగళాశీర్వచనములు గావించిరి.

సంపూర్ణము

# అంత్య సంప్రార్థన

నాదెళ్ల వెంకట్రావుగారు బి. ఏ.

నిన్ను మదిలోన స్మరియించు నిముసమందె
కుప్పలుగఁ దియ్యనగు నూహ లుప్పతిల్లు
వెలికిఁ దెలుపుదమన్నఁ దబ్బిబ్బులగును
శబ్దజాల విభాగంబు చాలకునికి.

నిన్ను నెడబాసి యెచ్చట నున్నఁగాని
నీదెసకె మానసపుదృష్టి నిలిచియుండు
నెల్లపుడు నొక్కదిక్కె చూపించుచుండు
నావికుల యంత్రపున్ ముల్లనంగ సకియ!

తరుణి! యెటనున్న నీమీఁదితలపు వీడి
యుండనేరదు నిముసంబు మొండిమనసు
చెలఁగి సాయంతనపువేళ చెట్టునీడ
లెంతసాగియు మూలంబు లెడలనట్లు.

కర్మబద్ధుఁడనై గతి గానరాక
యెట్టి దూరప్రదేశాల కేగుచున్న
నీకు నన్ను బిగించి బంధించినట్టి
వలపుగొలుసులు తెగిపోక చెలియ! సాగె.

ప్రేమ నాయెడ సుంత చూపింపవనుచుఁ
గలికి! నామాటఁగలలోనఁ దలఁపవనుచుఁ
దెలిసియును నిన్నె పట్టుక దేవురించు
నాకె ననుఁజూచి యొకసారి నవ్వగలుగు.

ఎంత తేలికగా నన్ను నీసడించి
వైచినను నాకు నీమీఁదివలపు విడదు
కోపమును గల్గ దద్ది నా గొప్పదనమొ?
వెడలుమనఁ, బోక వ్రేలాడు వెఱ్ఱితనమొ?

నిన్ను ధ్యానించునంతటి నిశ్చలముగ
నీశ్వరునినైన మదిని జింతించునెడల
బేలనైనట్టి నాపైని జాలిగలిగె
నతఁడు నీపాటికిఁ బ్రసన్నుఁ డవునుగాదె

కనులుమూసినఁ దెఱచినఁ, గలలలోన
గాలిలోపల గగన మార్గంబులందు
అంతటను నీవె ప్రత్యక్షమగుచు నాకు
మాఱుపనితోఁచనీయవే దారి చెపుమ.

ఎన్నిసారులో నిను వేఁడుకొన్న నాకు
ఎంతనిర్దయురాలవో యెఱుకె కాని
వేఁడుచున్నాను కడసారి వినుము నాదు
నిశ్చయం బింక నీవు మన్నింపకున్న.

దిక్కులను నీదు పేరు ప్రతిధ్వనింపఁ
గొండలకుఁ బోయి నీపైనఁగూర్చినట్టి
ప్రణయగీతాలుగుహాలందుఁ బాడుకొనుచు
దినములనుబుచ్చివిడుతు నా దేహమచట.

# ఇదియేనా పునర్వివాహము?

(మహారాష్ట్రమునుండి)

శ్రీ వాసుదేవరావు

౧

"నే నేయొట్టుఁ బెట్టిన నీవు నమ్మెదువో చెప్పుము?"

"ఏదియు వలదు. నా కంతనమ్మకము లేకపోలేదు. మీయొక్క మాటయే చాలును. శ్రీరాముని శరములు శత్రుసంహార మొనర్పక మరలిరానట్లు మీరుమాట యిచ్చిన నెఱవేర్పక మానరని నాకు గట్టినమ్మకము కలదు. ఆ యాధారముననే నా జీవితకాలముఁ గడపుచున్నాను. అనన్యతపూర్ణములగు మీ యౌదార్యములచేతను, ప్రేమపూరితమగు మీ సహవాసముననూ, మోడుమ్రానులు వెండియు జిగురించుతీరున, నా ప్రాణములు కుదుటఁబడినవి. ననుఁబోలినయనాథబాలిక కిఁక నేమికావలయును? మాతాపితృలకు నోఁచని యనాథబాలిక కేమికావలయును? నన్నెవ్వరైన నాదరింతురా? ప్రేమానురాగములతో నను హృదయమునకుఁ జేర్చుకొందురా? ఆఁకలిచే వాడియుండు నా మొగమును జిలకించి, మనసుకరఁగి, కనికరముతో, ప్రేమతో, చెంతకుఁ దీసికొని 'తల్లీ, నీకాఁకలి యగుచున్నదే?' యని యెవరైన నడుగుదురా? కృపాకటాక్ష వీక్షణముల నాపైఁ బ్రసరింతురా? ఇన్నియేల? ఇవ్విధమగు నేకప్రశ్నలు వారి మస్తిష్కమును నింపివేయదా? [illegible]రా! ఇట్టివారల స్థితులవలె నా స్థితి యుండలేదు.

నేను ననాథనై; అగతికనై; మాతాపితరులకు దూరురాలనై; నన్నే కాకినిఁగా విడచి నా తలిదండ్రులు పరలోకమునకు వెడలిపోయిరి. కాని, నీయెడ, నీపలుకులయెడ నాకు దృఢవిశ్వాసము కలదు. నీయాధారమున నుండఁ గలుగ నేనెట్లు లనాథ నగుదును? నీజీవము నా జీవము నొక్కటే యంటివి; ఆశ వదలకు మంటివి. ఇప్పుడేకదా నీవు "మనోహరీ, యేమైననుసరే, యెంతయైనను సరే, నా తలిదండ్రులతో వైర మొదవిననుసరే, నీనిమిత్తము నేను సకలసంపదలకు దూరగుఁడనైనను సరే, అంతయేల? ఈలోకము నే నేను విడుచుట తటస్థించినను సరే నిన్ను వీడను. వివాహమాడిన నిన్నే యాడుదును. తప్పను" అని యాశ్వాసమొసఁగి సంశయపూర్ణ విచారమగ్నమై యున్న నా డెందమున నమృతవర్షముఁ గురిపించితివి! ఆఁడినమాటఁ దప్పవని నే నెఱుఁగుదును. ఈ మహావాక్యాశ్వాసముపై భారముంచియే యీ యల్పకాలముఁ గడపెదను. ఈ కాలముననె, ఈ యాశలోనే, నాకు మరణము సంభవించినను మహానందముతో స్వీకరించెదను." అని వచింపుచుండ సుశీలా నేత్రద్వయ మశ్రుపూర్ణమై యుండెను.

శ్యామరావు సువిఖ్యాత న్యాయవాది. [illegible] కేవల ముదరనిర్వహణము నిమిత్తమై న్యాయవాదిత్వము స్వీకరించి యుండలేదు. సంసారశకటము నడుపుట కిదియొక సాధనమైనను, నాతనికి లోకోపకార చింతనమే యధికము. అచట నున్న యుద్యోగు లందఱు నీతనిఁ బొగడుచుందురు. ఇతఁ డనావశ్యకముగ నేయుద్యోగముఁ గైకొనఁడు. న్యాయపక్ష మవలంబించును. ఇట్లని యుద్యోగులందఱు నెఱుఁగుదురు. ఈ కారణమున నీతఁడు చేపట్టి వాదించిన తగవెద్దియు నీతనికి విరుద్ధముగాఁ బోవుచుండలేదు. అతఁ డప్పుడప్పుడు మిత్రులతో "నావలన నేనాఁ డసత్యభాషణము, అకృత్యము, కలుగునో, యానాఁటితో నే నీవృత్తికిఁ దిలాంజలి నొసఁగుదు" నని యనుచుండెను. ఈ ప్రతిజ్ఞను గ్రి[illegible] మున నిరూపణముఁ గావించుటకుఁ గాఁబోలు [illegible]

డొక 'కేసు' వచ్చెను. ప్రథమమున నాతఁడా వ్యాజ్యము విషయముఁ దనచే నైనంతవఱకుఁ బూర్తిగా నెఱిఁగి, విషయములు యథార్థములని నమ్మెను. దానిఁ జేపట్టెను; వాదించెను; గెలిచెను. కాని, యనంతర మనతికాలమున కంతయు జ్ఞానమాతనికిఁ దెలిసెను. ఇది కృత్రిమము, అసత్యము! అని యతనికి నిదర్శనపూర్వకముగాఁ దెలిసెను. ఆనాఁటితో నీతఁడు న్యాయవాదిత్వమును వదలివేసెను. ఆయూరును విడచెను. మధుకరుఁడీ శ్యామరావున కేకపుత్రుఁడు. ఇతఁడు కలకత్తాలో "నేషనల్ మెడికల్ కాలేజిలో" విద్యార్జన మొనర్చుచుండెను. పత్నీవిరహవేదన నోర్వలేక సుశీలాజనకుఁడు కాశీపట్టణమునకుఁ బోయి, యటఁ గొంతకాల ముండి, మరలివచ్చునప్పు డాతఁడీ శ్యామరావున్న యూరునకు వచ్చెను. కాని, యామరునాఁడే యాతఁడు—సుశీలాపిత—పరలోకమార్గమును బట్టెను. పాప, మాతఁడు 'కలరా' తగిలి, తనపుత్రిక నగతికఁగ విడిచి మరణించెను. శ్యామరావు దయాళు వగుటచేత నగతికస్థితియందున్న—మాతాపితృవిహీనయై యున్న—సురూపవతియైయున్న—సుశీలకుఁ దనగృహమున నాశ్రయ మిచ్చి పోషించుచుండెను. ఆబాలిక సురూపవతి యగుటయేకాక, నామసార్థకముగ సుశీలవర్తనయు నై యుంటఁ గని, యాతనిపుత్రుఁడు—మధుకరుఁడు—ఈమెయెడఁ బ్రేమముగ్ధుఁ డయ్యెను. ఇఁకఁ దన జీవితమున నీమె తనకు సహచారిణి కావలయునని యతనికిఁ గోరిక కలిగెను. ఈవిధమున మధుకరుఁడీమెను బ్రేమబంధములతోఁ గాఁచుచుండుటఁ దండ్రికి—శ్యామరావునకు—దెలిసి పుత్రునిపై నొకవిధమగు అసూయను వహించెను. అది చాణాక్షుఁడగు మధుకరునకుఁ దెలియక లేదు. కాని, తనకుఁ దెలిసినదని యాతఁడు తండ్రికిఁ దెలియనీయ లేదు. సుశీల శ్యామరావుగారి గృహమున సుఖముగ, సంతోషముగఁ గాలముఁ గడపుచున్నను, దనయగతికస్థితి యప్పుడప్పు డామె హృదయమునఁ బ్రజ్వలించుచుండెను. ఈవిధమున నాబాలికకు, మధుకరుని వియోగము—క్షణకాలవియోగ మైనను—దుస్సహ మగుచుండెను. ఏమియుఁ దోఁపదు. ఆబాలిక ద్వాదశవర్షప్రాయయె; కాని, చూచువారలకుఁ బదునేనువత్సరముల నవయువతివలెఁ గనఁబడుచుండెను. ఇఁక రూపమా, కవికల్పనలతోఁ దులఁదూఁగఁ జేకపోయినను నీమె రెండుమూఁడువందలసుందరులలో సౌందర్యవతియై యుండెనని మాత్రము నిస్సంశయముగఁ జెప్పనగును. ఆమెకు విద్యయు నయోగ్యముగ లభించియుండెను. 'మెడికల్ కాలేజి', సెలవులు ముగియవచ్చినది. మధుకరుఁడిఁకఁ గలకత్తాకు వెడలిపోవువేళ సమీపించుచున్నది. ఈతలంపే యామెను బాధించుచుండెను. హృదయవిదారణ మొనర్చివేయుచుండెను. ఆమెముఖకాంతి మలినమయ్యెను. తన కాతని యెడఁ గలమనోభావము వెలిబుచ్చవలయునని యామె యెదురు చూచుచుండెను. అనేకవిధాలోచనలతోఁ బరిపూర్ణయై యామె సాయంకాల ముద్యానమునఁ గూర్చుండి, యేమేమియో తలపోయుచుండెను. అంత, మధుకరుఁ డచ్చటికిరా నామె గౌరవపూర్వకముగా లేచి నిలిచెను. వదనబింబము ప్రసన్నతఁ దాల్చెను. మధుకరుఁ డొక్కపరి నలువంకలనుజూచి యెవ్వరును లేకుంట నెఱిఁగి మృదుమధురప్రేమపూరిత గంభీరస్వరమున నిట్లనెను. "సుశీలా, వినయశీలా, కూర్చుండుము. నిలుచుండనేల? నీవు నాతండ్రిగారి కాశ్రితవై యున్నను, నీమధుకరుని నీముఖకమలాశ్రితునిఁ జేసియున్నావు. సంధ్యాకాలమునఁ గమలము, భ్రమరము—మధుకరము—అందుఁ జిక్కుకొనినను లేకున్నను, మార్గనిరీక్షణము సేయకయే ముకుళించుచున్నది. కాని, యీసుకుమార కమలమును, నేను—నీహృదయమంచలమధుకరమును—నాచేతులతోఁ గట్టిగఁ బట్టికొనియున్నాను. సుశీలా, మాగృహమున నె శాశ్వతముగ నివాసముండుటకొఱకే పరమేశ్వరుఁడు నిన్నిక్కడఁ గంపియుండవలయునని తోఁచుచున్నది."

సుశీల:—"అనఁగా" అని యచ్చెరువుతోఁ బ్రశ్నించెను.

మధు:—అనఁగా, నిన్ను గాంధర్వవిధిని వివాహమాడు బుద్ధి నాకా పరమేశ్వరుఁ డునయింపఁజేయుటచేతనే, నే నిప్పు డిక్కడకు వచ్చితిని.

సుశీల లజ్జావనతముఖి యయ్యెను.

మధు:—సుశీలా, నినుఁబోలిన సుశీల—సుసాధ్వి—నాకు సహధర్మచారిణియైననె నాజీవితము సుఖసమృద్ధము కాఁగలదు. అనుమానము లేదు.

సుశీల:— కాని, నావంటి దీనను—పరాధీనను వరించుటలో నీకేమాత్రము సుఖమొదవునో?



"సుశీల లజ్జావనతముఖి యయ్యెను"

మధు:—సుశీలా, నాయీ స్వల్పానుభవమువలననె తెలియవచ్చినది. ఈజగమున నాకు సహధర్మచారిణియై, నా జీవయాత్రను సుఖమయమొనర్పఁగలయువతి యెవ్వతెయైననున్నచో అది నీవొక్కరితవని నాకుఁ జక్కఁగఁ దెలియవచ్చినది. నీవు మా యింట నాశ్రితవే. అయినను నాకు స ర్మచారిణి వగుటకుఁ దగుయోగ్యత నీయం దున్న ద కొంతయు ననుమానము లేదు. నిస్సీమమగు నీ మమయసాంగత్యమునఁ గడచిన యీస్వల్ప దినస పు సుఖపూరితములై యుండెను. ఆహా! ఈదినము లెంత సుఖముగఁ గడచెనో నీ వెఱుఁగవు కదా! నిజముగ నా నేను మహాధన్యుఁడ, నదృష్టవంతుడ నగుటవలననే నీవే మాయింటికి నడచివచ్చితివి.

సుశీ:—మధుకరా, నీ సహవాసమున నా కీదినము లెంత సుఖములుగ జరిగిపోయినవో నా కనుభవమె. అనాధబాలిక కిట్లు సుఖముగఁ గాలము గడచుటయు మహాభాగ్యమె — పూర్వసంచిత పుణ్యమె. కాని, మధుకరా, నీవు నన్ను గాంధర్వవిధిని వరింప నిశ్చయించియుంటివి. ఇట్లని మీ నాన్నగారు—నా కాశ్రయదాత—ఎఱిఁగిన నీవు చిక్కులలోఁ జిక్కుదువేమో యని నాకు భయముగు చున్నది.

మధు:—సుశీలా, నీ వాశ్రితవేయైనను నీయందలి సౌశీల్యము సద్గుణములు, గాంచి నాన్నగారు నాకు విరుద్ధముగా వర్తింప రని నమ్మెదను.

అంత నాచెంత వృక్షముల మాటుననుండి యెవరో నడచిపోవుట మధుకరునకు వినవచ్చెను. కాని, చీకటిపడినందున నీపోయినవా రెవ్వరో తెలియ లేదు.

"మధుకరా, నే ననాథను, అగతికను—, నిర్ధనికను. కేవల మొక్క ప్రేమతప్ప మఱొండేదియు నీకు నావలన దొరకదు. ప్రేమయే నా ధనాగారము; ప్రేమయే నా తలిదండ్రులు; ఈ ప్రేమయె నీ చరణసన్నిధిని నే సమర్పించు సర్వస్వము! ఈ ప్రేమతప్ప మఱేది నావలన నీకొదవఁగలదు? కాని, మనయీవివాహము మీనాన్నగారి కసంతుష్టి గలిగించునేమో? నీ వీవిధమునఁబట్టుపట్టిన నిందువలన నీకాయాసము కలుగునేమో? కావున మీనాన్నగారి యభిమతమునకు విరుద్ధముగఁ బ్రవర్తించి, నీవు కష్టపడ నేటికి? ఇప్పటి మన యీగాంధర్వ వివాహవిషయమును మదిలోఁబదిలపఱిచి, మీతండ్రికిఁ గోపము రాకుండ నుండుటకై, నే నాజన్మాంతమును నవివాహితగనే యుండెదను. కాని, నీవుమాత్రము, మీనాన్నగారి కయిష్టమైన దద్దియును జేయవలదు" సుశీలాకంఠము రుద్ధమయ్యెను. మధుకరుఁడామెను జెంతఁ జేరఁదీసికొనెను.

ఇప్పు డట్టిదెద్దియు జరుగనందున మధుకరుఁడాత్మలో సంతోషమందె. తండ్రినోటవెడలిన 'పొమ్మనుమాట వెంటనె యతఁడచ్చోటు వాసిపోయెను. అతఁడటు వెడలిపోయిన పిమ్మట శ్యామరావు సుశీలను మూఁపు నిమురుచు "బిడ్డా, సుశీలా, మీయీ యేకాంతసల్లాపసమయమున నేనాకస్మికముగ వచ్చుటచే నీ కాశ్చర్యము గలిగియుండును. ప్రేమసామ్రాజ్యమున నన్యుఁ డొకఁడు ప్రవేశించుట దుఃఖకరమే. కాని, యీసమయమున నేనచటికి రాకుండునెడల నీ హృదయౌన్నత్యము నా కెప్పటికిని దెలిసియుండదు. కేవలము నాకాగ్రహ మొదవుననుభీతితో నీవాతనియందు ప్రేమను విసర్జించుట కాయత్తయైతివి. నీమూలమున నీ ప్రియతమున కావంతయు నాయాసము కావలదను నుద్దేశముతో నీవాజన్మము నవివాహితవై యుండఁ గృతనిశ్చయవైతివి. నీ హృదయౌన్నత్య మింతకన్న నింకెంతయుండును? సుశీలా, మధుకరుఁడు నీకు వయోజ్యేష్ఠుఁడైనను బాలుఁడె, అవిచారపరుఁడె. కాని నీవు మాత్రము దూరాలోచనాపరురాలవు. నీకు నాయింట నాశ్రయ మిచ్చిననాఁడె నీకేదైన మహోపకారము సేయవలయునని యెంచియుంటిని. అట్లే చేయుదును. తప్పను, కాని నీకు మనసున కెక్కురీతిని జేయఁగలనో లేనో [illegible]యనుమానము. నీవుమాత్రము హతాశవు కాకుము. [illegible] చీకటి పడినది. నేను నీకు హితచింతకుఁడ నని మాత్రము గట్టిగ నమ్ముము." అని వచించి సుశీలతో వెడలిపోయెను.

౨

పైవివరించిన విషయములు జరిగిన మఱునాఁడే మధుకరుఁడు కలకత్తాకు వెడలిపోయెను. అటు బయలుదేరునపుడు 'నేఁ బోయివత్తు'ననియు, మెల్లఁగ 'నాపైఁ బ్రేమ ముండనిమ్ము' అనియు మాత్రమె యామెతోఁ [illegible]టకు వీలుపడినది. కాని రహస్యముగ— నేకాంతస్థ[illegible]—గలిసి, మనఃకవాటములఁ దెఱచి ప్రేమసల్లాప నేయుటకు వేళచిక్కినదికాదు. అతఁడు వెడలిపోయిననాఁటనుండియు నామెలో భేదము కాన్పింప[illegible] ఆనందప్రఫుల్లమైయుండు నామెయాననమండలముపై విచారచ్ఛాయలు దృగ్గోచరములు కాసాగెను. విద్యాభ్యాసము నెంతో కష్టమయ్యెను. తగురీతిఁ బాఠములఁ జదువనేరకపోవుటచే గురువులసమక్షమున నభ్యాసము చేయవలసి వచ్చెను. ఆమె దుర్భరవిరహదుఃఖమునకు లోనై నానాఁటికి నిస్తేజ యగుచుండెను. మధుకరుఁడు తండ్రికి లిఖించినజాబుల నామె యతిశ్రద్ధతో—అతికుతుకముతోఁ జదువును. ఈతెఱఁగంతయు శ్యామరావునకుఁ దెలిసెను. కాని, యిం దేమియు నాతఁడు తనపత్నికిఁ దెలుపలేదు. శ్యామరావు నాతనిపత్ని గంగాబాయియు సుశీల నత్యంతప్రీతి నాదరించుచుండురు. వారు తమకు మధుకరుఁ డొక్కఁడె కొడుకగుటచేతను, వేఱుస్త్రీసంతానము లేకపోవుటచేతను ఈసుశీలనే తమకన్నబిడ్డఁబోలె భావించియుండిరి. అందుపై నీమెయుఁ దలిదండ్రులను వాచియుండెను! గంగాబాయియు భర్తవలెనే దయాస్వభావ; కాని, తమ కేదైన హానికలిగించువిషయమునమాత్ర మామెను బలంపట్టుఁదల. అందునఁ గలుగు కీడుల నోర్చుట కామె కంటగించుచుండును. కావుననె, యీసుశీలా మధుకరుల ప్రేమాలాపము లామెకుఁ దెలుపుటకు శ్యామరావొల్లకుండెను. ఈవిషయమునఁ దనయిష్టముఁ బత్ని యంగీకరింపదని యతనికిఁ దెలిసియుండెను. అట్లుండియు నాతఁ డీబాలిక కేదే నుపకారము సేయవలయునని తలఁచియుండెను. ఈమె కేవిధముగ నుపకరింపఁదగునా యని యతఁడనవరతము నాలోచించుచుండును. గంగాబాయికి సుశీలపైఁ బుత్రికావాత్సల్య ముండెను. కాని, శ్యామరావేదృష్టి నామెను గాంచుచుండెనో, యేయుద్దేశముతో నాబాలికనెక్కుడుగారవమునఁ బ్రేమించుచుండెనో, అది వేఱు. ఈనడుమ సుశీలావర్తన మామెకు విచిత్రముగఁ గన్పట్టుచుండెను. కాని, యావర్తనమందలి దుష్ప్రకారణ మెద్దియో యామెకుఁ దెలియదు. "సుశీల యొద్దానఁ గృశించుచున్నది? దినదినము నధికాధికవివర్ణ [illegible]యుండె నేల? ఎల్లప్పుడు నుదాసీనయై యుండ నేటికి?" అని యెన్నిపర్యాయములైన నీమె భర్తనడిగెను. కాని, శ్యామరావు నిజమైనకారణ మెఱిఁగియుండియు నామెకుఁ దెలుపనిచ్చగింపక యేదియో యుత్తరములిచ్చి సమాధానపఱచుచుండెను. "ఒకవేళఁ దలిదండ్రులు జ్ఞప్తికి వచ్చియుందురేమో! చిరకాలముక్రింద మృతులైన తలిదండ్రులు జ్ఞప్తికివచ్చిన యనాథబాలిక లిట్లేయుందురు." అని యనెను. గంగాబాయి సుశీలనే ప్రత్యక్షముగ నడిగెను. ఆమెకడనుండియు

సమాధానరూపక ప్రత్యుత్తరము లభించినది కాదు. ఈ బాలిక యేదియో వ్యాధిచే బీడితయైయుండి, తెలుపుటకు సంకోచించుచున్నదని భావించి, యామె వెజ్జులఁ బిలిపించి, సుశీల కౌషధోపచారము లొనర్చెను. కాని, మనోరోగమునకు మందీయఁగలవారెవరు? కేవల మౌషధసేవనమువలన లాభము కలుగలేదు సరికదా, మఱియు నధికాధికముగఁ గృశింపసాగెను. మధుకరుఁడు వెడలిపోయిన విచారముమూలముననె యీబాలిక కిట్టిదుర్దశ సంభవించినదని శ్యామరావునకు మాత్రము తెలియును. అతఁడు విచారమగ్నుఁ డయ్యెను. అనుదినము నాతఁ డామెవిషయమున శ్రద్ధ వహించి, విచారము సల్పుచుండును. ఒక్కనాఁ డుదయ మీబాలిక ప్రకాలమునకు లేవకున్నందున, నీతఁ డామెవిషయమున్ గనుఁగొనఁ బడకటింటి కరిగెను. ద్వారము సగముమూసియున్నందున నీతఁ డాసందులోనుండి లోపలికిఁ దొంగిచూచెను. సుశీల తమగృహమున నాశ్రితయైయున్నను, నాతఁ డామె శయ్యాగృహమును దనవైభవమున కుచితముగను యలంకరింపఁ జేసియుండెను. అగదిలో నొక మేజాబల్ల (Table) యుండి దానిచుట్టు నాలుగైదుకుర్చీ లుండెను. పుస్తకములు నితరవస్తువులు నుంచుట కొక 'బీరువా'యుండెను. సుశీల విద్యాభ్యాసమొనర్చుట కొక మైనపువత్తిదీప స్తంభముండెను. ఒకమంచము, దానిపైఁ బరుపు నుండెను. ఇంతయేకాక ఛాయాపటములు కొన్ని యుండెను. వానిలో నొకదానిలో మధుకరుని ఛాయాపట ముండెను అది మధుకరునిబాల్యదశలోఁ దీయఁబడినది. మధ్య నొక బల్లయు, నిరుప్రక్కలఁ దలిదండ్రులుండి, మధుకరుని బల్లపై నిలువఁబెట్టి మాతాపితరు లాతని యిరుకరములను బట్టికొనియుండిరి. ఇవిగాక, దమయంతి, సరస్వతీమొదలగువారిచిత్రము లుండెను. సుశీల బల్లపైనున్న మధుకరుని ఛాయాచిత్రమున కెదుటఁ గూర్చుండియుండుట శ్యామరావునకుఁ గనఁబడెను. ఆబాలికకుడిచేత 'రుక్మిణీస్వయంవరము'ను బట్టికొని, యెడమమోఁచేయి బల్లపై నానించి యరచేతఁ జుబుకముఁబట్టుకొని మధుకరుని ఛాయాచిత్రమువంక నేకదృష్టితోఁ జూచుచుండెను. ఆమెకన్నుల నీరు బల్లపైనున్న పుస్తకముపై టపటపఁబడుచుండెను. చేత రుక్మిణీస్వయంవర పుస్తకమును బట్టియుండెనేకాని, దృష్టియంతయు, ధ్యానమంతయు, నాచిత్తరువునందలి మధుకరుని పైలీనమైయుండెను. శ్యామరావు తలుపుచాటున నిలుచుండి యీవిధమంతయుఁ బరికింపుచుండెను. ఇంతలో నాతనివీనులకు "మధుకరా, మధుకరా, నీదర్శనభాగ్యము నా కేలఁగలిగెనో? ఆదర్శనమే కాకుండిన నిప్పటికి యీదుస్సహవియోగజ్వాలలలోఁ బడి దగ్ధను గాకుందును గదా! నీచరణసన్నిధికి నే దూరమైనందున నా కెంతటి దుఃఖ మగుచున్నదో? ఆహా; యీవియోగదుఃఖము నేనెట్లు భరింపగలను! అనేకమార్గముల నామనస్సును శాంతిపఱుపఁ బ్రయత్నించితిని; కాని, యేమిచేసినను, ఎంతో రయారడించుకొన్నను, ప్రయోజనమే లేకపోవుచున్నది కదా! నే నేమిచేయఁగలను? ఎంత మఱతునన్నను మఱపురాకలుగదే! ఈ'రుక్మిణీస్వయంవరము'ను జదువుటవలన నామనోయాతన కొంచెవడునేమో యని యెంచితిని. కాని, మధుకరా, యీపుస్తకపఠనముమూలమున నావిరహయాతన తన యధికమే యగుచున్నదే! మధుకరుని— కమలము లచుట్టుబరిభ్రమించు భ్రమరము— మధుకరము— వర్ణము నలుపు. నావలె రుక్మిణీరమణి ప్రేమకొఱకుఁబరితపించు శ్రీకృష్ణుని వర్ణము నలుపు! ఈకారణమున నామనసు నెంతో సమాధాన మొనర్చుకొన యత్నించినను నిష్ఫలమే! మధుకరా! హా, మధుకరా!" అనువాక్యములు వినఁబడెను.

సుశీల కడపటివాక్యములు దుఃఖగద్గదస్వరముతోఁ బలికెను. అంత దుఃఖము దుస్సహమై బల్లపై ముఖమిడి నిశ్శబ్దముగా రోదింపసాగెను. శ్యామరావు చప్పుడుగాకుండ తలుపుఁ దెఱచెను. అడుగులసవ్వడియుఁ గాకుండ యాబాలికను సమీపించివీఁపునఁజేయియిడెను. సుశీల యులికిపడి మొగముఁ బైకెత్తిచూచెను. అదే శ్యామరావు నిలిచియుండెను. అంత నామె గౌరవపురస్సరముగా లేచి నిలుచుండి యథోవదన యయ్యెను. శ్యామరావాబిడ్డను జెంతకుఁజేరఁదీసి బిగ్గఁ గవుంగిలించి మృదుమధురాలాపము లిట్లని యనెను. "బిడ్డా, సుశీల! ఏడ్చుచుంటి వేటికి? తలనొప్పుచున్నదా? ఇంక నేదైన బాధయగుచున్న లేక నిన్నెవరైన నేమే ననిరా? సంకోచింపక చెప్పు తల్లీ! ఇప్పటికి నాలుగైదుమాసములనుండియు నీ కాంతి నానాఁటికి వివర్ణమగుచున్నది. దినదినము నీ ధికముగ నెలవెలఁబాఱుచున్నది. చిన్ననాఁటి ముచ్చ లేవైన నీకిపుడు జ్ఞప్తికి వచ్చుచున్నవా? వానిఁ దల విచారించుచున్నావా? చెప్పుమమ్మా. నేను నీకుఁబో

డనుగానా? తండ్రినిఁగానా? దాఁచనేటికి? యథార్థము నాకు దెలుపుము. భయపడకుము."

"ఎవరికిఁ దెలియును? చాలసేపటినుండియు నిట్లే యేడ్చుచున్నది. కారణమడిగినఁ జెప్పదు."



"మధుకరా! హా మధుకరా!"

ఈవాక్యములవలన సుశీలాహృదయ మించుక ధైర్యముఁ దాల్చెను. కాని, యీప్రశ్నల కేమిసమాధాన మీయఁ నగును? శ్యామరావు మరల నాప్రశ్న లే యడిగెను. "ఏమియు లేదు, బాబా, మీరు నన్ను మీకడుపునఁబుట్టిన బిడ్డకన్న నధికముగఁ బ్రేమించుచున్నారు. శ్రీమంతుల పిల్లలకంటె నే నధికసుఖసంతోషములఁ గాలముఁగడపు చున్నాను. నే నధికసుఖనైయే యున్నాను. ఎట్టిలోప ము, నెట్టివిచారమును నాకులేదు" అని సుశీల వినమ్రతతోఁ బలికెను.

"అట్లయిన నేడ్చుచుంటి వేటికి?"

"ఏమియులేదు. ఊరకే—" అనుచుండ గంగాబాయి యాగదిలోఁ బ్రవేశించి కన్నీరుఁ గార్చుచున్న యామె నధికప్రేమతో బిగ్గఁ గౌఁగిలించి యున్న తనభర్తఁ గాంచి "ఏమి? ఏడ్చుట కీబాలకేమైనది?" అని ప్రశ్నించెను.

గంగాబాయి సుశీలను దనచెంతకుఁ జేర్చికొని, ప్రేమార్ద్రస్వరమున "బిడ్డా, యేమగుచున్నదే తల్లీ! నీ వేమి కష్టపడుచున్నావే! నాతోనైనఁ జెప్పవా?" అని యడిగెను.

సుశీలకుఁ బలుకుట కవకాశ మీయకయె శ్యామరా విట్లనెను. "తలిదండ్రులు జ్ఞప్తికివచ్చిరేమో! సుశీలా, పొమ్ము, ముఖప్రక్షాళనము నేసి 'టీ' (తేనీరు) పుచ్చుకొనుము. రమ్ము ఇఁక నేడ్వకు!" అని యోదార్చి బయటికి వెడలిపోయెను.

గంగాబాయికి సుశీలపై నత్యంతానురాగముండె నని మున్నె వచింపఁబడియున్నది. సుశీలదుఃఖించుచుండఁ గని యామెకుఁ గష్టమయ్యెను. శ్యామరావు నీవిషయమై రోదనకారణమునుగూర్చి ప్రశ్నించెను. నేఁటివఱకును శ్యామరా వీబాలికావిషయములు కొన్ని గుప్తముగ నుంచి యుండెను. భార్యకుఁ దెలిపియుండలేదు. కాని, నేఁ

దారహాస్యములు వెల్లడిపఱుపవలసి వచ్చినది. "నేఁడు కాకున్న రేపైన బహిర్గతమగునుగదా? శ్యామరావామెకు యథార్థవృత్తాంతము నివేదించెను. అంతనామె "ఏమి! మధుకరుఁడు ప్రేమించినాఁడా! సుశీలనే భార్యగాఁజేసికొన నిశ్చయించినాఁడా!" అని యాశ్చర్యముతోననెను.

"అవును. మొన్న సెలవులలో మధుకరుఁ డిక్కడకు వచ్చియుండ వెనుకఁదోఁటలో వాఁడు సుశీలతోఁ బ్రేమాలాపము లాడుచుండ నే వింటిని. నిజముఁ బరికింప సుశీల యనాథయె. కాని యాబాలికాసద్గుణవర్తనములఁ జూడ నామెను మన కోడలినిగాఁ జేసికొనుటయందన్యాయమేమియు లేదని నాకుఁ దోఁచినది. చిన్నపిల్లయే యైనను బుద్ధిమంతురాలు; ఉదారహృదయ. గొప్పవంగడములోఁ బుట్టినవారికిఁగల లక్షణములన్నియు నీమెయందున్నవి."

"ఏ దెట్లయినను మన మధుకరునకు భార్యయగుటకుమాత్రము తగినదికాదు. ఇంత నిజము. మన కీబాలికపైఁ బ్రేమమున్నది. నాకన్నబిడ్డరీతిగఁ బోషించుచున్నాను. కాని, యెటుసూచినను దిక్కులేని యీపిల్లను మాత్రము నాకుఁ గోడలిఁగాఁ జేసికొనుట కిష్టములేదు. మధుకరునకు నీమెనిచ్చి పెండ్లిచేయను."

ఈమె పట్టుదలయు, నభిమానస్వభావము శ్యామరావునకుఁ జక్కఁగాఁ దెలియును. ఈ సంబంధమున కీమె యంగీకరింపదని యాతనికి రూఢిగఁ దెలిసియుండుటచేతనే యింతవఱకు నీ ప్రేమజన రహస్యము నాతఁడెఱిగియుండియు నామెకుఁ దెలిపియుండలేదు. ఎట్లయినను సరియె, యించుక హెచ్చరించిచూచిన మేలని తలఁచి యతఁ డీనాఁడు అయిదాఱుమాసములనుండియు దాఁచియుంచిన రహస్యము నామెకుఁ దెలిపెను. అతని యెప్పటియనుభవమె యీనాఁడును గలిగెను. సుశీలా పక్ష మవలంబించి శ్యామరావు భార్యమనసున కెక్కునట్లు పరివిధముల వర్ణించి, సాదృశ్యములను జూపి, నొక్కిచెప్పెను. కాని యేమిలాభము? శ్యామరావోడిపోయెను!

## 3

ఆనాఁ డంతయు సుశీల, భోజనమునకుఁ దప్ప, పడకటిల్లు విడిచి బయటికి రాలేదు. శ్యామరావామె దేహారోగ్యము విషయమై యధిక శ్రద్ధ వహించియుండెను. కాని, నేఁడాతఁ డెప్పటివలె నుండలేదు. విచారావృతుఁడైయుండెను. ఆతఁడు స్వయముగనే డాక్టరును బిలిచికొనివచ్చి యౌషధముల నిప్పించెను. కాని,యామె కౌషధోపచారము లన్నియు సర్వపదార్థములును ఆయౌషధమువలెనే చేఁదగుచుండెను. గంగాబాయిమాత్ర మెప్పటి శ్రద్ధ వహించలేదు. సాయంకాలమున శ్యామరావా బాలికకుఁ దానే స్వయముగ భోజనమిడెను. రాత్రియౌషధమిచ్చి పరుండఁబోయెను. అందఱును వెడలిపోయి తానేకతముగ నుంటఁగని సుశీల గదితలుపు మూసికొనెను.

మఱునాఁడు శ్యామరావు నిద్దురలేచుట కొంత యాలస్యమయ్యెను. గంగాబాయి లేచి, కాల్యకృత్యములఁ దీర్చి సుశీల దేహస్థితియెట్లున్నదో చూతమని యామె శయనాగారమునఁ బ్రవేశించెను. "ఏమిది, సుశీల లేదే!" అన్నికడలను వెదకిచూచెను. అచట నున్నవన్నియు యథాస్థానముల నుండెను. కాని, సుశీల మాత్రమె కానరాదయ్యెను. ఆమె దిగులువడి గుండియలు దడదడఁ గొట్టుకొనఁ గాళ్లు దొట్రుపడ, వడివడిగఁబోయి మగని లేపి 'సుశీలలే'దని చెప్పెను. ఆతఁడు నదరిపడి లేచి, విషణ్ణ హృదయముతో, ఖిన్నవదనముతో, ద్రుతగమనముతో నాగదిలోని కరిగిచూచెను. ఔను, నిజమే! అందలి యన్ని వస్తువులు నున్నచోటనే యున్నవి. ఆమధుకరుని ఛాయాచిత్ర మొక్కటే కనఁబడుటలేదు. మంచముపైన బరుపు చుట్టిపెట్టియున్నది. వస్త్రవాహకముపై నామె కుబుస మొకటి యగ్లేయుండెను. గంగాబాయి ఆ కుబుసముఁ జేతఁదీసికొని జేబులు తడివిచూచెను. అందొక దానిలో నొక కాగితపుమడఁత దొరికెను. శ్యామరావా కాగితమునుగైకొని యత్యాత్రముతో, కంపితకరములతో, నానావిధాలోచనాపూర్ణహృదయముతో మడఁతను విప్పిచూచెను. అందిట్లు లిఖింపఁబడియున్నది :

"అనేక నమస్కారములు;

నేను వ్యాధిపీడితనై యుంటిని. నాయీ వ్యాధిని గుదుర్చుటకు డాక్టరు లశక్తులు. అట్లుండ, మీ కనఘసర

ముగ్ధ నామూలమున నా ఉపాసమగుట నేఁ జూడఁజాలక, మీకాయాస పెట్టుట కిచ్చగింపక ఇలువీడి వెడలిపోవు చున్నాను. మీరు నాకొనర్చిన మహోపకారమును మీ రిరువురు నన్నుఁ బెంచి యింతదానినిఁజేసిన మీఋణమును నే నెన్నఁటికిని మరువను. నే నాజన్మము మీయిద్దఱయెడఁ నత్యంతకృతజ్ఞనై యుందును. ఇఁక నాకొఱకు మీరు వెదకుటకుఁ బ్రయాసపడ నక్కర లేదు.

ఒక వేళఁ బెంచిన మమతవీడలేక మీరు నను వెదకినను లాభ ముండదని తలఁచెదను.

దీన

సుశీల."

శ్యామరా వీజాబుఁజదివి భార్యచేతి కిచ్చెను. ఆమెయు దానిఁ జదువుకొని విస్మయ విమూఢయై పోయెను. "ఆహా! యెంతపనికి సాహసించినది!"

"ఇదంతయుఁ బ్రేమప్రభావమే!"

"అనఁగా?"

"అనఁగా, నేమున్నది? నిన్న నుదయము మనసంభాషణ నీబాలిక వినియుండఁబోలును."

"అంతమాత్రమునకె యిలువీడి పోవలయునా?"

"ఇంకేమి చేయవలయును? తన కోరినది దుర్లభమని తెలిసినది. తనకు మధుకరునితోడి సహవాసము లభింపదని యెఱిఁగినది. అందున హతాశయై మనల శాశ్వతముగనె విడిచిపోయినది. గదిలోనకు వచ్చిచూడ మధుకరుని ఛాయాచిత్రము నాకుఁ గనఁబడలేదు. అప్పుడే నా కనుమానము కలిగినది. నీయభిప్రాయ మెట్టిదైన నేమి? కాని, సుశీలవంటి సుశీలయు సువిచారయు; నుదార హృదయయు, నగు తరుణి యింకొక్కతె మధుకరునకు లభింపదు. ఆబిడ్డ యెచటికిఁ బోయినదో ఏమైనదో తప్పక వెదకవలయును. ఆమె యెచటికో చాలదూరము పోయి యుండవచ్చునని యీజాబువలనఁ దెల్లమగుచున్నది.

అనంతర మీయిద్దఱు నానావిధములుగ నూహలపై నూహలు చేయసాగిరి. ఇదమిత్థమని నిర్ణయింపలేక పోయిరి. ఆపైను నెమకష్టమై యుండెదుఁ దమకుఁగల మిత్రులకు వార్తల నంపిరి.

౪

సుశీల శ్యామరావుగృహమును, ఆశ్రయమును ద్యజించి వెడలిపోయి యైదుసంవత్సరములు గడచినవి. శ్యామరా వింకను నామెను వెదకుచునే యుండెను. ఎందు నామెజాడ తెలియలేదు. ముంబాపురి, పునహా, బరోడా మొదలగుసంస్థానములలోఁ దనకుఁగల మిత్రుల కందఱకు జాబులువ్రాసెను. ఆమెరూప రేఖలవివరమును "పోలీసు" వారికిఁ దెలిపెను. ఎన్ని చేసినను, ఎంత శోధించినను నామె పోకడ తెలియదయ్యెను. తుదకు శ్యామరావు ప్రాణము విసిగి యాశోధనకార్యము నాపివేసెను. కాని, యైదువత్సరములు గడచినను ఇంకను నాతఁడామె నందందు—పూర్వమువలె నదేపనిగఁ గాకున్నను—వెదకించుచుండెను. ఈయవకాశమున విశేషము లేవియుఁ గల్గలేదు; కాని, ముఖ్యముగా నొక్కటి చెప్పవలసియున్నది. మధుకరుఁ డాజన్మము నవివాహితుఁడై యుండఁ బ్రతిజ్ఞ వహించెను.

సుశీల గృహత్యాగమొనర్చి పోయినపిమ్మట మధుకరుఁ డొక్కసారియే తన తలిదండ్రులను సందర్శించి యుండెను. తిరిగి యింటికి రాలేదు. ఇంతకాలము నాతఁడింటికి రానికారణ మరయలేక మాతాపితరు లత్యంత ఖిన్నులైరి. జాబులపై జాబులను వ్రాసిరి. కాని, యతఁ డొక్క జాబుమాత్రమె వ్రాసెను. అందు "నేను స్వతంత్రముగా నేవృత్తిలోనైనఁ జొచ్చి ధనార్జనము చేయునంతవఱకును మీదర్శనమునకు రాను." ఇంతే వ్రాసియుండెను. అటుపిమ్మట జాబులు లేవు. శ్యామరావు నావిషయమునఁ బుత్త్రున కధికముగ వ్రాయలేదు.

మధుకరుని వైద్యవిద్యార్జనము సమాప్తియై "నేషనల్ మెడికల్ కాలేజీ"ని విడిచి ముంబాపురిలో నొకవైద్యశాలలో నుద్యోగము సంపాదించెను. త్వరలోనె—రెండుమూఁడు సంవత్సరములలోనె— స్వతంత్రముగ వైద్యశాల నేర్పరచి, తానందుఁ బ్రధానాధికారి యయ్యెను. కొలఁదికాలముననె యతనిఖ్యాతి యెల్లకడల వ్యాపించెను. ధనము మిక్కుటముగ లభించుచుండెను. బీదల కుచితముగ నౌషధోపచారము లొనర్చుటయె నిజధర్మలక్షణమని యెఱిఁగి, తనయౌషధాలయముముందఱఁ బెద్దయక్కరములలో "బీదల కుచితముగ మందీయఁబడును" అని వ్రాయిం

చెను. అనేకు లిం దుపచారము లందుచుండిరి. అతిశీఘ్ర
కాలముననే యా యౌషధాలయము పేరు వన్నెకెక్కెను.
అందలి డాక్టర్ మనమోహనరాయిగారి పేరును విఖ్యా
తము కాసాగెను.

మధుకరుఁడు కలకత్తా వీడినప్పటినుండియు నిజ
నామమును మార్చి 'మనమోహనరాయ్' అని యిడికొనెను.
నిరాశ్రితులైన రోగులకొఱ కాశ్రమము, నాయౌషధాల
యమునను యేర్పరచెను. ఆకారణమున నీతనియౌషధా
లయమున రోగు లెడతెగకుండురు. ఇట్లుండ నొకనాఁడు
ముప్పదిముప్పది రెండేండ్లు వయసుగల గృహస్థుఁడొకఁడు
మనమోహనరాయ్‌గారి చెంత కరుదెంచి, తనయింట నొక
రోగినిఁ జూడ విచ్చేయఁ బ్రార్థించెను. అల్పకాలముననె
డాక్టర్ మనమోహనరాయ్ గిరిగాముళోని యొకగొప్ప
బంగళాయొద్ద బండిదిగి లోనకుఁ బ్రవేశించెను. రోగిని
బరీక్షించెను. ఆరోగిని బరీక్షించినపిమ్మట నతఁడీరోగి
విషయము--వృత్తాంతము--నడిగెను. మాధవరావు--ఆ గృ
హస్థుఁడు--రోగివృత్తాంత మిట్లు చెప్పెను: "ఈమె నాపినతల్లి
కూఁతురు; నాకుఁ జెల్లెలు. చాలకాలమునకు మేము కలిసి
కొంటిమి. మాయింట నుండుమని నేనెంతో బ్రతిమాలినఁ
దున కంగీకరించినది. అప్పటికే కొంచెము రోగము
ముదురుచుండఁబోలును! నానాటికి నావ్యాధి యధికమై
తుదకు లేవలేక మంచముఁ బట్టెను. ఎంద రెందరో
డాక్టరులకుఁ జూపితిని. ఆయుర్వేద భిషజ్యులకు జూపి
తిని. ఎన్నెన్నియో మందుల నిప్పించితిని. కాని సుచిహ్న
ములు గానరాలేదు. అటుపిమ్మట మీ పేరును ఖ్యాతియు
వింటిని. మీయొద్దకుఁ బరుగిడివచ్చితిని. నాయీ చెల్లిని
మీచేతి కప్పగించుచున్నాను. ఏవిధముననైన నీబాలిక
రోగవిముక్తయగుటయే నాకుఁ గావలసినది. ఎంత వ్యయ
మునకైనను వెనుదీయను. నాయందుఁ గృపయుంపుఁడు.
నామనవి నాలించి మంచిమందు లిచ్చి నాసోదరిని బ్రతి
కింపుఁడు. మీయిష్టము ఏమిచేసినను సరియే; నాసోద
రిని బ్రతికింపుఁడు" అని యనుచుండ మాధవరావునకుఁ
గంఠము రుద్ధమయ్యెను. కన్నులబాష్పములు కారు
చుండెను. పెదవులు కంపించుచుండెను. ముఖము మ్లానమై
యుండెను.

"ఈమెకు వివాహమైనదా?"

"అదేమియు నాకంతగాఁ దెలియదు. కాని,
వివాహమైనదనియు నిప్పుడు తాను బాలవితంతు వనియు
మాత్రమె చెప్పినది."

"ఈమె తలిదండ్రు లెచటనున్నారు?"

"వారు నీమె పసిబాలగ నున్నప్పుడే కాలగతిఁ
జెందిరి."

"అనంతర మీమె యెక్కడ --ఎవరిచెంత-- నుండి
నదో?"

"అదియు నాకుఁ దెలియదు. నిరుఁడు నేను మా
తల్లితోఁ బునహానగరమునకు 'చతరసింగి' మహోత్సవము
నకుఁ బోయియుంటిని. అప్పు డీమెయు నాజాతరకు
వచ్చియుండెను. మాయమ్మ యీమెను గుర్తించి, చెంత
కుఁ బిలిచి, సకలముఁ దెలిసికొనెను. 'నే ననాథబాలికా
గృహమున నున్నా'నని చెప్పినది. మాయమ్మ యెంతయో
బ్రతిమాలఁగాఁ దుదకు మాయింటికి వచ్చుటకంగీకరించెను.
కాని, వచ్చిననాఁటనుండియు వ్యాధిపీడితయే!"

డాక్టరు మనమోహనరాయి రూపము రూపాంత
రమందెను. అతఁడు రోగిశిరోగ్రపార్శ్వమునఁ గూర్చుండి
యామెముఖలక్షణములను దదేకదృష్టితోఁ జూచెను.
సారూప్య మెందుకుఁ జేఁగాఁబోలు, జేబులోనుండి యొక
చిన్నకరండకము (డబ్బి) తీసి యందున్న దేనినో చూ
చుచు, నీబాలికాముఖమును బోల్చెను. అనంతర మేమి
తెలిసెనో, ఏమిగుర్తించెనో, కాని, తనమనమున "ఔను;
సంశయము లేదు! చిక్కినది" అని యనుకొనెను.

"సరే! రోగ మంతతీవ్రము కాదు. మీ రణుమా
త్రము భయమందఁ బనిలేదు. నాశక్తికొలఁదిఁ బ్రయ
త్నించి మీసోదరిని బాగుపఱతును" అని ధైర్యముఁ గొల్పి
వెడలిపోయెను.

అదిమొదలు డాక్టరనుదినము రెండుమూఁడుసారు
లీయింటి కరుదెంచి యారోగినిఁ జూచిపోవుచుండెను.
ఒకనాఁ డతఁడు మాధవరావుతో "ఈమె యిచటనుండుట
మూలమున నధికశ్రద్ధవహించుట కష్టము. మా యౌష
ధాలయమునఁ గొంతకాల మీమె నుంచిన బాగుండునని
తోఁచుచున్నది. అచట పరిచారికలున్నారు. ఇక్కడ
కన్న నధికపర్యాయములకక్కడఁ జూడ నవకాశము

లభించును. ఎడతెగని సేవనేసిన నీమె శీఘ్రకాలమున నె లేచి తిరుగఁగలదు." అని వచింపఁ దల్లియనుమతిని వడసి మాధవరావు పీడ్రోగి నౌషధశాల కంప నిశ్చయించెను.

"నే నడుగునది నీయొద్దను—ఇంక నెంతటి పేదవారి యొద్దనైనను—ఉన్నదియే. ఇంతటి పేదరికమున నైతము నీ వీయఁగలయట్టిదె."

"అట్లయ్యేనేని నేను మహానందముతో సమర్పించెదను. అ దేదియో తెలుపుడు"

"నీతోటి పునర్వివాహమున కనుజ్ఞ!"

సుశీల తటాలున లేచి కూర్చుండెను. వదనమండలమున దుఃఖచ్ఛాయ లుదయించెను; కన్ను లశ్రుజలధారాపాతము సేయసాఁగెను. నోట మాట రాదయ్యెను! ఈతెఱఁగెఱిఁగి డాక్టరిట్లనెను.

"నా పలుకులవలన నీకు దుఃఖ మొదవినదియా? నే నడిగినదాని నిచ్చుటకు నీకు బరువుగ నున్నదా? కష్టమా?"

"డాక్టరు గారూ, మీ రడిగినదాని నే నిదివరలోనె యొకరి కర్పించివేసి యున్నాను. అ దిప్పుడు నా యధీనమున లేదు. ఆవంతయు నాయొద్ద మిగిలియుండలేదు. మీపాదములకు మ్రొక్కెదను. అదిమాత్రము నన్నడుగవలదు".



"ఔను; సంశయము లేదు! చిక్కినది."

ఔషధశాలలోఁ జేరినప్పటినుండియు సుశీలకుఁ గ్రమముగ నిమ్మళించుచుండెను. ఆమెమాఁదు పండిన కొలఁది మనడాక్టరు నానందితుఁ డగుచుండెను. ఒక్కనాఁటిసాయంకాలము డాక్టర్ మనమోహనరా యామెను బరీక్షించుచుండ నామె దీనవదనయై, క్షీణస్వరమున "డాక్టరుగారు, నాకు నిమ్మళించునా? నాగుండెలు నొచ్చుచున్నవి." అని యనెను.

"గుండెలు త్వరలోనె బాగుపడును. నీవును త్వరలోనె లేచి తిరుగఁగలవు. నీకేమియు భయము లేదు. సరే కాని నిన్నీరోగమునుండి పూర్తిగా విముక్తను గావించితినేని నాకే 'మినాం' మిచ్చెదవో?"

"నేఁగడుఁ బేదను. 'నాయొద్ద' మీకట్టియినాము—"

"అట్లయిన నా కింకొం డేదియు వలదు. నాక దియే కావలయును. ఈఁ దలఁచిన దాని నిమ్ము. ఈదానము నేను నిన్నడిగుటయు నీవీయకుండుటయుఁ బవిత్రమగు ప్రేమ నెడమకాలఁ దన్నుటయే యగును. నేనును నీవలె నే, నాబాల్యసహచారిణీప్రేమకు దూరగుఁడనై యున్న యభాగ్యుఁడనె. కాని, యేనాఁడు నీముఖేందుబింబమును జూచితినో యానాఁడె నాయాబాల్యసఖి నాకట్టెదుట నిలిచినట్లయినది. నాకాస్మృతి విస్మృతిఁ గలిగించుట కెవరైన సమర్థులైన నది నీవెయని నామనసు నాకు బోధింప నాజన్మము నవివాహితుఁడనై యుండ నేఁజేసికొన్న ప్రతిజ్ఞయు మఱచితిని. నీతోఁ బునర్వివాహితుఁడ నగు

నపేక్షను బ్రదర్శించితిని. నాయాశను ఫలింపఁజేయుట నీ యధీనమున నున్నది. కాని; నే నడిగినదానము- ఎవరి కర్పించితివి? చెప్ప సంకోచము లేకున్నఁ జెప్పుము."

"నాకా పేరు నుచ్చరించుటకుఁ గష్టముగనున్నది- కాని, యాప్రియమూర్తి నాహృదయ పేటికలో భద్రముగా నున్నది. ఆ పవిత్రనామమును జపించుచుండుటే నాకుఁ బరమపవిత్రమైన కర్తవ్యము. డాక్టరుగారు, నే నింతే నుడివెదను. నేను నాబాల్యముననె మాతాపితృ విహీనవైతిని. అనంతర మొకయుదారపురుషుని యాశ్రయము నాకు లభించినది. ఆ యాశ్రయముననె నాకు నాప్రియమూర్తి లభించెను. కాని, యాయాశ్రయము వలన నాకు సుఖమొదవఁ జాలదనియు, నాప్రియమూర్తి నాకు లభింపదనియు, నాకుఁ దోఁచెను. కావున మరల నే నాశ్రయవిరహితనైతిని. నాకిఁకఁ బ్రియమనునది యీ జగమున మఱేమియు లేదని నామనసునకుఁ దోఁచినది. ఆజన్మమును గుమారికఁగనె యుండ నిశ్చయించితిని. అనాథబాలికాశ్రమమునకుఁ ద్రోవఁబట్టితిని. ఈ విరహవేదన నాపై నాచిన్నతనముననె పడుటచే——ఈవిరహవేదన—— ఈయసనసుఖవహృదయమును దగ్ధమొనర్చుచుండ నాగుండియలు చెదరెను. ఆనాఁటనుండియు నేను మృత్యువును గోరుచునుంటిని."

మనమోహనరాయి రూపము ప్రఫుల్లమయ్యెను. ఆతని ముఖమండలముపై నానందకాంతు లుదయించెను. తన బాల్యసహచారిణి యీమెయే యని గురుతించి యతఁడీకాంతను దదేకదృష్టితోఁ జూచెను. "వచింపుము-చెప్పుము- నీప్రియమూర్తినామ మెద్దియో? వినుట కే నత్యంతము గుతూహలుఁడనై యున్నాను. చెప్పుము?"

"ఆతనినామము నాపెదవులు దాఁటి రానీయ వలదని నిశ్చయించితిని. ఆపేరు నుచ్చరించుటవలన నాకు దుఃఖమగును."

"నీకు దుఃఖమొదవించు నేకృత్యము నేనుజేయను. పోనిమ్ము- ఆనీప్రియమూర్తి నామోచ్చారణమువలన నీకు దుఃఖమొదవు నెడలఁ బోనిమ్ము- నీపేరైనఁ జెప్పుదువా? నిన్ను నేనిచ్చటికిఁ దోడితెచ్చితిని. కాని, మాధవరావును నీ పేరడుగ మఱచితిని. కాఁబట్టి నాపైఁ గృపయుంచి నీపేరుఁ జెప్పుము."

"నాయట్టి యభాగినీ నామమును వినుటవలన మీ కేట్టిలాభ మొదవఁగలదు? కాని, విన నింత యాతురపడుచున్నారు. కావునఁ జెప్పెదను. ఈయభాగినిని 'సుశీల' యందురు."

మన మోహనుఁడు తటాలున లేచి యాసుశీలను గాఢముగఁ గౌఁగిలించెను. ఆమె బుగ్గలపైఁ బ్రేమ ముద్రికలను ముద్రించెను. ఈతని యీ యనుచితాచరణమునకు, అసభ్యకృత్యమునకు సుశీలకు మిగులఁగోపము వచ్చెను. ఆతని కరమును బలిమిని విడలించి విసరివైచి దవ్వులఁ దొలఁగెను. రోషకషాయితలోచనయై, రౌద్రాకారము దాల్చి గంభీరస్వర



"ఇదియేమి న్యాయము? డాక్టరుగారూ!......ఇట్టి యకృత్యమునకు మీ మన సెట్లు సమ్మతించెను?"

మున "ఇది యేమి న్యాయము! డాక్టరుగారూ, మీవంటి గొప్పవారి కిట్టి యనాలోచితకృత్యము-నీచ వర్తనము-తగునా? గౌరవభంగము కాదా? ఇట్టి యకృత్యము నేయుటకు మీమన సెట్లు సమ్మతించెను?" అని గర్జించెను.

"సుశీలా, నీయీచరితమంతయు విని నేను నిన్నే వివాహమాడవలయునని నిశ్చయించియున్నాను. కావుననె నీకిప్పుడీ ప్రేమాలింగన మొసగితిని."

"డాక్టరుగారూ; నాపైఁ గృపవహింపుఁడు-కాని నాపైని ప్రేమ వీడుఁడు. అట్టియాసయు మీకు వలదు. నేను మిమ్ముఁ బ్రేమింపఁజాలను. నా హృదయము పరాధీనము- మధుకరు నధీనము! అచ్చోట నితరులకు స్థలము దొరకదు." అని కన్నీరుగార దీనముగఁ బ్రార్థించెను.

"అట్టిచో నీయా ప్రియమధుకరుఁడ నేనే సుమా!"

"ఏమి! మీరా! మీరేనా? మీరు డాక్టరు మన మోహనరాయిగారు కారా?"

"అవును; డాక్టరు మనమోహనరాయయు నీ ప్రియమధుకరుఁడు నొక్కఁడె. నీప్రేమకొఱకు నేను నామము మార్చితిని. కాని, నీకు నాపైఁ బ్రేమ కలదో లేదో యని పరీక్షించుటకొఱకే తొలుత నిన్నుఁ బునర్వివాహమాడుదునని హెచ్చరించితిని. ఇప్పుడు పరీక్షలో నుత్తీర్ణవైతివి. ఆనాఁడు నిను జూచుటకై మాధవరావు నింటికి నేను వచ్చినపుడె నిను గురితించితిని. కాని, నిజమో కాదోయని సంశయించితిని. పిమ్మట నాజేబులో నుండి నీఛాయాపటముఁదీసి, పరిశీలించితిని; గుఱుతించితిని; నిక్కువ మెఱిఁగితిని. నీవె నా బాల్యసహచారిణివని తెలిసితిని. పిమ్మట నస్వల్పకాల సహవాసమున నది రూఢియయ్యెను. నీవు నాకొదవకుండినమాత్రము నే నా జన్మము నీనామజపము సేయుచుఁ జీవితశేషముఁ గడుపుచు నుండియుందును."

ఈమాటలు విని సుశీల మధుకరుని గాఢాలింగన మొనర్చుకొనెను. దుఃఖవేగ మొకింత తగ్గినవెనుక నిద్దఱుఁ దమతమ చరిత్రములఁ జెప్పికొనిరి. అల్పకాలముననె సుశీలకుఁ బూర్ణారోగ్యము కలిగెను.

మధుకరుఁడు కలకత్తా విడిచినదాదిగం దానున్నచోటును, దనయునికియుఁ దల్లిదండ్రులకుఁ దెలిపియుండలేదు. అతఁ డెల్లప్పుడును సుశీలావియోగదుఃఖసాగరమున మునిఁగియుండెను. కాని, యీకారణమువలనఁ దన క్షేమ సమాచారము తలిదండ్రులకుఁ దెలియకుండుట కితని కిష్టము కాలేదు. కావునఁ దనమిత్రుల మూలమున వారికిఁ దన క్షేమసమాచారములు తెలియఁజేయుట కేర్పాటులు చేసెను. శ్యామరావునకు సుశీలావియోగమునఁ బ్రబలాఘాతమైనట్లుండెను. ఇఁకఁ దల్లి-గంగాబాయి-తన మూలముననె పుత్రున కిట్టి దురవస్థ సంభవించినదని పూర్వవృత్తాంతములను స్మరించుచుఁ దనయుని యునికి తెలియనందున మిక్కిలి వగలఁ బొగులుచుండెను. నేఁడు శ్యామరావునకు మధుకరుని స్వహస్తలిఖితపత్ర మొకటి వచ్చెను. ప్రేమమయులగు నామాతాపితరుల కైన యానంద మమభ్యైకవేద్యము. తమపుత్రుని యాగమనమార్గముల నిరీక్షింపకయె వీరిద్దఱు ముంబాపురికి-తనయునిఁ జూచుటకు-బయలుదేరిపోయిరి.

డాక్టరు మనమోహనరాయిగారి యౌషధాలయము మునుమ బండి దిగి శ్యామరావు మధుకరునిగుఱించి యడుగనెంచెను. కాని యింతలో సుశీల వారిని సమీపించి "మీకెవరు కావలయును?" అని ప్రశ్నించుచుఁ దల పైకెత్తిచూచెను. తనయాశ్రయదాత శ్యామరావుగారు ప్రత్యక్షము! అంత నామె తలపంకించెను. ఆవేశాత్కృష్ట సంగము- స్వప్నమయమువలెఁ దోఁచెను. ఆమెకు భీతి జనించెను. ఈతనియాశ్రయమునఁ దనకుఁ దన ప్రియకరుఁడొదవునాశ లేకపోవఁ దా నాతనిరుల్లు - ఆశ్రయముఁ-త్యజించి పోయెను! ఇప్పుడు తన ప్రియకరునింట-ప్రియతముని సహవాసమున-తా నుంటఁ జూచి, శ్యామరావున కెంతకోపము కలుగునో? ఇఁక నేమి సంభవించునో? ఈవిచారములతో నీమె బెగ్గడిలిపోయెను. కాని, యామె యీస్థితిలో దీర్ఘకాలముండ నవసరము లేకపోయెను. సుశీల యిట్లు కర్తవ్యజ్ఞానశూన్యయై యుండ నంతలో మధుకరుఁడు నటకు వచ్చెను. మాతాపితరులఁ గాంచినంత నాతనికిఁ గడు నచ్చెరువయ్యెను. కాని, యావిస్మయభావ మెవరికిఁ దెలియపరుపలేదు. పుత్రకుఁడు తల్లిదండ్రులను లోనికిఁ గొనిచనెను. సుశీల వారికి వలయు సర్వోపచారములు

నొనర్చెను. తండ్రియనుమతితో మధుకరుఁడు తమవృత్తాంతమంతయుఁ దెలిపెను. అన్నియు విని శ్యామరావు గంగాబాయిని నిర్దేశించి యిట్లనెను. "ఏమి ? నేనని యుండలేదా ? సుశీలఁబోలిన యుదారహృదయయు, సుశీలవర్తనయు నైనబాలిక మఱొక్కతె లభింపదని యిప్పుడనుభవమయ్యెనా?" పిదప సుశీలను నిర్దేశించి "సుశీలా, నేను నీకు హితచింతకుఁడనని నీతోఁ జెప్పియుంటినే, జ్ఞప్తియున్నదా? లే, లెమ్ము- సకలము నా కిష్టమైనట్లే జరిగినవి. ఇందునకు నేను బరమేశ్వరునకుఁ గృతజ్ఞతాపూర్వకవందనసహస్రము లర్పించుచున్నాను." అనెను.

గంగాబాయి యేమియుఁ బలుక లేదు. కాని, తనకు సుశీలయెడలఁ గల ప్రేమవాత్సల్యములను బ్రకటించుటకుఁ గాఁబోలు, నాబాలిక నత్యాదరముతో జెంతకుఁ జేర్చి, కౌఁగిలించి, కన్నీరు మున్నీరుగాఁ గార్చుచుండెను.

ఆనాఁటినుండియు మాధవమధుకరులబంధుజనులు పరస్పరమిత్రత్వము వహించి మెలఁగుచున్నారు.

అల్పకాలముననే శ్యామరావు సుశీలామధుకరుల కతివైభవముతో వివాహము చేసెను.

సుశీలా మధుకరుల ప్రేమాలాప సంతోషసమయములలోఁ దమచరిత్రమంతయు జ్ఞప్తికిఁదెచ్చికొని సుశీల పరిహాసముతో- మహదానందముతో- లజ్జాభరముతో- తన భర్తను నిర్దేశించి "ఇదియేనా పునర్వివాహము?" అని యనుచుండును.

# లోకాలు నాకేలనే?

తురగా వేంకటరామయ్య గారు

ఆగువా ? జీవాలు
సాగునా ? రాగాలు
బాలకృష్ణునియందు
భ్రాంతి వీడిననాడు
లోకాలు నాకేలనే ?
కోకిలా ! శ్రీకృష్ణుడే చాలునే.

వలపు దీగెల ప్రాలి
పలుక వేమే తల్లి !
కలదెల్ల నీతేనె
కృష్ణునకిత్తునే !
నామనోహరు బిలువవా ?
కోకిలా ! నాజీవములు నిల్పవా ?

ఈమేడలో పాట
నే పాడుచుండగా
వేణువూదుచు ప్రోల
వింతనాట్యము సేయ
బాలకృష్ణుడు వచ్చునా ?
కోకిలా! ప్రణయయోగిని బ్రదుకునా?

పాడుజీవాల, కీ
బంగారుమే డేల,
కాలయాపన సేయ
కేళీవనా లేల
దండకాటివి లేదటే ?
కోకిలా! దావానలము లేదటే?

రాలనుం చేవేళ
పూలపానుపు లేల ?
కాలనుంటే మంచి
గంధంపు పూతేల ?
అందాలు నాకేలనే !
కోకిలా ! అన్నీ త్యజించినానే.

ఉండనీ; యీమేను
మండనీ; నాకేమి
భావమే ? నావిభుని
పాదాల వ్రాలునే
చింతిల్ల నాకేలనే ?
కోకిలా ! కాంతుడెక్కడికేగునే?

వేణుగానమునాటి
విశ్వమోహనమైన
బాలకృష్ణుపదాల
బడుచున్న నామనసు
ఆగుమంటే ఆగునా ?
కోకిలా ! త్యాగమంటే జంకునా?

మెల్లగా ఈమేను
మీ మ్రోలనే వదలి
రాగప్రపంచాన
రంజిల్ల జాలనా ?
పాడుబ్రదు కికనేలనే?
కోకిలా ! పాటలుంటేచాలునే.

ఉండ నీవే లోక,
మెండవానలయందు,
నిండు వెలుగున బ్రియుని
నీడలో నుండునే
శోకాలు బంధించునా ?
కోకిలా ! లోకాలు శాసించునా ?

మానసం బేనాడు
మాధవుని జేరెనో
ఆనాడె యీలోక
మంతా త్యజించితిన
నాకు భోగము లేటికే ?
కోకిలా ! నాదముంటే చాలునే.

వెలుగులో బ్రణవాల
వేణు పూదేవాని
పాట కెరటాలలో
నాట లాడుద మింక,
బ్రణయమార్గము బట్టవే !
కోకిలా ! బాలకృష్ణుడె పిలుచునే.

పురుషు డాతడొకండె
పొలతినే నొకతెనే ;
లోకాలు మాలోవి
లోలమై తేలునే
వేయిమాట లికేలనే ?
కోకిలా ! విడువలేనే కృష్ణునీ.

---

"ప్రణయగానము" వందలి ప్రథమభాగము 'ఈవేళ కనుపించునా' చైత్రసంచికయందు ప్రకటింపబడినది. ఈ చిన్న పొత్తమును నాప్రభువులు శ్రీమ దుయ్యూరు సంస్థానాధీశులునగు శ్రీశ్రీశ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారికి "ఉగాదికానుక"గా సమర్పించి శ్రీవారి యనుమతిని భారతియందు ప్రకటింప నొసగితిని.



# ఉద్భటారాధ్య చరిత్రము

## పీఠిక

! వేటూరి ప్రభాకరశాస్త్రిగారు !

సరస్వతీపత్త్రిక యపూర్వములగు సత్ప్రబంధముల ను వెల్లడించుట సంతోషవిషయము. ఇప్పుడు ప్రకటితమయిన యుద్భటారాధ్యచరిత్ర మట్టి యపూర్వ సత్ప్రబంధములలో నొక్కటి. దీనికి

కర్త: తెనాలి రామలింగకవి

అనఁగానే దీని సత్ప్రబంధత్వము గొంత సమర్థిత మగునుగదా! తెనాలిరామలింగకవి యని తెనాలి రామకృష్ణకవి యని యొక్కనినే యటునిటుగూడ లోకము పేర్కొనుట గలదు. తొలుత నాతఁడు శైవుఁడనియు, నప్పుడు రామలింగఁడని పేరయ్యెననియుఁ, దర్వాత వైష్ణవము పుచ్చుకొనెననియు, నప్పుడు రామకృష్ణుఁడని మార్పు పేరయ్యెననియుఁ బ్రతీతి. దీనిని వీరేశలింగము పంతులుగారు మొదలగువారు గొందఱు నమ్మిరి. మఱికొందఱు నమ్మరయిరి.* ఆ రెండు పేళ్లు నొక్కనివే యని నేనును విశ్వసించుచున్నాఁడను. అట్లు విశ్వసించుట కిదివఱకున్న యా యైతిహ్యముమాత్రమే కాక యపూర్వముగాఁ గొన్ని యాధారములును నా కగపడినవి. తెలుపుచున్నాఁడను:

రామలింగఁడే రామకృష్ణుఁడు

రామకృష్ణకవికృతములుగా నిదివఱకు దొరకి ప్రకటితములయియున్న గ్రంథములు రెండు. అవి పాండురంగ మాహాత్మ్యమును ఘటికాచలమాహాత్మ్యమును. రామలింగకవికృతిగా నిప్పుడు క్రొత్తగా దొరకి ప్రకటితమయినది యుద్భటారాధ్య చరిత్రము. తొల్త నాతఁడు శైవుఁడుగానుండి తర్వాత వైష్ణవుఁడుగా మాఱెననియే నే నిందు ముందు నిరూపింపనున్నాఁడను గాన యుద్భటారాధ్యచరిత్రము మునుపటి గ్రంథముగాను తక్కిన రెంటిని దర్వాతివానిఁగాను దెలుపుచున్నాఁడను.

ఉద్భటారాధ్య చరిత్రమున రామలింగకవి స్వవిషయ మిట్లు తెల్పుకొన్నాఁడు:—

సీ. కౌండిన్యముని రాజమండలేశ్వరవంశ
 పాథోధి నవసుధా భానుమూర్తిఁ
బాలగుమేలేశ పదపయోజద్వయీ
 ధ్యానధారణ సముదాత్తచిత్తు
మానితాయాతయామా నామభావిత
 విపులమహా యజుర్వేదవేది
రామేశ్వరస్వామి రమణీయకరుణావి
 శేషపోషితవిలసిత సమగ్ర
గీ. సహజసాహిత్య మాధురీ సంయుతాత్ము
లక్కమాంబకు ఘనయశోలక్ష్మి నెలయు
గామధీమణికిని బుత్త్రు రామలింగ
నామవిఖ్యాతుఁ గావ్యనిర్ణయధురీణు.

గద్యమునందును, "ఏలేశ్వర గురువరేణ్య చరణారవిందషట్చరణ సకల కలాభరణ రామనార్య సుపుత్త్ర సుకవిజనమిత్ర కుమార భారతీబిరుదాభిరామ రామలింగయప్రణీత" మని యున్నది.

పాండురంగ మాహాత్మ్యమున రామకృష్ణకవి యిట్లు చెప్పుకొన్నాఁడు.

సీ. ......శైవ వైష్ణవ పురాణావళీ నానార్థ
 ములు నీకుఁ గరతలామలకనిభము
గీ. ఆంధ్రభూమికుచాగ్రహారాభమైన
శ్రీ తెనాల్యగ్రహార నికేతవగ్ర

* విశ్వకర్మ వంశ్యుఁడు ధీరజనమనోరంజనకర్త, తెనాలి రామలింగకవి యొకఁ డున్నాఁడు. ఆతఁడు వేఱు.

శాఖి ... పరసక విధి

రమ్యగుణాకృష్ణ! రామయ రామకృష్ణ!

క. కౌండిన్యసగోత్రుఁడ వా
ఖండలగురునిభుఁడ వఖిలకావ్యరస సుధా
మండన కుండలుఁడవు భూ
మండల వినుతుఁడవు లక్ష్మమాపరతనయా!"

"శా. రదనీరూపము రామకృష్ణ కవిచంద్రా! సాంద్ర
కీర్తీశ్వరా"

"క. వాక్కాంతాశ్రయు భట్టరు
చిక్కాచార్యుల మహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తి భజించెద
నిక్కావ్యకలాకలాప మిచ్చేయుటకున్.

గద్యమున:— ఇది శ్రీమత్పరమపదనాథనిరవధిక కృపాపరిపాకపరిచితసర్వసకవితాసనాథ రామకృష్ణకవి నాథ ప్రణీతంబైన— అని యున్నది.

| రామలింగకవి | రామకృష్ణకవి |
|---|---|
| కౌండిన్యగోత్రుఁడు | కౌండిన్యగోత్రుఁడు |
| శుక్లయజుర్వేది | శుక్లయజుర్వేది |
| తండ్రి, రామయ | తండ్రి, రామయ |
| తల్లి, లక్ష్మమ | తల్లి, లక్ష్మమ |
| కుమారభారతీబిరు దాభిరాముఁడు | శారద! నీరూపము రామకృష్ణ కవిచంద్రా! |

ఉద్భటచరిత్రము బాల్యమున రచించినదిగాన 'కుమారభారతి'యని బిరుదు చెప్పుకొన్నాఁడు. పాండురంగ మాహాత్మ్యము ముదివయసున రచించినదిగాన 'శారదనీరూపము' అని కృతిపతి తన్ను సంబోధించినట్టు చెప్పుకొన్నాఁడు. కాన యీభేదము సంగతమే. ఇన్ని సరిపడి యున్నను నుద్భటచరిత్రమున రామలింగయ యని గ్రంథకర్తపేరును పాలగుమిరేచేశ్వరుఁడని గురునిపేరును, పాండురంగమాహాత్మ్యమున రామకృష్ణుఁడని గ్రంథకర్తపేరును, భట్టరు చిక్కాచార్యులని గురునిపేరును గాన వచ్చుట, గద్యములరీతులు భిన్నములుగానుండుట రెండు నొక్కని పేళ్లేయను సిద్ధాంతమునకుఁ గొంత బాధకములుగాఁ గానవచ్చును. ఈభేదములు మతము మాఱినపుడే యేర్పడిన వేయని నే ననెదను.

## అందుకు సాధకములు

ఇందుమతీపరిణయమని తెనాలిరామభద్రకవికృతి యొకటి కలదు.* అం దిట్లున్నది:

...............కవి
తాఘనతామహు మత్పితామహున్
రామయ రామకృష్ణ కవి
రాజుఁ దలంచి నుతించి ప్రమొక్కొదన్.

గీ. తదనుసంభవమణిని సుదక్షిణా ప
రిణయ ముఖకావ్యరచనాధురీణు నాంధ్ర
కవికదంబములోనఁ బ్రఖ్యాతి గన్న
యన్నపకవీంద్రు ధీసాంద్రు నభినుతింతు.

* * * * *

సీ. ప్రౌఢి మీపెదతాత పాండురంగాది స
త్కృతులు చేసెను రామకృష్ణసుకవి
అనుజుఁ డన్నప్ప మీపినతాత రచియించెఁ
బరగ సుదక్షిణాపరిణయంబు
మీతాత శ్రీగిరి చాతురీ విఖ్యాతి
శ్రీశైలమాహాత్మ్య కృతి యొనర్చె
కడిమి మీతండ్రి యిమ్మడి రామకృష్ణాఖ్యుఁ
డనఁ గీర్తిగనె సంస్కృతాంధ్రములను

గీ. ఔర యనిపించె మీయన్న వీరరాఘ
వాఖ్యకవి సర్వకవితామహత్త్వమునను
నిన్ను నూచానసంతాను నెన్నఁ దరమె?
ప్రాజ్ఞహృదయాబ్జరవి రామభద్రసుకవి!

దీనింబట్టి చూడఁగాఁ బాండురంగమాహాత్మ్యాదులను రచించిన తెనాలిరామకృష్ణకవియును, సుదక్షిణా పరిణయము రచించిన తెనాలి యన్నయకవియును నన్న దమ్ములని యేర్పడుచున్నది. దీనికి సరిగానే సుదక్షిణా పరిణయమున:

*ఇది తంజాపురపు సరస్వతీపుస్తక భాండాగారమునఁ గలదు. శ్రీ మానవల్లి రామకృష్ణకవి, యం. ఏ. గారు దీనివిషయము 1914 సంవత్సరాదిసంచికలో 'తెనాలికవులు' అను వ్యాసమునఁ దెలిపినారు. వారే దీని ప్రతిని చెన్నపురి గవర్నమెంటు లైబ్రరికిని ఒసఁగినారు.

గీ. నవ్యసుగుణాభిరామ తెనాలిరామ
పండితాగ్రణిసత్పుత్త్రి భవ్యమిత్రు
హరపదాంభోజసౌముఖ్య నన్నపాఖ్యు
నన్నుఁ బిలిపించి యాదరోన్నతి వహించి.

*  *  *  *  *

గద్యము "ఇది శ్రీమత్తెనాలి రామేశ్వర శాశ్వత కృపాకటాక్షలక్షిత కవితాభిరామ రామయపండిత కుమార సహజశైవాచారసంపన్న ధీమదన్నయనామధేయ ప్రణీతంబైన సుదక్షిణాపరిణయమందు."–అని యున్నది

ఈ సుదక్షిణాపరిణయ పద్యములవలనఁ గూడఁ దెనాలిరామకృష్ణుఁడు, తెనాలియన్నయ, యన్నదమ్ము లగుట యితరప్రమాణనిరపేక్షముగానే యేర్పడుచున్నది. ఇర్వురును రామయపండితునికొడుకులే; తెనాలివారే; ఒక కాలమువారే. (అది ముందు తెలియనగును.) అంతేకాక రామలింగఁడే రామకృష్ణుఁ డయ్యెననుటనుగూడ నీసుదక్షిణాపరిణయమే స్వతంత్రముగా సాధించుచున్నది. ఉదాహృత గద్య పద్యములవలన నన్నయ సహజశైవాచారుఁ డనియు, తెనాలిలో వెలసిన రామేశ్వరస్వామి యనుగ్రహమునఁ గవిత నేర్చినవాఁడనియు, మఱియు,

గీ. కాళిదాసాది సంస్కృతకవులఁ దలఁచి
ఆంధ్రభాషావిశేషభాషాధిపతుల
నన్నపార్యాదులను బుద్ధి సన్నుతించి
పాలగుమ్మిభీమగురుని సద్భక్తిఁ గొలుతు.

అనుపద్యమువలనఁ బాలగుమ్మి భీమయశిష్యుఁడని యు నెఱుకపడుచున్నది. దీనినిఁబట్టి యన్నయకుటుంబమువారును సహజముగా శైవాచారసంపత్తికలవారనియు, తెనాలిరామలింగస్వామి భక్తులనియుఁ, బాలగుమ్మివారి శిష్యులనియుఁ దలఁపఁగూడును.* మనప్రస్తుతగ్రంథమగు నుద్భటచరిత్రమును రచించిన రామలింగకవి యిట్టిలక్షణములు గలవాఁడు. అతని శైవాచారనిరతి యుద్భటచరిత్రమున స్పష్టముగాఁ గన్పట్టుచున్నది. మఱియు నాతఁడు 'రామేశ్వరస్వామి రమణీయకరుణావిశేషపోషిత విలసిత సమగ్రసహజసాహిత్య మాధురీసంయుతాత్ముఁ'డనియు 'పాలగుమ్మేలేశపదపయోజధ్యాయీధ్యానధారణ సముదాత్త చిత్తుఁ'డ ననియుఁ జెప్పుకొన్నాఁడు. పాలగుమ్మియేలేశ్వరుఁడును బాలగుమ్మిభీమేశ్వరుఁడును నన్నదమ్ములో తండ్రికొడుకులో అయియుందురు.

మఱి యన్నయ తన యన్నయని రామలింగనిఁ (లేక రామకృష్ణునిఁ) బ్రస్తుతింపకున్నంతమాత్రాన వారి సోదర్యవిషయము సందేహింపఁ దగినదేమో యనరాదు. తెనాలిరామభద్రకవి తనతాతలన్నదమ్ములు ముగ్గురనియు, మొదటివాఁడు పాండురంగమాహాత్మ్యకర్త రామకృష్ణుఁ డనియు, రెండవవాఁడు తన తండ్రి తండ్రి శ్రీగిరియనియు, మూఁడవవాఁడు సుదక్షిణాపరిణయకర్త యన్నయ యని యు స్పష్టముగాఁ జెప్పినాఁడు గాన యిట్టిసందేహము నకు సందు లేదు.

అన్నయకవి మతము మార్చుకొన్నాఁ డన్న యనాదరముచే నన్నగారిని బ్రస్తుతింపక పోయెనేమో! 'సహజశైవాచార'యన్న పద మాయన్న నడుమఁ దెచ్చుకొన్న వైష్ణవాచారము మీఁది వైమనస్యముచేఁ జేర్చుకొన్నదేమో! రామకృష్ణకవి తనమతముమార్పును దెలుపుకొనకున్నను, పాండురంగమాహాత్మ్యమున 'శైవవైష్ణవపురాణావళీ నానార్థరచనా పటిష్ఠకరమ్యమతివి' † అని తన శైవప్రబంధరచనమును దెలుపుకొన్నాఁడు.

తెనాలిలో నుండుటచేత నే తర్వాత తెనాలివారని యింటిపే రేర్పడినదిగాని యంతకుముందు వారియింటి పేరు గార్లపాటివారని ప్రాంతవ్రాఁతలలో నున్నది. గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు వీరేశలింగము పంతులుగారును దీనిని జెప్పిరి. తెనాలిలోనున్న రామయపండి

---

* పాలగుమ్మివారారాధ్యులు గాఁబోలును. రామలింగకవి కించను నూఱేండ్లకు ముందొకఁ డా యింటిపేరివాఁడు శైవాచార్యుఁడు కొండవీటి రెడ్డిరాజ్యమున నున్నట్లు శాసనమున్నది. శ్లో. పాల్గుమిశ్రీకంఠగురోః పంచాక్షరమంత్రపానరుక్త్యస్య; శిష్యాయ శివ్యపరిమద్రక్షా దాక్షిణ్యసత్కటాక్షస్య. శక 1336 నాఁటిది పెదకోమటి మాచారెడ్డిశాసనము. శృంగార శ్రీనాథము ననుబంధముచూచునది.

†'శైవవైష్ణవ పురాణావళీ నానార్థములు నీకుఁ గరతలామలకనిభము' లని పాఠాంతరముకలదు. పాండురంగమాహాత్మ్యమున నీపద్యము పాఠభేదములతో నున్నది.

తుఁడు శైవాచారపరుఁడుగాన యక్కఁడ వెలసియున్న రామలింగస్వామి పేరే తన ప్రథమ పుత్త్రునికిఁ బెట్టుకొనెనని నేను దలఁచుచున్నాఁడను. అన్నయు చెప్పుటచేతనే కాక ఈ క్రిందిసాధనము చేతఁగూడ నాతఁడు శైవాచారపరుఁడని రామలింగేశ్వరస్వామి భక్తుఁడని యేర్పడుచున్నది.

తెనాలిలో రామలింగేశ్వరస్వామి యాలయమున నొక యుత్సవవిగ్రహముపీఠము మీఁద నీశ్లోక మున్నది.

శ్లో. శ్రీ తెనాలి నగరే వ్యరాజయ
గార్లపాటి పురరామపండితః;
శుక్లమాఘసిత పంచమీ గురౌ
రామలింగ ముమయోత్సవాకృతిమ్*

రామలింగని యింటిపేరు గార్లపాటివారని యిది వఱకు వ్రాసినవా రెవ్వరుగాని యీశ్లోకము నునికి నెఱిఁగినట్లు తెలియరాలేదు. రామలింగని యింటిపేరు తొల్త గార్లపాటివారనుట నీశాసనశ్లోకము స్థిరపఱచుచున్నది. ఉద్భటారాధ్యచరిత్రలో రామలింగఁడు తన యింటిపేరేదో పేర్కొనలేదు. రామకృష్ణుఁడై పాండురంగ మాహాత్మ్యమునను బేర్కొనలేదు. 'శ్రీ తెనాల్యగ్రహార నిర్ణేత'ననిమాత్ర మందుఁ జెప్పుకొన్నాఁడు. అప్పటికి తెనాలివారని యింటిపేరు స్థిరపడకుండవచ్చును. అన్నయ సుదక్షిణా పరిణయమునఁ 'దెనాలి' యింటిపేరు చెప్పుకొన్నాఁడు.

మనుమఁడగు రామభద్రకవి చెప్పుటచేతను, దల్లి పేరు మొదలగునవి సరిపోవుటచేతను రామకృష్ణుఁడును, నన్నయయు నన్నదమ్ములని స్పష్టపడినది. ఉద్భట చరిత్రమందుఁ గానవచ్చు రామ(లింగే)శ్వరస్వామి యనుగ్రహము, పాలగుమివారి శిష్యత్వము, శైవాచారము మొదలగునవి సరిపోవుటచేతను, లోకమందుఁ బారంపర్యముగా వచ్చుచున్న ప్రతీతికిఁగూడ నిర్వాహ మేర్పడుటచేతను, నుద్భటారాధ్య చరిత్రకర్తయగు రామలింగయయే వైష్ణవ మతము పుచ్చుకొని రామకృష్ణుఁడై పాండురంగ మాహాత్మ్యము రచియించినాఁడని, వారు వేఱుపురుషులు గారని, నిర్ణయించుట ప్రమాణదూరము కాదు.

## పోలికలు

రామలింగకవియే రామకృష్ణుఁ డయ్యెననుట కింకను మఱియొక బలవత్ప్రమాణము చూపెదను. పాండురంగమాహాత్మ్యమున 'శైవవైష్ణవపురాణావళీ నానార్థ రచనా పటిష్ఠైక రమ్యమతివి' యని చెప్పఁబడుటచే నాతఁడేవో శైవపురాణకథల రచియించి యుండవలెననియు, నీ యుద్భటారాధ్యచరిత్రము వానిలోనిది యగుననియు ననుకొంటిమి. తొలుతఁ దాను శైవుఁడై యున్న పుడు రచియించిన యుద్భటారాధ్యచరిత్రములోని పద్యములే మార్చి మార్చకుండఁ దర్వాత వైష్ణవుఁడై రచించినఘటికాచల మాహాత్మ్యమున నాతఁడు చేర్చుకొన్నాఁడు. ఇవిగో చూడుఁడు.

సీ. అచలసుతాభర్త కర్పించి మఱికాని
మృగములు లేఁ బూరి మేయ వచట
అసమలోచనునకు నర్పించి మఱికాని
యళులు క్రొవ్విరి తేనె లాన వచట
అంధకధ్వంసికి నర్పించి మఱికాని
కోయిల లిగురాకు గొఱుక వచట
అంగజారాతికి నర్పించి మఱికాని
చిలుకలు పండ్లు భుజింప వచట

గీ. తక్కఁగల జంతువులు శంభుఁ దలఁచి కాని
యుచితవర్తనములఁ గోరి యుండ వచట
వచనములు వేయుఁగల యంతవానికైన
నాయరణ్యంబుఁ గొనియాడ నలవియగునె?

మ. హరిణంబుల్ బులిఁ జెంచు, సింగమొగి స
య్యాటంబు లాడుల్ గరుల్,
బురినీడల్ ఫణిడింభ జాలముల ని
ల్పుం గేకి, చిట్టెల్కలుల్

---

* పదియేండ్లకుముం దీశ్లోకమునుగూర్చి గుంటూరిలో శ్రీ. మల్లాది సోమయాజులుగారు నాకుఁ జెప్పిరి. మూఁడేండ్లకుముందు నేను జూచితిని. ఇప్పుడొకమిత్రుఁడుచూచి వ్రాసి పంపెను. శుక్ల సం. మాఘ శుద్ధ పంచమీ గురువారము స్వామికన్నుపిళ్లగారి పుస్తకమును బట్టిచూడఁగా సరిపడుచున్నది.

నారువోసినరీతి నున్నారు ధీరు
లన్నగరియందుఁ గోపురం బున్నవారు.
[ఘటికాచల మాహాత్మ్యము]*

ఉద్భటారాధ్య చరిత్రపద్యముల ఛాయగల పద్యములు పాండురంగ మాహాత్మ్యమునఁగూడ లేకపోలేదు. కాని ప్రౌఢతరమయిన రచనమగుటచేఁ బాండురంగ మహాత్మ్యమున నీవిధముగాఁ బాడినపాటయే యనఁదగు పద్యములు గానరావు. ఈసాధనములన్నియు రామలింగఁడే రామకృష్ణుఁ డయ్యెనను సిద్ధాంతమును నిర్వివాదముగా నెలకొల్పఁగలవని నానమ్మకము.

ఇంకొకసాధకము

ఇన్ని సరిపడినను నుద్భటారాధ్యచరిత్ర రచనాకాలమును, పాండురంగ మాహాత్మ్యరచనా కాలమును నొక్కపురుషుని జీవితపరిమాణమునందుఁ బొందనివిగా నుండినచో నిఁక నీవాదమెల్ల వమ్మయిపోవలసిన దేయగుచు. అచిక్కు లేకుండ నదియుఁ గుదురుచున్నది. ఒక్కనికే రెండుపేళ్లను సిద్ధాంతము నిర్వివాదముగా నిల్చుచున్నది.

ఉద్భటచరిత్ర రచనాకాలము

కొండవీడు దుర్గాధ్యక్షుఁడుగా నున్న నాదెండ్ల గోపమంత్రికడ ముఖ్యోద్యోగియయిన యయ్యారె దేచమంత్రి యుద్భటారాధ్యచరితము కృతిగొన్నాఁడు. అదియెల్లఁ గృత్యవతరణికలోఁజూడఁదగును. శ్రీకృష్ణదేవరాయఁడు క్రీ. 1515 సం॥ కొండవీడు జయించెను. అదిమొదలుగాఁ గృష్ణరాయల యేలుబడి కది లోబడినది. రాయలమంత్రియగు సాళ్వతిమ్మరసు కొండవీటిపాలనమును దన మేనల్లుఁడగు నాదెండ్ల గోపమంత్రి కప్పగించెను. నాదెండ్ల గోపమంత్రి సుప్రఖ్యాతుఁడు. గోపమంత్రి క్రీ 1517 న దేచమంత్రికొక్క యగ్రహారము నొసఁగెను.

దేచమంత్రి శైవాచార పరాయణుఁడు. ప్రోలనారాధ్యుని వంశమువాఁడగు చంద్రశేఖర వాచంయముని శిష్యుఁడు. మఱియు మహావిద్వాంసుఁడగు ల్లోల్ల లక్ష్మీనరపండితునకును శిష్యుఁడు. ఆలక్ష్మీనరుఁడు కటాక్షింపఁగా శివపంచస్తవి కీతఁడు వ్యాఖ్యానము రచించెను. అందు:—

శ్లో. నాదిండ్ల గోపనృపతే రూరేదేచ ప్రధానతా,
క్వచిదర్థః క్వచిన్మైత్రీ క్వచిద్ధర్మః క్వచిద్యశః
*      *      *      *      *      *

......యస్మాద స్త్రి శ మాదా
దఖిలమనుపతిం దేచయామాత్యవర్య,
స్సోఽయం శ్రీచంద్రమౌళి ర్జయతి గురువరః
ప్రోలనారాధ్య వంశ్యః.

[ఈ గురునిఁగూర్చి ఉద్భటారాధ్యచరిత్రము నవతరణికను గ్రంథావసానమును గూడఁ జూడునది.]

"సచాయం దేచయామాత్యోమహిమ స్తవపంచికాం
లక్ష్మీధర కటాక్షేణ కురుతే గురు తేజసా."

దేచమంత్రి గోపమంత్రిచే నగ్రహారాది సమ్మాననముఁ బడసి ప్రఖ్యాతుఁడయినపిదపనే యుద్భటచరిత్రము కృతినందియుండును. ఆకాల మించుమించుగా క్రీ. 1525 అని తలపఁవచ్చును. దీనిచేఁ దెనాలి రామలింగకవి కృష్ణదేవరాయలసభలో నున్నాఁడన్న లోకప్రతీతి పటాధారమయి సంరక్షితమగుచున్నది.

†పాండురంగమాహాత్మ్య రచనాకాలము

పాండురంగమాహాత్మ్యము విరూరి వేదాద్రిమంత్రి కంకితమయినది. ఆ వేదాద్రిమంత్రి కందాళ యప్పలాచార్యుల శిష్యుఁడు. మంగయగురువరాజ కుమారుఁడగు పెదసంగ భూపాలునొద్ద వ్రాయసకాఁడు. చిత్రభారత

---

* ఘటికాచలమాహాత్మ్యము తెనాలిరామకృష్ణకవి రచితమయినను నద్వయ్యాతని మనుమని కాలమున (అతనుమని పేరులేదు) ఖండోజీరాయఁడను మాహారాష్ట్రునకు గృతియీయఁబడినది. కాన యందుఁ గృత్యవతరణిక రామకృష్ణుని రచనముగాదు. రామకృష్ణుని విషయమం దేమియు లేదు. అది కలావతీ ముద్రాక్షరశాలలో 1902 సం. ముద్రితమయ్యెను.

† శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు 'తెనాలి కవులు' అను పేరు 1914 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో వ్రాసిన వ్యాసమున పాండురంగమాహాత్మ్య రచనాకాలమును జక్కఁగా నిర్ణయించినారు. దానిసారమే ఇక్కడ చూపఁబడినది.

కృతిపతితండ్రి చెవ్వతండ్రుడితడు, నై జయంతీ విలాస
కర్తయగు సారంగుతమ్మకవియు, నీ కందాళ యప్పలా
చార్యులకు శిష్యులు. క్రీ 1542 పరాభవ వత్సరమున గండి
కోటప్రభువు కందాళప్పలాచార్యులకు భూదాన మొసఁగిన
శాసనము గలదట. దీనింబట్టి పాండురంగ మాహాత్మ్య
రచనాకాల మించుమించుగా క్రీ 1550, 1560 అగునని
తలంపవచ్చును. మఱియు పాండురంగ మహాత్మ్యమున
రామకృష్ణునిచే

భట్టరు చిక్కాచార్యుఁడు

తన గురుఁడుగా స్తుతింపఁబడినాఁడు. ఈచిక్కా
చార్యునికిఁ బలువు రాంధ్రకవులు శిష్యులయి యుండిరి.
చాతుర్వాటికామాహాత్మ్యము, ఆనందకాననమహాత్మ్యము
మొదలగు ప్రబంధములను రచియించిన లింగమ కుంట
రామకవి (ఈతఁడు తెనాలి రామకృష్ణకవి యల్లుఁడు)
యు నాతనితమ్ముఁ డగు లింగమకుంట తిమ్మకవియు నీ
చిక్కాచార్యులకు శిష్యులు.

క. గురురాయ పట్టభద్రుని
నరిహరు శ్రీరంగనాయకాంశభవున్ భ
ట్టరు చిక్కాచార్యుల మ
ద్గురులఁ దలఁచి యడుగులకు నతుల్ గావింతున్.
[లింగమకుంట రామకవి]

సీ. శ్రీవైష్ణవహితుండ, జిక్కయభట్టరు
శిష్యుండ— [లింగమకుంట తిమ్మకవి.]*

మఱియు రామకృష్ణకవులచేఁ గామందకము కృతి
గొన్నవాఁడు కొండ్రాజు తిమ్మరాజుకొడు కగు వేంక
టాద్రియు నీయాచార్యుని శిష్యుఁడే.

క. శ్రీచంచద్భట్టరుచి
క్కాచార్య వరార్య శిష్య యతులిత శౌర్య
ప్రాచుర్యవర్య గుణార
త్నాచల జయలలిత ధైర్యనయతత్త్వనిధీ.
[కామందకము కృతిపతి సంబోధనమున.]

మఱియు నీకామందకకృతిపతి, పాండురంగ
మాహాత్మ్యకృతిపతి యగు విఠూరివేదాద్రిమంత్రి సేవిన
ప్రభువైన పెదసంగభూపాలునకుఁ జెల్లెలి కొడుకు. శా.
1506, క్రీ 1584 స్వభానువత్సరమున వేంకటరామకృష్ణ
కవులచే నా కొండ్రాజు తిమ్మరాజు కొడు కగు వెంక
టాద్రి కామందకకృతి నందుకొన్నాఁడు.

మ. రమణీయంబుగ శాలివాహశకవ
ర్షంబుల్ గతంబై సహ
స్రము నేనూఱును నాఱునై వెలయఁగాఁ
బ్రౌఢిం దెనిఁగించి రా
ర మహిం దిమ్మయ వేంకటాద్రివిభు పే
రన్ వేడ్కఁ గామందకీ
యము శ్రీవేంకటరామ కృష్ణులు స్వభా
న్వబ్దంబునన్ రూఢిగాన్.

దీనిఁబట్టి చూడఁగాఁ బాండురంగ మాహాత్మ్య
రచనాకాలము క్రీ. 1565 ఇంచుమించుగా నగునని యేర్పడు
చున్నది. అనఁగాఁ దెనాలి రామలింగకవి యించు
మించుగా క్రీ. 1525 ఉద్భటచరిత్రమును, మఱి ముప్పది
యేండ్లకుఁ బాండురంగమాహాత్మ్యమును రచించి యుండు
నని చెప్పనొప్పుచున్నది. మనకవి తమ్ముఁడగు నన్నయ
కవి సుదక్షిణాపరిణయరచనాకాలముకూడ నిందుకు సరి
వచ్చుచున్నది. మఱి పెక్కుమార్గములచేఁగూడ మన కవి
వర్యుని కాలమును నిర్ణయింపవచ్చును గాని యామార్గములు
కొంత డొంకతిరుగుడుగానుండుటచేతను, ఇప్పుడు చెప్పిన
కాలమునకే చేరునవిగానుండుటచేతను విడనాడినాఁడను.

కవిస్తుతులు

నేఁ జూచినంతవఱకుఁ గవిస్తుతులలో 'రామలింగ
కవి'యన్న పేరే కానవచ్చినది. నడుమఁ దెచ్చిపెట్టు
కొన్న రామకృష్ణనామము ప్రాచీనకాలమునఁ బ్రఖ్యా
తము కాలేదు కాఁబోలును! పాండురంగ మాహాత్మ్య
ప్రౌఢిమ ప్రఖ్యాతమైనతర్వాత రామకృష్ణనామము
గూడ రహికెక్కినది..

ఉ. రంగుగఁ బాండురంగని తెఱం
గలరంగ రచించి వేడ్కమీ
ఱంగ ఛలోక్తులన్ నృపుఁ గ
రంగనొనర్చు హాస్యరంగు నింగి ము

* సుదక్షిణాపరిణయకర్త (లింగమకుంట తిమ్మకవి) అప్పకవికంటెఁ దర్వాతివాఁడని కం. వీ. గారు వ్రాయుట
ప్రామాదికము.

ట్టంగ మెలంగు నేతపూర్గ,
డంగి చెలంగు నభంగసద్యశో
లింగుని రామలింగ,
కళలింగకళానిధినిఁ గణించెదన్.
[నాగ్నజితీపరిణయము-వల్లారి నరసింహకవి]

క. శృంగార రసాలింగిత
రంగత్కవితా నదీతరంగము హృదయ
త్వంగద్భుజంగ మాంగద
లింగమ్ముగ తెనాలిరామలింగనుఁ దలఁతున్.
[పృథుచరిత్రము, సరస్వతీ సోమయాజి]

పైపద్య మాతఁడు లింగధారియనికూడఁ జెప్పుచున్నది.

"రంగనాథుని రామలింగకవిని"
[కూర్మపురాణము, రాజలింగకవి]

"రామ, లింగకవి రామభద్రుల లీలఁదలఁతు"
[అధ్యాత్మరామాయణము, శరభన కవి]

"భీమకవి రామలింగని"
[చంద్రరేఖావిలాపము, జగ్గన]

ప్రబంధరత్నావళిలో తెనాలి రామలింగకవి కృతులు కందర్పకేతువిలాసము, హరిలీలావిలాసము నను వానినుండి కొన్ని పద్యము లుద్ధరింపఁబడినవి. వానింగూర్చి ముందుఁ దెలుపుదును. అందును రామలింగనామమే యున్నది. మఱియు నీచాటుపద్య మున్నది.

ఉ. లింగనిషిద్ధుఁ గల్వల చె
లింగని మేచకకంధరుం ద్రిశూ
లింగని సంగతాళి లవ
లింగని కర్దమదూషిత న్మృణా
లింగనిఁ గృష్ణచేలుని హ
లింగని నీలకచన్ విధాతృనా
లింగని రామలింగకవి
లింగనికీర్తి హసించు దిక్కులన్.

అప్పకవి మొదలగువారు మఱియుఁ బెక్కురు రామలింగఁడనియే పేర్కొనిరి. అయినను ఆతని యల్లుఁడగు లింగమకుంటరామకవియు, మనుమఁడగు రామభద్ర కవియు రామకృష్ణనామమును బేర్కొనిరి.

చతుర్వాటికామాహాత్మ్యము ఆనందకానన మహాత్మ్యము నను కృతులలో:—

సీ. శ్రీరామసేవా ప్రసిద్ధుఁ గౌశ్యపగోత్రు
శుభదకాత్యాయనసూత్రపాత్రు
లలితచారిత్రుఁ గాళయమంత్రికిని గోన
మకును దౌహిత్రు సర్వకవిపౌత్రు
తిరుమలాంబాగర్భవరవార్ధి పూర్ణేందు
ధన్యాత్ము లక్ష్మప్రధానపుత్రు
నిజపాలకజనకనిష్ఠాగరిష్ఠ రా
మసచివలబ్ధ రామజపధుర్యు

గీ. రామకృష్ణాఖ్యుజామాతఁ బ్రకటవిభవు
శుక్లయజురధ్యయనుఁ బేర సూరిమాచ
యానుజునిఁ దిమ్మధీనిధి కగ్రజాతు
నవఘు లింగమకుంట రామార్యు నన్ను.*

ఇట్లు అల్లుడగు రామకవియుఁ బూర్వోదాహృత పద్యమున మనుమఁడగు రామభద్రకవియు, రామకృష్ణ నామము పేర్కొనుటకు వారు వైష్ణవమతమం దెక్కువగా నభిని వేశము గలవారగుట కారణము గావచ్చును. వారి వైష్ణవమతాభినివేశ మాయాగ్రంథములఁ జూడవచ్చును.

## మఱికొన్ని కృతులు

తెనాలి రామలింగనికృతులు మఱిరెండు తెలియ వచ్చుచున్నవి. వానిపేళ్లు కందర్పకేతు విలాసము, హరి లీలావిలాసము. ఆప్రబంధము లిప్పుడు కానరావుగాని, వానినుండి కొన్ని పద్యములు ప్రబంధరత్నావళిలో నుద్ధృతములయినవి. వానినాగ్రంథమునఁ జూడఁదగును. ఇవి

---

* ఆనందకానన మాహాత్మ్యములో 'నిజపాలకజనక' అనుచోట, 'నిజజనకాగ్రజ' అనియున్నది. దీనిచే నాతఁడు తనపెద్దతండ్రికి దత్తుఁ డయ్యెనని తెలియనగును. లింగమకుంట రామకవి తెనాలి రామకృష్ణకవియల్లుఁడని లింగమకుంటవారెల్లరు నేటికిని జెప్పుచున్నారు. నేఁడు లింగమకుంటవారి యల్లురగు శ్రీ కొండ వెంకటప్పయ్య పంతులుగారివల్ల తొల్త నిది విని తర్వాత లింగమకుంటలో విచారించి రామకవికృతుల సంపాదించియందును జూచి నేనిది తథ్యమని నమ్మితిని.

ప్రాక పాండురంగ విజయమని మఱియేమో అని యీకవి కృతు లున్నట్లు కొందఱు పేర్కొందురుగాని వానివిష యము నమ్మఁదగినది గాదు.

## కథలు

తెనాలిరామలింగని కథలని దక్షిణ హిందూదేశ మెల్లఁ బ్రఖ్యాతి కెక్కి పెక్కుగథలున్నవి. వానిఁగూర్చి మన మేమియుఁ జెప్పఁజాలము. ఆతఁడు హాస్యచతురుఁడై యుండవచ్చును. నిజముగాఁ గొన్నికథ లాతనికి సంబంధిం చినవే కావచ్చును. లోకులు మఱియు ననేకాద్భుతకథ లాతని తలకుఁ దగిలించియు నుందురు. పెక్కుగథలు శ్రీకృష్ణదేవరాయల గోష్ఠిలో జరిగినవిగా వినవచ్చును. రామలింగఁడు రాయల సమకాలమువాఁడే. కావున నవి సంభావ్యములు గావచ్చును. చాటుపద్యమణి మంజరిలో నేనాతని కథలకు సంబంధించిన చాటుధారలఁ గొన్నిటిని జేర్చినాఁడను. క్రొత్తదొక్కటి యిక్కడ చూపుచున్నా డను.

క. ఓయమ్మలార! మందులు
వేయేల మకారకొమ్ము విషకవిగానిఁ
వా రెత్తకుండఁ జేసిన
వా రెత్తదు రామరాయవసుధేశునకున్.

అళియరామరాయనికి వాయురోగము వచ్చెనట! అంతఃపురస్త్రీ లాతనికి మందుల నిప్పింపఁ దంటాలు పడు చుండఁగా రామలింగఁ డీపద్యమును జెప్పినాఁడట. మకారకొమ్ము విషకవిగాఁ డనఁగా మూర్తికవి. ఆతని వాయి=నోరు, ఎత్తకుండఁ జేసినచో రామరాయలకు వాయి=వాయురోగము,తలచూపదని పద్యార్థము. మూర్తి కవి విషకవిత్వప్రయోగముచే రాయలకు రోగమువచ్చె నని స్త్రీలను నమ్మించి యాతని యుద్యోగవైభవము నూడఁగొట్టించుట కత్తిన రొత్తుగాఁబోలునిది!

ఇఁకఁ గవివిషయమును విడిచి ప్రస్తుతగ్రంథమును గైకొందును. శైవారాధ్యులలో నొక్కఁడయిన యుద్భ టారాధ్యుల చరిత్ర మిందు వర్ణితమయినది.

## ఉద్భటుఁడు

పాల్కురికి సోమనాథకవి రచియించిన బసవపు రాణములో సప్తమాశ్వాసమున నీయుద్భటుని చరిత్రము వర్ణితమైనది. ఆకథనే మనకవి ప్రపంచించి ప్రబంధము చేసి నాఁడు. తెలుఁగున మల్లికార్జున పండితారాధ్యుఁడును, నన్నిచోడఁడును నుద్భటుని స్తుతించిరి.

క. హరలీలా స్తవరచనా
స్థిరనిరుపమభక్తిఁ దనదు దేహముతోడన్
సురుచిరవిమానమున నీ
పురమున కుద్భటుఁడు ప్రీతిఁ బోవఁడె రుద్రా!

శివతత్త్వసారము.

క. క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవము, సాలంకా
రము, గూఢవస్తుమయ కా
వ్యముగా హరు(ర?)లీల, చెప్పి హరు మెప్పించెన్.

కుమారసంభవము.

పయిపద్యములఁబట్టి యుద్భటుఁడు హరలీల, కుమా రసంభవము, అలంకారగ్రంథము (కావ్యాలంకార సంగ్ర హము) రచించినాఁడని తెలియనగుచున్నది. ఇందుఁ గావ్యాలంకారసంగ్రహ మొకటితక్కఁ దక్కిన విప్పుడు కానరాకున్నవి. ఆతవి కుమారసంభవమునుండి కొందఱా లంకారికులు కొన్నిశ్లోకముల నుద్ధరించిరి. * ఉద్భ టుఁడు కాశ్మీరరాజగు జయాపీడునిసభలో విద్యాపతిగా నుండెనని (క్రీ. 779 నుండి 813 వఱకు) రాజతరంగిణి లో నున్నది.

ఆంధ్రకవు లీతని శివకవులలోఁ జేర్కొనుట మన కథానాయకు డీతఁడే యనుటకు సాధకముగాని యీక థలో నాగ్రంథముల స్మరణము లేకపోవుటయుఁ గాలము సరిపడకపోవుటయుఁ గొంతెబాధకమగుచున్నది. ఈప్ర బంధమున నుద్భటుఁడు ముంజభోజునికి శైవదీక్ష నొసఁగిన గురువుగాఁ జెప్పఁబడినాఁడు. ముంజభోజుఁడు దశమ శతాబ్దివాఁడు. ఉద్భటుని గ్రంథము లీభోజుని కింకను బూర్వకాలముననే పుట్టినవి. ఈయుద్భటారాధ్య చరిత్రలో ముంజభోజుని పేరున్నను దీని కాకరమయిన

---

* నన్నిచోడని కుమారసంభవము పీఠిక చూడుము.

బసవపురాణమున భోజుఁడనిమాత్రమేయున్నది. పలువురు భోజులున్నారుగాన యీతఁ డాకాలమువాఁ డయినను గావచ్చును. ముంజభోజుఁడనుట రామలింగకవి స్వకల్పితముగాన యది యప్రమాణమని త్రోసివేయవచ్చును. ముదిగొండవారని యిప్పుడాంధ్రదేశమునఁ బ్రఖ్యాతులుగానున్న యారాధ్యబ్రాహ్మణుల కీయుద్భటారాధ్యుఁడు మూలపురుషుఁడని యీప్రబంధమందుఁ గలదు. ఆయుద్భటునిదగ్గఱనుండి ముదిగొండవారివంశక్రమముగూడఁ గొంత గ్రంథాంతమున గానవచ్చుచున్నది. ఈవంశక్రమము పాల్కురికి సోమనాథుని గ్రంథమునఁ గానరాదు * కర్ణాటభాషలోఁగూడ నుద్భట చరిత్రములు గలవు. సోమరాజకవి బసవాంకకవి యనువా రిర్వురు వానిని రచించిరి. పాల్కురికి సోమనాథుడు కుమారపాలఘూర్జరునిదిగాఁ జెప్పినకథనే కర్ణాటకకవు లుద్భటునికథగాఁ జెప్పిరి. ఆకర్ణాటకకవులకంటె వన సోమనాథుఁడు ...ర్వుఁడు. కుమారపాలున కుద్భటదేవుఁ డని నామాంతరముగా నా యుద్భటదేవచరిత్ర పీఠికలో శ్రీ శ్యామాచార్యులు గారు వ్రాసిరి. అదియెట్లో? మల్లికార్జున పండితారాధ్యుఁడు సోమనాథుఁడు, వారి నిర్వురను వేర్వేఱుగాఁ జేర్కొనిరి. కుమారపాలుని చరిత్రమున నాతని కానామాంతర మున్నట్టు చెప్పరయిరి. పాల్కురికి సోమనకథ చొప్పున రచియింపఁబడిన యీ యుద్భటారాధ్యచరిత్రమునకును, నా కర్ణాట ప్రబంధములకును నేమియు సంబంధమును గానరాదు.

# కాపుపడుచు

నిడమర్తి సత్యనారాయణమూర్తి గారు

[సారస్వతసమాజము]

బువ్వాదుత్త నెత్తిని బెట్టి నవ్వుమొలయఁ
జీరకుచ్చెళ్ల సింగార మారఁబోసి
మంజుమంజీరరవ మొప్ప మగువ యేమి
పాడెదు వినువారలనెల్ల బందెగొనుచు?.

ఉ. బాలిక! యేరినో మధుర
  భంగులఁ బాడెదు నీదు యౌవనో
ద్వేలసుఖాంబురాశి నడ
  తెంచిన ప్రేమతరంగమాలికా
(?) డోలికలందునం బ్రణయ
  రూప విభాసురమైన గీతికా
లాలితుఁ గాఁగ నెవ్విధిఁ ద
  లంపఁగరాని రహస్యపూర్ణ విభ్రమా?

ఉ. మట్టును దట్టమై ప్రకృతి
  శోభలు పూచిన కారణంబునన్
బుట్టిన సంతసంబున వి
  ముక్తవిచారకుమారి వౌచు ని
ప్పట్టునఁ దన్మయత్వమునఁ
  బాడుచు నుంటివొ? లేక మాకుఁ జూ
పెట్టెదొ నీదు ప్రేమ కురి
  పించెడి మోహనరాగ సంగతిన్.

చ. తలపులఁ జిక్కి నిల్చితి య
  థావిధిఁ బాడుచుఁ బోవుచుంటి వో
లలన! పికస్వరాన, దిశ
  లం బ్రవహించెడివాయు వాహినీ
తలముల మ్రోయుగానము వి
  ధంబున నీమధురస్వనంబు శ్రో
తల చెవి కంతకంతకును
  దగ్గుచు వాక్కుల లీనమయ్యెడిన్.

* చంద్రశేఖరగురునివఱకు నావంశక్రమమున్నది. ఈచంద్రశేఖరుఁడే దేచయమంత్రిగురుఁడగునని నేననుకొనుచున్నాను.

# మొదటి జయసింహవల్లభుని నిడమర్రు శాసనము

మల్లంపల్లి సోమశేఖర శర్మగారు

ఈ తామ్రశాసనము కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా చవుటపల్లి గ్రామనివాసులైన బ్రహ్మశ్రీ చింతలపాటి వెంకయ్యశాస్త్రిగారి యింటనుండఁగా నామిత్రులైన బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అయిదేండ్లకు ముందు కొనివచ్చిరి. అప్పుడు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారి మూలమున నది చెన్నపురి గౌర్నమెంటు శాసనశాఖ వారికిఁ జేరి ౧౯౧౬-౧౯౧౭ వ సంవత్సరపు శాసన నివేదికలో నేడవ తామ్రశాసనముగ విమర్శింపఁబడినది. అందులో శాసనమునందలి సారాంశమే తెలుపఁబడినది కాని శాసనము మూలము ప్రకటింపఁబడియుండలేదు. ఇటీవల దీనిని ప్రభాకరశాస్త్రిగారు నాకొసఁగినారు. శ్రీ వెంకయ్యశాస్త్రిగారి కీశాసన మెక్కడ నెట్లు లభించినదో ఆ విషయమేమియుఁ దెలియరాలేదు.

### ఆకారాదికములు

ఈశాసనమునంగల రాగిరేకులు మూఁడు. మొదటిరేకు మొదటిప్రక్క, మూఁడవ రేకు రెండవప్రక్క వ్రాఁతలేదు. ఒక్కొక్క రేకు పొడవు ౭ అంగుళములు; వెడల్పు ౩ అంగుళములు. రేకుల యెడమభాగమున అంచులకు రమారమి పావు అంగుళము దూరమునఁగల రంధ్రములగుండ పోనిచ్చిన యొక రాగికడియము మూలమున నీమూఁడు రేకులును బంధింపఁబడియున్నవి. కడియము యొక్క వ్యాసము ౩౹అం॥ములు. ఈకడియ మొకరాజముద్రికలో అతికింపఁబడియున్నది. ముద్రిక యొక్క వ్యాసము ౧౹ అంగుళములు. రాజముద్రికమీఁద నెగువభాగమున అర్ధచంద్రరేఖయు, దిగువభాగమున పద్మమును, ఈ రెంటికి నడుమ 'శ్రీసర్వసిద్ధి' అనుపేరును గలవు.

### లిపి - భాష

ఈశాసనమునందలిది తెలుఁగు - కన్నడలిపి : అనఁగా నిందలివి తెలుఁగు - కన్నడ అక్షరములు. పదియవ శతాబ్దమునకు పూర్వము పోయినకొలఁది తెలుఁగు అక్షరములును, కన్నడ అక్షరములును ఒక్కరీతినుండుటచేత నట్టి లిపికి తెలుఁగు కన్నడలిపి అని పేరుకలిగెను. ఈలిపిలోనే పూర్వచాళుక్యశాసనము లన్నియు వ్రాయఁబడినవి. దీనికి పదునొకండవ శతాబ్దము మార్పుకాలము. పోల్చిచూపవలసి వచ్చినప్పుడు అక్షరమునకు ఎగువభాగమున తలకట్టువలెనుండు అడ్డుగీటు తీసివేయఁబడుచువచ్చెను. ఉదా: ంవాసకాత్ (పం. ౧), వసేత్ (పం. ౨౮)

భాష సంస్కృతము; చిట్టచివర ఆజ్ఞప్తి నిగుడించిన శ్లోకమును, వ్యాసగీతలనఁబడు

మామూలు శ్లోకములను తక్క మిగిలిన శాసనమంతయు గద్యాత్మకము.

శాసనలిపిలోఁగాని, భాషలోఁగాని గమనింపఁదగిన యితరవిశేషము లేవియు లేవు.

శాసనవిషయము

పూర్వచాళుక్య వంశజుఁడైన మొదటి జయసింహావల్లభుఁడు కాటిశర్మ అను బ్రాహ్మణునికి కార్తిక పౌర్ణమినాఁడు నిడుబఱు అను గ్రామమును దానముచేసెనని తెలుపుట కీశాసనము పుట్టినది.

పూర్వచాళుక్యుల యితర శాసనముల వలెనే యిదియు వారి మామూలు బిరుదములతో ప్రారంభమగుచున్నది. పిదప కీర్తివర్మ మొదలుకొని దాతయైన జయసింహా వల్లభుని వఱకుగల చాళుక్యవంశానుక్రమము నిది తెలుపుచున్నది.

కీర్తివర్మ
|
విష్ణువర్ధన మహారాజు
|
జయసింహావల్లభ మహారాజు

జయసింహావల్లభుని తండ్రియైన విష్ణువర్ధన మహారాజునకు మకరధ్వజుఁడను నామాంతరముకలదు (పం.౫). జయసింహా వల్లభుఁడు తనతల్లిదండ్రుల యొక్కయు, తనయొక్కయు యశస్సును, పుణ్యమును అభివృద్ధిపొందు నిమిత్తము ఈదానము చేసెను.

ప్రతిగ్రహీత

దానమును ప్రతిగ్రహించినవాఁడు కాటిశర్మ. ఇతఁడు గొప్ప విద్వత్కుటుంబములోని వాఁడు. ఇతని తాత పేరు మండశర్మ. ఆయన అసనపురస్థాననివాసి; ఘటికాసామాన్యుఁడు; పదక్రమముల యనుక్రమముతోఁ గూడ రెండు వేదములను అధ్యయనముచేసినవాఁడు; సకల్పముగ ఉపనిషత్తులు, పురాణములు, ఇతిహాసములు, అనేక ధర్మశాస్త్రములు తెలిసినవాఁడు. కాటిశర్మ తండ్రి పేరు శివరుద్రశర్మ. ఈయన తనతండ్రికంటెను అధికముగఁ గల గుణసంపదచేత నిర్మలమైన కీర్తిని సంపాదించి వంశాలంకారమైనవాఁడు; అగ్నిష్టోమయాజి. కాటిశర్మ విద్వత్తలో తండ్రి, తాత లిరువురికిఁ దీసిపోయినవాఁడు కాఁడు. ఈతఁడును రెండు వేదములను జదివినవాఁడు: అర్థసహితముగ యజ్ఞాగమములు, ఉపనిషత్తులు, మంత్రములు, ఇతిహాసములు, పురాణములు, ధర్మశాస్త్రములు చదివి పేరు పొందినవాఁడు; హారీత సగోత్రుఁడు: తైత్తిరీయ సబ్రహ్మచారి. ఇట్టి యీతనికి పరమ బ్రహ్మణ్యుఁడును, మాతా పితృ పాదానుధ్యాతుఁడునైన జయసింహా వల్లభుఁడు దానము చేసెను.

స్థలనిర్దేశము

దాన మొసంగిన గ్రామము నిడుబఱు (పంక్తి ౧౧). దీనిపేరు నిడుపఱు అనియుఁ దెలుపఁబడినది (పంక్తి ౧౮). ఈ గ్రామము గండేఱువాటి విషయమున వ్యాఘ్రనదికి ఉత్తరమున, వన్నేరు నదీతీరమున ఆ విషయమునకు రాజధానియైన గండేఱు నగరమునకు తూర్పుప్రక్క నాలుగు కోసుల దూరమున నున్నట్లు శాసనము తెలుపుచున్నది.

ఈనిడుబఱు, గండేఱు గ్రామములుగాక ఈశాసనమున మఱియొక గ్రామము పేర్కొనంబడినది. దానిపేరు అసనపురము. జయసింహవల్లభుఁ డీశాసనమును 'అసనపురవాసకము'నుండియే కాటిశర్మకొసంగెను. 'వాసక' మన నేమి ? వాసము అనఁగా నివాసము. 'వాసకము' అను పదము వాసమునుండి యేర్పడినదే. ఇది నివాసస్థల మనునర్థమున సమాస పదాంతమున వాడఁబడుచుండును; (మోనియరువిలియమ్సునిఘంటువుచూడుఁడు) కాని మన శాసనమునం దుపయోగింపఁబడిన రీతిని 'అసనపురవాసకాత్ 'అని వాసకశబ్దము ప్రయోగింపఁబడినట్లయిన దానికి స్కంధావార శబ్దమునకుఁ జెప్పు నర్థము చెప్పవచ్చునని డాక్టరు ఫ్లీటు దొరగా రభిప్రాయపడి యున్నారు.[1] ఈ వాసకపద ప్రయోగము చాల పూర్వకాలమునాఁటిది. 'స్వస్తిపురనిసంగమ వాసకాత్' అని విష్ణుకుండి ఇంద్రభట్టారకవర్మ శాసనమునందును, 'విజయళెందులూరవాసకాత్ 'అని విక్రమేంద్రవర్మ శాసనమునందును గన్పట్టుచున్నది. ప్రాచీనతామ్రశాసనములు పెక్కింటిలో నీ ప్రయోగము కలదు. 'విజయకాన్దాళి వాసకాత్' 'పిష్ఠపురవాసకాత్', 'దంత పురవాసకాత్', కళింగనగరవాసకాత్', 'విజయసారపల్లి వాసకాత్' అని కళింగగాంగ శాసనములు మొదలగు వాటినుండి ఉదాహరణము లనేకములు చూపవచ్చును. ఇన్నిటిలోను వాసకపదమునకు స్కంధావారమని యర్థము చెప్పుట అంత యుక్తియుక్తముగఁ దోఁపదు. పై నిచ్చిన యుదాహరణములు కొన్నిటిలో పురము, వాసకము— ఈ రెండు పదములు నుపయోగింపఁబడినప్పటికి వాసక పదమునకు స్కంధావారమనికాక రాజధానియని యర్థము చెప్పుటయే యుక్తమని నాయభిప్రాయము. 'కళింగనగర రాజధానినుండి', 'దంతపురరాజధానినుండి', అని యీ విధమున నర్థము చెప్పుట సమంజసము. అయినను ఈ విషయమును గురించిన చర్చ పండితులకు వదలెదను.

ఈ యసనపురము పూర్వ చాళుక్యులలో మొదటిరాజులకాలమున ప్రసిద్ధికెక్కిన పట్టణ రాజములలో నొకటి. దీని నిప్పుడు గుర్తించుట దుస్సాధము. ఈ పేరుగల గ్రామము కృష్ణా గోదావరీ మండలములలో నెచ్చటను గానఁబడదు.

మిగిలిన నిడుబఱు, గండేఱు గ్రామములు రెండును గండేఱు వాటి విషయములోనివి. ఈ విషయ మెచ్చటిది ? ఇది పూర్వ చాళుక్యశాసనములు పెక్కింటిలోఁ గానవచ్చుచున్నది. పూర్వ చాళుక్యులలో మొట్టమొదట నీవిషయమును జయించినరాజు జయసింహవల్లభుఁడే. ఇతని కాలమునుండియే యది పూర్వచాళుక్య రాజ్యములోఁ జేరిపోయెను. ఈ విషయమునకే కంతేఱువాటియనియు, కండేఱువాటియనియు, గండేఱువాడియనియు నామాంతరములు కలవు. పూర్వచాళుక్య ప్రభువులలో ననేకు లీ విష

1. Ind. Ant. Vol. xxxi, P. 253, f 1.

యమునందలి గ్రామములను బ్రాహ్మణులకు దానముచేసియున్నారు. వారిలో మొట్ట మొదటివాఁడు మన జయసింహవల్లభుఁడు. ఈతని మఱియొక శాసనమువలన నితఁడు 'వెంటూరు' గ్రామమునకు దక్షిణమున రెండు కోసుల(గవ్యూతి)దూరముననున్న 'కొంబఱు' గ్రామమును దానము చేసినట్లు తెలియుచున్నది[1]. అదికూడ నీకండేఱువాటి[2] విషయములోనిదే. నరేంద్ర మృగరాజ బిరుదాంకితుఁడైన రెండవ విజయాదిత్యుడు[3], మొదటి చాళుక్య భీమవిష్ణువర్ధనుఁడు[4], అమ్మరాజ విష్ణువర్ధనుఁడు[5], రెండవ చాళుక్యభీముఁడు[6], అమ్మరాజ విజయాదిత్యుఁడు[7]—వీరందఱి దాన శాసనములలోను ఈ విషయము పేర్కొనంబడినది. అనఁగా పై నుడివినవారందఱు ఈ విషయములోని గ్రామములను దానముచేసిన వారే. మొదటి చాళుక్య భీమవిష్ణువర్ధనుని రెండుశాసనములలో[8] ఉత్తరకండేఱువాటి విషయమని పేర్కొనంబడి యుండుటచేత నీ విషయము ఉత్తర కండేఱువాడి యనియు, దక్షిణ కండేఱువాడి యనియు రెండు విభాగములతో వ్యవహరింపఁబడుచుండిన ట్లూహింపనగును. అమ్మరాజ విజయాదిత్యుని రెండు శాసనములలో[9] గుడ్లకండేఱువాడి యను విషయము పేర్కొనంబడినది. నమ్ముమ్మారు, తాండికొండ (తాడికొండ), అమ్మలపూ(ం)డి, గొల్లపూ(ం)డి, ఆసువులపట్టు అను గ్రామము లన్నియు నీవిషయములోనివని తెలుపఁబడినది. గుడ్లకండేఱువాడి యనునది కండేఱువాడికి నామాంతరముకాని లేక కండేఱువాడి విషయములోని యొక భాగముయొక్క పేరుగాని అయి యుండవచ్చును. కండేఱువాడికే గుడ్లకండేఱువాడియ్యనియుఁ బేరైయుండునని వా యభిప్రాయము. గుడ్లకండేఱువాడియనఁనేమి? ఒకవేళ గుళ్లు, గోపురములు ఈవిషయమునఁ బెక్కులుండుటచేత దీనికి గుడ్లకండేఱువాడి విషయమని పేరు కలిగెనేమో. 'గుడి' పదమునకు బహువచనరూపమైన యిప్పటి గుళ్లు అనుదానికి పదునొకండు, పండ్రెండు శతాబ్దములలో 'గుడ్లు' అను రూపముండినట్లు శాసనములవలన మనకుఁ దెలియవచ్చుచున్నది. గుడ్లు, మడ్లు, మామిడ్లు, ఊడ్లు, అమృతపడ్లు— ఇట్టి బహువచనరూపములు పదునొకండు, పండ్రెండు శతాబ్దములందలి శాసనములందుఁ గన్పట్టును(రాజరాజనరేంద్రసంచిక చూడుఁడు పుట ౬౦). ఇట్టి రూపము లానాఁటి శాసన

---

1. Cp. no 11 of 1917—18.

2. మూలమున 'కణ్ఠేఱవాటి' యని కలదు. ఇదియే కండేఱువాటియని తరువాత వ్యవహరింపఁబడుచువచ్చెను. కణ్ఠేఱువాటి కండేఱువాటియగుటకు చూడుఁడు రాజరాజనరేంద్ర సంచిక, పుట ౬౧.

3. Ep. Ind. Vol V p 118; S. I. I. Vol I. p 33.

4. Ep. Ind. Vol. V p 127; Cp. No. 1 of 1913—14.

5. S. I. I. Vol. I p 40.

6. S. I. I. Vol. I p 45.

7. Cp No. 5 of 1912—13; Cp. No. 11 of 1914—15.

8. Ep. Ind. Vol. V p 127. Cp. No. 1 of 1913—14.

9 Cp. No. 5 of 1912—13. Cp. No. 11 of 1914—15.

వాఙ్మయమున పద్యములందును గలవు [1]. (...... వఖండ [illegible] చెట్టిగొంట్టూర(ం) చెఱువ్యలు(ం) చెఱ్కు గుడ్ల విల్వ...). అందువలన మన యీనిడ్రుట్టు శాసనము ననుసరించి 'గుడ్ల' అనురూపము క్రీస్తుశక మొదవ శతాబ్దమునుండి వ్యవహారములో నుండినట్లును, ఆ రూపము పదనాల్గవ శతాబ్దమునుండి పండ్రెండవ శతాబ్దమువఱకు మాఱకుండ వచ్చుచున్నట్లును ఊహింపవచ్చును. విజయాదిత్యన రేంద్ర మృగరాజాది చాళుక్య భూపతుల పైశాసనములను బరిశీలించిన ఈవిషయమునందలి యీ క్రిందిగ్రామముల పేళ్లు మనకుం దెలియుచున్నవి.

## కండేఱువాటి విషయము

గ్లొంటూరు : దీనికి దక్షిణమున నాలుగు మైళ్లదూరమున కొంబలు

కొఛల్లి

కొట్టపలు : దీనికి తూర్పున అతుగుపలు
దక్షిణమున వానపట్టు లేక వామపట్టు
పడుమట వాణ్టుపెదయు (?)
ఉత్తరమున గనయ్యార్బు (?)

వణ్టుపెదయు: దీనికి తూర్పున కొట్టపలు
పడుమట అమాటి

గొంటూరు: దీనికి తూర్పున గొంగువ
దక్షిణమున గోణయూరు
పడుమట కలుచెఱువులు
ఉత్తరమున మడపల్లి

## ఉత్తర కండేఱువాటి విషయము

ఇడతలూరు
మాకిపట్టు

## గుడ్ల కండేఱువాటి విషయము

| | |
|---|---|
| నమ్మూరు | గొల్లపూండి |
| గోరండ | అమ్మలపూండి |
| తాండికొండ | అసువులపట్టు |

కండేఱువాడి విషయమునందలి యున్ని గ్రామములు మనకుం దెలిసినను ఇది యిప్పటి యే తాలూకాలకు వర్తించు నన్న సంగతిని నిర్ధారించుట కష్టముగ నున్నది. ఏలయన ఈపై వాటిలో చాలగ్రామము లిప్పుడు గుర్తింపనసాధ్యముగ నున్నవి. గొంటూరు, నమ్మూరు, గోరండ, తాండికొండ, గొల్లపూండి అనుగ్రామములు మాత్రము మనకు గుర్తింపబడగును. మొదటి నాలుగు గ్రామములును ఇప్పటి గుంటూరు తాలూకాలోం గాన్పించుచున్నవి. వీటికి గుంటూరు, నంబూరు, గోరంట్ల, తాడికొండ అనునవి యిప్పటిపేళ్లు, అమ్మలపూండి యిప్పటి అమ్మనబ్రోలుగను, గ్లొంటూరు ఇప్పటి వెల్లటూరుగను గ్రహించిన చో ఇప్పటి ఒంగోలు, రేపల్లె తాలూకాలలోగూడ నీవిషయము వ్యాపించి యుండవచ్చును. గొల్లపూడి యిప్పటి బాపట్ల తాలూకాలోని గొల్లపూడి కావచ్చును. ఇందువలన నీకండేఱువాడి విషయము గుంటూరు, బాపట్ల, రేపల్లె, ఒంగోలు తాలూకాలలో వ్యాపించియుండినట్లూహింప నగును. గుడ్ల కండేఱువాడియు, కండేఱువాడియు నొక్కటియేయని మన శాసనమువలన నిర్ధారణ చేయవచ్చును. గుంటూరు తాలూకాలోని నిడమర్రు గ్రామము కంతేటికి తూర్పుదిక్కుగ

1, S. I. I Vol. IV No. 749.

ఏనిమిది మైళ్ళదూరమున నుండుటచేత శాసనమునఁ జెప్పఁబడిన నిడుబఱు, గండేఱులు పైనుడివిన నిడమఱ్ఱు, కంతేరులై యుండునని నిశ్చయింపవచ్చును. ఇవి గండేఱువాటి విషయములోనివి[1]: ఇప్పటి గుంటూరు తాలూకాలోనివి. గుడ్లకండేఱువాడిలోనివని తెలుపఁబడిన నమ్మూరు, తాడికొండ, గోరంట గ్రామములును గుంటూరు తాలూకాలోనివే. అందువలన గుడ్లకండేఱువాడియు, గండేఱువాడియు నొక్కటియే యనుట స్పష్టము. మిగిలిన గ్రామములుకాని, నదులుకాని, ఉత్తరకండేఱువాడి విషయముకాని గుర్తింప సాధ్యమగుటలేదు.

### శాసనకాలము

శాసనము కార్తిక పౌర్ణమినాఁడు పుట్టినది. ఏకార్తిక పౌర్ణమియో నిశ్చయముగఁ దెలిసికొనుటకు సాధనములు లేకపోవుటచేత నిది జయసింహవల్లభుని పరిపాలన కాలమగు క్రీ. శ. ౬33-3౪——౬౬౧-౬౨ సంవత్సరముల నడుమ మాత్రము పుట్టినదని చెప్పనగును.

### ఘటికలు

ఈశాసనమున మండశర్మ 'ఘటికా సామాన్యుఁ'డని తెలుపఁబడినది. 'ఘటికా సామాన్యుఁడు', 'ఘటిక' అనుపదమున కర్థమేమి? ఇంకను ఆపదమునకు నిశ్చయమైన యర్థము తెలియదు; కాని యూహింపవచ్చును. ఘటికాస్థానములు చాల శాసనములలో వచ్చును. పల్లవనందివర్మ కేలూరు పాళయం తామ్రశాసనము[2] వీరకూర్చవర్మ యొక్క కుమారుఁడగు స్కందశిష్యపల్లవుఁడు బ్రాహ్మణుల ఘటికాస్థానమును బోషింప వలసిన భారమును సత్యాశ్రయ భూపతినుండి గైకొనెననియు, కాంచీపురము రాజధానిగఁ బరిపాలించిన రెండవ నరసింహవర్మపల్లవుఁడు మొదటి నరసింహవర్మవలెనే బ్రాహ్మణుల ఘటికాస్థానమును నిర్మించెననియుఁ దెలుపఁబడి యున్నది. దక్షిణాపథమునఁ బరిపాలనము నెఱపిన కదంబరాజులకు మూలపురుషుఁడగు మయూరశర్మ తన గురువగు వీరశర్మతో పల్లవరాజధానికి (అనఁగా కాంచీపురమునకు) బయలుదేరి వెళ్లెననియు, అతఁడు ప్రవచనమున గొప్ప పండితుఁడు కావలెనను కోరికతో అన్ని 'ఘటికల'కును వెళ్లి గొప్ప ఆశుతర్కుఁడయ్యెననియు నొకశాసనము[3] తెలుపుచున్నది. భరతక్షేత్రమున కలంకారభూతమైన కర్ణాటసీమలోని కుంతలదేశము 'ధర్మక్కె నెమ్మక్షుం భోగక్కాగరము

---

1. కంద్రవాడియని యొక విషయముకలదు. గుంటూరుమండల మందలి మందడము మొదలైనవి ఈవిషయములోనివి. కండేఱువాడి పేరే తరువాత కంద్రవాడియని, మాఱియుండవచ్చును. అట్లయిన కండేఱువాడి, కంద్రవాడి విషయములు రెండు నొక్కటే. అయినను ఈవిషయ మింకను బరిశోధింపవలసి యున్నది.

2. Cp. No. 24 of 1910—11.

3. Ep. Carn. Vol. VII, Sk 176.
ఏవమాగతే కదంబకులే శ్రీమాన్ బభూవ ద్విజోత్తమః, నామతో మయూరశర్మేతి శ్రుతిశీల శౌచాద్యలంకృతః, యః ప్రయాయ పల్లవేంద్రపురీం గురుణాసమం వీరశర్మణా, అధిజిఘాంసుర్ ప్రవచనం నిఖిలఘటికాం వివేశ తార్కికః.

మూడ ఘటికాస్థానముం' అని ధర్మమునకు సహకారకములును, భోగములకాకరములు నగు ఘటికాస్థానములకు నెలవని మఱియొక శాసనము దెలుపుచున్నది[1]. హొంజర పట్టణము మహాఘటికాస్థానమని వేఱొక శాసన మీక్రిందిరీతిని దెల్పుచున్నది[2].

"హొంజెరపట్టణద మహాఘటికాస్థానద
శ్రీసోమేశ్వర దేవర సన్నిధానదల్లి"

ఉత్తంకుఁడు సామవేదమునఁ జెప్పినరీతిని ఘటికాశ్రమ మేర్పాటుచేయఁబడినదని మఱియొక శాసనమున నీవిధమున నున్నది.[3]

"ఉత్తంకోక్త్యా సామవేదే వ్యధత్తాం ఘటికాశ్రమమ్."

ఈవిధమున నున్న శాసనముల నన్నిటిని సమన్వయించి మనము ఘటికాశ్రమార్థము నూహింపవలసియుండును.

ఘటికాశ్రమము వైదిక విద్యాప్రదానముఁ గావించు విద్యాశాల యనియు, ధర్మాధర్మనిర్ణయము చేయు ధర్మాసనమనియు, విద్యాశాలయు ధర్మాసనము నగుట నది రాజపోషితమై భోగముల కాకరమైన స్థానమనియు, ఉత్తంకుఁడు సామవేదమునఁ జెప్పినరీతి నేర్పాటు కావింపఁబడు ననియు, నిశ్చయించుటకు వీలుగ నుండుట చేత నది యొక విద్యాపీఠమనియు, అగ్రహారముకంటె గొప్పదనియు, ధాన్యకటకము, నాలందవంటి విశ్వవిద్యాలయముల కంటెఁ జిన్నదనియు సదాధారముగ నూహింపవచ్చును. ఆకాలపు విద్యాపీఠములకు ఘటికలు లేక 'ఘటికాశ్రమములు' లేక 'ఘటికాస్థానములు' అని పేరుండినట్లు మన కీశాసనములవలన విస్పష్టమగుచున్నది. ఘటికా సామాన్యుఁడన ఇట్టి విద్యాపీఠమునందలి యొక ఆచార్యుఁడనియో, సభ్యుఁడనియో చెప్పవచ్చును. (కేతనకవి యింటిపేరునఁగూడ మనకు ఘటికపేరు వినవచ్చును. అతనియింటిపేరు మూల ఘటికవారు కదా).

1. Ep. Carn Vol. vii. Sk. 197 2. Ep. Carn Vol. xii. Si. 23 3. Ep. Carn Vol. v. Cn. 178



కీర్తిశేషులగు శ్రీయుత సర్ పిట్టి త్యాగరాయ శ్రేష్ఠిగారు

ప్రథమ అఖిల భారత దేవాంగమహాసభ



ఆహ్వానసంఘాధ్యక్షుడు

శ్రీయుత, పి. టి. కుమారస్వామి గారు, బి. ఏ.



అధ్యక్షుడు

శ్రీయుత్, యస్. సి. వెంకటప్ప గారు, బి.ఏ.,బి.యల్.

# మూలము[1]

మొదటిరేకు : రెండవప్రక్క.



[ ] ఈకుండలీ కరణమున మూలములోఁగొంచె మరిగిపోయి స్ఫుటముగ లేని యక్షరములు ఉంచఁబడినవి.

[*] ఇట్టి గుర్తుగల కుండలీకరణమున మూలములో నుండవలసిన యక్షరములు లేకపోవుటవలన నిపు డుంచఁబడినవి.

( ) ఇట్టికుండలీకరణమున నున్న యక్షరములు మూలమున అనవసరమై ఎక్కువగుటచే తీసివేయవలసినవి.

౧. స్వస్తి(శ్రీ)మదసనపురవాసకాత్ స్వామిమహాసేనపాదానుధ్యాతానాం హారితీ పుత్రాణాం మానవ్య

౨. సగోత్రాణాం మాతృగణ[2]పరిపాలితానాం అశ్వమేధయాజినాం చలుక్యానాం విశుద్ధవంశోద

3. యగిరిశిఖరోదితక్షితిపత్యహిమదీధితేః సకలజగదాత్తి [ర్*] హారకవర్మణః

౪. (శ్రీ)కీతి[ర్*] వర్మణః ప్రియనప్తా శశలాఞ్ఛనస్యేవ సకలజగన్ధునో[3](?) నయనాన

౫. న్ద(న)కరస్య స్వరూపలావణ్యావర్జితమకరధ్వజస్య మకరధ్వజాపరనామ్నః (శ్రీ)మద్దైదంయుగీన

౬. విష్ణోః విషణు[4]వర్ధనమహారాజస్య ప్రియతనయః ప్రవర్ధమానోదయప్రతాపోపనతసమ

---

1. నాదగ్గఱనున్న రేకులననుసరించి.
2. ॰గణపిరిపాలితానాం అని శాసనము చెక్కినవాఁడు వ్రాయఁబోయి 'ప'కు ఎడమచేతిపైపు కొంచెము వంపిచ్చినాఁడు. కాని పూర్తిగ 'పి' వ్రాయలేదు.
3. జగజ్జన (?) అని.
4. విష్ణువర్ధన॰అని చదువవలెను

రెండవరేకు : మొదటిప్రక్క.



౭. స్త సామన్తమకుటతటఘటితమణిమయూఖమఞ్జరీపుంజపింజరితచరణారవిన్దయుగలః నిజ

౮. గుణదీధితికలాపకలియుగధ్వాన్తనిరాకరిష్ణుః ఆఖణ్డల ఇవాఖణ్డితపౌరుషః ప

౯. రమబ్రహ్మణ్యో మాతాపితృపాతానుధ్యాతః శ్రీజయసింహవల్లభమహారాజః గణ్డే

౧౦. అవాట్యాం వ్యాఘ్రనద్యా శ్చోత్తరతః వన్నెఅనద్యాశ్చ తీరే గణ్డేఅరాజ ధాన్యాః

౧౧. పూర్వదిగ్విభాగే గవ్యూతద్వయే నిడుబఅనామగ్రామ మధివసతః కుడుంబినః సమవేతా

౧౨. నాజ్ఞాపయతి విదితమస్తు వో యథాసనపురస్థాననివాసినో ఘటికాసామాన్య

5. ॰పాదాను॰ అని చదువవలెను.



౧౩. స్య సపదక్రమానుక్రమాధీత వేదద్వయస్య సకలోప్వసప త్పురాణేతిహాసానేక ధర్మశాస్త్ర

౧౪. విదః[7] మణ్ణశర్మణః[8] పౌత్రాయ స్వపితురధికగుణసంపద్గణా[9]పార్జితనిర్మలయ శోవిశే

౧౫. షేణ ఆత్మనో న్వయ మలమలంకరిష్ణోః అగ్నిష్టోమయాజినః శివరుద్రశర్మణః

౧౬. పుత్రాయ ద్వివేదాధ్యాయినే యజ్ఞాగమోపనిషన్మస్త్రార్థేతిహాసపురాణధర్మ

౧౭. శాస్త్రవిమలీకృతవితతమతయే హారీతసగోత్రాయ తైత్తిరీయసబ్రహ్మచారణే[10] కాటిశర్మణే

౧౮. కార్త్తికపౌర్ణమాస్యాః[11] మాతాపిత్రో రాత్మనశ్చ యశఃపుణ్యాభి విధ[12]యే సంప్ర[13]త్తోయం సదుప

---

7. లేఖకుడు ముందు 'విదిః' అని వ్రాసి పిదప విదః అని దిద్దెను.

8. లేఖకుడు శమ్మణః అని వ్రాసి పిదప శర్మణః గ దిద్దెను.

9. °సంపద్గణోపార్జిత° అని చదువవలెను.

10. °బ్రహ్మచారిణే అని చదువవలెను.

11. పౌర్ణమాస్యామ్ - అని.

12. °పుణ్యాభివృద్ధయే - అని.

13. సంప్రదత్తోయం - అని.



౧౯. ఉనామగ్రామః [॥*] నాస్యబాధాకరణీయా [॥*] ఆజ్ఞప్తిరత్రాయ్యర్యమనోభి రామః శ్రీచీయమా[ర్యస్సుజ?*]

౨౦. నాశ్రయోయం [।*] భూపేన్ద్రనీతిప్రవిభాగదక్షః[వేదాఙ్గవి]త్సర్వకలాన్తరజ్ఞః[14] [॥*] అత్రవ్యాసగీతాః [॥*] స్వదత్తాం ప

౨౧. రదత్తాంవా యత్నాద్రక్ష యుధిష్ఠిర [।*] [మహీం మ] హీమతాం శ్రేష్ఠ దానా చ్ఛ్రేయోనుపాలన[మ్॥ బహు*]

౨౨. భిర్వసుధాదత్తా బహుభిశ్చానుపాలితా [।*] యస్యయస్యయధా[15]భూమి [స్తస్యతస్య*]

౨౩. తదాఫలః[16] [॥*] షష్టిం వర్షసహస్రాణి స్వర్గే[17]మోదతి భూమిదః [।*] ఆక్షేప్తా చాను [మన్తాచ*]

౨౪. తాన్యేవ నరకే వసేత్ [॥*]

14. 'కలాన్తరజ్ఞః'—అని చదువవలెను.
15. యదా - అని.
16. ఫలమ్ - అని.
17. స్వర్గే - అని

# ఋతు లక్ష్మి

మిత్తింటి నరసింహమూర్తి గారు [కవితానికేతనము]

తొలకరి మబ్బులు తొంగలి ఱెప్ప
తెరచి లోకములెల్ల తేరి చూడంగ
మెఱపుల కాంతులు మెయి నిండికొనగ
మేఘుని కన్నీరు మేర లేకున్న
భూదేవి దేహంబు పొంగి పొరలుచు
పులకరించినయట్లు మొలకలు దోచె.

పచ్చిక బయళులు ఫలపుష్ప తతులు
భూదేవి తేజమ్ము ప్రోగువెట్టంగ
సఖుడొడ్డు కన్నీట స్నానంబు జేసి
పచ్చిక బయళుల బట్టలుగట్టి
కలువ రేకులు తన కనుదమ్మి లొప్ప
తియ్యని మందార తిలకమ్ము దిద్ది
లేపల్లవంబులతో పాదములకు
శతపత్రరజమును జక్కగ బూసి
సొగసైన కలువల తొగరులు దిద్ది
తేటైన సస్యంపు బీటపై నుండి
పారిజాతంబులు పై బోసికొంచు
చిరునవ్వు మోమున చిగురు వెట్టంగ
మోహంపు జూపుల మోహినీ దేవి
అంతరిక్షమునుండి అవనికి దీవి
లోకంబులను తన లోగొంచు చూచు.

నేరేడు ఫలియించి నీలాలు గురియు
పండిన జాములు బహుమతు లిచ్చు
కనువిచ్చి సీతలు కానుక లంపు
ఫలియించి బుడమలు పరిమళ మిచ్చు
పూచి జనుము తల యూచుచు నుండు
చెముడు కాకులు చేరి శ్రుతి పట్టుచుండ
జాముల మెసవెడి రామచిలుకలు
గోరువంకలు నింపు గొలుపగా గూయు
నీలకంఠ రవంబు నింగిని ముట్టు
కొమ్మల గట్టుల గూలంగ నేయు
నాబోతు ఱంకెలు నాకాశమంటు
ఓంకార నాదంబు లొక్కట మ్రోగు
వేణువు చేబట్టు వెట్టి గొల్లండు
పసిరిగ మేసెడి పశువుల మంద
బీడున తిరిగెడి పిఱికి మృగములు
నెమరు వేయుట మాని నీవంక జూచు
మొఱవెట్టి తల్లులదరి జేరు లేగ
లాశ్చర్యమందుచు నట్టె నిలచియు
నానంద సాగర మందున దేలి
చూచు మైమఱచిన చోద్యంబు తోడ

# ఫైజీ పారసీవచనమా?

ఉమర్ అలిషా కవిగారు

స్వస్తిశ్రీ క్రోధనసంవత్సర చైత్రమాస "భారతి" పత్రిక (సం. ౭. సంచిక ౪)లో ౧౧౭ వ పేజీ తరువాతగల చిత్రము "ఫెయిజీ" కృతఫారిషీ రామాయణమునందలి చిత్రము అనివేసి దానివెనుక సువర్ణ వికారమైన పటమున పారసీలిపిగల వచన మొకటి గలదు. అది నేనీక్రింద తెలుగులిపితో వ్రాసి దాని ప్రతిపదార్థమును వివరించితిని.

ఇది రామాయణవిషయము గాదు. భారతమునకు సంబంధించినది "ఫైజీ" కృతము కాదు. ఫైజీ, పారసీలో రామాయణ భారతములు, హర్షుని నైషధము మున్నగు సంస్కృతగ్రంథము లెన్నియో పద్యకావ్యములుగా వ్రాసెనుగాని వచనములోఁ బెట్టలేదు. ఇది "బదౌనీ" అగ్బరాస్థానమున రచించెనేమోకాని చిత్రపటమునకును ఈలిపియందలి విషయమునకును సంబంధ మంతగా నగుపడదు. అయినను విమర్శకుల కావిషయమువిడిచి దానిని తెలిఁగించుచున్నాఁడను.

బాదజా=అటుతరువాత

ఇంద్రాబ బెహిష్తరా=ఇంద్రుఁడు స్వర్గమునుండి

దర్, కౌరవాయెజర్రీక్=జల్తారు బట్టలచే నలంకృతులగు కౌరవుల మధ్య

హాజిర్ సాఖ్త = ప్రత్యక్షమై

ఒ, కిషన్ రా=శ్రీకృష్ణునకు

గొసుల్ దాద్=అర్ఘ్యమిచ్చెను.

ఓగవానెబుజర్గి, ఒ, షీర్ దార్=పాలునిచ్చే పెద్ద ఆవులు

అజ్, గల్లహాయె, ఖుద్, బరో మదా=తమ మంద నుండి బయలుదేఱివచ్చినవి.

పస్, కిషన్, ఆమదన్=తరువాత కృష్ణులు వచ్చినారు.

ఒ, షీరెఖుద్=మఱియు తమపాలను—

గస్ పల్ దాదన్ద=(అర్ఘ్యము) సమర్పించినవి—

ఒ, అజ్ షాఖయె బుజర్గ=పెద్దకొమ్మలు(గలవృక్షములు)

కొ, దర్, నవాహియె ఆకోః=ఆపర్వతప్రాంతములయందు

బూదన్ద=కలవు.

ఆబెరవాగ ష్త=నీళ్లు (దాహము) అయినవి. (ఇంద్రునకు)

ఒకిషన్=కృష్ణులు

ఒ, ఆ, ఆబెషీర్=ఆ (ఆవుల) పాలనే నీళ్లుగా

గస్పల్ కర్ద= అర్ఘ్యమిచ్చినాఁడు (అనఁగాదాహమిచ్చి పూజించెనని అర్థము)

ఒ, అ, బెహిష్తి=మఱియు, స్వర్గ మునుండి

దేవత హా గల్ఫషాన్ దన్ద=దేవతులు పుష్పవృష్టికురిసిరి.

ఒ నఖ్హార్ హా=భేరీని నాదములు

నవాఖ్ తన్=చేసిరి.

దర్ కేసరా=కేసరులమధ్య

సనాగుఫ్తన్ద=స్తోత్రముచేసిరి.

ఒ, అతరాఫె ఆలం=ప్రజలచుట్టు

ఒ, దరియాయె అమాన్=ప్రవహించునది

ఒ, దరఖ్తానె జంగల్=ఆరణ్యకఫలవృక్షములు

2. ఒ, వోష్ దిమయ్యూర్ =జంతు విహంగసంతానములు

ఖుష్ హాక్ గష్తన్ద=సంతోషాతిశయమున సంచరించినవి (సంచలించినవి)

ఓ, బాజ్ = అటుతరువాత

ఇందర్ = ఇంద్రుఁడు

ఓ, కిష్‌న్ గుఫ్‌త = కృష్ణునితో (ఇట్లని చెప్పెను)

కే = ఏమనియనిన

అజ్, ఆమదనె, మా = మేమువచ్చుటచేత

షుమా = మీరు

బాదషా షుదేన్ = సామ్రాజ్యవంతులు కాగలరు.

ఓ. ఇ ఖైమాసె దీరన్ దారేం = మేము రెండవవిన్నపము ఉంచుచున్నాము; అనఁగా చేయుచున్నాము.

కే జూద్ = సత్వరము

కనస్‌రా = కంసుని

కేసిరా = కేసిని

విరాసతె దియత్‌రా = సామ్రాజ్యమునుండి

బెకషేన్ = తీసివేయుము.

బాదషాహె రూయెజమీన్ = విశ్వప్రపంచ చక్రవర్తులు (అగువారు)

బేకునేన్ = పరాఙ్ముఖులై పోవుదురు.

ఓ, పిసర్ అమాఖున్‌రా = మీ మేనమామ కుమారుఁడైన

కే అర్జున్ బాషద్ = ఏ అర్జునుఁడైతే కలఁడో

ఊరా = అతనిని

వజూదె మన్ దా నాదేద్ = నా తనువుగా భావించుము.

బరూ, మెహర్బాన్ ష వేన్ = అతనిపై దయగలవాఁడవగుము.

కే. ఊ = ఎందుచేతనంటే, యాతఁడు

బఖువ్వతెషుమా = మీ (తోట్పాటను) బలమువలన

ఖిద్‌మత్ హాయె ఖూబ్ = మంచి పరిచర్యలను

బజాయె ఖాహద్ ఆవుర్‌ద = చేయుటకు చాలినవాఁడగును.

బఖువ్వతెషుమా = మీ (సహాయమను) బలమువలన

జంగె భారతారా = భారతయుద్ధము

ఖూబ్ ఖాహేద్ కర్దా = బాగుగ చేయఁగలఁడు.

ఒ షుమా = మతీరుమీరు

బ, ఇత్తిఫాకె, ఆ, అర్జున్ = అర్జునుని మైత్రివలన

రాజహాయెబు జర్గ్ = పెద్దపెద్దరాజులను

ఖాహేద్, కుష్త = సంహరింపగలరు.

ఓ, మన్. ఫేష. తమాం దేవతా = నేను సమస్త దేవతాసమక్షమున

దర్, కేసరా = కేసరులమధ్య (నిలిచి)

గుఫ్తాబూదంకే = నేనుచెప్పునది యేమనిన

అర్జున్ పిసరెమన్ అస్త = అర్జునుఁడు నాపుత్రుఁడు

ఓ, అజ్, షికమ్ కుంతి = అతఁడు (నాంలన) కుంతికి

ముతవల్లిద్ షుదా అస్త = పుట్టినాఁడు

రాజహారా ఖాహద్‌కుష్త = అనేక రారాజులను సంహరింపఁగలఁడు.

ఓ, జంగహాయె అజీంఖాహెద్‌కర్ద = పెద్ద పెద్ద యుద్ధములను చేయును.

అగర్ షుమా = ఒకవేళమీరు

ఊరా = అతనికి

ఖువ్వతెఖుద్ ఖాహాదాద్ = మీ శక్తికొలఁదిసహాయము చేయునెడలఁ (అనగా మీరు సహాయము చేసినచో పెద్ద పెద్ద రాజులను సంహరించును. అనిపైదానితో అన్వయము)

సఖునెమన్ = నామాటలు

దర్ దేవతహా = దేవతలమధ్య

రాస్‌తఖాహెద్ షుద్ = నిజముకాగలవు.

ఓ, అగర్. న = ఒకవేళ (నీవు అర్జునునకుతోడ్పడక) పోయినయెడల

అజ్ దస్తె. ఊ = అతనిచేత

హీచ్ కార్, నఖాహదామద్ = ఏపనియుకానేరదు

అర్జున్ = అర్జునుఁడు

గర్ కమాన్ దారీ = బాణవిద్యయందు

నజీర్, నదారద్ = అనుపమానుఁడు.

మగర్ షుమా = కాని మీరు (ఒక్కరే)

నజీర్, ఊ. బాషద్ = అతనిని పోలగలరు.

బి, దర్ జంగెబిరాదర్ = ఆ, సోదరులయుద్ధ మధ్య (అనఁగా భారతయుద్ధమునందు)

ఒ, మురరొ, ఊ=జానిబ్ (అర్జునుని) రక్షకులు, మున్నగు (అన్నిటికి)

షుమా నేస్ =మీరై యున్నారు.

నిగాహబానీయె. ఊ=అతని (అర్జునుని) కాపాడుట

అజ్ బరాయెఖాతిరెమన్ =నా గౌరవార్థమై (అనఁగా నాసంతుష్టికై)

ఖాహెష్ కర్దు=చేయఁగోరినాను

ఒ, ఊ. రా. =మఱియు నతనిని

బజాయెమన్ =నాస్థానమున (నన్నుగా)

బె పసంద=సన్మానించుము.

ఒ, మరా =మఱియు నన్ను

బజాయె జా నెఖుద్ =నీప్రాణమువలె

తసవ్వుర్ బెకునేద్ =భావింపవలెను.

ఒ అగర్ షుమా=ఒకవేళ మీరు

నిగాహబానీయెఅర్జున్ బెకునేద్ =అర్జునుని కాపాడేయెడల

మర్గెహం=మరణమున్ను

నజ్ దీకెఊ=అతని సమీపమునకు

నఖాహద్ ఆమద్ =రా నేరదు.

ఓ, బాదజీ=తరువాత

ఆ, అర్జున్= ఆ యర్జునుఁడు

కె, ఫర్ జందెమన్ =నా పుత్రుఁడు.

ఒ, పిసరె అమ్మె షుమా స్త=నీ మేనమామకొడుకు

హంరా షుమా=మీవెంట

ఖాహద్ మాన్ ద=ఉండనిచ్చుయించును.

ఒహర్ గా=ప్రతిచోటను(క్షణములో)

షుమా=మీరు

కనస్ రా=కంసుని

ఖాహద్ కుష్త=చంపివేయగలరు.

తమాం, రాజహాయెదూయెజమీన్ = సమస్తరాజ ప్రపంచము.

దుష్మన్ షుమాఖాహద్ షుద్ =మీకు శత్రువులై పోవుదురు.

ఒ, అ, అర్జున్ =మఱియు నాయర్జునుఁడు

బ, ఖువ్వతెషుమా=మీశక్తివలన-(అనఁగా నీసహాయమువలన)

ఆ-హమా రా =వారినందఱిని,

ఖాహద్ కుష్త=సంహరించివేయును.

అగర్ షుమా=ఒకవేళ మీరు (అనఁగా ఎల్లప్పుడు మీరు)

మరా, ఒ, దేవతాహారా=నన్ను దేవతలను

అజ్ ఖుద్ మీదానేద్ =మీవారిగ నెంచుఁడు

బర్ అర్జున్ =అర్జునునిపై (నీవు)

మెహర్ బాన్ బాషేద్ =కృపగలిగి యుండవలయును.

జూ, ఈసఖునా రా= ఈప్రకారము-ఈమాటలను

ఇందర్ గుఫ్త=ఇంద్రుఁడు చెప్పఁగా

ఒ, కిషన్ షునీద్ =కృష్ణుఁడు వినెను.

అని ముగింపఁబడియెను. కొన్ని సందర్భములర్థము కాలేదు. పైని ఒకటిరెండుచరణములు తరువాత శ్రీకృష్ణునిబాల్యమున జరిగిన కంసవధ. ఇవియెట్లు సమర్థనీయములో, ఊహింపవలసి యున్నది.



# పల్లవులు

న్యాయమూర్తి వేపా రామేశం గారు

కట్టకడపటి ఆంధ్రరాజులలో నొకరిద్దఱికి పల్లవులతోఁ సంబంధ ముండినదుండవచ్చును. ఆంధ్రరాజ్య మంతరించిన వెంటనే అధికారమునకువచ్చినవారు పల్లవులు. ఆంధ్రదేశముఁ బరిపాలించిన పల్లవరాజుల వంశావతార క్రమమునుసంతృప్తికరముగ నిర్ణయించుట చాలకష్టము. మనకు దొరకినపల్లవ శాసనముల కొకదానికొకటి సంబంధము కనఁబడదు. అవి యిక్కడ నొకటి, అక్కడ నొకటి, వెదజిమ్మినట్టుగ దొరకినవి. వాటిననుసరించి సరియైన చారిత్రకవంశావతారమును నిర్మించుటకు వీలులేకుండ అతుకు కలియకుండ నున్నది. (పల్లవులవంశోత్పత్తిక్రమమునుగుఱించి స్పష్టముగ మన కేమియుఁ దెలియరాదు. పల్లవనామమునుగుఱించియు, వారి వంశోత్పత్తి క్రమమునుగుఱించియు పెక్కు సిద్ధాంతములు కలవు. అందువలన నిప్పుడు చేయఁదగినది వారిశాసనములపట్టిక నిచ్చుటయే.

౧. పల్లవయువమహారాజు శివస్కందవర్మయొక్క మైదవోలుశాసనము. (ఇదియిప్పుడు మద్రాసు మ్యూజియములోఁ గలదు.) ఇది యాతనికి పూర్వము పాలించుచుండిన మహారాజుయొక్క పదవపరిపాలన సంవత్సరమున కాంచీపురమునుండి యొసంగఁబడినది. ఎ. ఇం. ౬. పు. ౮౪; కీల్. ప. నెం. ౬౧౭; అ. లూ. నెం. ౧౨౦౫; భాష- ప్రాకృతము.

౨. పల్లవధర్మ మహారాజాధిరాజ శివస్కందవర్మయొక్క ఎనిమిదవపరిపాలన సంవత్సరమున నొసంగఁబడిన హీరహడగల్లి శాసనము. ఇది కాంచీపురమునుండి యొసంగఁబడినది. ఎ. ఇం. సం. ౧. పు. ౨. ౯. ౪౭౯; ఎ. ఇం. సం. ౨. పు ౪౮౩, ౪౮౫; ఎ ఇం. సం. ౬, పు ౮౮; కీల్. ప. నెం ౬౧౮; అ. లూ. నెం ౧౨౦౦. భాష- ప్రాకృతము.

౩. బుద్ధ్యంకురుని తల్లియు, పల్లవయువమహారాజు విజయబుద్ధవర్మ రాణియునగు చారుదేవియొక్క గుణపదేవయ్య (గుంటూరు జిల్లా) శాసనము. (ఇది యిప్పుడు బ్రిటీషు మ్యూజియములోనున్నది.) ఇది మహారాజ విజయస్కందవర్మ పరిపాలనములోనిది. ఇం. ఆం. సం. ౯. పు ౧౦౦; సం ౫. పు ౧౭౪; ఎ. ఇం. సం ౧. పు ౨; ఎ. ఇం. సం ౬. పు ౮౮; ఎ. ఇం. సం ౭, పు ౬౭, ౬౯; ఎ.ఇం. సం. ౮. పు ౧౪౩; కీల్. ప. నెం ౬౧౬; అ. లూ. నెం ౧౩౨౭; భాష- ప్రాకృతము, సంస్కృతము.

౪. బృహత్ఫలాయన గోత్రీయుఁడైన మహారాజ జయవర్మ కొండముది శాసనము.

(ఇప్పుడు బ్రిటీషు మ్యూజియములోనున్నది.) ఇది కూదూరనగరమున విజయస్కంధావారమునుండి యొసంగఁబడినది. ఇది పదవ సంవత్సరమున వ్రాయఁబడినవి. ఎ. ఇం. సం. ౬ పు. ౩౧౬; కీల్. ప. నెం. ౧౦౧౪; అ. లూ. నెం. ౧౩౨౮; భాష- ప్రాకృతము, సంస్కృతము (ఈ పైశాసనము లన్నియు బ్రాహ్మలిపిలోఁ గలవు.)

(ఈక్రింది శాసనములు సంస్కృతభాషనున్నవి; ఇవి బ్రాహ్మీలిపిలోఁగాక మామూలుగ దక్షిణహిందూదేశ లిపిలో వ్రాయఁబడినవి.)

౧. కుమారవిష్ణువు చందలూరుశాసనము. ఈకుమారవిష్ణువు స్కందవర్మప్రపౌత్రుఁడు; కుమారవిష్ణువు పౌత్రుఁడు; బుద్ధవిష్ణువు పుత్రుఁడు. ఈశాసనము కాంచీపురమునుండి యొసంగఁబడినది. ఎ. ఇం. సం. ౮. పు. ౨౩౩.

౨. స్కందవర్మ ఒంగోడుశాసనము. ఇదిసంతరావూరువద్దదొరకినది. ఇది తామ్రప దగ్గఱ విజయస్కంధావారమునుండి యొసంగఁబడినది. ఎపి. రిపో. ౧౯౧౬., రెండవభాగము, పేరా ౩.

౩. పల్లవధర్మ యువమహారాజ విష్ణుగోపవర్మ ఉరువుపల్లిశాసనము. ఈవిష్ణుగోపవర్మ మహారాజ స్కందవర్మ ప్రపౌత్రుఁడు; మహారాజవీరవర్మపౌత్రుఁడు, మహారాజస్కందవర్మపుత్రుఁడు. ఇది మహారాజ సింహవర్మ యొక్క పదునొకండవ విజయరాజ్యసంవత్సరమున్నాటిది. పాలక్కడనుండి యొసంగఁబడినది. ఇం. ఆం. నెం. ౫. పు. ౫౧; కీల్. ప. నెం ౬౧౯.

౪. పల్లవధర్మ మహారాజ సింహవర్మ ఒంగోడుశాసనము. ఈసింహవర్మ యువమహారాజ విష్ణుగోపునిపుత్రుఁడు; మహారాజస్కందవర్మపౌత్రుఁడు. మహారాజవీరవర్మ ప్రపౌత్రుఁడు. ... ఎపి. రిపో. ౧౯౧౬..., రెండవ భాగము, పేరా ౪.

౫. పల్లవమహారాజ సింహవర్మ పికిర శాసనము. ఈసింహవర్మయువమహారాజవిష్ణుగోపవర్మపుత్రుఁడు; మహారాజ(రెండవ)స్కంధవర్మపౌత్రుఁడు; మహారాజవీరవర్మప్రపౌత్రుఁడు. మెంమట్టూరనుండి అయిదవరాజ్యసంవత్సరమునఁనొసంగఁబడినది. ఎ. ఇం. సం. ౮. పు. ౧౫౯.

౬. పల్లవధర్మ మహారాజ సింహవర్మ యొక్క ఎనిమిదవసంవత్సరపు మంగలూరు శాసనము. ఈసింహవర్మయువమహారాజవిష్ణుగోపవర్మపుత్రుఁడు; మహారాజ స్కందవర్మ పౌత్రుఁడు; మహారాజవీరవర్మప్రపౌత్రుఁడు. ఇది దసనపురమునుండి యొసంగఁబడినది. ఇం. ఆం. సం. ౫, పు. ౧౫౫; కీల్. ప. నెం. ౬౨౦.

౭. విజయ విష్ణుగోపవర్మ చూరశాసనము. ఈవిష్ణుగోపవర్మ సింహవర్మకుమారుఁడు; మహారాజ విష్ణుగోపవర్మపౌత్రుఁడు. ఎపి. రిపో. ౧౯౧౪, రెండవభాగము; పేరా ౧.

పైనిచ్చిన ౩, ౫, ౬, ౭ నెంబరుశాసనములవలన ఈక్రింది వంశావతారక్రమమును నిర్ణయింపవచ్చును:

స్కందవర్మ
|
వీరవర్మ
|
(రెండవ) స్కందవర్మ
|
సింహవర్మ — యువరాజ విష్ణుగోపవర్మ
|
సింహవర్మ
|
విజయవిష్ణుగోపవర్మ

౮. పల్లవమహారాజు వీరకూర్చవర్మ ప్రపౌత్రుని దర్శిశాసనము (ఒక్క రేకుమాత్రమే. ఇది యిప్పుడు బ్రిటీషుమ్యూజియములో నున్నది.) దసనపురమునుండి యొసంగఁబడినది. ఎ. ఇం. సం. ౧. పుట ౩౯౭; కీల్. ప. నెం. ౬౭౨.

౯. పెనుకొండశాసనము. ఇందు సింహవర్మయు, స్కందవర్మయు పేర్కొనఁబడియున్నారు. ఎ పి. రిపో. ౧౯౧౪, రెండవ భాగము, పేరా ౪.

౧౦. సింహవర్మయొక్క అమరావతి స్తంభశాసనము—సౌ. ఇం. ఇ౯. సం. ౧. పు. ౨౫; కీల్. ప. నెం. ౬౪౧; ఎ. ఇం. సం. ౧౦. పు. ౪౩, ౪౪.

౧౧. గుంటూరు జిల్లాలో దొరకిన శాసనము. ఇది పూర్వము సర్ వాల్టర్ ఇలియట్ దగ్గఱ నుండెడిది. (ఇప్పుడది బ్రిటీషు మ్యూజియములోఁగలదు.) ఇది రాజా అత్తివర్మశాసనము. ఈతఁడు ఆనందఋషివంశసంభవుఁడగు కందారరాజు వంశమున జనియించినవాఁడు. ఇం.ఆం.సం.౯.పు.౧౦౨; కీల్.ప.నెం.౧౧౧౫.

౧౨. మహారాజాధిరాజ సముద్రగుప్తుని అలహాబాదు జయస్తంభశాసనము. ఈ సముద్రగుప్తుఁడు క్రీస్తుశకము ౩౩౮ -వ సంవత్సరప్రాంతమున పిష్ఠపురము మహేంద్రుని, గిరికొత్తూర స్వామిదత్తుని, యేరండపల్లి దామనును కాంచీ విష్ణుగోపుని, అవముక్తపు నీలరాజును, వేంగి హస్తివర్మను, పాలక్క-రుద్రసేనుని, ఇంకను దక్షిణాపథములోని యితరరాజుల నందఱిని కారాబద్ధులంగావించి పిదప విడిచిపెట్టెను. గుప్తశాసనములు, పు. ౬. కీల్. ప. (ఉత్తరదేశశాసనములు) (ఎ. ఇం. సం ౫. నెం. ౫౦౯.)

౧౩. ఒకానొక రవికీర్తి జినేంద్రాలయమును గట్టించినట్లు తెలుపు అయ్యావళిశాసనము. ఇది కోసలులతోను, కాళింగులతోను పోరాడి, పిష్ఠపురమును స్వాధీనపఱచుకొని కన్నాల (కొల్లేరుసరస్సు) వద్ద యుద్ధముచేసి కాంచీపురపల్లవుల నోడించిన పశ్చిమచాళుక్య రెండవ పులకేశి సత్యాశ్రయుని పరిపాలనకాలములోనిది. శ. ౫౫౬, ఎ. ఇం. సం ౬. పు. ౪.

౧౪. పల్లవ (నరసిం) హ విష్ణువు అనఁగా మొదటి నరసింహవర్మ కాలమునాటి బాదామి (బొంబాయిరాజధానిలోని బెల్గాం మండలమునందలి ఇప్పటి వాతాపిపురము) శిలాశాసనము. ఇం. ఆం. సం. ౯. పు. ౧౦౦, కీల్. ప. నెం ౬౨౭.

తరువాతి పల్లవులకు ఆంధ్రదేశముతో సంబంధమున్నట్లు కనబడదు.

పల్లవనామమును గుఱించినట్టియు పల్లవ వంశోత్పత్తి క్రమమునుగుఱించినట్టియు ఊహలకు కీ. శే. వి. వెంకయ్య గారు ఆర్కియలాజికల్ సర్వేౘ౧౯౦౩-౧౯౦౪ వ సంవత్సరపు నివేదికకువ్రాసినవ్యాసముచూడఁదగును.

సంకేతాక్షరములకు వివరణము

ఎ. ఇం.—ఎపిగ్రాఫియా ఇండికా.

కీల్. ప. నెం.—కీల్‌హారన్ దక్షిణహిందూదేశ శాసనముల పట్టికలోని నెంబరు(ఎ. ఇం. సం. ౭)

అ. లూ. నెం.—అప్పెండిక్సు లూడర్సు నెంబరు (ఎ. ఇం. సం. ౧౦)

ఇం. ఆం.—ఇండియన్ ఆంటిక్వెరీ

ఎపి. రిపో.—ఎపిగ్రాఫి రిపోర్టు

సౌ. ఇం. ఇన్.—సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్సు.

సం.—సంపుటము.

పు.—పుట.

# నే నె!

కంచర్ల బసవ కోటిలింగము గారు

జనన మరణ లయంబులు, జాతి, నీతి
తల్లిదండ్రులు, బంధు, మిత్రములులేని
మహిత గురు, శిష్య, కాల కర్మములులేని
సచ్చిదానంద మూర్తియౌ సాక్షి నేనె?

గీ. సర్వ, ధర్మార్థ, కామ, మోక్షములు లేని
యమల సుఖ, దుఃఖ, పాప, పుణ్యములు లేని
నామ, రూప, క్రియా, గుణనటనలేని
చిన్మయానంద మూర్తియౌ శివుఁడ నేనె?

గీ. శ్రుతులు, శ్రుత్యంతములుఁ గూడఁ జూడరాని
యజ్ఞమంత్ర తీర్థాళిచే నరయరాని
జపతపోగ్ని క్రియాళికి సాధ్యపడని
సచ్చిదానంద మూర్తియౌ సాక్షి నేనె?

గీ. యోగముద్రల శమదమ త్యాగములకు
స్నానసంధ్యా ద్యనుష్ఠానశౌచములకు
శుష్కవేదాంత, తార్కిక సూత్రములకు
సుకరముం గాని యాపరంజ్యోతి నేనె?

గీ. పంచవింశతి తత్త్వ భావములు లేని
సప్తధాతువుల్, పంచకోశములు, లేని
మహదమహదర్థ, జడ, జంగమంబుగాని
చిత్కళా యుక్తుఁడగు పరశివుఁడ నేనె?

గీ. శత్రు షడ్వర్గ బీజసంచయము లేని
బంధమోక్ష వికల్పముల్ పడయరాని
బాధ్య, బాధక, బాధానుభవము, లేని
చిన్మయానంద మూర్తియౌ శివుఁడ నేనె?

గీ. అక్షరంబుల కందనియక్షరుండ
శిక్షలకురాని లోకైక శిక్షకుండ
స్వ, పరపక్ష సజాతి విజాతి, శూన్య
సచ్చిదానంద మూర్తియౌ సాక్షి నేనె?

గీ. పలుకఁ, బట్టఁగఁ, జూడఁగఁ, దలఁపఁ, బడక
యాదిమధ్యాంతశూన్యమై యలరు నట్టి
నాద, బిందు, కళాతీత భేద రహిత
సచ్చిదానంద మూర్తియౌ సాక్షి నేనె?

గీ. ఉండెనో? లేదో? యుండినన్నొండొ? రెండొ?
జ్ఞానమో? విజ్ఞానమో? జడమొ? సత్తొ?
యంకమో? యణువో? యింక శంకవిడని
యచల పరిపూర్ణ శుద్ధ బుద్ధాత్మ నేనె?

గీ. పెఱుగ, కఱుగక, తఱుగక, కఱుగరాక
వినక, చూడక, చేయక, వికృతిలేక
కదల మెదలక, శక్తిచే కట్టు వడక
చెలఁగు సచ్చిత్సుఖాత్ముఁడౌ శివుఁడ నేనె?

గీ. దేశకాలవస్తువులచేఁ దెగనివాఁడ
దేహములు మూఁటిపై నాసఁ దెగినవాఁడ
లలి నవస్థాత్రయ సాక్షినై యలరువాఁడ
చిన్మయానందమూర్తినై చెలఁగువాఁడ.

గీ. మలిన సత్త్వప్రధానమౌ మాయఁగూడి
సరవి జీవేశ్వరాఖ్యల సగుణమగుచు
సకలసచరాచరములకు జనకమైన
నిరతిశయ సౌఖ్యమూర్తిని నేనె సుమ్ము?

గీ. లేదు నాకేమి యని నేను లేక పోను
నేనుగాని దీజగమున లేనె లేదు
జగములే నేను నాయందె జగములుండు
నతివిచిత్రంబు! నా నైజ మరయఁదరమె?

గీ. సకల సచరాచరప్రపంచంబు విలయ
భావమంది నిద్రించెడు పట్టు నందు
నిండి నిబిడీకృతంబయి నిఖిలమందు
నిలుచు నిశ్చల తత్త్వంబు నేనె సుమ్ము!

గీ. సర్వమును నావశంబయి జరుగుచుండు
నేను దేనికి వశుఁడనుగాను నిజము
అఖిలభూత జాలమున కే నాశ్రయంబ
నేనొరుల యాశ్రయంబున లేను సుమ్ము!

గీ. మున్ను ననుఁగాంచ నార్యులెన్నెన్ని గతుల
వెతలఁబడి; రిప్పటికిఁగూడఁ వెదకుచుండ్రి
వెదకఁగల రింక, నంతయు వితయె కాని
యెఱుఁగవచ్చునె నాతత్త్వమెన్నడైన?

గీ. ఏమతంబును, నాతత్త్వమెఱుఁగ లేదు
ఏమహర్షియు నానైజ మెఱుఁగ లేఁడు
యెఱుకగలవార మనిచెప్పు టెఱుకలేమి
నెఱుక పఱచుటె, కాని నన్నెఱిఁగి కాదు.

గీ. సంహితలు నన్నుఁ గనుఁగొనజాల వనుచు
"నేతి నేతి" వాక్యంబులరీతిఁ దెలిపె
"భాతి భాతి" వాక్యంబుల బ్రహ్మమైన
నన్ను రూపింప నా కుద్దియున్నె జగతి?

గీ. అణువుకంటెను చిన్న, మహత్తుకంటె
నధికమై యుండు, భౌతికాధ్యాత్మకలిత
సకలజలజోద్భవాండ సంచయము, నాదు
పదరజోలేశమున, కోటిభాగ మగునె?

గీ. లూత గర్భాన, తంతువు భాతి; జగము
లగణితములుగ నాయందె యవతరించి
స్పంజిచేఁ బీల్పఁబడిన రసంబు పగిది
విశ్వమంతయు నాయందె విశ్రమించు.

గీ. ఊర్ధ్వమతిముఖ భక్తినిర్మలపదంబు
క్రైస్తవాది విశిష్ట విరాట్పదంబు
ప్రథిత శూన్యత్వ బుద్ధనిర్వాణ పదము
హైందవాద్వయ మూల సూత్రాత్మనేనె!

# వేంకటేశ్వర వచనములు

[ఇవి తాళ్లపాకవారు రచించినవై యుండవలెను. వీనిలో విష్ణుభక్తి యూటలూరుచున్నది. ప్రాచీనములలో, ఇంతరసవంతము, భక్తిభరితము నగు వచన రచన యసాధారణముగా నున్నది. కృష్ణమాచార్య సంకీర్తనములు, శంకరవచనములు, మొదలగునవి, వ్రేళ్ల లెక్కకుఁ జాలినవి, యిట్టివి కొన్ని యున్నవి. వీని నెల్లఁ గ్రమముగా వెల్లడింపఁ గోరికపడుచున్నాఁడను. సహృదయు లివి చవిగొందురుగాక.—వే. ప్ర.]

శ్రీ వేంకటగిరి దేవా! నాదేహంబు మీరుండెడి నిత్యనివాసంబు; నాజ్ఞానవిజ్ఞానంబులు మీయుభయపార్శ్వంబుల దీపంబులు; నాముకుఁ జెరమలయూర్పులు మీ యిరుదెసలంబట్టెడి యాలవట్టంబులు; నామనోరాగంబు మీకుఁ జెంద్రకావివలువ; మీకు మ్రొక్కనెత్తినచేతులు రెండున్ను మకరతోరణంబులు; నాభక్తియె మీకు సింహాసనంబు; నామేనంబొడమినపులకలు మీకు గుదులుగ్రుచ్చి యర్పించిన పూదండలు; నే మిమ్ము నుతియించిన నుతులయక్షరరవంబులు మీకు భేరీభాంకారఘంటానినాదంబులు; నాపుణ్య పరిపాకంబులు మీకు నైవేద్య తాంబూలాదులు; మదీయ నిత్యసేవాసమయనిరీక్షణంబులు మీకు సర్వాంగంబుల నలందిన తట్టుపునుంగు; నాసాత్త్వికగుణంబు మీకు ధూపపరిమళంబు; నీవు దేవుండవు; నేనర్చకుండను. ఈరీతి నిత్యోత్సవంబు నాయందు నవధరించవే శ్రీ వేంకటేశ్వరా! ౧

నందకాయుధధరా! నీయాయుధంబులకు జయజయ; నీవాహనంబులకు శుభమస్తు; నీ పరివారంబులకు క్షేమంబుగోరెద; నీకళ్యాణగుణంబులకు నిరంతరాభివృద్ధియగు; నీసత్త్వంబులకు శోభనపరంపరావాప్తియెసంగవలయు; నీదేవులకు మంగళమహశ్రీయగు; నీమహిమకు ననంతవివిధార్చనము; నీభుజాబలమునకు నపరిమతస్తోత్రము; నీచక్కఁదనంబునకుఁ బుష్పాంజలి; నీయుదారతకు శరణంబు; నీశ్రీవత్సకౌస్తుభాదిచిహ్నంబులకు సంతతప్రార్థన. నీపాదంబులకు సాష్టాంగ నమస్కారంబుచేసెద. ఏమినిమిత్తంబు చేసెదవంటివా? నాలుగుయుగంబులధర్మంబులు, సకలజంతువుల పరిణామంబులు, కమలాసనాదిదేవతల బ్రదుకులు, నీమూలంబుగావున నీవు శుభంబుననుండుటేమేలు నమోనమ శ్శ్రీ వేంకటేశ్వరా! ౨

అలమేలుమంగాపతీ! నిన్ను వెదకి వెదకి కనిపెదమన మేమెంతవారము? మీ సుద్దులు పెద్దల నడిగి వైకుంఠవాసుండ వనఁగా నీ యూరెఱింగితిమి. విష్ణు వాసుదేవ నారాయణ నామంబులువిని మీ పేరెఱింగితిమి. నీలమేఘ శ్యామలక్షణంబులు గలుగంగా మీవర్ణం బెఱింగితిమి. శ్రీవత్సకౌస్తుభాది చిహ్నంబులు చూచి మీగుఱు తెఱింగితిమి. శేషాచల నివాసంబుకతన మీగోత్రం బెఱింగితిమి. పురుషోత్తమ ఖ్యాతిచేత మీపౌరుషం బెఱింగితిమి. వేణునాదవినోదివని చెప్పంగా మీవంశం బెఱింగితిమి. మత్స్య కూర్మ వరాహ నారసింహ నారదాద్యవతారంబులువిని మీపుట్టు వెఱింగితిమి. నీకు మ్రొక్కెదము. అన్నింట నధికుండవని నిన్నుంగొలిచితిమి. ఇంక నీమహిమలంగొని యాడెదము. నమోనమ శ్రీ వేంకటేశ్వరా! 3

క్షీరాబ్ధిశయనా! కమలంబులు సూర్యుని కెదురుచూచినయట్లు నాహృదయపద్మంబు రవిమండల మధ్యవర్తియైన నీ కెదురుచూచుచున్నది. మయూరంబులు మేఘాగమనంబునకుం జెలంగినట్లు నా మనోమయూరంబు నీలమేఘవర్ణంబైన నీ తిరుమేను దలంచి యానందించుచున్నది. ముత్యపుంజిప్పలు స్వాతి చినుకులకు నోరు దెఱచినట్లు నావదనశుక్తి మీపాదతీర్థంబునకు వికసించుచున్నది. సర్పంబులు గానంబులుగోరి చొక్కి పడగలెత్తి యాడినట్లు నా వీనులు నీ కథల నాలకించుచున్నవి. నీవు పరాత్పరమూర్తివి. నేను ప్రకృతిసంబంధంబులైన యంగంబులు ధరియించినవాఁడ. అదియెట్లుగూడు ననవలదు. ఆప్రకృతికి నీవు చైతన్యమవు. ఈచుట్టఱికము తొల్లి కలుగఁగానే దీనికి ననురాగముంగలిగి యున్నది. కన్నెఱుఁగకున్నఁ గడు పెఱుంగు నండ్రు లోకులు. ఇంతియకాని మిమ్ము నెఱుంగ నేనెంతటివారము. నా యాన విన్నవించితి నింతియకాని నిన్ను నేఁ గక్కసించినవాఁడఁ గానుజుమీ నమోనమ శ్రీ వేంకటేశ్వరా!

దామోదరా! సకలతీర్థంబులు మీకోనేటనే యాడితి. సకల తిరుపతుల విగ్రహంబులు మీమూర్తియందే సేవించితి. సకల దానంబులు మీకు నొక కాసు కానుక పెట్టినయందె ఫలియించె. విహితయజ్ఞాదికర్మంబులు మీకైంకర్యంబుననే తీర్చితి. జపంబులన్ని మీ తిరుమంత్రమందె జపించితి. వేదపాఠంబులు మీసంకీర్తనమందె యభ్యసించితి. తపములు వైష్ణవాచారములలభించె. నింక నేమిటం గడమ లేదు. నాహృదయకమలంబున నీవున్నాఁడవు. నామనంబు శోధింపంబనిలేదు. నాణెంబైన టంకంబునకు వట్టంబు గొనరాదు. భండారంబు నంబడిన లెక్కకుఁ బరులు చాడిచెప్పంబనిలేదు. ఆరీతి సె[illegible]ంగించినవాఁడ. నే నీసొమ్మయినవాఁడ. నగుటం [illegible]దోషంబులు మమ్ముఁ బైకొనకుండుటం జేసి, రక్షింపవే. నమోనమ శ్రీ వేంకటేశ్వరా! 4

# బ్రహ్మగీతము

చేపూరు సింహాచలము గారు

(సంపుటము ౧, సంచిక ౯ తరువాయి)

"భూతలంబందు నేనేల పుట్టినానో?
ఎవఁడు పుట్టించె నిట్లు నన్నవనియందు?
జననమరణంబు లేకుంట సాధ్యమగునె?"
అనుచు గురుఁజేరి ప్రశ్నింప నాదరమున
"అడుగఁదగని రహస్యార్థ మడిగి తీవు
దీనిమర్మంబు మనుజుండు దెలియలేక
దుఃఖ మొదవఁగా బ్రహ్మను దూఱుచుండు
సౌఖ్య మొదవఁగాఁ దనయత్న సఫలమనును
గాని తనరాకపోకకుఁ గారణంబు
కొంచెమేనియుఁ దావిచారింపకుండు
స్వస్వరూపంబు నెఱిఁగెడి సాధనంబు
తపము గాకున్న వేఱొండుదారి యగునె?
కాన నభ్యాసవశమున మానసమును
విషయసుఖముల వెనువెంట వెడలనీక
లక్ష్యమందున సతము నిల్పంగవలయు
మనసు నిల్చిన విజ్ఞాన మతిశయిల్లు
నంత సద్విచారణ [illegible] మగును.

కర్తయును గాఁడు భోక్తయున్ గాఁడు బ్రహ్మ
సాక్షిమాత్రుఁడయని శ్రుతి చాటుచుండ
బ్రహ్మ పుట్టించె మమ్మంచుఁ బలుకఁదగునె?
బ్రహ్మ పుట్టించె ననియెడిపలుకదెంత
సత్యమగునో విచారణ సలుపవలయు.

జోగులనువాఁడు జూదరి త్రాగుఁబోతు
దొంగలకు ఱేఁడు పాంథులఁ ద్రోవఁగాచి
గొంకుజంకులు లేకుండఁ గొట్టువాఁడు
కలఁడు, వానికిఁ బుత్త్రులు నలువురుండి
రందు నిద్దఱు దుర్మార్గులైరి వాఁడు
సుతులనందఱ నొకరీతిఁ జూచుఁగాని
హెచ్చుతగ్గుగఁ జూచునా యెన్నఁడైన,
సమముగాఁ జూచుటకు నేమి సబబు గలదు?
పక్షపాతంబు సూపిన వానినెటుల
నాదరింతువొ చెప్పుమా" యనుచు యోగి
శిష్యునిన్ జూచి ప్రశ్నింప శిష్యుఁ డంత
"పామరునికైన సుతులపైఁ బక్షపాత
ముండునే? తండ్రికిం బ్రేమయుండకున్నె?
తండ్రి సుతులను బక్షపాతమునఁ జూడ
వానిఁ దండ్రియని పిలువఁ బాపమొదవు,
వాఁడు నిజముగా నల్గురు బాలురకును
దండ్రిగాఁడేమొ, వారలతండ్రి జోగు[యనిన
లనుచు భ్రమను దలచిఁనామె మనమె"
మందహాసంబుతోఁ జిదానందయోగి
మనల బ్రహ్మయే పుట్టించె"ననిన మనము
బ్రహ్మపుత్త్రుల మనుటయే వాస్తవంబు,
బిడ్డలందఱ నొకరీతిఁ బ్రేమఁజూపి
పెంచుచున్నాఁడె దేవుఁడు పృథ్విలోన?

"అన్నమో రామ" యని వీథి నఱచు నొకఁడు,
ఇష్టమృష్టాన్నసంతృప్తి నెసఁగు నొకఁడు,
నిలువ నీడయే లేక గాసిలు నొకండు,
రూపవంతుఁ డొకండు కురూపి యొకఁడు,
జ్ఞానహీనుఁ డొకండు సుజ్ఞాని యొకఁడు,
ఇట్టి భేదంబు చూడమే యిహమునందు
బ్రహ్మయును బక్షపాతి గావలయు లేక
బ్రహ్మ జనకుండు గాఁడని పలుకవలయు"
ననిన శిష్యుండు గురువుతో ననియె నిట్లు
"బ్రహ్మ జనకుండు గాఁడని పలుకఁదగును
నిత్యశుద్ధబుద్ధాత్ముఁడై నిర్గుణుఁడగు
బ్రహ్మపక్షపాతియ యని పలుకఁదగునె?"
"అట్టులయినచో మన మిట్లు పుట్టుటకును
గారణం బేమియో యెఱుఁగవలె శిష్య!
ఏల వచ్చితి వియ్యెడ కిపుడు నీవు?
ఎవరు పంపిరి? పిలిచినా రెవరు నిన్ను?
తెలియఁ బల్కు మాలోచించి తెల్లముగను."

మంచిమార్గంబు బోధింతు రనుచు వింటి
దాని నాలింప మనసునఁ దలఁపు గలిగి
వచ్చినాఁడను నన్నెరుఁ బంపలేదు
పిలువ లేదెవ్వరును నన్నుఁ బ్రీతితోడ"
అనిన శిష్యుని గాంచి తా నడిగె యోగి
"తెచ్చినది యేది యిటకు ని న్దెల్పు"మనుచు
శిష్యుఁ డంత విచారణ సేసి "మీమ
బోధ నాలింపఁగాఁ గోర్కెపుట్టె, నన్నుఁ
దెచ్చినది కోరికే యని తెలియు" ననఁగ
కోరి కేటికి నిన్ను నక్కజేరఁ దెచ్చె
నింటికడ నుండఁ జెల్లదే యిట్టి ముండ్ల
డొంకలను దాఁటి రానేల జంక" కనిన
శిష్యుఁ డాచార్యుని గాంచి చెప్పె నిట్లు

"దేవ! ఇంటనుండినఁ గోర్కె [illegible]
ఎచట కో[illegible] నచటి కేగ
వలయు నితరస్థలంబున ఫలము గలదె!"
అంత నాయోగి "పుత్రకా! చింత సేయ
మనల వడుపుచున్నది కోరికనుచుఁ దెలిసె.

కోరికే జన్మముల కెల్లఁ గారణంబు
వేదశాస్త్రముల్ దీనినే వెల్లడించు"
ననిన శిష్యుండు దా సంశయాత్ముఁడగుచు
"గొప్ప జన్మంబు లెత్తఁగాఁ గోరుఁ గాని
నీచజన్మంబు లెత్తుచు నింద్యకర్మ
లాచరింపఁ గోరునె యెవ్వఁడైన" ననిన
"శిష్యుఁడా! సద్విచారణ సేయలేక
మొండివాదనల్ వాదించు మూర్ఖుఁడెపుడుఁ
దానఁ దెలియునా యెపుడైనఁ దత్త్వ[illegible]
నిర్మలాంతఃకరణమున నియతిఁగలిగి
చేయు మాత్మవిచారణ చిత్తమందు
కోరికలు పుట్టుటకు నేది కారణంబు
సెప్వమ్మా యుదాహరణతోఁ జింతసేసి"
అనుచు నాయోగిపుంగవుం డాజ్ఞనీయ
బర్ణశాలకుఁ [illegible]తపంబు సల్పి
సంశయం బెల్లఁ బోనాడి సంతసమున
వచ్చి గురుపాదములకుఁ దాఁ బ్రణతి సేసి
"కో[illegible] పుట్ట భ్రమయె కా కారణంబు,
మద్యపానంబు సుఖమను మమతవలన
త్రాగుకోరిక పుట్టును దనకు మొదట
బ్రాహ్మణుం డింటఁ దనకోర్కె ఫలితమగునె?
త్రాగుఁబోతులయిండ్లకుఁ దానపోయి
హేయవస్తుబంధములు సహించుకొనుచు
సంతతంబును ద్రాగుచు సంచరించు"
ననిన శిష్యునిఁ గాంచి యిట్లనె గురుండు

"పూర్వజన్మకర్మంబునఁ బుట్టుచుంద్రు ! ...
మనుజులంచును జెప్పరె మౌనివరులు.

కర్మ యన నేమి? ఎట్టులు కర్మవలనఁ
బుట్టుచుందురు మనుజులు పుడమిపైని
దీని తత్త్వంబు లెస్సఁగాఁ దెలియవలెను.

కర్మయెల్లను మూఁడు మార్గంబులౌను:
సంచితంబంద్రు ముందటి జన్మలందు
భ్రమను జేయు కార్యమున నభ్యాసమెల్ల
వాసనా మాత్రమై నిల్చి ఫలముగోరు
దాని; ప్రారబ్ధమన సంచితంబునుండి
ప్రస్తుతానుభవమునకు వచ్చునదియె;
ఫలముఁ గోరుచుఁ జేసెడి పనులయందు
గల్గు నభ్యాసమెల్ల నాగామియంద్రు.

వీనిమూలంబుఁ దెలియుమా వివరముగను
తపముచే దీని తత్త్వంబుఁ దరుచకుండ
వినుటమాత్రాన నేర్చిన వెంగలీఁడు
తప్పుదారిని బోవుట తథ్య"మనెడి
సచ్చిదానందయోగి ప్రసంగమెల్ల
భక్తి నాలించి గురునకుఁ బ్రణతి సేసి
యాశ్రమోపాంతవనభూమి కరిగి శిష్యుఁ
డాచరించెను దపముఁ దా నధికనిష్ఠ.

మరలి యనుభవం బిట్టులు మనవి సేసె
"విషయభోగంబు సుఖమను వెఱ్ఱిదగిలి
భోగవస్తువుపైఁ గోర్కె పుట్టుమొదట
కోరునట్టి పదార్థంబుఁ గూర్చుటకును
పాటుఁబడుచుండు మనుజుండు పలువిధముల
ఆశతోపాటు పనులయభ్యాసమెల్ల
వాసనారూపమాత్రమై వఱలుచుండు.

దీనివృద్ధియె బంధంబు దీనిక్షయమె
మోక్షమని చెప్పుచుందురు మునులు శిష్య!
ప్రణవ మిష్టమున్ ప్రాణభావంబు లాయె
నిదియె మాయాస్వరూపమం చెఱుఁగు మయ్య!
దీనివృద్ధియె సృష్టియై తేజరిల్లె
దీనిని బ్రవృత్తి యందురు మౌనివరులు
గాన కోర్కెయె జన్మకుఁ గారణంబు;
గలుగఁబోదు జన్మంబు నిష్కామునకును
దీని భావంబుఁ దపమునఁ దెలియువాఁడు
బ్రహ్మగీతంబు హాయిగాఁ బాడుకొనుచు
సచ్చిదానందరూపుఁడై సంచరించు."

(సశేషము)

---

# వనవాసి

దుర్గమహంతి సీతారామ శర్మ గారు

సుమగుచ్ఛములఁ జేరి ప్రమదగానము సల్పు, యెలదేఁటిపిండుతోఁ జెలిమి సేసి
కలనిస్వనమున సంచలవమొందెడు నిర్ఝరోర్ములతోఁ గూడి యుబుసులాడి
లలిత సౌరభసమాకలితులై పరువెత్తు, పవనార్భకులతోడఁ బంతమాని
దరిఁ జేరి మూర్కొను హరిణీచయంబులో, నిజ కష్టసుఖము లన్నియును సెప్పి
గహనసీమయె సర్వముగాఁ దలంచి, యతిశయానంద మధురాసవానుభవముఁ
గాంచి యేకాకియై సర్వకామములను, రోసి ధన్యాత్ముఁ డగు వనవాసియొకఁడె.



# తేజోలేఖనము

(సంపుటము ౧, ౧౨వ సంచిక తరువాయి)

వింజమూరి కృష్ణమాచార్యులు గారు

## ఐదవ ప్రకరణము

### చిత్రము

ఒక తేజోవిలేఖకుడు, కమీరా కెదురుగానుండు వస్తురూపములు సరాసరి నకలుగా తాను తీసిన ఛాయాపటమందు కనబడినచో తృప్తినొందును. వేరొకడు పరిస్థితులనుబట్టి వీలగునంతవరకు తాను దీయు ఛాయాపటములు ఆకర్షణీయముగ నుండునటులు ప్రయత్నించుచుండును. మరియొకడు కేవలము నకలు చిత్రములతో తృప్తినొందక రసానురాగ ప్రభావమును విశదముచేయ జాలునట్టి యుత్తమచిత్రములను దీయుటకు కృషిసలుపును. సుందరహార్మ్యములు, జలాశయములు, రాచబాటలు, జంతువులు, పుష్పములు, ఫలములు మొదలగు దృశ్యముల యొక్క రూపములనుజూపు చిత్రనిర్మాణమున కీకాలమున, తేజోలేఖనము ముఖ్య సాధనముగా నెంచబడుచున్నది.

తేజోలేఖన యంత్రసహాయమున సమస్తవస్తురూపములను జూపునట్టి ఛాయాపటములను, సులువుగాదీయుటకు అవకాశమేర్పడినను, అవి సుందరముగను, ఆకర్షణీయముగను ఉండవలెనన్నచో వాటియందు "మేళనము" గోచరించుచుండవలయును. మరియు చిత్రమునందొక భాగమునకు ప్రాధాన్యమొసగి చూపరులదృష్టి నాకర్షించునటుల దానికి స్థలనిర్దేశము గావింపవలయును. మిగిలియున్న భాగమంతయు దాని ననుసరించియుండు లాగున చూచుకొనవలయును. ప్రవీణుడగు తేజోలేఖకునిచే దీయబడినట్టి ఛాయాపటములనుగాని, చిత్రకారుని చిత్రపటములనుగాని పరిశీలించితిమేని వాటియందలి ప్రధానవస్తురూపములు అవి ఆక్రమించినట్టి స్థలమునుబట్టియే ప్రాముఖ్యముబడయుటను కనుగొనవచ్చును. సామాన్యముగా చిత్రపటములయందుగాని, ఛాయాపటములయందుగాని, నడిమిభాగముకంటె ప్రక్కలకు హెచ్చుప్రాముఖ్య మీయబడుచుండును. ఏదేని యొకచిత్రము నీక్రింద జూపబడినటుల విభజించితిమేని AA, BB, CC, DD, గీతలపై నుండిన వస్తురూపములు సహజముగా స్థలప్రాముఖ్యమును బట్టి దృష్టి నాకర్షించునవిగా నుండును. నిలువు గీతలు అడ్డగీతలు కలియుస్థానమునకు హెచ్చుప్రాముఖ్య మీయబడుచుండును.




+ గురుతు గల మధ్యభాగము, చిత్రమంతటియందును నిస్సారమైనదిగా నెంచబడును. కమీరా యొక్క వెనుకభాగమునందమర్చబడియుండు గ్రవుండు గ్లాసుపై, పైన జూపబడినటుల గీతలు గీచియుంచుకొనుట మంచిది. చిత్రములయందు, దిబ్బండల మెప్పు

డును మయమ్ముగా నుండక, పైనుండి క్రిందికిగాని, క్రిందినుండి పైకిగాని మూడవవంతులో నుండవలయును. ప్రధానవస్తురూపములు, చిత్రము నిలువుగ నున్నచో CC, DD, గీతలపయినను, అడ్డముగ నున్నచో AA, BB, గీతలపయినను ఉండవలయును. మరియు, చిత్రముయొక్క యిరుప్రక్కలును, ఒకటికొకటి అనురూపముగా నుండరాదు. అనగా, ఒకేవిధమగు వస్తురూపము లిరుప్రక్కల నుండరాదు. అడ్డముగా నున్న చిత్రమునందు DD, గీతలపై నొక ప్రధానవస్తురూపముండినచో, CC, గీతలపై అట్టిదే మరియొకటి యుండరాదు. ఈక్రిందిపటమునం దీపద్ధతి జూపబడియున్నది.




వ్యత్యాసమును సూచించుటకుగాను, చిత్రములందు కట్టడము లెప్పుడును మయముగానుండక యొకప్రక్క కుండవలెను. వీథులయొక్క చిత్రములందు వీథి కిరువైపులనుండు ఇండ్ల వరుసలు కలియుస్థానము (Vanishing Point) మయముగా నుండక కొంచెమొకప్రక్క కుండవలయును. ఈక్రిందిపటమును చూడుడు:



వెలుతు రెప్పుడును బయట పనిచేయు తేజోలేఖకుని కట్టుబాటులో నుండ నేరదుగాని నేర్పుతో స్థలనిర్దేశము కావించుకొనినచో ప్రతి తేజోలేఖకుడును తన శక్తికి సరిపడునట్టి వెలుతురును బడయవచ్చును. సూర్యుడు సరిగా కమీరాకు వెనుకనున్నచో చిత్రమునందు వెలుతురు నీడలయొక్క మార్పు గోచరింపక వస్తురూపము వెలవెలబోవుచు నిస్సారముగ నుండును. సూర్యుడు కమీరాకెదురుగానున్నప్పుడు చిత్రమునందు నీడ తప్ప మరేమియు నుండక మిగుల అసంతృప్తికరముగా నుండును.

తృప్తికరమగు ఫలితము లెప్పుడును సూర్యుడు కమీరాకు వెనుకగాని, ముందుగాని, కుడిప్రక్కనైనను, ఎడమప్రక్కనైనను, ఉండినపుడు చేకూరగలవు. చిత్రములయందు నీడ యొనర్చుపని చాలగలదు. కమీరాకెదురుగా కుడిప్రక్కకుగాని, ఎడమప్రక్కకుగాని సూర్యుడున్నప్పుడు, వెలుతురు నీడలయొక్క సమ్మేళనముగలిగినట్టి సుందరమగు చిత్రములు లభ్యము కాగలవు. కాని సూర్యుని కెదురుగా కమీరానుంచునపుడు సూర్యకిరణములు లెన్సుపై పడకుండులాగున చూచుకొనవలయును. సూర్యుడు కమీరాకు వెనుకభాగమునందున్నచో కమీరాను సూర్యునకు కుడివైపునగాని, ఎడమవైపున గాని నీడగలప్రదేశమునం దుంచవలయును. వస్తురూపములపై బడు వెలుతు రెప్పుడును నీడతో గూడినదై యుండుట మంచిది. ఛాయాపటములందు హెచ్చువెలుతురు పడినట్టి భాగములు తెల్లగను, నీడగల భాగములు నల్లగను ఉండును. హెచ్చువెలుతురుగలభాగము (High lights) విశేషముగ నుండినచో ఆచోట నీడనిచ్చునట్టి వస్తువునుంచుటమంచిది. ఉదాహరణము:

మార్పు లేనట్టి హెచ్చువెలుతురుగల సముద్రతీరములు మొదలగు ప్రదేశములందు నల్లనిబట్టలు తొడుగుకొనినట్టి బిడ్డలను నిలబెట్టుట, హెచ్చునీడ నిచ్చు చెట్లతోపులు మొదలగుచోట్ల తెల్లనివస్త్రములు ధరించినట్టి స్త్రీనిగాని, పురుషునిగాని నిలబెట్టుట.

మనుష్యులయొక్క ఛాయాపటములను దీయునపుడు, వెలుతురునందు హెచ్చుమార్పు లుండరాదు. ఎత్తుగానుండు కట్టడపునీడకాని, గోడనీడకాని, చెట్లనీడకాని మనుష్యులపటములు దీయుటకు తగినవిగానుండును. కాని నీడనిచ్చునట్టి కట్టడముగాని, గోడగాని ఫొటోగ్రాఫును దీయించుకొనువానికి వెనుకనుండక కుడిప్రక్కనో

ఎడమప్రక్కనో ఉండవలయును. ఒకనికంటె హెచ్చు మంది గలపటములను దీయునపుడు తలలన్నియు నొకేవరుసలోనుంచక ముందువెనుకల కుండవలయును. మనుష్య రూప పటములను (Portraits)దీయుటకు ప్రత్యేకపు నియమములు గలవు. అవియన్నియు వేరొకప్రకరణము నందు చర్చింపబడును. ఈప్రకరణములో దెలుపబడినట్టి నియమములను ప్రతి తేజోలేఖనాభ్యాసియు విధిగా పాటింపవలయునని మా తలంపుకాదు. నిజమగు చిత్రకారు డెప్పుడును, నియమములకు అధికారి కాగోరుచుండును గాని, బానిసగా నుండుట కిష్టపడ నేరడు. నూతనముగా తేజోలేఖనము నభ్యసించువారుమాత్రము తమ కండ్లకింపుగా దోచినట్టి చిత్రములను తరుచు పరీక్షించుచు చిత్ర నిర్మాణపద్ధతిని గ్రాహ్యముచేసుకొనుట మిగుల మంచిది.

## ఆఱవ ప్రకరణము

## ఫోటోగ్రాఫులుదీయుట

తేజోలేఖనము నభ్యసించు ప్రతివారును తమకమీరాయందలి వేరువేరు భాగములయొక్క యుపయోగమును బాగుగా బోధపరుచుకొని, ఫోటోగ్రాఫులు, చిత్రపటములు మొదలగువాటిని పరీక్షించుటవలన కొంతవరకు చిత్రనిర్మాణపద్ధతులను గ్రాహ్యముచేసికొనినపిమ్మటగాని స్వయముగా ఫోటోగ్రాఫులను దీయుటకు ఇల్లుదాటి బైటికి పోరాదు. నూతనముగా యీవిద్య నభ్యసించు వారలకు స్టాండుకమీరా తగియుండునని లోగడ చెప్పియుంటిమి. ఈప్రకరణమందు స్టాండుకమీరాతో ఫోటోగ్రాఫులను దీయువిధము దెలుపబడును. నూతనాభ్యాసకులు ప్రథమమున చెట్లు మొదలగు దృశ్యములయొక్క ఫోటోగ్రాఫులను ( Lınd scap3s)దీసి కొంతయనుభవమును పొందినపిమ్మటగాని మనుష్యుల ఫోటోలను దీయుటకు పూనుకొనరాదు. (మనుష్యుల ఫోటోగ్రాఫులను దీయువిధము వేరొకప్రకరణమందు దెలుపబడును.)

చెట్లుమొదలగు దృశ్యములయొక్క ఫోటోగ్రాఫులను దీయుటకు ఇల్లుదాటి కొంతదూరము పోవలసి వచ్చును. అప్పుడు అభ్యాసకుడు తనవెంట కమీరా, స్టాండు, ప్లేట్లువేసియుంచుకొనినట్టి డార్కుస్లైడు, ఫోకసింగుగుడ్డ వీటి నన్నిటిని తీసుకొనిపోవలయును. ప్రయాణమగుటకు ముందుకావలసిన సామానులన్నియు నున్నవా లేవా యని చూచుకొనుట మంచిది. ఫోటోగ్రాఫు దీయదగినదృశ్యము నెన్నుకొనినపిమ్మట దాని కెదురుగా కమీరాను స్టాండుపై బిగించి నిలబెట్టవలెను. ఈటగించునపుడు లెన్సు, స్టాండుయొక్క మూడుకోళ్లలో నొక దానిపై నుండులాగున జూడవలెను. ఇట్లు చేయుటవలన కమీరాయొక్క వెనుకభాగము మిగిలిన రెండుకోళ్లకు మధ్యముగానుండి ఫోకస్ చేయునపుడు స్టాండుయొక్క కోళ్లు మనకాళ్ల కడ్డమురాకుండ నుండగలవు. కమీరాను పైవిధముగా స్టాండుపై బిగించినపిమ్మట, గ్రవుండుగ్లాసు గల వెనుకభాగమును ఫోకసింగుగుడ్డతో కప్పవలయును. పిమ్మట యీగుడ్డక్రిందికి తలదూర్చి లెన్సుమూతను తెరచి గ్రవుండుగ్లాసుపై పరీక్షించితిమేని కమీరా కెదురుగా నుండు దృశ్యముయొక్క రూపము దానిపై తలక్రిందులుగా గనబడుచుండును. గ్రవుండుగ్లాసుపై కనబడెడిరూపముయొక్క పరిమాణము, కమీరాకును దృశ్యమునకును గల దూరమునుబట్టి మారుచుండును. ఈ క్రిందిపటము జూడుడు:



కమీరాను దృశ్యమునకు దగ్గరగా దెచ్చుచుండినకొలది గ్రవుండుగ్లాసుపై కనబడురూపము పెద్దదిగను, వెనుకకు గొనిపోయినకొలది చిన్నదిగను మారుచుండును. కాని ఆరూపముమాత్రము స్పష్టముగానుండక మకమకలాడుచుండును. లెన్సు గల కమీరాయొక్క ముందుభాగమును మెల్లదిగా ముందునకు జరుపుచు గ్రవుండుగ్లాసుపై ఫోకసింగుగుడ్డలోనుండి చూచుచుంటిమేని, మకమకలాడెడురూపము క్రమముగా స్పష్టముగా నగుపడగలదు.

షరికొంచెము ముందునకు నడిపినగాని, వెనుకకు నడిపిన గాని, తిరిగి మకమకలాడుటకు ప్రారంభించును. ఎప్పుడు గ్రవుండుగ్లాసుపై రూపము స్పష్టముగా నగపడునో ఆ వెంటనే కమిరాయొక్క ముందుభాగమును ముందునకు జరుపుట మానివేయవలయును. ఈపనికే ఫోకసింగు అని పేరు.

కమిరాయందు గ్రవుండుగ్లాసుగల వెనుక భాగ మెప్పుడును తూకమునకుసరిగా నిలబడియుండవలయును. కొన్ని సమయములందు గ్రవుండుగ్లాసునందలి రూపము క్రిందిభాగమున స్పష్టముగను, పైకి రానురాను మకమకలాడుచును ఉండును. అప్పుడు కమిరాయొక్క వెనుక భాగమున కిరుప్రక్కల వయముగా బిగింపబడియుండు యుత్తడిమరలను వదలుచేసి ముందునకును వెనుకకునువంచి చూచుకొనుచు ఎప్పుడు రూప మంతయు స్పష్టముగా నగుపడునో అప్పు డామరలను బిగించి వేయవలయును. గ్రవుండుగ్లాసుపై దృశ్యముయొక్క రూపమును మన మెంత స్పష్టముగా ఫోకస్ చేయగలుగుదుమో అంతస్పష్టముగా మన ఫొటోగ్రాపు లుండగలవు. పైవిధముగా వలయు పరిమాణములో మనము కోరుదృశ్యమును ఫోకస్ చేసుకొనినపిమ్మట లెన్సుయొక్క అపెర్చరు తగ్గించవచ్చును. లెన్సుయొక్క అపెర్చరు తగ్గించుచుండిన కొలది దృశ్యమునందలి దూరముగనున్నట్టి ప్రదేశములును దగ్గరగానున్నట్టి ప్రదేశములును సమానముగా ఫోకస్ కాగలవు. మంచిప్రకాశమానమగు వెలుతురునందు అపెర్చరు F 22 లేక F 32 వరకుగూడ తగ్గింపవచ్చును. కాని, అపెర్చరు తగ్గించుచుండినకొలది లెన్సును తెరచి మూయు కాలము (ఎక్సుపోజర్—Exposure) హెచ్చుచుండును.

తృప్తికరముగా ఫోకస్ చేసిన పిమ్మట షట్టరును మూసి (షట్టరులేని కమిరాలైనచో లెన్సుమూత మూసి వేయవలయును.) గ్రవుండుగ్లాసుతలుపు వెలుపలకు తెరచి దానిస్థానమున ప్లేట్లు వేసియుంచుకొనునట్టి డార్కుస్లైడును రెండవనెంబరు తలుపు మనకెదురుగా నుండులాగున ద్రోపవలయును. (అనగా 1 వ నెంబరుతలుపు కమిరా లోపలిభాగమున కెదురుగా నుండవలెను)

పిమ్మట I వ నెంబరు తలుపును పైకంటె లాగి, ఫోకసింగుగుడ్డతో స్లైడును కప్పవలెను. తరువాత షట్టరునుగాని, షట్టరులేనట్టి కమిరాలైనచో లెన్సుమూతను గాని కొంతకాలము తెరచి యుంచిపిమ్మట తిరిగి మూసివేయవలయును. దీనికే "ఎక్సుపోజరు" అందురు. షట్టరులేనట్టి కమిరాయొక్క లెన్సుమూతను తెరచిమూయునపుడు మూతగాని మనచేయిగాని లెన్సున కడ్డము రారాదు. ఈ విధముగా డార్కుస్లైడునందలి రెండుప్లేటులును ఎక్సుపోజుచేయబడినపిమ్మట వాటిని చీకటిగదియందు ఎర్రదీపపువెలుతురులో డివలపు (develop) చేయవలసియుండును.

## కాలపరిమితి - ఎక్స్‌పోజర్

## (Exposure)

లెన్సును తెరచి మూయుకాలపరిమితిని నిర్ధారణ చేయుట మిగులకష్టము. ఈకాలపరిమితి ప్లేట్లయొక్క వేగమునుబట్టియు, లెన్సుయొక్క వేగమునుబట్టియు, అపెర్చరునుబట్టియు, వెలుతురునుబట్టియు, కాలమును బట్టియు మారుచుండును. ఈ క్రిందిపట్టికలయందు (Tables) మనదేశపువెలుతురునకు సరిపడునట్టి ఎక్స్‌పోజరు కాలపరిమితులు దెలుపబడియున్నవి. వీటిసహాయమున సంవత్సరముపొడుగునను అన్నివిధములగు ఫొటోగ్రాపులను దీయుటకు, వెలుతురుయొక్క మార్పు ననుసరించి ళ్ళేకించుచుండు సరియగు ఎక్స్‌పోజరులను సులభముగా దెలుసుకొనవచ్చును. కాలపరిమితిని దెలియజేయు యంత్రములుకూడ గలవు. ఆయంత్రముల నుపయోగించు విధము వాటితో బంపబడును.

## లెన్సును తెరచిమూయుకాలపరిమితిని తెలియజేయు ఎక్స్‌పోజరుపట్టికలు

## (Exposure Tables)

ఈక్రింద, కాలము, (నెలలు, గంటలు) వెలుతురు, ఫొటోగ్రాపులుదీయుటకు తగిన స్థలములు; (Subjects) లెన్సుయొక్క అపెర్చరులు; ప్లేట్లయొక్క వేగములు; వీటికిజెందిన 5 వేరువేరుపట్టికలీయబడియున్నవి. ఈపట్టికలలో నుండి ఫొటోగ్రాపుదీయుస్థలమునకు, కాలమునకు, లెన్సుయొక్క అపెర్చరునకు, ప్లేటుయొక్క వేగమునకు, వెలుతురునకు, సరిపడునట్టి సంఖ్యలను కనుగొని

వాటి కెదురుగా చివరగడియందుండు లబ్ధమూలములను (Factors) జ్ఞాపకముంచుకొనవలయును. పిమ్మట వాటిని మొత్తముచేసి 6వ పట్టికయందు యీమొత్తమునకు క్రింద నుండు సంఖ్యను దెలుసుకొనవలెను. ఆసంఖ్యయే సరియగు కాలపరిమితి కాగలదు.

## ఉదాహరణము

| | | | |
|---|---|---|---|
| కాలము:-జూను నెల ఉదయము 9 గంll | లబ్ధమూలము | | 0 |
| వెలుతురు:-కొద్దిపాటి మబ్బుతో గూడిన సూర్యరశ్మి | | ,, | 1 |
| ఫోటోగ్రాఫుదీయుటకు తగిన స్థలము:- | కమీరాకుసమీపముగా నుండు కట్టడములు | ,, | 4 |
| ప్లేటుయొక్క వేగము:- H. & D. 100 | | ,, | 2 |
| లెన్సుయొక్క అపెర్చరు;- F. 22 | | ,, | 5 |
| | | మొత్తము | 12 |

ఆరవపట్టికయందీమొత్తము (12) క్రిందనుండు సంఖ్య 1 శెకను గాన, 1 శెకనుకాలము లెన్సును తెరచియుంచి పిమ్మట మూసివేయవలయును.

| | | | |
|---|---|---|---|
| కాలము:-మార్చినెల సాయం. 4 గం. | లబ్ధమూలము | | 2 |
| వెలుతురు:-ప్రకాశమానమగు సూర్యరశ్మి | | ,, | 0 |
| ఫోటోదీయుటకు తగినస్థలము:- | చెట్లు మొదలగు దృశ్యములు | ,, | 6 |
| ప్లేటుయొక్క వేగము:- H. & D. 200 | | ,, | 1 |
| లెన్సుయొక్క అపెర్చరు F. 16 | | ,, | 4 |
| | | మొత్తము | 13 |

ఆరవపట్టికయందీమొత్తము క్రిందనుండు సంఖ్య 2 శెకనులు. కాన, సరియగు ఎక్స్‌పోజరు 2 శెకనులుగా తెలిసికొనవలెను.

కాలము (Time) పట్టిక. 1.

| కాలము | జూన్ | మే-జూలై | ఏప్రిల్-ఆగస్టు | మార్చి-సెప్టంబరు | ఫిబ్రవరి-అక్టోబరు | జనవరి-నవంబరు | డిశంబరు | లబ్ధమూలము |
|---|---|---|---|---|---|---|---|---|
| ఉదయము | 9 గం. మొ 12 గం. | 9 గం. మొ 12 గం. | 10 గం. మొ 12 గం. | | | | | 0 |
| సాయంకాలము | 12 గం. మొ 3 గం. | 12 గం. మొ 3 గం. | 12 గం. మొ 2 గం. | | | | | 0 |
| ఉదయము | 6 గం. మొ 9 గం. | 7 గం. మొ 9 గం. | 8 గం. మొ 10 గం. | 9 గం. మొ 12 గం. | 11 గం. మొ 12 గం. | | | 1 |
| సాయంకాలము | 3 గం. మొ 6 గం. | 3 గం. మొ 5 గం. | 2 గం. మొ 4 గం. | 12 గం. మొ 3 గం. | 12 గం. మొ 1 గం. | | | 1 |
| ఉదయము | | 6 గం. మొ 7 గం. | 7 గం. మొ 8 గం. | 8 గం. మొ 9 గం. | 9 గం. మొ 11 గం. | 10 గం. మొ 12 గం. | 11 గం. మొ 12 గం. | 2 |
| సాయంకాలము | | 5 గం. మొ 6 గం. | 4 గం. మొ 5 గం. | 3 గం. మొ 4 గం. | 1 గం. మొ 3 గం. | 12 గం. మొ 2 గం. | 12 గం. మొ 1 గం. | 2 |
| ఉదయము | | | 6 గం. మొ 7 గం. | 7 గం. మొ 8 గం. | 8 గం. మొ 9 గం. | 9 గం. మొ 10 గం. | 10 గం. మొ 11 గం. | 3 |
| సాయంకాలము | | | 5 గం. మొ 6 గం. | 4 గం. మొ 5 గం. | 3 గం. మొ 4 గం. | 2 గం. మొ 3 గం. | 1 గం. మొ 2 గం. | 3 |
| ఉదయము | | | | | | | 9 గం. మొ 10 గం. | 4 |
| సాయంకాలము | | | | | | | 2 గం. మొ 5 గం. | 4 |

వెలుతురు (Light) పట్టిక 2.

| | |
|---|---|
| ప్రకాశమానమగు సూర్యరశ్మి లబ్ధమూలము (Factor) | 0 |
| మబ్బులతో గూడిన సూర్యరశ్మి ,, ,, | 2 |
| దట్టముగా మబ్బుచే క్రమ్మినవెలుతురు ,, ,, | 3 |

ఫోటోగ్రాఫుదీయుటకు తగిన ప్రదేశములు

వస్తువుల (Subjects) పట్టిక 3.

| | లబ్ధమూలము |
|---|---|
| మేఘములు | 0 |
| నీడలు లేనట్టి సముద్రదృశ్యములు | 2 |
| కమీరాకు సమీపముగానుండు కట్టడములు | 4 |
| చెట్ల క్రింద, ప్రకాశమానమగు వెలుతురు నిచ్చుగదుల యందుండు మనుష్యులు | 7 |
| వెలుతురు లేని యిండ్లలోపల | 12. మొ. 15 |
| ఆకాశముతో గూడిన సముద్ర దృశ్యములు | 1 |
| ముందుభాగమున నీడనిచ్చు వస్తువులుగాని, స్థలములు గానిగల సముద్రదృశ్యములు | 8 |
| అడవిప్రదేశములు, చెట్లు మొదలగు యితరదృశ్యములు | 6 |
| చలించనట్టి వస్తువులు | 0 |
| మంచివెలుతురుగల యిండ్లయందలి లోపలిభాగములు | 8. మొ. 12. |
| దేవాలయము లోపలిభాగములు | 15. మొ. 20. |

అపెర్చరుల (Stops) పట్టిక 4.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | F. 4. 5— | F. 6.3 — | F. 8— | F. 11— | F. 16— | F. 22— | F. 32— | F. 45— | F. 64 |
| లబ్ధమూలము: | 0— | 1— | 2— | 3— | 4— | 5— | 6— | 7— | 8 |

ప్లేట్లయొక్క వేగము (Speed of Plates in H & D) లో పట్టిక. 5.

| H. & D. 70— | H. & D. 100— | H. & D. 200 మొదలు 300— | H. & D. 300 మొదలు 800. | |
|---|---|---|---|---|
| 3.— | 2.— | 1.— | 0.— | లబ్ధమూలములు |

ఎక్స్పోజరు లేక, సరియగు కాలపరిమితి (Exposure) పట్టిక 6.

| లబ్ధమూలముల మొత్తము | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఎక్స్పోజరు | 1/2000 | 1/1000 | 1/500 | 1/250 | 1/100 | 1/50 | 1/25 | 1/10 | 1/5 | 1/5 | ½ | 1 | 2 | 4 | 8 | 16 | 30 | 1 | 2 | 4 | 8 | 16 | 30 | 60 | [illegible] |

నోటు:— మొదటి 17 గడులయందలి ఎక్స్పోజరుకాలములు సెకనులుగను మిగిలినవి నిమిషములుగను తెలిసికొనవలయును.

(సశేషము)

# నా నాతి వాక్యంబు.

అధికార్ల సూర్యనారాయణరావు గారు, బి. ఏ., బి. యల్.

నా నాతి వాక్యంబు గానామృతంబు<br>
నా లేమ రాగంబు నా వైభవంబు<br>
నా బాల వదనంబు నాకలోకంబు<br>
నా సీత హృదయంబె నా నివాసంబు

నా సఖి యందంబు నగు వసంతంబు<br>
నా చెలి చందంబు నవ ప్రసూనంబు<br>
నా నాతి సుగుణంబు నా భూషణంబు<br>
నా సీత ప్రణయంబె నాదు ప్రాణంబు.



సప్తమాంధ్ర ఆయుర్వేద మహాసభ



ఈ రథోత్సవము ఏప్రెల్ నెల 5-4-25 తేదిన గొప్ప వైభవముతో జరిగెను.—ప్రెస్ ఫోటో బీరో.

# వేదాంత విమర్శ

సుసర్ల రామశాస్త్రి గారు

(సంపుటము ౨, సంచిక ౪ తరువాయి)

## జీవేశ్వర భేదాభేద విచారము

ఇట్లుండ బ్రహ్మసూత్రాద్వైతభాష్యకర్తలు జీవేశ్వరులకు భేదము లేదనుటయే వ్యాసాభిప్రాయమని సిద్ధాంతము చేసినారు. ఇది వ్యాసాభిప్రాయ మేనా, కాదా? యని విచారింతము.

జీవేశ్వరాభేదమే వ్యాసాభిప్రాయ మయినచో పరమాత్మ తేజోమయుడు, సత్యసంకల్పుడు, అని యర్థముగల 'భారూపస్సత్యసంకల్పః' అను శ్రుతిని విషయవాక్యమునుగా దీసికొని :—

బ్ర. సూ. "అనుపపత్తేస్తు నశారీరః' (1-2-3)

అను సూత్రమును వ్యాసులు వ్రాసినారు. ఇందు సత్యసంకల్పత్వాది ధర్మములు పరమాత్మయందే కాని జీవునియందు లేవుగాన జీవుడు బ్రహ్మము కాడు అని స్పష్టముగ కానవచ్చుచున్నది.

వ్యాసులవా రిట్లనేకసూత్రములను వ్రాసినారు. కావున జీవుడే బ్రహ్మమనియనుట వ్యాసాభిప్రాయము కాదు. మహానుభావుడయిన వ్యాసులు, నశించిన బ్రహ్మజ్ఞానము మరల నీమానవుల హృదయములందు స్ఫురించుగాక, వీరందరు బ్రహ్మము నుపాసించి ముక్తిని బొందుదురుగాక యను నుద్దేశముతో బ్రహ్మసూత్రములను వ్రాసినారు; గాని నేనేబ్రహ్మను, నీవే బ్రహ్మవు అని చెప్పి, బ్రహ్మము లేదని బోధపరిచి, ప్రపంచమును నిరీశ్వరము చేయుటకుకాదు. నేనే బ్రహ్మను అను మాటకు బ్రహ్మ లేడను నర్థమున్నదని వేదవ్యాసులకు తెలియదా?

ఇదివరకు అద్వైత మతాగ్రేసరశిరోమణులమని అభిమానము గలిగి మేము బ్రహ్మమేము, అను నభిమానముగల మహానుభావులకు ఈ మాట విని నయంతనే, వ్యాసాభిప్రాయము దెలియమి తోకమట్టబడిన పామునకువలె కంఠపూర్తిగ కోపమువచ్చి; 'పాగాబెట్టుకుంటే పంతులనుకున్నాను; నువ్వా, పాడగట్టా,' అన్నట్లు, ఏమో విశేషము వినవచ్చుననుకున్నాము. మీపాండిత్య మిక్కడికి బోధపడినది. శంకర సిద్ధాంత మబద్ధమనుచున్నారా? మీరుచెప్పినదేనా సిద్ధి; నరబి పెట్టిన దేనా ప్రసాదము. జీవబ్రహ్మైక్యము వ్యాసాభిప్రాయము కాదనుచున్న మీరు,

'తత్త్వమసి' (ఛాం. ఖం. 6 ప్ర 8 ఖు)

దీని కొక్కడాని కర్థముచెప్పుదురో, అని యడుగవచ్చును. 'త్వమసి' ఇత్యాద్యనేక వాక్యములకు, నిజమయిన యర్థములను తెలియక అపార్థములను కల్పించి వాటి పవిత్రార్థమును పాడుచేతురేమో యని యోచించియేకదా వ్యాసులవారు, శ్రుతిప్రతీకముతో అట్టిశ్రుత్యర్థమును స్పష్టపరిచియున్నారు.

పైనివ్రాసిన 'తత్త్వమసి' అను శ్రుతికి బృహన్నారదీయమునందు :—

"శ్లో. తత్త్వమస్యాది వాక్యోత్థం
యజ్జీవ పరమాత్మనోః,
సాదృశ్యవిషయం జ్ఞానం
తదేత న్మోక్షసాధనమ్."

ఓ శ్వేతకేతూ, ఇప్పుడు నీజీవాత్మ బద్ధావస్థయందున్నది. ఈబంధము వదలిన పైని నీయాత్మ బ్రహ్మసమానమగును. అని సాదృశ్యవివక్షచే నర్థము చెప్పబడియునని వ్రాసిరి. కాని బ్రహ్మమే అగునని వ్రాయలేదు.

ఇక అనుభవమును బట్టి విచారింతము :— ఒకానొక వస్తువు రెండు, మూడుగాని అనేకముగాని అయినప్పుడు ఏవస్తువు అనేకమయినదో దానిధర్మములే ఆ యనేక

వస్తువులయం దుండుట చేతను అవన్నియును మరల మొదటి వస్తువులో కలిసిపోవుటకు అవకాశమున్నది. ఒక బంగారుముక్కను అనేకముక్కలుగ జేసి, వాటినన్నిటిని మరల నొకముక్కగ జేయుట కవకాశ మున్నది. కాని భిన్నధర్మములుగల రెండువస్తువులనయినను ఏకము చేయ వలయుననిన నెపరితరముకాదు.

ఒక వెండిముక్కను ఒక కర్రముక్కను ఏకము చేయుటకు నెంతకాలము ప్రయత్నించినను ధర్మైక్యము లేమి, శక్యముకాదు. మరియొక విశేషమున్నది:—

వాస్తవముగ భిన్నములయి, కొన్నిధర్మములందు మాత్రము సమానములయిన వస్తువులకు, సర్వధర్మసమానత లేమి, ఐక్యముకలుగదుగాని, సామ్యముండవచ్చును. ఒక పండితుడు పూర్ణచంద్రుని, తనప్రియాముఖమును జూచి,

శ్లో. కిం పద్మస్య రుచిం నహంతి నయనా
నందం విధత్తేన కిం?
వృద్ధిం వా ఝుష కేతనస్య కురుతే
నాలోకమాత్రేణ కిమ్?
వక్త్రేన్దౌ యది సత్యయం యదపర
శ్శీతాంశు రుజ్జృంభతే
దర్పస్స్యాదమృతేన చేదిహ తద
ప్యస్త్యేవ బింబాధరే.

ఇచట 1 పద్మశోభాహరణము
2 నయనానందజనకత్వము
3 మనోద్దీపకత్వము
4 అమృతాకరత్వము.

మొదలగు కొన్నిధర్మములు ముఖమునందును చంద్రునియందును సమానముగ నుండుట పరస్పర సామ్యమును చెప్పగలిగినాడు.

ప్రస్తుతము 1 బ్రహ్మమే జీవులయినాడనిగాని
2 బ్రహ్మము రెండుభాగములయి అందొక భాగము జీవులయినది అనిగాని

3 బ్రహ్మములో నేదో కొంత జీవులయినా రనిగాని చెప్పినయెడల జీవులకును బ్రహ్మమునకును సర్వ ధర్మ సమత్వముండుటచే సర్వదా జీవబ్రహ్మ భేదము లేకయే పోవలయును. నిజమే, భేదము లేనేలేదు. అని యంటివేని, జీవులుకూడ సర్వదా సచ్చిదానంద స్వరూపులే కావలెను. అట్లొప్పుకొనినయెడల, అన్నిజీవులు బ్రహ్మమే యగుట నేజీవుడును ముక్తినిగోరించి ప్రయత్నింప నవసరమేలేదు. కావుననే కొందరు జ్ఞానులు,

శ్లో. భిదాయది నసిద్ధ్యేత
జీవాత్మ పరమాత్మనోః!
తదా ముక్తౌ విమోక్షాయ
కోయత్నం కర్తు మర్హతి.

అని వ్రాసియున్నారు.

ఈ ప్రపంచములో ప్రతిజీవుడును సుఖమునువలె దుఃఖమునుగూడ ననుభవించుట చూచుచున్నాము. ఎవ్వడు చూచుచున్నాడో వాడును నీరెంటిని ననుభవించుచునే యున్నాడు. కావున నిత్యానంద, సత్యానంతస్వరూపు డయిన బ్రహ్మమే, జనన మరణప్రవాహములోబడి దుఃఖము ననుభవించుచున్నదని చెప్పుటకన్న బుద్ధితక్కువమాట మరి యెలాగంటిదో తెలియదు.

ఒకనిపుత్రుడు మృతినొందినప్పుడు,

1 హా! పుత్రుడా నన్ను విడిచిపోతివా?
2 నిన్ను విడిచి నేనెట్లు బ్రతుకుదునురా? తండ్రీ!
3 నీముఖము మరి కానరాదురా! నాయనా!
4 హా! దైవమా!

అని యేడుచుచున్నవాడు. ఈఅద్వైతుల బ్రహ్మమే యనుటకు సందేహమా?

ఈ అద్వైతు లిట్టివాదమునకు సమాధానమును చెప్పుటకు తోచక—

1 మాయ యొకటి కలదనియు
2 ఇది జడమనియు
3 దీనియందు ఆవరణశక్తి విక్షేపశక్తి అని రెండు శక్తు లున్నవనియు
4 బ్రహ్మము దీనికి లొంగిపోయినదనియు
5 జీవుడు బ్రహ్మమేఅయినను, మాయ తనయందున్న ఆచ్ఛాదకశక్తిచే జీవుని తనస్వరూపమును తెలిసికొన లేకుండగ జేసినదనియు

6 మాయయే తనయందున్న విక్షేపశక్తిచే జీవునికి తనకు రూపభేదమున్నట్లు భ్రమ పెట్టుచున్నదనియును చెప్పిరి.

కనుక నిద్దియంతయును భ్రమయగుటచే జీవేశ్వరులకు ఏకత్వము నిశ్చయమే అని చెప్పుదురుగాని ఇది యంతయు విచారిత రమణీయమగు స్వకపోలబల కల్పితమగు వేదబాహ్యయుక్తి. ఎట్లన:—

వీరు, మాయయే అచేతనము, అనాది అని చెప్పుచున్నారు.

1 అచేతనమయినమాయ

2 చేతనము పరిపూర్ణము.

3 సర్వశక్తికము అయిన బ్రహ్మమును స్వాధీనముచేసికొనినదియని చెప్పుట యెంత అసందర్భముగనున్నదో యీ మాయ అనాదియనుచున్న అద్వైతులు మాయ, బ్రహ్మమో, బ్రహ్మభిన్నమో అను ప్రశ్నమునకు సమాధానము చెప్పుటయు నంతేకష్టము.

అచేతనమాయకు, చేతనమైన బ్రహ్మను తానావరించి ఆతనికి తానెవరో తాను తెలిసికొనలేకుండగ జేసి జీవునిగా మార్చెదను. తనయందలి విక్షేపశక్తిచే బ్రహ్మమునకు రూపభేదమున్నట్లు తోపించెదను, అను నాలోచనమెట్లుదయించెను? అని యడిగిన నేమి సమాధానము ? అచేతనములయిన రాళ్ళకు, కర్రముక్కలకు, చిల్లపెంకులకును ఆలోచనశక్తి యున్నదని యీ యద్వైతులు తప్ప మరి యెవరయిన ననగలరా ? ఈ అద్వైతులే 'మాయా' పదమునకు 'యా మా సా మాయా' ఏదిలేదో అది మాయ యని విగ్రహము చెప్పి, లేనిదే మాయ యని అర్థము జెప్పుచున్నారు. మాయయే లేనపుడు ఆవరణవిక్షేపము లను రెండుశక్తు లెట్లుండును? ఎవ్వడయిన :—

శ్లో. మృగతృష్ణాంభసిస్నాతః
ఖపుష్పకృత శేఖరః;
వంధ్యాపుత్రోఽఘనిర్యాతి
శశశృంగధనుర్ధరః.

అర్థము:—గొడ్డుదానికొడుకు, యెండమావులలో స్నానమాడి గగనారవిందము కొప్పులో ముడుచుకొని చెవులపిల్లి కొమ్ముతో జేసిన ధనస్సు చేతబట్టుకొని వెళ్లుచున్నాడు.

ఇట్లుచెప్పిన మనము నమ్ముదుమా ?

మహాభారతములో మోక్షధర్మపర్వమున—

శ్లో. 'అన్యశ్చ శశ్వదవ్యక్త స్తథాన్యో ఽహ మితిజ్ఞానం విపశ్చితామ్;'

ముండకములో:—

శ్రు. 'జుష్టం యదా పశ్య త్యన్య మీశ మస్య మహిమాన మితి వీతశోకః.'

(ఇట్లుపనిషత్తులు, పురాణము, బ్రహ్మసూత్రము, మహాభారతము మొదలగు గ్రంథములు, 'తత్త్వమసి' అను వాక్యమునకు సాదృశ్యవివక్షచే నర్థము చెప్పవలయు ననుచున్నవి.)

పూర్వమీమాంసయందు—

1 'ఆదిత్యోయూపః'

2 'యజమానః ప్రస్తరః' ఇత్యాద్యభేదవాక్యములకు, యజమానియే రాయి, సూర్యుడే యూపము, అనునర్థముమాని సామ్యము నంగీకరించిరి. అట్లనే ప్రకృతమందును సాదృశ్య వివక్షనంగీకరించిరి.

## జీవస్వరూపము

ఇట్లు జీవుడు బద్ధముక్తావస్థలయందు గూడ బ్రహ్మభిన్నుడని శ్రీవ్యాసులవారు స్పష్టపరచినారు.

అయితే, యీజీవస్వరూప మెట్టిదో? యను ప్రశ్నమునకు మనము కేవలానుభవముచే సమాధానమును తెలిసికొనజాలము. శబ్దానుమాన ప్రమాణముల చేతనే తెలిసికొనవలయును గాని గత్యంతరము లేదు. ఎవ్వరైన స్వానుభవముచే జీవస్వరూపమును బోధపరిచెదనన్న వారున్న చో వారికి వందనముచేసి వినగోరుచున్నాను.

శ్రీవేదవ్యాసులవారే బ్రహ్మసూత్రములలో జీవస్వరూప మెట్టిదో శబ్దప్రమాణానుసారముగ వ్రాసినారు. ఆక్రమము నీక్రింద వ్రాయుచున్నాను.

బ్ర. 'నాత్మాశ్రుతే, ర్నిత్యత్వాచ్చ తాభ్యః

[illegible]ధ; 3 జ్ఞానవహరిక; 4 ఆభాస;

శ్రు. జ్ఞా [illegible] నిర్విశేష; 7 సవిశేష; 8 [illegible]

శ్రు[illegible]; 10 ఆరోప.

అనగా:—జీవునకు జననము లేదు, మరణము లేదు, నిత్యుడు.

బ్ర. 'జ్ఞోఽతఏవ' (2-3-19)

శ్రు. 1 'అథయోవేదేదం జిఘ్రాణీతి సఆత్మా'

,, 2 'మనసైవై తాన్కామాన్పశ్యన్రమతే.'

,, 3 'ఏషహి, ద్రష్టా, శ్రోతా, ఘ్రాతా, రసయితా, మంతా, బోద్ధా, కర్తా, విజ్ఞానాత్మపురుషః' ఇత్యాదిశ్రుతులు.

జీవుడు, జ్ఞానముకలవాడు, చేతనుడు.

బ్ర. 'ఉత్క్రాంతి, గత్య, గతీనాం?'

శ్రు. 1 'తేన ప్రద్యోతేనైష ఆత్మానిష్క్రామతి, చక్షుషోవా, మూర్ధ్నోవా, ఒన్యేభ్యోవా శరీర దేశేభ్యః.'

ఈ శ్రుతివలన జీవునకు నీదేహమును విడిచివెళ్లుట యున్నదని తెలియును.

శ్రు. 2 'ఎవైకే చాస్మాల్లోకా ప్రయన్తి, చంద్రమసమేవ తే సర్వే గచ్ఛంతి'

ఈ శ్రుతి జీవు డీదేహమును విడిచినపైని చంద్రలోకమునకు వెళ్లునని చెప్పుచున్నది.

శ్రు. 3 'ఆస్మాల్లోకాత్పునరేష్య స్మైలోకాయ కర్మణే.' ఈ శ్రుతి జీవుడు చంద్రలోకమునుంచి కర్మజన్యఫలము ననుభవించు నిమిత్తము మరల మనుష్యలోకమునకు పంచాగ్ని ద్వారమున వచ్చునని తెలియజేయుచున్నది.

బ్ర. 'స్వశబ్దోన్మానాభ్యాంచ' (2-3-23)

శ్రు. 'ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః'

ఈ శ్రుతియందున్న అణుశబ్దముచేతను

శ్రు. 'వాలాగ్రశతభాగస్య, శతధా కల్పితస్యతు, భాగోపః'

ఈ శ్రుతి, ఒక అణుపదార్థమును చూపి, ఇలాగంటి పరిమాణముగలవాడు జీవుడు అని బోధపరుచు

... 3-26)

గగనమునను న్న సూర్యుడు చంద్రుడు మొదలగు తేజఃపదార్థములయొక్క కాంతి, అనేకస్థలములయందు వ్యాపించియుండుట లోకములో చూచుచున్నాము. ఆతీరుననే ఒకభాగమునందున్న జీవుడు, తన జ్ఞానగుణముచేతను సమస్తదేహమును వ్యాపించియుండును, అని చెప్పుచున్నది.

బ్ర. 'పరాత్తుతచ్ఛ్రుతేః' (2-3-21)

శ్రు. 'అన్తః ప్రవిష్టశ్శాస్తాజనానాం'

ఈ శ్రుతి, జీవుడు పరమాత్మాధీనుడుగు తన కర్మను, అనుసరించి తనకు కలుగచేయబడిన, కర్తృత్వము గలవాడని బోధించుచున్నది.

కావున:—

1 జీవునకు జననము లేదు
2 ,, మరణము లేదు
3 జీవుడు నిత్యమయినవాడు
4 ,, జ్ఞానముగలవాడు
5 ,, చేతనుడు
6 ,, దేహమునుంచి ఉత్క్రాంతిగలవాడు
7 ,, దేహమునువిడిచినపైని చంద్రలోకగతికలవాడు
8 ,, చంద్రలోకమునుంచి కర్మజన్యఫలము ననుభవించునిమిత్తము పంచాగ్ని ద్వారమున మరల మర్త్యలోకమునకువచ్చువాడు
9 ,, అణుస్వరూపుడు
10 ,, తన జ్ఞానగుణముచే సమస్తదేహమును వ్యాపించియున్నవాడు.

జీవస్వరూప మెట్టిది ?

బ్ర. 'జన్మాద్యస్యయతః' (1-1-2)

ఇత్యాది పదములను శ్రుతులలో దూర్చి అశ్రుతులను అన్యథా సమన్వయించినందున ఉపనిషన్మతము పూర్తిగ నశించినది.

ఎట్లన—

శ్రు. 'ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే, తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి.'

ఈ శ్రుతికి వ్యాసులు కర్మసంహితయందు—

శ్లో. ద్వావేతౌహిశరీరస్థౌ
జీవశ్చ పరమస్తదా;
పారతంత్ర్యాది జీవ
స్వాతంత్ర్యేతి శ్రుతౌశ్రుతః.
స్వవశే నాదనాద్బ్రహ్మ
సాక్షిత్వేనావి సంస్థితః
సఏవహి శుభస్యాత్తా
జీవోత్తాస్యైవ వేదనాత్.

శ్లోకార్థము:—ఈ దేహమునందు జీవాత్మ, పరమాత్మయను రెండాత్మలున్నవి. ఆరెంటిలో నొకడగు జీవుడు కర్మ జన్యఫలమును అనుభవించుచున్నాడు. కావున జీవుడు బ్రహ్మముకాదను భావము స్పష్టపడుచున్నది.

అద్వైతులు ఈ యర్థమును విడిచి, యీ శ్రుతియందు 'వ్యావహారిక' అను పదమునుదూర్చి ఈ శ్రుతి వ్యావహారిక భేదమును చెప్పుచున్నది అని వ్రాయుట సూత్రకారాసమ్మతార్థముకాదు?

బ్ర. 'దర్శయతి చాథో ఒపిస్మర్యతే' (3-2-47)

ఈ సూత్రమునకు అద్వైతులు భాష్యము వ్రాయుచు

శ్రు. 'అథాత ఆదేశో నేతినేతి' అను బృహదారణ్యక శ్రుతినిన్ని.

శ్లో. 'అనాదిమత్పరంబ్రహ్మ
నసత్తన్నాసదుచ్యతే' (గీ. 13-123) అను వాక్యమున్ను వ్రాసి, బ్రహ్మచైతన్యముతప్ప మరియే పదార్థమున్ను లేనేలేదని యర్థముచెప్పినారు.

ఈ యర్థము వేదవ్యాసమత విరుద్ధము. వ్యాసులు

శ్లో. మూర్తం సదితి సంప్రోక్త
మమూర్తమసదుచ్యతే,
మూర్తామూర్తేతరద్బ్రహ్మ
నతత్సన్నాసదుచ్యతే.

అని వ్రాసినారుగాన (3-2-47) సూత్రభాష్యమున నుదహరించిన 'నేతినేతి' వాక్యము, బ్రహ్మము జగద్విలక్షణమని తెలియజేయునుగాని బ్రహ్మముతప్ప మరియే పదార్థమున్ను లేనేలేదని చెప్పుట వ్యాసాభిప్రాయ విరుద్ధమని స్పష్టముగ గానవచ్చుచున్నది.

బ్ర. 'నస్థానతోపి పరస్యోభయలింగంసర్వత్రహి'

ఈ సూత్రభాష్యములో నద్వైతులు:

శ్రు. 'అశబ్దమస్పర్శమరూపమవ్యయం'

,, 'అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘం'

ఇత్యాది శ్రుతుల నుదహరించి బ్రహ్మము నిరాకారమని యర్థము చెప్పినారు. కాని యది సూత్రకర్త యొక్క అభిప్రాయముకాదు. బ్రహ్మాండపురాణములో

శ్లో. ప్రసిద్ధస్థూలసూక్ష్మాది
నైలక్షణ్యో జగత్పతిః,
అస్థూలాదిరితి ప్రోక్తో
నైవస్థాల్యాద్యభావతః.

ఇట్లు బ్రహ్మము ప్రాకృతస్థాల్యాది రహితము అని వ్యాసులు వ్రాసియున్నారు. ఇట్లనేకోదాహరణములను వ్రాయవచ్చును గాని ప్రాజ్ఞులకు ఇవి చాలునని విరమించుచు ప్రకృతము ననుసరించుచున్నాను.

మనము వ్యాసాభిప్రాయమగు నుపనిషదర్థమును పురాణరూపవ్యాఖ్యానుసారముగ ననుభవములోనికి దెచ్చికొనినయెడల కలలోనయినను జీవుడు బ్రహ్మముగునని భ్రమపడము. లేక పద్ధర్శన మహాకూపములలో బడితిమా పరమార్థ మెన్నటికిని దెలియదు. అందుచే వ్యాసాభిప్రాయానుసారముగ బ్రహ్మమునకును జీవునకును హస్తిమశకాంత మున్నది.

1 బ్రహ్మము సర్వజ్ఞము—జీవుడు తన వెనుకనున్నవారేమి చేయుచున్నారో తెలిసికొనజాలనంత అజ్ఞాని.

2. బ్రహ్మము సర్వశక్తికము:—జీవుడు తనకు కావలసిన వస్తువులనుకూడ సంపాదించుకొనలేనంత యశక్తుడు.

3. మనకు యథార్థజ్ఞానములు కలుగజేసి సత్ప్రవర్తకులనుజేసి రక్షించదగినవాడు పరమాత్మతప్ప గత్యంతరము లేదు.

4. పరమాత్మ నిర్వికారుడు—జీవుడు షడ్భావవికారములు గలవాడు.

5. ఆయన నిరంజనుడు—జీవుడు సాంజనుడు.

6. ఆయన హేయగుణశూన్యుడు—జీవుడు హేయగుణి.

## మోక్షప్రాప్త్యుపాయము

ఇట్లు వ్యాసులు జీవబ్రహ్మభేదమున్నదని చెప్పి, పరమకారుణికుడగు నాతడు, జననమరణ రూప సంసార సముద్రమునబడి అతిదుఃఖము ననుభవించుచున్న జీవులు మోక్షము పొందుటకు,

'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' (1-1-1)

అనుసూత్రముచే నుపాయము నుపదేశించుచున్నారు:—

ప—అథ,అతః,బ్రహ్మజిజ్ఞాసా.

అ—అథ='నాస్త్యకృతః కృతేన' ఈశ్రుతికర్మచేత మోక్షము సంభవించదు, అని చెప్పుచున్నందునకర్మజన్య ఫలభోగానుభవములయందు వైరాగ్య ముదయించిన పైని.

అతః=ముముక్షువు అయినాడు గాన,

బ్రహ్మజిజ్ఞాసా=బ్రహ్మవేదనము (ఉపాసనము) కర్తవ్యా= చేయదగినది.

ముముక్షువు మోక్షముకొరకు బ్రహ్మవేదనమును చేయవలయును అని భావము.

వేదనము, ఉపాసము, యీరెండును పర్యాయ పదములు ఎట్లనిన:—

(1). శ్రు॥'మనో బ్రహ్మేత్యుపాసీత' ఈశ్రుతిలో 'ఉపాస్' ధాతువుతో ప్రారంభింపబడిన యర్థము.

2 శ్రు. 'భాతిచ, తపతిచ, కీర్త్యా(బ్రహ్మ)వర్చసేన యఏవంవేద'—అనుశ్రుతిలో 'విది'ధాతువుతో ముగింపబడినది.

(1) 'యస్తద్వేద, యత్సవేద, సమయైతదుక్తః' అని విధిధాతువుతో ప్రారంభింపబడిన రైక్వుని వేదనము.

(2) 'అనుమ ఏతాం భగవో దేవతాం,శాధియాం దేవతా ముపాస్సే'. అని 'ఉపాస్' ధాతువుతో నుపసంహృత మయినది.

ఇట్లు విద్యుపాస్ ధాతువులు పర్యాయములుగా శ్రుతులలో వాడబడినందున వేదనమన నుపాసన మని వ్యాసాభిప్రాయము.

గావున ముముక్షువు మోక్షార్థము బ్రహ్మోపాసనము చేయవలయును,

ఆబ్రహ్మోపాసనము చేయువిధమునుగూడవ్యాసులీక్రింది సూత్రములో నుపదేశించుచున్నారు:

బ్ర. సూ. 'ఆసీనస్సంభవాత్; (4-1-7)

ప—ఆసీనః, సంభవాత్.

అ—సంభవాత్=కూర్చున్నవానికి చిత్త చాంచల్యము లేకుండుట సంభవించునుగాన,

ఆసీనః=మృదువైన యాసనముపైని కూర్చుని బ్రహ్మోపాసనమును చేయవలయును.

బ్ర.సూ. 'ఆప్రయాణాత్తత్రాపిహి దృష్టం.' (4-1-12)

ప—ఆ + ప్రయాణాత్, తత్ర,అపి,హి,దృష్టం.

అ—హి=నిశ్చయముగ,

తత్ర + అపి=ఆయుపాసనయందును,

శ్రు॥'సఖల్వేవం వర్తయన్యావదాయుషం,బ్రహ్మలోక మభిసంపద్యతే.' అనుప్రమాణమువలన

ఆప్రయాణాత్=ఉపాసనము చేయుటకుప్రారంభించినది, మొదలు మరణకాలము వచ్చువరకును మధ్యకాలమున ప్రతిదినమ్ము సాయంప్రాతఃకాలముల యందు కొంతసేపు ఉపాసనము చేయవలయునని

ధృష్టాంతమునవస్థమ్మన్న ది:

ఈ బ్రహ్మచింతనము ప్రతిదినం సాయం ప్రాతః కాలములయందు నిరంతరమేప్పు తప్పక ఉపాసనము చేయ వలయును.

శ్రు. 'సర్వవ్యాపీ సర్వభూతా న్తరాత్మా'

ఈశ్రుతి బ్రహ్మము సర్వవ్యాపకము, సర్వా న్తర్యామి యనియును,

శ్రు; 'ఆత్మానం ధ్యాయథ'

ఈశ్రుతి బ్రహ్మమును ధ్యానించుమని చెప్పు చున్నది. కాన బ్రహ్మము నెచ్చట ధ్యానించవలయునో అట్టిస్థానమును ఈక్రింది సూత్రముచే నుపదేశించు చున్నారు:—

బ్ర. సూ; 'దహర ఉ త్తరేభ్యః' (1-3-14)

ప—దహరః, ఉ త్తరేభ్యః'

అ—ఉ త్తరేభ్యః=శ్రు; 'ఏష ఆత్మాఽ పహత పాప్మా, విజరో, విమృత్యు, ర్విశోకో,విజిఘ త్సోఽపిపాస, స్సత్యకామ,స్సత్య సంకల్పః.

శ్రు; 'అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ, దహరోఽస్మిన్నంతరాఆకా శః, తస్మిన్యద న్త స్తదన్వేష్టవ్యమ్

ఈశ్రుతి, ఉపాసక శరీరమును 'బ్రహ్మపుర' శబ్ద ముచేత ఉపాస్యబ్రహ్మయొక్క పట్టణమునుగ, నిర్ధారణ ముచేసి, 'దహరం పుండరీకం వేశ్మ' అనువాక్యముచేతను ఆ బ్రహ్మపురమధ్యవర్తి యయినట్టియు, ఆబ్రహ్మపురా వయవమయినట్టియు పుండరీకాకారము వంటి యాకా రము గలిగినట్టియు, అల్పపరిమాణము గలదియు నగు హృదయము, పరమాత్మయొక్క గృహమునుగ నుపదేశిం చుట వలనను,

దహరః=దహరాకారము బ్రహ్మము కావున, బ్రహ్మమును హృదయమునందు ధ్యానించుమని వ్యాసు లుపదేశించుచున్నారు. హృదయము బ్రహ్మధ్యానస్థానము.

బ్రహ్మయొక్క ధ్యానార్హరూప మెట్టిదో? యని ధ్యాతలకు సంశయముగలుగునని శ్రీ వ్యాసులవారు:—

బ్ర. సూ; 'అ న్త స్తద్ధర్మోపదేశాత్; (1-1.20)

అను సూత్రముతో బ్రహ్మమున ధ్యానార్హరూపము నుప దేశించుచున్నారు.

ప—అ న్తః, తద్ధర్మోపదేశాత్.

అ—తద్ధర్మోపదేశాత్ = శ్రు; 'యఏషో న్తరా దిత్యేహిరణ్మయః పురుషోదృశ్యతే.........

ఈశ్రుతిచేతను చెప్పబడుచున్న తేజోమయత్వాది ధర్మములు ఆదిత్యా న్తర్వర్తియందు చెప్పబడుటచే,

అ న్తః=అంతరాదిత్యునియందున్న పురుషశబ్ద వా చ్యుడు తేజోమయ సర్వావయవములును కలవారు, అని శ్రీవ్యాసులవా రుపదేశించుచున్నారు.

శ్రు; (కఠ-15;) 'అశబ్దమస్పర్శమ' రూప మవ్య యం; 'అస్థూల మనణ్వదీర్ఘ మహ్రస్వం! ఇత్యాది శ్రుతుల కర్థమును శ్రీవ్యాసులు బ్రహ్మాండపురాణమున:—

శ్లో. ప్రసిద్ధస్థూలసూక్ష్మాది వైలక్షణ్యాన్మహేశ్వరః,
అస్థూలాది రితిప్రోక్తో నైవ స్థూలాద్యభావతః.

శ్లో. 'ప్రాతికానిహి రూపాణిభూతేభ్యో సాయతఃపరః,'
అరూపవానితిప్రోక్తో నైవ రూపాద్యభావతః.

ఇట్లు ధ్యేయబ్రహ్మమునకు తాను స్వయముగ కల్పించుకొని నయప్రాకృత జ్ఞాన తేజోమయదేహమున్న దని వ్యాసు లుపదేశించుచున్నారు. కావున జననమరణ ప్రవాహములోబడిన జీవుడు హృదయమున నా బ్రహ్మ మునుపాసింపవలయును.

ఈ యుపాసనను, 1. ధ్యాన, 2. ఆవాహన, 3. ఆసన, 4. పాద్య, 5. అర్ఘ్య, 6. ఆచమన, 7. స్నాన, 8. వస్త్ర, 9. భూషణ, 10. గంధ, 11. పుష్ప, 12. ధూప, 13. దీప, 14 నివేదన, 15. ప్రార్థ నానమస్కారములు అనునవి అంగములు.

వీటి యర్థము గురుముఖైకవేద్యముగావ భావనా పూర్వకముగ చేయని పైపనులుఅటువంటివిగాని బ్రహ్మో పాసనాంగములు కావు. లోకవిడంబన మాత్రము, అని భావనోపనిష త్తున స్పష్టముగ నుపదేశింపబడినది. కావున సభలలో నుపన్యాసము చేయకూడదని శ్రీవ్యాసశాసనము.

సమాప్తము

బ్రహ్మోపాసనము చేయుటకు అభిప్రాయముగల వారు.

శ్రు; 'తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్...'

ఆనుశ్రుత్యనుసారముగ నీ యుపన్యాసమును వ్రాసిన వానివద్దకువచ్చి రహస్యముగ నడిగినచో షోడశోపచారా ర్థముగాని పంచోపచారార్థముగాని స్పష్టపడును. భావ నోపనిష త్తు చూచినను చాలును.

# ప్రణయ కలహము

త్రిపురాన వేంకట సూర్య ప్రసాదరాయ కవి గారు

ఇల సరివారిలోనఁ దగునే తలవంపులు నా కటంచుఁ దాఁ
బాలయలుకన్ వహించి పొరపొచ్చెము గల్గసి కూర్మిగోరి యు
వ్వాలి మొగమయ్యెఁ గాని పతిభక్తికి మాదగు బోటిమేటియో
పలఁ గడు గారవించెడు రసజ్ఞుల కింకిటఁ జెప్పనేటికిన్.

క. అక్షీణ ధర్మపాలన, దీక్షన్ మును బాసచేసి తెఱవ నిపుడు ని
ష్పక్షమతి నరయవైతివి, దక్షిణనాయకుల కిదియు ధర్మంబగునే.

క. కల్లలకు బ్రమసి మహి బహు, వల్లభులగు పతుల నమ్మి వలచిన యిల్లాం
డ్రెల్లిదము గారె కటకట, చెల్లుననుచు నింత చులుక సేయందగునే.

చ. ప్రబలుఁడ, నేలుకోఁగలను బల్మిని, నా దగు చేతిలోని దీ
యబల, యిదేమి సేయఁగలదంచు ననాదరబుద్ధిఁ జూచెదో
యబలయుఁ బ్రేమదక్కి యసహాయతఁ దెంపు వహించెనేనియుం
బ్రబల యగుంజుమీ ప్రణయభంగపుసంగతి కింతు లోర్తురే!

ఆ. ప్రణయసూత్రకలన బంధింపఁదగుఁ గాక
పువ్వువంటి యిగురుఁబోండ్ల మనసు
కడఁక బల్మి నేలుబడిఁ జేసి తానేమి
సౌఖ్య మనుభవింపఁజాలు భర్త.

# ప్రాచీన భరతవర్షమునందు శూద్రులకుఁ గల యధికారము

[విశ్వభారతి - క్వార్టర్లీలో పండిత విధుశేఖర భట్టాచార్యులవారిచే వ్రాయఁబడినది—
వేలూరి శివరామశాస్త్రి గారిచే తెలిగింపఁబడినది]

ఈ వ్యాసమునందు ముఖ్యముగా శూద్రులకును దక్కువ వర్ణములవారికిని వైదిక కర్మలందుఁ గల యధికారమునుగురించి విచారింతము. ప్రాచీన భరత వర్షమునందు వ్యాప్తమైయున్న వర్ణపద్ధతికి సంబంధించిన విషయము లానుషంగికముగా నెంతవఱకుఁ దెలియునో యంతవఱకే మనమిందుఁ దృష్టిపడవలసి యున్నాము.

ప్రథమప్రశ్న మిది: వైదికకర్మలందు శూద్రు లధికృతులా? 'ఔను' అని ప్రత్యుత్తరించువాఁడు బాదరి యను [౧] ఆచార్యుఁ డొక్కఁడే. అతఁడు'యజేత'అను విధి [యజ్ఞముచేసి తీఱవలయును] యజ్ఞము చేయగోరు నెవనికేనియు చెల్లునని చెప్పుచున్నాఁడు; ఏలనఁగా నిష్కృష్టమగు నిషేధవిధి తెలుఁజేసి పైవిధి శూద్రులను వెలివేయదు. మఱియు అతఁడు భిన్నముగా అభిప్రాయ పడిన ఆత్రేయుని-[౨] ఖండించి వర్ణవివక్ష లేకయే ప్రతి వానికిని యజ్ఞాధికారము కలదని తేల్చినాఁడు. [మీమాంసాసూత్ర ౬. ౧. ౨౭]

ఇటులు సిద్ధాంతించి బాదరి శూద్రులకుఁగూడ వేదశాస్త్రాధ్యయనమున నధికారము కలదని అవశ్య మంగీకరించెను. శబరస్వామి బాదరియభిప్రాయములసంకలించి చెప్పిన వాక్యమువలన ఈవిషయము విస్పష్టమయ్యెడిని. [మీమాంసాసూత్ర ౬. ౧. ౨౭—౨౮]

"కావున ప్రతివానికి వేదాధికారముకలదని బాదరి అభిప్రాయపడెననుట విస్పష్టము."

పైవిషయములవలన బాదరిమతమున శూద్రులకు ఉపనయనాధికారముకూడ కలదని తేలుచున్నది. ఏలన వేదాధ్యయనమువినా యజ్ఞాదిక్రియలు విధియుక్తముగా నెఱవేర్పఁబడఁజాలవు. చిట్టచివర ఈవిషయమునకువత్తము.

ఇదియంతయు కేవలము భావనయా? లేక నిక్కముగా ఆచరింపఁబడెనా? అని మనిమందు తెలిసికొనుటకు ఇంతకంటె ఎక్కువకుతూహలము కలుగును. ఆచరణమునకుఁగూడ సాక్ష్యముకలదని మనము కనుగొందుము. శూద్రులుకూడ వైదికకర్మలలో భాగస్వాములైరను సిద్ధాంతముదెస విచ్చలవిడిగాఁ బ్రవహించు వేదవాక్యములు కలవని శబరుఁడును [మీ. సూ. ౬.౧.౨౫—౨౮] కర్కుఁడును [కాత్యాయన శ్రౌత సూత్ర ౧.౧.౬] చెప్పిరి.

ఒక ఉదాహరణము. దర్శపూర్ణమాసయందుహవిష్కృత్తు [ఆహుతి సిద్ధముచేయువాఁడు] బ్రాహ్మణుఁడాయెనేని'ఏహి'అనియు,క్షత్త్రియుడాయెనేని'ఆగహి' అనియు, వైశ్యుఁడాయెనేని 'ఆద్రవ' అనియు శూద్రుఁడాయెనేని 'ఆధావ'[3] అనియు ప్రేషయీయవలయునని ఆదేశము కలదు. [శతపథబ్రాహ్మణ ౧.౧.౪.౨]

ఇంకొకటి. ఒకానొక వైదికవ్రతమునందు శూద్రుఁడు పులిపెఱుగును ఆహారముగా గొనవలయును నని కలదు. [శాబరభాష్య. మీ.సూ. ౬.౧.౩౧. మఱియు కర్కభాష్య మీ.సూ. ౧.౧.౫.౧]

---

౧. బ్రహ్మసూత్రకర్త యగు బాదరాయణునికంటె నితఁడు సాక్షాద్భిన్నుఁడు. [శ. ౪-౧౦-౧౩]

౨. జైమిని ఆధారమున [మీమాంసాసూత్ర ౬.౧. ౨౫-౩౦] కాత్యాయనుఁడు [శ్రౌతసూత్ర ౧. ౧. ౬] ఆపస్తంబుఁడు [యజ్ఞపరిభాషాసూత్ర ౧.౨]

3. ఈపదములన్నియు ఏకార్థబోధకములైనను గౌరవభేదమునకు సూచకములుగా గానిపించును. ఏహి=రమ్ము, ఆగహి=ఈవలికి రమ్ము, ఆద్రవ=వడిగా రమ్ము, ఆధావ=పరుగెత్తిరమ్ము. ఇటులు అర్థమిచ్చుచుండుటఁ జేసి ఆయాయావర్ణములవారు అటులే వెళ్లియుందురో లేక యిది గౌరవమాత్రభేదకమో అరయ వలయును. (ఈ యుద్దేశము కేవలము నాది.)

పవిత్రమగు సోమము శూద్రులకుఁగూడఁ గలదని తరువాతఁ గనుఁగొందుము. సోమపానమున వారికి తప్పక అధికారముకలదని ఈవాక్యము వలన గ్రహింపవలెను. "బ్రాహ్మణులనియు క్షత్రియులనియు వైశ్యులనియు శూద్రులనియు నాలుగువర్ణములవారు కలరు. వీరిలో నెవరును సోమమును ఉమియరు. [శతపథబ్రాహ్మ. ౫.౫.౪.౯.] శూద్రు లొకానొక సోమయాగమున కధికారులని ఇది తెలుపకుండునా?

ఇట్టివాక్యములు శూద్రులకుఁ గొంతయేనియు పవిత్రమగు వేదకర్మలయందు అధికారము కలదని తేటపఱచును. అయితే వైదికకర్మలందు అగ్రత్రైవర్ణికులకే భాగము కలదని వాదించు జైమినియు [మీ. సూ. ౬.౧] ఇతరులును ఈ బాదరిమతమును సంపూర్ణముగా త్రుంచివైచిరి. అయినప్పటికిని వీరు ప్రత్యేకముగా ఇరువురివిషయములో కొంత వైదికకర్మాధికారమును నిష్కృపట్యముగ అంగీకరించిరి. ఈయాచార్యులమతము ననుసరించి వీరిరువురును అగ్రత్రైవర్ణమునకుఁ జెందినవారు కారు. వీరనార్యులనియు ముందు మన మెఱుఁగగలము.

అందు మొదటివారు సంహితలయందును బ్రాహ్మణములందును ౧ పలుమార్లు చెప్పఁబడిన రథకారులు. [రథము చేయువారు]. అగ్న్యాధానప్రసంగమున రథకారుఁడు వానకాలమున అగ్ని నాధానము చేయవలెయు నని కలదు. ౨

ఇఁక రథకారులన నెవరు? అగ్రత్రైవర్ణికులయందు రథములు చేయు వృత్తిగలవారు. రథకారులని తమ కనుకూలముగ ఛాందసులగు ఆచార్యులు (Orthodox teachers) సులభముగా వాదింతురు. ఇట్లనుచో వారికి అగ్న్యాధానము నెడ శంకయే లేకపోవును. కాని అట్టియర్థముపాదేయము కాదని గ్రహించుటకు వారికి జ్ఞానము నెడభక్తి కలదు. అందువలన రథకారుల నిజస్థితి యెట్టిదో నిరూపింపవలసిన ఆవశ్యకత ఉదయించెను.

శూద్రవర్ణమునకు సంబంధించిన కరణమాతయందు జనించి శూద్రస్త్రీసంబంధము పడయుటవలన రథకారుఁడు శూద్రుఁడని కర్కుఁడు పరిగణించుచున్నాఁడు. [కాత్యా. శ్రౌ. సూ. ౧.౧౬]

అగ్రత్రైవర్ణికులకు సవర్ణభార్యలందు జనించిన కుమారులుగాని లేక తరువాతి తక్కువవర్ణమునందు (అనంతర) జనించిన కుమారులుగాని తండ్రివర్ణమునకు చెందుదురని బౌధాయనుఁడు చెప్పుచున్నాఁడు. [ధర్మసూ. ౧.౯.౬.] ఇట్లు బ్రాహ్మణునకు బ్రాహ్మణియందుఁగాని క్షత్రియయందుఁగాని జనించినకుమారుఁడు బ్రాహ్మణుఁడనియు క్షత్రియునకు క్షత్రియయందుఁ గాని వైశ్యయందుఁగాని జనించినవాఁడు క్షత్రియుఁ డగుననియుఁ జెప్పి వైశ్యునకు శూద్రియందు జనించినవాఁడు రథకారుఁడని చెప్పినాఁడు. [౧.౯.౭]

ఇఁక ఈవిషయమునఁ గూడ బౌధాయనునిచే వక్కాణింపఁబడినట్టియు గౌతమపురస్కృతమునువట్టియు [౪-౧౬] పద్ధతినే మన మంగీకరించితిమేని రథకారుని వైశ్యునిగా అంగీకరించి తీఱవలయును. ఇట్లు కాఁగా అగ్న్యాధానముతోఁ గలిపి వైదికకర్మలందు అతఁడు భాగస్వామియగుట నిర్వివాదము. కాని అట్లు అంగీకరించుచోఁ జాలఁ జిక్కులు కలుగును. ఏమన్న రథకారు లగ్రత్రైవర్ణములోనివారే యగుదురేని అగ్రత్రైవర్ణమునకుఁ జెందు సూత్రము చేతనే సరిపోవుచుండగా వారి యగ్న్యాధానమునకు ప్రత్యేకముగా నొకసూత్రమును విధింపఁ దైత్తిరీయ బ్రాహ్మణమున కక్కఱయేమి?

అయితే మనువు నవీనాచార్యుల ననుసరించి పైనుదాహరించిన ప్రమాణములనుండి తొలఁగినాఁడు. అగ్రత్రైవర్ణికులకు అనంతరవర్ణభార్యలందుఁ గలిగిన పుత్రులు తమ తండ్రులతో సవర్ణులుకాక తద్వర్ణమువంటి వర్ణమునకు (సదృశ) చెందుదురని మను విట్లు చెప్పెను:(౧౦.౬) అవ్యవహిత వర్ణజాతీయలగు భార్యలయందు జనించిన

---

౧. అథర్వ 3.౫.౬; కాఠక ౧౭.౧౩; వాజ. ౧౬.౧౭; 3౦. ౬౧; తైత్తి. బ్రాహ్మ ౧. ౧; ౪౮, 3. ౪. ౨.౧; శతపథబ్రాహ్మ. ౧3.౪.౨.౧౭.

౨. అగ్రత్రైవర్ణికుల అగ్న్యాధానవిధినిగూర్చి తైత్తిరీయ బ్రాహ్మణమున (౧.౧.౨.౬.) కలదు. ప్రాచీన వ్యాఖ్యాతలగు శబరునిచేతను [మీ. సూ. ౬.౧.౪౪] కర్కునిచేతను [కాత్యా. శ్రౌ. సూ. ౧.౧.౯.] పలుమాఱు లుదాహరింపఁబడినది కాని రథకారుని అగ్న్యాధానవిధి తెలుపువాక్యమందుఁ గానరాదు.

వారు మాతృదోషవిగర్హితులు కానం తమ తండ్రుల
వర్ణమునకు సవృకర్ణసవర్ణమునకుఁ జెందుదురు. మఱియు
'ప్రాచీనాచార్యులు వారిని తమతల్లులవర్ణమునకుఁ జెందు
దురన్నారు' అనియు [౯ ౧౦.౧౪] పైనివ్రాసెను. వారు
తమ తల్లులకు చెప్పఁబడిన సంస్కారములకు మాత్రమే
అర్హులని వ్యాఖ్యాతలు వ్రాసిరి.

దీనిబట్టి రథకారుఁడు శూద్రవర్ణమునకు చెందిన
వాఁడు [ఇతఁడు యాజ్ఞవల్క్యుని మతమున మాహిష్య
జనకునకును, కరణమాతకును జనించినను, లేక బోధాయనుని
మతమున వైశ్యజనకునకును శూద్రమాతకును జనించినను]
ఇటులాతఁడు ద్విజాతులకుఁ జెందఁడు. కావుననే
ఆతని కపూర్వముగా నగ్న్యాధానము విధింపవలసి వచ్చి
నది.

మీమాంసాసూత్రములకు వ్యాఖ్యాతృ శిరోమణి
యగు శబరస్వామి రథకారుల(గ్ర త్రై)వర్ణ్యమునకు పూర్తి
గా వేఱయినట్టియు, అ(గ్ర త్రై)వర్ణికులకు కొంచెముతక్కువ
అయినట్టియు, క్షత్రియవైశ్యశూద్రవర్ణములను వేఱయి
నట్టియు ఒకానొక వర్ణమునకుఁ జెందుదురనియు,
కావుననే వారి కగ్న్యాధానము ప్రత్యేకముగా విధింప
వలసివచ్చిన [౬.౧.౫౦] దని యింకొక నడిమిత్రోవ
త్రొక్కినాఁడు. తైత్తిరీయబ్రాహ్మణము [౧.౧.౪౮]
రథకారుల న(గ్ర త్రై)వర్ణికులతోఁ గలిపి చెప్పుటచే రథకా
రులకు శూద్రులకంటె నగ్రస్థానము కలదని స్పష్టము.

వారి అసలువర్ణమేదేని యగుఁగాక, రథకారులు
ద్విజాతులలో చేరరమట విశదము. ఐనను వారు అగ్న్యాధానమునకును దానికి సంబంధించిన క్రియలకు అర్హులు.

ఇఁక నిషాదులను గుఱించి తెలిసికొందము. ఆత్మ
వర్ణజాతుఁడగు నిషాదస్థపతి [నిషాదులలో పెద్ద] రుద్రు
నకు సంబంధించిన ఒక వైదికక్రతువునకు అర్హుఁడని ఒక
బ్రాహ్మణమునందు [జైమిని ౬.౧.౫౧. మఱియు,
కాత్యా. ౧.౧.౧౨ శబరకర్కులును] కలదు.

సంస్కృతమునందును, పాళీయందును, ప్రాకృత
వాఙ్మయమునందును అడవిబోయలుగా చెప్పఁబడిన చంద
మున ఈనిషాదులు నిస్సంశయముగా అనార్యులు. మఱియు
పై బ్రాహ్మణమునందే నిషాదస్థపతి అధ్వర్యుల కిచ్చు
దక్షిణ పిట్టలఁబట్టుబోను(సూట) అని చెప్పఁబడినది. ఆబో
ను ఆర్యులకుఁగాక నిషాదులకు మాత్రమే యుపయుక్త
మగునని శబరస్వామి చెప్పుటచే నిషాదు లార్యులకంటె
సాక్షాద్భిన్నులనుట సిద్ధము. [మీ. సూ. ౬.౧.౫౨]

ఐదుగురు పురుషులు లేక యైదుగురను నర్థమున
వేదములందు [మంత్రభాగమున] 'పంచజనాః' అని సమస్త
పదముకాక సహచరములగు రెండు నిత్యబహువచనాంత
ములగు పదములు తఱచుగాఁ దగులుచుండును. కొన్ని
చోటుల 'జనాః' అనుపదమునకు బదులు 'మనుషాః'[3]
'మానవాః'[4] 'కృష్టిః'[5] 'చర్షణీః'[6] అనుపదములునువచ్చును.
ఇవన్నియు బహువచనాంతములు. వీనికి 'జాత'[7]అను పద
మునుగూడఁ జేర్చవగును. ఇదియు బహువచనాంతము.
వ్యాఖ్యాతల ననుసరించి ఈశబ్దముకూడ తదర్థబోధకమే.

ఈ యైదుగురెవరనునదిఇంకను సరిగా నిర్ధారింపఁ
బడని విషయము.

యాస్కుని నిరుక్తమున [3-౮] రెండువిధములు
గా వ్యాఖ్యాతమైనది. కొందఱమతమున [ఏకే] [౮]
వారు ౧. గంధర్వులు, ౨. పితృదేవతలు, 3. దేవతలు, ౪
అసురులు, ౫. రాక్షసులు, అనియు; ఇక ఔపమన్యవు
నిమతమున నాలుగువర్ణములవారును మిగిలిన నిషాదులును
కలిసి ఐదుగురగుచున్నారు.

---

౧. వీరు తమ తల్లులవర్ణముకంటె నెక్కువయు తండ్రులవర్ణముకంటె తక్కువయు అగువర్ణమునకుఁ జెందుదు
రని మేధాతిథి వ్యాఖ్యానము.

౨. ప్రకృతముద్రణములలో కానరాకున్నను బ్రాహ్మణులుకూడ కారని అందులోనే యున్నది.

3. [ఋక్-౮-౯-౨] ౪. [అథ 3.౨౧.౧౫] ౫. [ఋక్ ౧.౭.౮]

౬. [ఋక్ ౫.౮౬.౨] ౭. [ఋక్ ౬.౬౧.౧౨]

౮. ఇది కొందఱమతమని యాస్కుని అభిప్రాయమైయుండఁగా ఇది యాస్కునిమతమే యనియాతనికంటఁ
గట్టుట వేదిక్ ఇండెక్సు-గ్రంథకర్తల పొరపాటు. విచారింపఁగా నిట ఔపమన్యవుని మతమే యాస్కాభిప్రేతము.

పాశ్చాత్యపండితులు 'వేదిక్ ఇండెక్స్' గ్రంథకర్తలుకూడ పై రెండర్థములును సందర్భముగా లేవని తలంచుచున్నారు. వారిలో వారియభిప్రాయములుకూడ చాల భిన్నములు: తూర్పు దక్షిణము పడమర ఉత్తరములనున్న జనులును మధ్యనున్న ఆర్యులను కలిసి ఐదుగురు [పంచజనాః]అని రాత్, గెల్డ్నర్ అనువారి(Roth Geldner) మతము. ఆర్యులకు దాసులకు తెలుచుగా చేసిన విభాగమునుబట్టి అనార్యులకు 'జనాసః, మానుషాః' అను పదములు చెల్లవుకావునను, ఐదువర్ణములకు సోమము సంబంధించదుగావునను ఆ యైదువర్ణములు సరస్వతీనదీతీరమున నివసించుచున్నటులు చెప్పఁబడెఁ గావునను, మఱియు ఇంద్రుఁడు పాంచజన్యుఁడని [ఐదువర్ణములకు సంబంధించినవాఁడు] యుండెఁగావునను ఈ'పంచజనాః' అనుపదమునకు ఆర్యులనియే యర్థమని జిమ్మరు (Zimmer) పై వారిని ఖండించుచున్నాఁడు. (Vide Index A)

ఎంత యాలోచించినను యాస్కుఁ డుదాహరించిన 'ఏకే' మతము యోగ్యమైనది కాదనుట నిర్వివాదము. మనకుఁ దెలిసిన ఏవేదవాక్యములలోను దాని కాధారము దొరకదు. నిఘంటుకాండలలో [౨-౩] మనుష్యునకు పర్యాయపదముగా [వాచకము] ఈయఁబడిన 'పంచజనాః' అను పదమువలననే మానవమాత్రులే యని యర్థము విశదమయ్యెడినిగాని గంధర్వాసుర రాక్షసులని కాదు. ఇటులుండఁగా సమానపదములగు 'పంచమానవాః పంచకృష్టయః' అనునవి మనుష్యుల ఐదువర్ణములను నర్థమున స్థిరముగా వాడఁబడినవి. డాక్టర్ లక్ష్మణసరూప్ అనువారు[1] ఖండారంభమునందు [౩.౮] యాస్కునిచే ఉదాహరింపఁబడిన సూక్తమున [ఋక్ ౧౩.౪] ఐదుజాతులవారు [పంచజనాః] యజ్ఞమునందు భాగము పుచ్చుకొన అహూతులైరనియు, ఆ యాహ్వానము రక్షః పిశాచములకు అని ఊహింపరానిదనియు, ఇంతియకాక మొదటిఅర్ధపాదము నిస్సందిగ్ధముగా 'రాక్షసులనభిభవింతముగాక'అని చెప్పుటచేతను 'పంచజనాః' అనఁగా ఐదువర్ణములవారే యని కొండొక హేతువును సముచ్చయించుచున్నారు.

ఔపమన్యవునిమతముగా ఎత్తఁబడిన రెండవయర్థమును మొదటిదానివలె అనర్హమని యేలత్రోసివేయఁబడినదో మాకు దురూహము. ప్రత్యుత మాకు అదియే సహేతుకముగను సహజముగను కానిపించుచున్నది. ఎటులనిన నిషాదులనార్యులగుటచే దేనియం దార్యత్వము గుంఫితమై యున్నదో అట్టిచాతుర్వర్ణ్యమున వారికంటె భిన్నులని పైని చెప్పఁబడిన శబరుని యుద్దేశమును ఇది ధ్రువపఱచుచున్నది.

శూద్రులును నిషాదులును పై మూఁడువర్ణముల వారితోపాటు చాల వైదికకర్మలందు భాగస్వాములనియు ఔపమన్యవునిమతమున విశదమగుచున్నది. ఉదాహరణము. వేదమంత్రభాగమున (Text) ఐదుగురుజనులు యజ్ఞార్హులనియు [ఋక్ ౧౦.౪౫.౬] అగ్ని ఐదుగురు జనులకు సంబంధించినదనియు [ఋక్ ౯.౬౬.౨౦; అథ ౪.౨౩.౧] మఱియువారు అగ్నికి హవిస్సునిత్తురనియు [ఋక్ ౬.౧౧.౪] పవిత్రమగు సోమము ఐదుగురిలో నివసించుననియు వారి యజ్ఞాయతనములో నిక్కివచ్చునదియు [ఋక్ ౯.౬౫.౨౩] మఱియు పూతమగు సరస్వతీనది వారిని [ఐదుగురిని] వర్ధిల్లఁజేసిననియు విస్పష్టముగాఁ జెప్పఁబడినది.

వాజసనేయిసంహితలోని పాంచజన్య పదవ్యాఖ్యానమున ఉవ్వట మహీధరులుకూడ ఆయాయైదుగురు వైదికకర్మల కంగీకృతులని స్పష్టముగా నిరూపించిరి. ఉవ్వటుఁడు:— 'పాంచజన్య' అనఁగా ఐదుగురికి మేలు కూర్చువాఁడని యర్థము. ఐదుగురెవరనఁగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు నలుగురును నిషాదు లైదవవారు. నిషాదు లెటులగుదురంటేని వారికిని యజ్ఞార్హత కలదు. మహీధరుఁడు—పంచజను లనఁగా బ్రాహ్మణులు మొదలుకొని నాలుగువర్ణములవారును నిషాదులునుకలిసి. ఏలయన నిషాదులకును యజ్ఞార్హత కలదు.

శబరుని యుద్దేశములతో కలిసి పై విషయములు ఆర్యులగు నాలుగువర్ణములవారికిని నిషాదులకునుఒండొండ అత్యంతమైత్రి కలదని తేటతెల్లగా నిరూపించును. ఈ దిగువదికూడ ఈ యభిప్రాయమునే దృఢపఱచును. విశ్వ

౧. వారి ఆంగ్లీకృత నిఘంటు నిరుక్తములయందు పు. ౨౩౩.

జిద్యజ్ఞము చేసినవాఁడు [బిగ్విశేత] అవభృథమగు పదపడి మూఁడు రే లొకయడవిలో నివసించి పిదప మూఁడురేలు నిషాదులలో నివసించుచు [పంచవింశబ్రాహ్మణ ౧౬.౬ ౩.౯.] అప్పుడు ఆనిషాదులనుండి నెవ్వరిబ్రాలుగాని, నెవ్వరి యన్న ము గాని, చామలుగాని, చామయన్నము కాని, అడవి జంతువుల మాంసముగాని నిస్సందేహముగా పుచ్చుకొనననుజ్ఞాతుఁ డైనాఁడు. [కాత్యా. శ్రౌ. ౧.౨.౨.౧] ఈ రెండుజాతులవారికిని పరస్పర మైత్రి లేనిదే యిటులు చెప్పుటసంభవము

ఈవిషయమున నింక నిషాదశబ్దము స్వయముగా ఏమి చెప్పునో విచారింతము. యాస్కుఁడు దాని వ్యుత్పత్తిని గుఱించి [నిరుక్త. ౩.౧.] ఇటులు వ్రాసెను. నిషాదున కాపే రెటులు వచ్చెను? ఆతఁడు నిషాదనుఁడు కాన; నైరుక్తు లేమి చెప్పుదురనఁగా పాప మతనిలో నిషణ్ణమై యున్నది కాన [తావుకొనియున్నది. కాన]. ఈ రెండవ వ్యుత్పత్తి ఆపాతరమణీయమని విశదమే. అయితే ఇఁక మొదటి'నిషాదన' అన నేమి? జంతువుల జంపి వాఁడు జీవించునుగాన నిషాదుఁడని డాక్టర్ లక్ష్మణసరూప్ అను వారు చెప్పుచున్నారు. అయితే ఇదిమూలములో నిసుమంతయు లేని ఆంగ్లానువాదము. [అటులనఁదగు నేని] విచారింపఁగా నిది"కూర్చుండి చంపుఁగావున నిషాదుఁడు అనఁగా జంతువుల జంపి జీవించువాఁడని అర్థము". అని వ్రాసిన దుర్గాచార్యుని వ్యాఖ్యానమునుండిపుట్టిన దురభిప్రాయము. నిషాదన అనునది ని + సద్ అనుధాతునుండి వ్యుత్పాదితము. ని=క్రింద, సద్=కూర్చుండుట, కాఁగా నపుంసకలింగమున క్రిందకూర్చుండుట అని అక్షరార్థము; నివసించుట,అని ఆలంకారికార్థము. [బుక్ ౧.౧౬౨.౧౪; ౯.౪.౫.]. పుంలింగమగుచో క్రింద కూర్చుండువాఁడు లేక నిమ్నప్రదేశమున కూర్చుండువాఁడు లేక నిమ్నాసనము కైకొనువాఁడు, అని అర్థమగును. ఈ చివరయర్థమిచట [ఆక్షరికముగ ఆలంకారికముగఁ గూడ] సరిపోవును.

దీనివలన ఐదుగురిలో అంతర్గతులగు అనార్యనిషాదులు చాతుర్వర్ణ్యమునవారికంటెఁ దప్పక తక్కువఁగా పరిగణింపఁబడిరనియు దాన నీయైదువర్ణములుకూడిన సంఘమునందు నిమ్నాసనమునకువారు నిర్ణయింపఁబడిరనియు వేఱే చెప్పనక్కరలేదు. వారి కిట్టి కొంచెదన ముండుటచే శ్రేష్ఠులగు త్రైవర్ణికులు వారికీపేరు [నిషాద] పెట్టియుందురు. ఇట్టివే కొన్ని పదములు కలవు. చూడుఁడు: అంత్యావసాయి అనఁగా పొలిమేరల నుండువాఁడు. [మిక్కిలి నీచమగు వివిధజాతులకుఁ బెట్టఁబడిన నింద్యమగు పేరు] నిరవసితుఁడు [బహిష్కృతుఁడు]; ఈపదము వెలివేయఁబడిన కొన్ని జాతులను చెప్పును. అధునాతన కాలమున ఆసనవిశేషముకూడ;(Gallery). దానియందు కూర్చుండు తక్కువవారికి ఇట్లే పెట్టఁబడిన పేరై యున్నది.

ఇఁక ధర్మసూత్రములు నిషాదుగుఱించి యేమి తెల్పునో చూతము. నిషాదు లసలు అనార్యులని యెఱిఁగితిమి. కాని యిచట వారికార్యులతో రక్తసంబంధము కలిగినటులు కనుఁగొందుము. ఇంతియకాక బ్రాహ్మణులతోడనే సంబంధముకల కులమునవారనియు నెఱుఁగుదుము. ఏలనఁగా బౌధాయను ననుసరించి బ్రాహ్మణునకు శూద్రకు పుట్టినవతఁడు నిషాదుఁడు. [ధర్మ ౧.౯.౨] ఇటులుండఁగా; బ్రాహ్మణునకు వైశ్యకుఁ గలిగినవాఁడు నిషాదుఁడని నిర్ణయించుచు గౌతముఁ డితనిని మఱియొక మెట్టెక్కించినాఁడు. [౪.౧౬] ఎవరిమతమున నేని ఈ కాలమునాఁటికి అనార్యనిషాదుఁడుఆర్యసమూహములో చేర్చుకొనఁబడినటులు రుజువగుచున్నది.

నాఁటికాలమున ఏలక్షణములు వర్ణమును నిర్ణయించినవో లేక నిశ్చయించినవో అవి నేఁటికాలమునఁ గల లక్షణములకంటెఁ జాల భిన్నములు. నిశ్చాయకములగు ఆధారము లీమూఁడు. ఒకటి— ధర్మాచరణముచే స్వయం సంపాదితమగు శ్రైష్ఠ్యముకాని, ధర్మము నాచరింపమిఁగలుగు నైచ్యముకాని. రెండు—వృత్త్యంతరగ్రహణము. మూఁడు—సమనంతర జన్మములందు అనుస్యూతఫలముకల జన్యజనక భావము.

మొదటిదానిగుఱించి ఆపస్తంబుఁడు—[ధర్మ౨. ౫.౧౦.౧౧] ప్రకృతజన్మమునందు తనధర్మముల సరిగా నెఱవేర్చుచో ఏవర్ణమునవాఁడేని తరువాతిపుట్టువున సమనంతర శ్రేష్ఠవర్ణముకలవాఁ డగును. ధర్మములను పేక్షించునెడల పిదప వర్ణమునఁ బుట్టును. వ్యాఖ్యాత హరదత్తుఁడు దీనిని విపులముగా చర్చించినాఁడు. స్వయం

సంపాదితములగు గుణములయొక్క ప్రాబల్యమే సవ
వంతరసంతతి యొక్క పైఁజెప్పిన వర్ణ విషయమైన గొప్ప
దనమునకును, కొంచెదనమునకును కారణమగుచున్నదనుట
విస్పష్టము.

రెండవది—వృత్త్యంతరగ్రహణము. దానిఫలమును
యాజ్ఞవల్క్యుఁ డిటులు చెప్పుచున్నాఁడు. [౧-౯౬]—
ఒకవర్ణమునకు నియతమగు కర్మను మఱియొకవర్ణమువాఁ
డవలంబించుచో వాఁడావర్ణమునకుఁ జెందును. [వృత్త్యే కర్మనానిసామ్యమ్]. మను విట్లనుచున్నాఁడు[౧౦. ౮౧.౧౪౪]—ఆపత్సమయములం దైనను క్రింది వర్ణ
ములవారి వృత్తి నవలంబింపనగును. తనకర్మలో గిట్టక
పోయినయెడల బ్రాహ్మణుఁడు క్షత్త్రియకర్మచే జీవింప
నగును. అందునుగిట్టనియెడల వైశ్యకర్మచేసిగాని శూద్ర
కర్మ పర్యంతమునకుఁగాని వెళ్లి జీవింపవచ్చును. అగ్ర
జాతుల కన్నిటికి నిది చెల్లును. అయితే అగ్రవర్ణమున
వాఁడు ఇష్టానుసారముగా గ్రహించిన తక్కువవర్ణముల
వారి కర్మయందే పాఁతుకొనియున్నయెడల వాని సంత
తియు కొన్నితరములదాఁక అట్లేయున్నయెడల అట్లు
క్షత్త్రియ కర్మయందు నియతమైయున్న బ్రాహ్మణ
కుటుంబము అయిదవతరమున క్షత్త్రియ కుటుంబముగా
మాఱిపోవును. ఇట్లే వైశ్యులగుట కాఱు తరములును
శూద్రులగుట కేడుతరములును పట్టును. [యాజ్ఞ. మితా
క్షర ౧.౯౬]

మూఁడవది రక్తసంబంధము. దీనివలన కొందఱి
మతమున అయిదుతరములకును, మఱికొందఱిమతమున ఏడు
తరములకును వర్ణము సంపూర్ణముగా మాఱును. [గౌ. ధ.
సూ. ౪. ౨౨.౨౩] హరదత్తుఁ డిటులు వివరించు
చున్నాఁడు:—

"బ్రాహ్మణునకు క్షత్త్రియకు పుట్టిన సవర్ణకన్య
[మూర్ధావసక్త] బ్రాహ్మణుని పెండ్లాడుచో ఆమె స్త్రీ
సంతతియు ఏడుతరములదాఁక అటులే చేయుచో ఆ
యేడవతరపు టాఁడుపడుచు బ్రాహ్మణి యగును. ఇఁక
బ్రాహ్మణునకు క్షత్త్రియకుఁ గలిగినవాఁడు క్షత్త్రియను
బెండ్లాడుచో అతని యేడవతరముదాఁక నున్న పురుషులు
కూడ క్షత్త్రియలనే పెండ్లాడుచో ఆయేడవతరమునుండి
పుట్టినవారందఱు క్షత్త్రియులగుదురు." ఇందు గర్భిత
ముగా నున్న అభిప్రాయ మిది: బీజము అపవిత్ర
సంబంధముచేఁ గ్రమముగా తఱిగిపోయినను శ్రేష్ఠద్రవ్య
సంబంధము కలిగి తన పవిత్రత్వమును మఱలసంపాదించు
కొనును. అధమద్రవ్యముతో క్రమాక్రాంత మగు సంస
ర్గము అధమత్వమును నియతముగా నిలుపఁ గారణమగు
చున్నది.

ఇఁక నిషాదులవిషయమునకు మఱలుదము. బౌధా
యనుఁ డిటు లనుచున్నాఁడు:—

వివాహము నిషాదసంఘమునందు లేక కులమునందుఁ
గాని పర్యాప్తమయి [భార్యాభర్తలిరువురును నిషాదులే
యగుదురేని] అయిదుతరములదాఁక నటులే నియతమయి
యుండుచో వారినుండి శూద్రత్వము తొలఁగును. అనగా
అట్టి నిషాదుల యైదవతరమువానిలో శూద్రాంశయేమియు
మిగిలియుండదు. కాని అతఁడు నిషాదశ్రేష్ఠుఁ డగునో
లేక వేఱువర్ణమువాఁ డగునో అసంగతినిమాత్రము బౌధా
యనుఁడు తిన్నగా విశదీకరింప లేదు.

ఐనను అట్టి అయిదవతరమువాఁడు ఉపనీతుఁడు
కావలయునని [ధ.సూ.౧. ౯.౧౬.౧౬] అని బౌధాయ
నుఁడు చెప్పుచున్నాఁడు. ఆఱవతరమువాఁడు పురోహి
తానుమతిచే యజ్ఞమున కర్హుఁడనియు ననుచున్నాఁడు.
ఇఁక ఏడవవాఁడు మలినుఁడుకాక మూలపురుషుని సంపూ
ర్ణస్వస్థితిని పొందుననియు చెప్పుచున్నాఁడు. నీచకులము
లతోఁ గొన్నితరములదాఁక బీజము ఊరక వ్యాపించుట
మాత్రమున దాని పూర్వసౌభాగ్యము నెటులు చూరఁ
గొనునో నాకు నిక్కముగా తెలియలేదని ఒప్పుకొనవలసి
యున్నది. జన్యజనక భావ శాస్త్రజ్ఞులు (Mendelism)
ఈ విషయమును విశదీకరింపగలరా?

బౌధాయనుఁడు పైనిజెప్పిన వర్ణాధిక్య ప్రక్రియ
ఉపనయనమున కర్హత యిచ్చినను తావన్మాత్రప్రయోజ
కమే యయి అగ్రత్రైవర్ణికుల సమస్తవిధులకును అధికా
రములకును అనర్హతను తేల్చుచున్నది. అది యటుండె.
ఉపనయనమునుగుఱించి కొంత పరిశీలింతము.

సూతుఁడు[1] కాక మిగిలిన[2] ప్రతిలోములు
[3]కర్మకలాపములందు అంగీకరింపఁబడరని ఆపస్తంబుఁడు

---

౧. బ్రాహ్మణికి క్షత్త్రియునకు కలిగినవాఁడు.

౨. పైజాతితల్లికి క్రిందిజాతితండ్రికిపుట్టినవారు.

3. వ్యాఖ్యాతల ననుసరించి ఉపనయనమునకు-దాని పోలిన కర్మలకు.

చెప్పుచున్నాఁడు. [ధర్మసూత్ర. ౪. ౨౫] కుల్లూకభట్టు అంగీకరింపకున్నను(౧౦,౪౧) ఒకానొక శాస్త్రమునం దలి ప్రత్యేకవిధిచే సూతుఁ డుపనయనమున కర్హుఁడని హారదత్తుఁడు వ్రాసినాఁడు.

ఇఁక అనులోమములు.౨ శూద్రయఁ బుట్టినవారు తక్క మిగిలిన యనులోమములు ఉపనయనార్హులు. [బౌధాయన ధర్మసూత్ర. ౪.౨౬.] ఈ ప్రక్రియయే సంకీర్ణ జాతుల సమనంతర వ్యతికరమునఁగూడఁ బ్రవర్తించును. [యాజ్ఞవల్క్య. మితాక్షర ౧.౯౫]. మస్కరి అనులోమములకు ఉపనయనాధికారము నంగీకరించు చున్నాఁడు. కాని వేదాధ్యయన నిషేధమొకటి కలుపుచున్నాఁడు. [గౌ.ధ.సూ. వ్యాఖ్య ౪.౨౫] ఆతఁడొక స్మృతిని3 ప్రమాణముగా చూపెను—'అనులోమముల కుపనయనాధికారము మాత్రమే కలదు. వేదాధ్యయనమునఁ గాని పంచయజ్ఞములఁగాని గార్హపత్యాగ్నినిగాని అగ్నిహోత్రమునఁగాని ఇంధనాధానమునఁ గాని ప్రాతస్సాయం సంధ్యలఁగాని అధికారము లేదు. ఇంతియకాక వీరియుపనయనము వేదమంత్రములు లేకుండ ఉపాంశువుగా జరుగవలయును.' అని

ఇది యున్నదున్నపాళముగా ఉపాదేయము కాదు. ఏలన, సాంకర్యములేని శూద్రుఁడుకూడ పంచయజ్ఞములం దధికృతుఁడని తొల్లి మనము చూచి యున్నాము. భూతయజ్ఞము౪ పంచయజ్ఞాంతర్గత మనియు గృహ్యాగ్నిలోఁ జేయఁబడుననియు నందఱకు తెల్లమయినదియే.

గృహ్యాగ్నికిఁగూడసంబంధించిన వేఱువేఱు పాకయజ్ఞములకు శూద్రులును అర్హులు. ఇందు వారికిఁగల భేద మేమనఁగా మంత్రోచ్చారణాభావము. భక్తిచిహ్నముగా 'నమఃనమః' అని ఉచ్చరింపవలయును. [అటులు చేయుట కర్హతగలవారిచే ఆ మంత్రములు చెప్పఁబడుసమయమున]

మస్కరి వ్యాఖ్యానమునుండి మఱికొన్ని పంక్తు లుదాహరింతును. (గౌ.ధ.సూ. ౪.౨౬)

"ఉపనయనము సవర్ణాంబష్ఠనిషాదులకుమాత్రమే. ఒకస్మృతియం దిటులు కలదు; [పురోహితు నుద్దేశించి] సవర్ణు నుపనయించి ధనుర్వేదము బోధింపవలెను; అంబష్ఠు నుపనయించి వైద్యశాస్త్రమును బోధింపవలెను; నిషాదు నుపనయించి హస్తిశిక్ష బోధింపవలెను."

ఉపనయనము వేదాధ్యయనమునందు అధికారము కలుగుటకుమాత్రమే కాక లౌకికవిద్యయందధికారము కలుగుటకుఁగూడ నుద్దేశింపఁబడినదని పై దానివలన విశదమగుచున్నది.

మఱియు శూద్రులకు లౌకికజ్ఞానముబోధించుటకుఁ గూడ నుపనయన మావశ్యకమని సులభముగా సాధింపఁబడిన దగుచున్నది. వైద్యవిద్యార్థుల యుపనయనమును గుఱించి శుశ్రుతము (నిర్ణయసాగర ముద్రితము౧.౨.౫) ఒకయోగ్యుఁడగు శూద్రుని వేదమంత్రములువినా ఉపనయించి యతనికి వైద్యము బోధింపవలయు నని చెప్పుచున్నది. తఱుచుగా ఉదాహరింపబడు నీ శ్లోకమును మునిముందు చూపినవాఁడు ఆర్యసమాజ మూలపురుషుఁడగు స్వామి దయానందసరస్వతి యని నే ననుకొనుచున్నాను.

---

౧. ఆశాస్త్రమేదియో వక్కాణింపఁబడలేదు. ౨. పయిజాతితండ్రికి క్రిందిజాతి తల్లికి పుట్టినవారు.

3. దీనిపేరు చెప్పఁబడలేదు. నేఁటికిని తెలియఁబడలేదు.

౪. దీనికి వైశ్వదేవమనియు బలికర్మయనియు వేఱు పేరులు కలవు.



# నాటకకళా సంస్కరణము

**దువ్వూరి రామిరెడ్డి గారు**

## ఉపోద్ఘాతము

సంఘసమష్టి తనయందలివ్యక్తిని నైతికబంధములఁ జిక్కించుకొని యెట్లు అధికారముచేయునో, ఒక్కొక్కప్పుడు వ్యక్తియుఁ దన సంకల్ప బలముచేత సంఘసమష్టిని దన యభిప్రాయమునకుఁ ద్రిప్పుకొను చుండును. ఇందుకు మన సాంఘికజీవితమునందు లెక్క లేని నిదర్శనములను జూచుచున్నాము. సంఘమునకును, అందలియంశమైన వ్యక్తికిని బరస్పరసంబంధము గలదు. కావున నొకజాతి నాగరకమైనదని చెప్పుటలో 100-కి 90 మంది మనుష్యులైనను నాగరకులుగ నుందురని మన మూహింతుము.

జాతీయజీవితమార్గము కొండదారివలె నిమ్నోన్నతముగ నుండును. వాతావరణములోని మార్పులను భారమితి(Barometer)సూచించునట్లుల శిల్పము జాతీయ జీవితమునందలి నీచోచ్చదశలను దెలియఁజేయు చుండును. కవులు స్వతంత్రముగ వస్తుకల్పనము చేయు చున్నను,సమకాలీనభావములును,ఆచార వ్యవహారములును వారిరచనలయందుఁ బ్రవేశించియుండును. కాళిదాసుని నాటకములను మనము చదివినయెడల ఆకాలపు నాగరకతను మనము కొంచెమించుమించుగ నూహింపఁగలము. వాల్మీకిమహాకవి లోకోత్తరవీరుఁడైన శ్రీరామునిచరిత్రమును సృజించినప్పటికిని, కవికి సమకాలీనమైన హైందవ సంఘముయొక్క నాగరకతయు ఆచారవ్యవహారములును అందు నంకితమైయుండక తప్పవు.

ప్రస్తుతవిషయమునకు వత్తము. మన తెలుఁగుజాతి చాలమందికవులకును, శిల్పులకును, నటకులకును ఆకరమై యున్నది. వారిరచనలు, సృష్టులు, అభిప్రాయములు భావిసంతతికి, మనకళాభిరుచిని, కల్పనానైపుణ్యమును, ఔచిత్యగౌరవమును, మీఁదుమిక్కిలి మన శిక్షణమును, దెలియఁబఱుచును. కావున ఇప్పటికవులును, తక్కుంగల శిల్పులును సమకాలీన ప్రజాబాహుళ్యముయొక్క యశిక్షితమైన యభిరుచి యడుగులకు మడుఁగులొత్తి సులాయాసలభ్యమైన కీర్తికొఱకు పాటుపడుటయే వారిబాధ్యతయని తలంచుకొనక, భావిసంతతులకుఁగూడ మన శిల్పసిద్ధిపైని గౌరవముండునట్లు, తమయభిరుచిని మఱికొంత సభ్యముగను, ఔచిత్యదృష్టిని మఱికొంత నిశితముగను అలవరచుకొనుట యావశ్యకము.

సుమా రొకసంవత్సరముక్రిందట ఒంగోలునం దుండిన నామిత్రులు రావుసాహేబ్ డాక్టరు శేషాద్రి రెడ్డి గారికి అతిథినై నే నచ్చట రెండుమూఁడుదినములు గడపితిని. ఆయూరియందు స్థాపింపఁబడియున్న యొక నాటక సమాజమువారిచేఁ బ్రయోగింపఁబడిన "సుమతి"* అను నాటకమును చూచుట మాకిరువురకుఁ దటస్థించినది. రెండుమూఁడుగంటల వినోదముకొఱకును, ఆవినోదమున అలక్షితముగ మిళితమైన రీతిని సమకూరుచుండు భావశిక్షణముకొఱకును మనము సాధారణముగ నాటకశాలలకుఁ బోవుచుందుము. చేతిడబ్బు వదలించుకొని, నిద్రలేమి మున్నగుశ్రమలకుఁ బాల్పడియు మనము నాటకము చూచుట కవిచేతను నటకులచేతను "మీరు సభ్యతాశూన్యులు! మీరు మృగప్రాయులు" అని చెప్పక చెప్పించుకొనుటకుఁ గాదు! సహృదయులభావములు దూషింపఁబడుటకు గాదు! కాని దురదృష్టవశమున మాకానాఁ డట్టి యసభ్యవినోదము ప్రాప్తించినది. ఆ నాటకమునందలి యనౌచిత్యముల నుదహరించి సభ్యలోకమునకు విసుగు పుట్టించి నా యభిరుచినిగూడ దూష్యముగ నొనరించు

* ఆనాటకము పేరునుగుఱించి నాకు సంశయము గలదు. సుమతియని జ్ఞప్తి. కవిపేరును మఱచిపోతిని.

కొనుటకు నాకిష్టము లేనప్పటికిని "శిల్పము" కొఱకు అట్లు చేయక తప్పినదికాదు. మేము నాటకశాలయం దున్నంతవఱకు జఱిగినకథ యీ క్రిందివిధముగ నున్నది. భాగ్యవంతుఁడైన బ్రాహ్మణయువకుఁ డొకఁడు ఒక భోగముసాని నుంచుకొని తన యాస్తినంతయుఁ గొల్లగొట్టుకొనును. కొంతకాలమునకుఁ దన భార్యనుగూడ ఆసానికిఁ బరిచారికనుగ నియమించును. అటుపైని కొల్లగొట్టుటకు విటునియొద్ద నొకగవ్వయైనను లేదని తోఁచినవెంటనే ఆసాని యాతని విడనాడి, మఱియొకనిని దగుల్కొనును. రెండవవిటుఁడును ఆభోగముదియు నేకశయ్యాగతులయి యుండునప్పుడు పరిత్యక్తుఁడైన మొదటివిటుఁడు వచ్చి చూచి "చెడి బ్రతికినవాని వైరాగ్యావేశముతో" ఆసానిని దిట్టుటకుఁ బ్రారంభించును. భోగమువారిని దిట్టుటయే సంఘసంస్కరణముయొక్క ప్రధానసూత్రమని తలంచువారును కొందఱు గలరని, అట్టికోటిలో మన నాటకరచయితనుగూడ చేర్చుకొని నాటకమునందలి యాసంవిధానమును సహించినను, సహింప నలవిగానివి మఱికొన్ని బయలుదేరినవి. ఆ నాటకశాలయందు స్త్రీలు చాలమంది యుండిరి. అతిట్లు భోగమువారికి సంబంధించినవేకాక సామాన్యముగ స్త్రీజాతికంతటికి సిగ్గును రోఁతను బట్టించునట్లు తోఁచినవి. * "సానులు సందివాకిటిలో నొకనిని, ముందువాకిటిలో మఱియొకనిని పెట్టుకొని చిత్రకారెలో కుక్కలవలె.........వారి......... సొరకాయలవలె నుండును; అవి.......కావు, రోగముల భోషదలు." మొదటిమాటతో నిప్పు అంటింపఁబడి, రెండవ మాటతో కిరసనాయిలు పోయఁబడి, మూఁడవమాటతో భగ్గని మండిన నాహృదయము సంయమన సాధ్యముకాక పోయినది. ఏవో రెండుమాటలని నాటకశాల వీడివచ్చితిని. రెడ్డిగారును నావెనువెంట వచ్చిరి. బయటికివచ్చి మనము స్థిమితపఱచుకొనునప్పటికి నా యొడలంతయుఁ గంపించుచుండెను. నాటకము ముగిసినవెనుక మాదుర్ణయమును గుఱించి ఆసమాజముయొక్క కార్యదర్శి యుపన్యసించెనని వింటిమి.

[illegible] నాటిదినుదయమున ఆసమాజములోని యొక సభ్యుఁడు, తాము రాత్రి ప్రదర్శించిన నాటకమును చింతామణియను నాటకమును దీసికొనివచ్చి, ఆనాటకము చింతామణివలె నున్నదనియు, అందులో లేని బూతులు ఇందులోఁగూడ లేవనియు, మేము నాటకశాల నుండి వెడలివచ్చినయనంతరము చాల నీతిప్రదమైన కథ జరిగినదనియుఁ జెప్పెను. మొదటి విషగుళికతోడనే మా జీర్ణశక్తి నాశనమైనది. ఆపైని విరివిగాఁ బంచిపెట్టఁబడిన నీతిఖాద్యములు మేమెకవేళ గైకొన్నను నిరుపయుక్తములై యుండును.

తరువాత ఆరెండు నాటకములలోని సంవిధానములను నేను జూచితిని. సుమతినాటకము చింతామణికిఁ బ్రతిబింబముగ వ్రాయఁబడి యున్నదనుటకు సందియము లేదు. నేనిప్పుడు చింతామణిని సమర్థించుటకుఁ బూనుకొనలేదు. కాని ఆరెండునాటకములను సరిపోల్చినప్పుడు మాత్రము, సభ్యతయందుఁ జింతామణియే మెఱుఁగుగ నున్నది. చింతామణికారుఁడు రచనానైపుణ్యముతో వెల్లడించిన బూతులను సుమతినాటకరచయిత జట్కాబండి వారి సభ్యతలోనికి దింపి, శృంగారరసమును సిరాబుడ్డిలో ఊరవేసినారు. ప్రకరణమున కిట్టివస్తువు ఆవశ్యకమని అలంకారశాస్త్రముయొక్క వఱుఁగుసొచ్చినను, అభిరుచి విషయకమైన చర్చ వచ్చినప్పుడు, దానిని కవియొక్క చిత్తసంస్కారపరిపాకములకు సంబంధించినదిగ మన మెఱుంగుదుము. మృచ్ఛకటికము ప్రకరణమయ్యు సహృదయులకు ఏవముపుట్టించు బూతుకూఁతల మట్టునకు దిగలేదు. అట్లనుటవలన సంస్కృతమునందు, అధమములైన ప్రహసనములు లేవని నేను నుడువుటలేదు. కాని, అవి సహజముగ నిరాదరింపఁబడుచున్నవి. నింద్యవిషయమే భాషయందున్నను నింద్యమే. భావమువలన భాషకు గౌరవము కలుగుచున్నది గాని, భాషవలన నింద్యభావమునకుఁగూడఁ బ్రశస్తి గలుగదు.

నేనీసుమతినాటకప్రదర్శనమును చూచినప్పటి నుండియు, నాటకరచయితలయందును, నటకులయెడను, ప్రేక్షకులయందును నా కొకవిధమైన శ్రద్ధ పుట్టినది. అప్పటినుండియుఁ గొందఱియాధునికకవుల నాటకములను జనరంజకములని ప్రజలచేఁదలంపఁబడు మఱికొన్ని నాట

* నాటకము నాయొద్ద లేదు. జ్ఞప్తియున్నటులు వ్రాయుచున్నాను.

క్రమములను సుప్రసిద్ధులని తలంపఁబడు నటకులచేఁ బ్రదర్శింపఁబడుచుండినపుడు చూచుచుంటిని. జనరంజకత్వమునకుఁ గారణములను, అందుకై కవులును నటకులును జేయుచున్న వ్యాపారరహస్యములను, మోసములనుగూడ గ్రహించి నాయభిప్రాయములను ఈవ్యాసమూలమునఁ బ్రకటింపఁ దలంచితిని. ఇట్లు చేయుటవలన నే నెందఱెందఱి యనుమానములకు, విమర్శనములకుఁ బాత్రుఁడను కానున్నానో నే నెఱుంగుదును. ఈవ్యాసమునందు నే నెచ్చటనైనను నిదర్శనపూర్వకముగ నాయభిప్రాయములను దెలిపుచ్చవలసివచ్చినప్పుడు, ఎవరినైన నాటకరచయితలను నటకులను సమాజములను విమర్శించి దృష్టాంతములుగఁ గైకొనుట నాకు వారిపైఁగల ద్వేషముచేఁ గాదు. కాని, శిల్పముపైఁగల గౌరవముచేత నేను కొన్ని నాటకములలో అనౌచిత్యములకు నుదాహరణములను గైకొంటినిగావున, ఆనాటకములెల్ల అనౌచిత్యభూయిష్ఠములనియు, ఆయానాటకరచయితలు కల్పనానిపుణులు కారనియుఁ బాఠకమహాశయులు తలంపరాదు. ఆగ్రంథములపైనను ఆకవులపైనను నా కత్యంతగౌరవము కలదు. నటకులవిషయమైకూడ నే నిట్లే మనవిచేసికొనుచున్నాను. కావున నేను నిర్మలహృదయముతోడను శిల్పదృష్టితోడను రచియించిన యీవ్యాసమును నాటకకళాభిమానులెల్లరును అన్యథా తలంపక నాసదుద్దేశమును గ్రహింతురని నాప్రార్థనము.

## నాటక కవి

ఇప్పుడు వెలువడుచున్న నాటకములలో 100 కి 90 నాటకములు "నాటక"మని పేర్కొనుటకుఁదగినవి కావు. ఒకకథలోని కొన్ని సీనులను ఒకటిగా జోడించినంతనె అది యొక నాటక మగునని కొందఱు నాటకరచయితల యుద్దేశమైయుండును. నాటకమునకు ఆదిమధ్యాంతములు కలవనియు, సంధిబంధమును, సంయోగితయు, సడలినయెడల నాటకశరీరము విచ్ఛిన్నావయవసమూహమువలె నుండుననియు వీ రెఱుఁగరు. ఒకవేళ నెఱింగియు ఆచరణమున నసమర్థులై యున్నారు. ఇప్పటి కొన్ని నాటకములలో, 'మేకపోతు మెడచన్నులు, అఱువ్రేలు' మున్నగు రచనావిశేషము లగపడుచున్నవి. ప్రజలకన్నులలోఁ దేలికగా దుమ్ముకొట్టుట కలవాటుపడి రంగసాంప్రదాయములను (Stage Politics) చక్కఁగాఁ దెలిసినకవులు అట్టిరచనావిశేషముల నాశ్రయింతురు. వానితోడ నాటకసమష్టికి నవసరమైనసంబంధ మేమియుండదు. నిరుపయోగములును, విపరీతములును నైన అట్టియవయవములను గత్తిరించినను లోప మేర్పడదు. ఇది రచనానూన్యతయైనను, లేక ప్రేక్షకులను సులభముగ వలలో వేసికొనుటకుఁ గవి ప్రయత్నపూర్వకముగ నొనరించిన వంచనమైనను గావలయును. ఒకయుదాహరణము: రామదాసునాటకములో 'అహమక్కుసీను' లవకుశలో 'చాకలవానియింటిసీను.' వానిని వేఱుపఱచి, అట్టిసీనులు ప్రత్యేకముగఁ బ్రదర్శింపఁబడినపుడు హాస్యరసోత్పాదకములయి వినోదము కలిగింపవచ్చును. కాని ఆనాటకములందు ఆయాకథాభాగమున వాని కంతప్రాముఖ్యము లేదు. మొగమునకు ముక్కు అందమని యొకశిల్పి మూరెడుముక్కునుజేసి యొకమానవవిగ్రహమున కంటించినట్లున్నది. నాటకశరీరమందు అంగానుగుణ్యము చాల ముఖ్యము. కేవలము లాభముచేత అనుచితమైన కల్పనలకుఁ బూనుకొనుట నింద్యము.

ధర్మవరము రామకృష్ణాచార్యులవారి నాటకరచనతోడఁ గ్రొత్తక్రొత్త నాటకలక్షణము లేర్పడినవి. సంక్షేపముగ భావమునుఁ బ్రకటించుటయన్న ఆకవి యెఱుంగని పరమరహస్యము. రెండుమూఁడు మాటలలోఁ జెప్పఁదగిన భావమును అచ్చులో నరపేజికిఁ దక్కువగాఁ జెప్పఁడు. దుఃఖముయొక్క పరిమాణము వాక్యముల దీర్ఘత్వము ననుసరించియు, సంఖ్య ననుసరించియు నుండునని తలంచికాఁబోలు బాహుకునికిఁ గొండవీటిచేంతాడు వంటి స్వగతమును గల్పించి ప్రేక్షకులపై ఆయనకుఁగల కసియంతయుఁదీర్చుకొన్నాడు. వ్రాసిపెట్టిన పద్యములు గ్రంథస్థములు కాకపోయినయెడల విస్మృతము లగునను తలంపుతో బాహుకుఁడు చంద్రునిదూషించు కథాభాగమున నిక్షేపించినాఁడు. వీనినన్నిటిని తలదన్ను చాపల్యము మఱియొకటి గలదు. ప్రహ్లాదనాటకమున లీలావతి పాడునట్టి "రారా-ధీరోలా-నాబాలా" అనుపాటయందును, "సుకుమారా - గుణశాలీ" అనుపాటయందును "రామకృష్ణకవిరత్నముఁ బ్రోవ" అనియు "కవిరామకృష్ణ" అనియు, కవిగారు తన పేరును ఇముడ్చు

కొన్నారు. అచ్చట యొకచుక్కగుర్తును బెట్టి జ్ఞాపికలో "లీలావతి యీపాటచదువునప్పుడు అంకితముపేరును తీసి వేయవలయును" అనియైన హెచ్చరింపలేదు. నటకులును ఆయంకితముయొక్క యనౌచిత్యమను గ్రహింపలేదు. లీలావతిపాత్రము ధరించినయొకనటకుడు "రామకృష్ణకవి రత్నము" అని పాడుచుండగా విని నేను ఆశ్చర్యపడితిని. లీలావతిని ఇంద్రునివలె చెంగుపట్టుకొని రామకృష్ణకవి కాలమునకు లాగవలయునో, లేక కవినే లీలావతికాలమునకు నెట్టవలయునో తోఁపకున్నది. అట్లుచేసినను లీలావతి రామకృష్ణకవిపేరు నేల స్మరింపవలయునో నాకనూహ్యముగ నున్నది. నాటకములో కవి దాఁగియుండవలయునేకాని ముక్కు వెళ్లఁబెట్టవలసినయావశ్యకత లేదు. ఇట్టినాటకముల నాదరించు నభిరుచిగల మనము కాళిదాసాదులనాటకముల నెట్లు మెచ్చుకొనఁగలము?

"నాటకము చాలబాగుగనున్నది" అని యనిపించుకొనుటకు మఱియొకయుపాయము గలదు. స్థానికమైనను అస్థానికమై దేశభక్తి దేశానురాగము మున్నగుభావములను వెంట్రుకపట్టుమాత్రమైనను సందుకల్పించుకొని బారెఁడుపొడుగు ఉపన్యాసములోఁబొదిపి ప్రవేశపెట్టుట; హిందువులు మహమ్మదీయులు కలసియున్న నాటకకథయైనయెడల (ఆకథ జరుగుకాలమందు అట్టిభావములు ప్రజలలో లేకున్నను) హిందూమహమ్మదీయ మైత్రినిగుఱించిన యుపన్యాసము నొకపాత్రమునోటఁజెప్పించి నాట్యశాలను రాజకీయోపన్యాస మందిరముగ మార్చుట. పుట్టినదాది అడవులలోఁ గాలముపుచ్చుచు, గ్రంథములలో వర్ణింపఁబడిన లక్షణములచేత గుఱ్ఱమును గుర్తించిన కుశలవులు మాతృదేశాభిమానమును గుఱించి నేఁటికాలపు భావముల వెడలఁగ్రక్కు ఉపన్యాసముల బలాత్కారముగ ప్రేక్షకులపైఁ గురిపించుటమూఁడ, ఆంధ్రపత్రిక, వాల్మీకాశ్రమమునకుఁగూడఁ బంపఁబడుచున్నదా యను భ్రాంతి పొడముచున్నది. దేశకాలపాత్ర విరుద్ధమైనను పురాతనవస్తువునకు ఆధునికవాసన దగిలించుట చాలమంది నాటకరచయితల కభ్యాసమై యున్నది. ఇది యొక వ్యాపారరహస్యము.

చాలమంది నాటకకవుల రచనాలోపములను, పాటలును పద్యములును గప్పిపుచ్చుచున్నవి. నాటకములోని కల్పనను బృథక్కరించినయెడల ఆలోపములు బయలుపడును. ఎట్టినాటకమైనను జక్కఁగాఁ బాడఁగలిగిన యొకరిద్దఱునటకుల నాశ్రయించి ప్రసిద్ధికి రావచ్చును. అల్లూరు నాటకసమాజమువారు రామదాసునాటకమును బ్రదర్శించుచుందురు. పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు (ఆసమాజమునఁ బ్రధాన నాయకపాత్రము ధరించునటకుఁడు) కబీరుపాత్రమును ధరింతురు. ఆప్రదర్శనములను జాలమంది కొనియాడుచుండుదురు. రెడ్డిగారు నాట్యప్రపంచమున ఆర్జించిన పేరుప్రతిష్ఠలకు ఆనాటకము పట్టుఁగొమ్మ. ప్రజలప్రశంసకు నాస్పదమైన విషయము నెఱుంగవలయునని చాలమంది యభిప్రాయములను గనుగొంటిని. కొంచెమించుమించుగ అందఱును ఈ క్రిందివిధమున జవాబిచ్చుచుందురు. "రామచంద్రారెడ్డి హిందుస్థానీ పాటలను జక్కఁగాఁ బాడఁగలఁడు. నాటకము ప్రారంభమునుండి తుదివఱకుఁ బాడుచున్నను, కొంచెముగూడ ఆయన గొంతు రాఁపుపుట్టదు. ఆయన పాడుచున్నపుడు మఱికొంతసేపు పాడుచుండిన బాగుగ నుండునని తోఁచును. నామట్టుకు నేను రెండుమాఱులు 'Once more' అన్నాను" రామచంద్రారెడ్డిగారిని గుఱించి చెప్పఁబడునదంతయు యథార్థమె. కాని, నాటకము ఈవిధముగనా మెచ్చుకొనఁబడవలయును? షేక్స్పియరు మహాకవియొక్క ప్రతిభ, గ్యారిక్కు ననుసరించి యుజ్జీవింపవలయునా? లేక యాతని రచనలకు స్వతంత్రమైన యంతస్సారముగలదా? చదువరు లూహింపఁగలరు. బూటకపుటాధారముల నాశ్రయించి ప్రసిద్ధికెక్కిన నాటకములు ఆశ్రయచ్యుతి గలిగినవెంటనే విస్మృతము లగును. ప్రేక్షకుల యభిరుచి ననుసరించి వ్రాయఁబడు నాటకములు వారియభిరుచి మాఱువఱకె గౌరవింపఁబడును. తర్వాత నధఃపతనము.

పాత్రోచితమైన భాషనుపయోగించుటావశ్యకము. మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయ శాస్త్రులవారు బొబ్బిలి నాటకమున బుస్సీ దొరపాత్రమునకు వ్యాకృతభాషనే యుపయోగించిరి. కోలాచలము శ్రీనివాసరావుగారు రామరాజు నాటకమున పటానునకు ఉత్తమభాషనే యుపయోగించిరి. వారిని ఉత్తమపాత్రలనుగఁ జిత్రించి అట్టిభాష నుపయోగించియుందురు.

కాని ప్రదర్శనమునందు వారివేషములకును వారిభాషల కును జాల వైరుధ్యము గోచరించుచుండును. దాని నొప్పుకొన్నను, ఆపాత్రముల హైందవపురాణపరిచితి చూడఁ జిత్రముగ నున్నది. బుస్సీదొర "స్తంభమునుండి పైకురికి" అనుపద్యమును చదువును. పఠాను సంస్కృత పదభూయిష్ఠమైన పొడవగు సమాసములతో సప్తమా రుతములను జిల్లరదేవుళ్లను తన్నుఁ జంపుటకుగా ఆహ్వానిం చును. హైందవేతరజాతులకు సంబంధించిన యుత్తమ పాత్రములచే నుత్తమభాషను మాట్లాడించుట యొకవిష యము. కాని, వారికి మనశాస్త్రపురాణాదులయందుఁ బరిచయము గలిగినట్లు వ్రాయుట వేఱొకవిషయము. మహమ్మదీయుల యుత్తమపాత్రత్వమునకు హైందవ పురాణపరిచయము ఆవశ్యకము గాదు. దుఃఖము కలిగి నప్పుడు తమతమమనస్సులలో నెలకొనియున్న దైవమునో దేవతలనో స్మరించుట స్వాభావికముగ నుండునుగాని, అట్టిసమయమున మహమ్మదీయుడు పౌరాణికదేవతలను దలంచుట విరుద్ధముగఁ గనుపట్టును. బుస్సీదొర బైబిలు నుండి యుపమానమును గ్రహించినయెడల నుచితముగ నుండెడిది. పఠాను ఖొరానునందో లేక మఱియేవిధ మైన మహమ్మదీయ పురాణమునందో పరిచితమైన దేవత లను, ప్రవక్తలను ఆహ్వానించియుండిన మెఱుఁగుగ నుం డెడిది.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రచియించిన గయోపాఖ్యానమున కృష్ణార్జునుల దెప్పిపొడుపులు, ఆత్మ గౌరవముపై దృష్టిగల యేపెద్దమనుష్యుఁడును మాట్లాడి యుండఁడు. ఇక కృష్ణార్జునులమాట యేల? సంవాదము లలో అంతమాత్రము గాటులేనిదే ప్రజలకు రుచింపదు. పాపము! కవి యేమిచేయును? శతావధానులు పిశుపాటి చిదంబరశాస్త్రిలుగారు, గయోపాఖ్యానమునుజూచి దా నిని మించవలయుననుకోరికతో శ్రీరామాంజనేయమను నాటకమును వ్రాసి శ్రీరామునికిని ఆంజనేయునకును వైరముఁ గల్పించి యిరువురిసంవాదమును ముదిరినకొండ మిరపకాయపాకములోనికి దించినారు. రామకృష్ణాచా ర్యులవారు ప్రమీలార్జునీయనాటకమును రచియించి నాగరకవిద్వాంసులచే వ్రాయఁబడు నాటకములలో బూతు ఎంతవఱకు నొప్పుకొనఁదగ్గది యనువిషయమును దృష్టాంతపూర్వకముగ దృఢపఱచినారు. వ్రాయుకొలఁది యిట్టియుదాహరణములకు లెక్క యుండదు. రెండు మూడు ఊరక మచ్చుచూపితిని.

## నటకులు

కొంచెమించుమించు ఇరువది యిరువదియైదుసంవ త్సరములకుఁ బూర్వము తెలుఁగుదేశమున, నాటకవృత్తి నవలంబించినవారే నాటకము లాడుచుండిరి. ఆకాలమున నాటకములన్నను, నటకులన్నను ఒకవిధమైన యనుమాన ము, హైన్యమును దోఁచుచుండెడిది. ఇందుకుఁ గారణము లేకపోలేదు. ఆనటకులలోఁ జాలవఱకు దేశద్రిమ్మరులు. తల్లిదండ్రులను, దారపుత్రాదులను వదలినవారుగనో లేక యితరుల సంసారములను జెడఁగొట్టినవారుగనో యుం డిరి. వారు ప్రదర్శించుచుండిన నాటకము లెల్లను వారి స్వంతసృష్టులు. ఈకాలమున బాపట్ల కాంతయ్యగారు రచియించిన నాటకగీతావిశ్వకోశమువంటిది వారికిఁ గూడనొకటి యుండినది. ఇదివఱకు రచియింపఁబడినవి, యిపుడు రచియింపఁబడునవి, యింకమీఁద రచియింపఁ బడఁబోవు సర్వనాటకములకును అందుఁ బాటలు గలవు. రేపటిరాత్రి నాటకము వేయవలయునని యనుకొన్న యెడల ఈనాటిప్రొద్దున నాటక పాత్రములును, సీను లను వారే తీర్మానించుకొని సందర్భానుసారముగఁ బాటలుచొప్పించి స్వంతకవిత్వముతో నాటకమును దుద ముట్ట ఆడివేయుదురు. ఇట్టి దురవస్థనుండి నాటకములను రక్షించినందులకు నేటికాలపు శిక్షిత నాటకసమాజముల వారు ప్రశంసాపాత్రులు.

పూర్వపునటకులకన్న నేటికాలపు నటకులకు బాధ్యత యెక్కువ. ఏలయన, యిప్పటినటకులు విద్యా వంతులు; నాగరకులు. ప్రేక్షకులు కూడ నట్టివారే. కావున నటకులును నిర్బాధ్యముగఁ బ్రవర్తించుటకు వీలు లేదు. వారు గమనింపవలసిన విషయములు చాలఁగలవు. కాని వ్యాసవిస్తరభీతిచే నిచ్చట కొన్నిటిని మాత్రము వ్రాయుచున్నాను:

తాను ధరింపఁబోవు పాత్రమును, కవి పోషించిన విధమును, ఆపాత్రయొక్క గుణగణములను, మన స్తత్వ మును, నాటకబంధమునందు ఆ పాత్రమునకుఁ గలస్థాన మును ప్రయోజనమును, తన కార్యప్రవృత్తికి హేతువైన

భావమును నటకుఁడు మొట్టమొదట గుర్తెఱుంగవలయును. వారు మాటాడు ప్రతిమాటకును అర్థముచక్కఁగఁ దెలిసియుండవలయును. అర్థము తెలియనిదే భావోదయము గాదు. భావోదయముకానిదే తాను ధరించుపాత్రము యొక్క యవస్థయందు సహానుభూతి యుండదు. నటకుఁడెప్పుడును పాఠమందిచ్చువానిపై (Prompter) ఆధారపడియుండఁగూడదు.

నాటకమునకు అభినయము (చేష్ట) ప్రధానము. కార్యప్రచలనము లేనియెడల నాటక మనిపించుకొనక యొక్క యుపన్యాసమగును. *కార్యప్రచలనమును, అభినయమును అడ్డగించుపాటలను పద్యములను నటకు లంగీకరింపరాదు. కాని పాటపద్యములపైని చాపల్యముచేతఁ గవి యుద్దేశింపనిచోటులలోఁగూడఁ గ్రొత్తక్రొత్త పద్యములను బాటలనుజేర్చి కార్యగతికి భంగము గలిగించుకొందురు. ఏల? అభినయలోపమును సంగీతముచేఁ బూరించుకొనుటకు ఒకదానియందలి లోపమును భిన్నమగు మఱియొకదానితోఁ బూరింపఁబ్రయత్నించుట ‡ చింతకాయ బహుమానమునలె నున్నది.

నాకు సంగీతముపై ద్వేషబుద్ధికలదని నా మానవత్వమును సంశయింపఁబోకుఁడు. తగవుకానిచోటమంచిదియైనను జెడ్డదిగఁ దోఁచును. ఒకవేళఁ బౌరాణిక నాటకములలోని నాయికానాయకులు పాటలు పాడినప్పుడు అనిష్టముగనైన మన్నింపవచ్చును. పౌరాణిక నాయకులు అమానుషశక్తిసంపన్నులగుటవలన వారిజీవితము మనజీవితమునకన్న భిన్నముగను, ఊహ్యముగను, గొన్నియెడల నలౌకికముగను గనుపట్టుచుండును. మానవసహజములగు సుఖదుఃఖములను వారనుభవించునప్పుడే మనమువారితో నేకీభవింతుము. కాని, చారిత్రక సాంఘిక నాటకములలోని నాయకు లట్లుగాదు. వారు మనుష్యులు. అమానుషశక్తి వారియొద్ద నించుకేనియు లేదు. కావున వారి సుఖదుఃఖములకు మన సుఖదుఃఖములకు సమీప బాంధవ్యము గలదు. అందులో ముఖ్యముగ సాంఘిక నాటకముల నాయకుల ప్రవర్తనము ప్రస్తుతపు సాంఘిక జీవితముయొక్క ఆదర్శకప్రతిబింబముగ నుండును. అంగడివీథిలో గుడ్డలవ్యాపారము చేయుచుండ మనము ప్రతిదినమును జూచుచుండిన సుబ్బిశెట్టియు, జిల్లాకోర్టులో మనము చూచుచున్న ప్లీడరు వెంకోజీరావుగారును మనము ప్రతిదినమును ఇంటిలో సంభాషించుచున్న తల్లిదండ్రులు, ఆలుబిడ్డలు స్నేహితులు మున్నగువారు స్టేజిమీఁదకు వచ్చి "తులువా పలువా" యనియు "ఛీఛీ, పాపా" యనియు హార్మోని మెట్లకు అనువుగ విఱిగెడి అర్థములేని పాటలతో సంవాదములు సలుపుకొనుచుండఁ జూచినప్పుడు వారిని బిచ్చివారి ఆసుపత్రికిఁ బంపింప బుద్ధిపుట్టునుగాని అందలి యానందము ననుభవింపఁజాలము. గొంతులేనినటకులకు, పాటను సైతము మ్రింగివేయగల హార్మోనియము శ్రుతి మేలుచేసి పుణ్యము గట్టుకొనునట్లు, అభినయచాతుర్యము కొఱఁతపడిన నటకులకుఁ బాటలు అభయప్రదానము చేయుచున్నవి. ఇట్లనుటవలన నటకుఁడు బొంగురుగొంతువడి సంగీతజ్ఞానశూన్యుఁడై యుండవలయు నని నా సిద్ధాంతముకాదు. నాటకమున సంగీతము అభినయమునకుఁ గేవలము ఔపచారికముగ నుండవలయును; కార్యగతికి నేలాటి యభ్యంతరముఁ గల్పింపరాదు.

నేఁడు కొందఱునటకులు పద్యములు చదువుటలో నొక యపూర్వపద్ధతిని గనిపెట్టినారు. ఒక పద్యమును రెండుమాఱులు చదువుట. సీసపద్యమైనయెడలఁ బ్రతిచరణమును రెండురెండు మాఱులు చదువుట. మొదటితూరి

* ఇది నాటకరచనకు సంబంధించిన విషయము. ఇందుకు నటకులు బాధ్యులుకారు. నాటక లక్షణమునకు సరిపోవునదియు తమప్రతిభను జక్కఁగఁ బ్రకటించుకొనుటకు అనువైన పాత్రపోషణము కలదియునగు నాటకమును నటకులు ప్రదర్శనమున కేర్పఱచుకొనవలయును. కాని యిప్పటినటకులపద్ధతి వేఱుగ నున్నది. ఏ నాటకములోఁ బాటలు పద్యములు మెండుగనుండునో అదియే యుత్తమనాటకమని వారి యభిప్రాయము. అట్టి నాటకములవలన నటకులకువచ్చుకీర్తి నాట్యపరమైనది కాదు, గానపరమైనది.

‡ ఒకరాజునకు ఒకరైతు నిమ్మపండును దెచ్చి బహుమతిచేసెను. దానిని జూచుచుండిన మఱియొకఁడు పొడవాటి చింతకాయను దెచ్చి రాజునకు సమర్పించెను. రాజు చిఱునవ్వుతో "ఇది యేమిబహుమాన" మని ప్రశ్నించెను. అందున కాతఁ డిట్లు జవాబుచెప్పెను. "లావుపాసి పొడుగులో నున్నది, పులుసునకు దానమ్మమొగుడు."

రోగముతో నుండెను జడువుట! రెండవతూరి అర్థముతో నుండెను జదువుట! తానొకసభయెదుట నటియించుచున్నాఁడని యు, తానుజేయు అభినయము, తాను పలుకుమాటలు సభాస్తారులు గ్రహించిరో లేదో యనువిచారము, తర్కము, నటకుని కెప్పటికి నుండఁగూడదు. అట్లుండినయెడల దాను నటకుఁడు కాక, విద్యార్థులకు ఉక్తలేఖనముచెప్పు బడిపంతులవంటివాఁడగును. రామకృష్ణమాచార్యుల నాటకములలోఁ బాత్రములు ధరించు నటకులందు బున రుక్తిదోష మొకగుణముగ వెలసినది. ఇందుకు మార్గదర్శకుఁడుకవియే. పద్యములోనిభావమునే గద్యములోను పాటలోను గూడఁజెప్పును. సామాన్య ప్రేక్షకుల గ్రహణశక్తి ననుమానించి కాఁబోలు రెండుమూఁడువిధముల నయభయములతోడ,కవిగారు తనభావములను వారిమనస్సులోనికెక్కించుకారిచేయును.

"భామవేషగాఁడికి మజ్జిగ నెయ్యిపొయ్యండి. తిత్తివూదేవాఁడికిఁ బప్పుకూడా కావాల్నా" అను ప్రాతభాగవతుల పాత్రగౌరవములు ఇప్పటి నాటకసమాజములలోఁగూడఁ బొడకట్టుచున్నవి. ఏనాటకమునందైనను, ఆయాస్థలముల ఆయాపాత్రము ప్రముఖమనియు, ఎంతనీచపాత్రమైనను తననియోగమును జక్కఁగనిర్వర్తించినయెడలఁ బ్రశంసార్హమనియు, నటకునికి వచ్చుపేరుప్రతిష్ఠలు తాను ధరించుపాత్రయొక్క యుదాత్తగుణముల ననుసరించికాక, పాత్రోచితాభినయ చాతుర్యమువలన ననియు, నటకులెఱుంగరు. ఒకవేళ యెఱింగియుఁ జాపల్యమును జిక్కఁబట్టలేకున్నారు. ప్రతినటకునకును దాను నాయకపాత్రమును ధరించినఁగాని సుప్రసిద్ధుఁడు గానేరఁడను అపోహ గలదు. ఇట్టి దురభిప్రాయముచేతనే చిల్లరపాత్రములను ధరించిన కొందఱు తమపాత్రములను జనుపక ఉదాసీనులయి నాటకముయొక్క సమష్టిరంజకత్వమునకు లోపమువాటిల్లఁ జేయుదురు; ఒక్కొక్కప్పుడు చెడగొట్టుదురు.

తాను ధరింపఁబోవుపాత్రముయొక్క గుణపోషణమునకు, స్వభావమునకు, తనమనస్తత్త్వము సరిపోవునా లేదా యనువిచారము నటకుని కుండవలయును. మొట్టమొదట తాను తనమనస్సును స్వభావమును పృథక్కరించుకొనుట యావశ్యకము. తనస్వభావమునందు గాంభీర్య

మును(Tragic element) లేనినటకుఁడు(Tragic hero) పాత్రమును స్వాభావసిద్ధముగ అభినయింపలేఁడు.

పాత్రధారణమునుగుఱించి యించుక వ్రాయవలసియున్నది; పాత్రోచితగౌరవమును బోషించునది వేషము. వేషమునుబట్టి సాధారణముగ మన మొకమనుష్యుని స్వభావశీలాదులను, అభిరుచిని, శిక్షణము మున్నగువానిని గుఱికి కొంచె మెచ్చుతక్కువగఁ దెలిసికొనఁగలము. కాని చాలమందినటకులు పాత్రోచితవేషములు ధరించుట లేదు. సావిత్రి, సీత, దమయంతి మున్నగుపౌరాణిక నాయికలు మోచేతులక్రిందికి జాఱుచుండు జాకెట్టులు, ఎఱ్ఱనిపట్టుతోఁ జేయఁబడిన "బో" అమర్పఁబడియున్న టోపా, ఉల్లిపొరలవంటి సిల్కులు ధరించుకొందురు. వారివేషములను జూచినప్పుడు గౌరవమునకు మాఱు లాఘవము మనమనస్సులలో నుత్పత్తియగును. వారికులుకు బెళుకులు మాతిత్రిప్పుటలు మున్నగు షోకులక్షణములు బజారీజంతలకుఁగూడ సిగ్గుపుట్టించును. చేటికలు నాయికల తలదన్నునట్లు అలంకరించుకొందురు. వారిలో నాయిక యెవతో చేటిక యెవతో గుర్తించుటకుఁ గొంత సంభాషణము జరిగినఁగాని సాధ్యముగాదు. హిరణ్యకశిపుఁడు మున్నగురాక్షసనాయకులు పదియాఱవశతాబ్దమున రోమనువీరులు ధరించు ఉడుపులను వేషికొందురు. ఆయుడుపులలోని చీలికలకు, కత్తిరింపులకు, ఏలాంటి యర్థ ముండదు. ఇతరరాజపాత్రధారులు పదునెనిమిదవ శతాబ్దమునాఁటి ఫ్రెంచివిగ్గులను ధరించుకొని సర్వకాల సర్వావస్థలయందుఁ దలలు విరియఁబోసికొని తిరుగుచుందురు.

కవికల్పనమును దమయిష్టమువచ్చినరీతిని కత్తిరించు అలవాటు నటకులకు మిక్కుటముగ నున్నది. కవి నటకులకన్నఁ దక్కువప్రతిభ గలవాఁడయినప్పుడును, కథ కొంచెము దీర్ఘమైనప్పుడును నాటకమిట్టి శస్త్రచికిత్సకుఁ బాల్పడుచున్నది. కాని యిట్టికత్తిరింపు జరిగినవెనుక నాటక మెట్లు స్వరూపలోపమును బొందకయుండునో, సంయోగిత చెడిన ఆనాటకమును సహృదయరంజకముగ నటకు లెట్లుప్రదర్శింపఁగలరో తోఁచకున్నది. వీనినన్నిఁటిని దృశ్యప్రాయ మొనరించుసాహసము మఱియొకటి కలదు. తెలుఁగునాటకములలో భిన్నమగు మఱియొక భా

మనసా బొప్పించుటట! ఇది కవి యొనరించిన పాపముకాదు నటకులు stage effect కొఱకు (అందేమి stage effect ఉన్నదో గోచరించుటలేదు. effect కు మాఱు defect కనఁబడుచున్నది.) స్వచ్ఛమైన యుర్దూభాషను ఎవరిచేతనైన వ్రాయించుకొని గుడ్డిపాఠముచేసి సభాస్తారులపైఁ గుమ్మరించుకొందురు. సుప్రసిద్ధనటకులని పేరువహించిన రాఘవాచార్యులవారుకూడ సామాన్యప్రజలకన్నులలో దుమ్ముకొట్టుటకు విశేషించి యీయధమమార్గము నవలంబించుచుండిరన్న, ఇఁక ఈ రంగసాంప్రదాయముల (Stage politics) పైని మమతపోవని నటకు లుండుట యరుదు. పఠానువేషము ధరించిన రాఘవాచార్యులవారిపద్ధతి నవలంబించియే కాఁబోలు పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు కబీరుపాత్రమును ధరించి రామదాసుతో ఉర్దూభాషలో మాటలాడుదురు. పాపము! రామదాసుకు ఉర్దూభాషాప్రౌఢపాండిత్యమే కావున చెప్పినమాటల నెటులో అర్థము చేసికొనునేకాని, ఉర్దూభాషలో తిరిగి జవాబు చెప్పు భాషాజ్ఞానము లేక తెలుఁగుతో మాటలాడును. తెలుఁగువారు ఉర్దూభాష చక్కఁగా నేర్చుకొనునంతవఱకైన నటకు లిట్టిచాపల్యమువంకకుఁబోకుందురని నాప్రార్థనము.

మ్లేచ్ఛదేశీయపాత్రోచితమైన భాష నుపయోగింప నిశ్చయమైనయెడల మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రులవారు ప్రతాపరుద్రీయమున వలీఖాను ప్రభృతులకును బొబ్బిలియుద్ధనాటకమున హైదరుజంగు మున్నగువారికి నుపయోగించిన మిశ్రభాష రమ్యముగ నుండును. కాని పఠాను మొట్టమొదటిప్రవేశమున స్వచ్ఛమైన యుర్దూభాషయును కడపటిసీనులలో అందుకు విరుద్ధముగ సంస్కృతపద భూయిష్ఠమైన సమాసములను మాటలాడుట విపరీతముగఁ దోఁచును.

ఒకొక్కప్పుడు నటకులు సామాన్యప్రేక్షకులను నవ్వించి చప్పటులు కొట్టించుకొనుటకు, అనవసరమైన హాస్యాభినయము చూపి కవి యుద్దేశించినరసమునకు విరుద్ధమైన రసమ్ము నుప్పతిల్లఁజేయుదురు. ఒక్కయుదాహరణము: హిరణ్యకశిపునియొద్దకుఁ జండామార్కులు విద్యా[illegible]మైన ప్రహ్లాదుని దీసికొనివచ్చి పరీక్ష చేయుఁడని చెప్పుదురు. రాజు పరీక్ష చేయును. ప్రహ్లాదుఁడు విష్ణువునే స్మరించును. హిరణ్యకశిపుఁడు కోపగించుకొని గురుపుత్రులతట్టు చూచును, అంతట వారికి వడఁకురోగముపుట్టి కాలుసేతులతితీవ్రముగ వడఁకింతురు. ఈయసామాన్యమైన యభినయకౌశలము చూచినంతనె కొందఱు ప్రేక్షకులు పొట్టలుపిసుకుకొని నవ్వుదురు. ఈ మెచ్చుకోలుచేఁ బ్రోత్సహింపఁబడి చండామార్కులు మఱికొంత తీవ్రముగ వడఁకుదురు. పాపము, వారినిస్సహాయతకుఁ బ్రేక్షకులమనస్సులో, కవి, కరుణారస ముప్పతిల్లఁజేయవలయునని తలంచెనుగాని నటకుఁ డందుకుభిన్నమైన హాస్యరసమును బుట్టించెను. ఇతరులను నవ్వించుటకు నాట్యకళాకౌశలము అవసరము లేదు. చీలమండలవఱకు గడ్డకట్టుకొని యుండినయొకఁడు స్టేజిపైకివచ్చి మోకాళ్లవఱకు గడ్డ నెగఁదీసుకొన్నయెడల ఆవైచిత్ర్యమునకుఁ జాలమంది నవ్వుదురు.

నటకులు కవులవలెనె వారివారి శిల్పనైపుణ్యము చేత లోకము నుద్ధరింపఁదగినవారు. వారిబాధ్యతయుఁ గొంచెము కాదు. కావున ప్రజాసామాన్యముయొక్క యభిరుచికి, వారు తమశిల్పమ్మును దింపుటకంటెఁ బ్రజల యభిరుచిని క్రమక్రమముగ సంస్కరించుటకుఁ బ్రయత్నము సల్పవలయును.

## నాటక శాల

నాట్యరంగ మెప్పటికిని యాథార్థ్యభ్రమను గొల్పవలయును. కాని మన ముపయోగించు పర్దాలకును, మనము ప్రదర్శించు నాటకములకును దేశకాలపరిస్థితి వైరుధ్యము కనుపట్టుచున్నది. సారంగధరునో లేక కృష్ణార్జునులనో మద్రాసుమౌంటురోడ్డులో తిరుగుచున్నటుల ప్రదర్శింతుము. కన్యాశుల్కములోని గిరీశమును రాజాంతఃపురములో సంచరించుచున్నటుల చూపింతుము. బుడ్డకు భూతమునకు ఒక వేషమందు వేయుటవలన ఇట్టి వైరుధ్యము సంభవించుచున్నది. పౌరాణిక నాటకములాడినను లేక చారిత్రకసాంఘిక నాటకము లాడినను, మొదటిపర్దా, వీథి, అంతఃపురము, దర్బారు, అడవి, అను నీ అయిదుపర్దాలనే యుపయోగింతురు. ఒక నాటకములోని నాయకుఁడును ప్రతినాయకుఁడును ఒకేయంతఃపురములోనో, లేక యొకేదర్బారులోనో మార్చిమార్చి కనఁబడుచుందురు. నేఁడు నాటకశాలలో అగపడుచున్న పర్దాలు



శ్రీమతి కమలాబాయి అమ్మగారు—వెండిరాట్టము బహుమానము బొందుట



శ్రీమతి రాజామణి అమ్మగారు—వెండిరాట్టము బహుమానము బొందుట



మైలాపూరు మూకబధిర పాఠశాల—విద్యార్థినులకు గృహకృత్యములను నేర్పుట



మైలాపూరు మూకబధిర పాఠశాల—విద్యార్థినులకు కుట్టుపని నేర్పుట

సీనులును ఇతరపరికరములతో సహా ... ప్రతికృతులు.

ఇట్టి సద్ద్రవ్యము సంభవింపకుండుటకుఁ గొన్ని ప్రయత్నములు చేయవచ్చును. నాటకములను పౌరాణిక ములనియుఁ జారిత్రకములనియు, సాంఘికములనియు విభజించి ఒక్కొక్క నాటకసమాజమువారు, ఒక్కొక్క వర్గ మునకు సంబంధించిన నాటకములకుఁదగిన యుపకరణ ముల నేర్పఱచుకొని నాట్యకళయందు త్తమసిద్ధిని పొంద వచ్చును. అట్లుగాక, సమాజము భాగ్యవంతమైనయెడల ఆమూఁడువిధములైన నాటకములకు ఆయాదేశకాలపరి స్థితులకు సంబంధించిన పర్దాలును, ఇతరోపకరణములును సేకరించి తరువాత నట్టినాటకములఁ బ్రదర్శింపవలయు ను. కాని, యిట్టిప్రయత్నములు, జమీందారుల పోష ణమున నభివృద్ధియగుచుండు మైలవరంసమాజము, ఏలూరు సమాజము మున్నగువానికే యొకవేళ సాధ్యము.

పౌరాణికనాటకములపర్దాలకు సీనులకును రామా యణ మహాభారతములందుఁ గానవచ్చు రాజప్రాసాదాది శిల్పవర్ణనముల నాదర్శకముగఁ గొనవచ్చును. చారిత్రక నాటకములకు బౌద్ధమొగలాయి శిల్పములను గ్రహింప వచ్చును. వర్తమానస్థితిగతులఁదెలుపు సాంఘిక నాటకము లకు నేఁటికాలపు సంకరశిల్ప ముపయోగపడును. ఏది యెట్లున్నను; ప్రస్తుతపు నాట్యరంగము ఆపాద మస్త కము మార్పు నొందవలయును.

ఏనాటకసమాజమువారైనను పదిపదునైదునాట కములను అవకతవకగ నాడుటకంటె నొకటిరెండునాట కములనైనను సరియైన యుపకరణములతో యోగ్యముగఁ బ్రదర్శించినయెడల అదియే యశస్కరము. సంఖ్యకన్నను రాశికన్నను, గుణమే ప్రధానము. ఇంగ్లండులో మూఁడు నాలుగు సంవత్సరములు విద్యనభ్యసించి మరల హిందూ దేశముచేరిన నామిత్రుని అచ్చటి నాటక విషయములను గుఱించి ప్రశ్నింపఁగా ఆయన యిట్లుచెప్పెను. "నేనొక నాటకము ఆఱునెలలకుఁబూర్వమునుండియు ప్రదర్శింపఁ బడుచున్నదని విని యొకనాఁటిరాత్రి చూడఁబోయితిని. అప్పటికిని ప్రేక్షకులు క్రిక్కిఱిసియుండిరి. నాప్రక్కను గూర్చుండియున్న యొక పెద్దమనిషినివిచారింపఁగా ఆయ న ఇట్లు చెప్పెను. ఇంక ఆఱునెలలవఱకు నాడినఁగానిచూ డఁదలఁచుకొన్న వారంతయును చూడలేరు. ప్రతిదినమును క్రొత్తప్రజలే వచ్చుచుందురు. ఇరువదివారు ఆరునెలలు కనుక సంవత్సరముపొడుగుననాడిన దేనిని పర్దాలు మున్నగు వానికై వారు వెచ్చించిన పెట్టుబడిద్రవ్యముపోను లాభము మిగులదు." నాటకరంగమున యాథార్థ్యభ్రమ కల్పించు టకెంతద్రవ్యమైనను యూరపియను నాటకసమాజముల వారు ఖర్చుపెట్టుదురట. అంతద్రవ్యమును మనము వెచ్చిం పలేకపోయినను వెచ్చించు ద్రవ్యమైనను ఉచితముగా విని యోగించు టావశ్యకము.

## ప్రేక్షకమండలి

ప్రేక్షకమండలిలో అన్ని విధములైన శిక్షణము గల మనుష్యు లుందురు. బహిర్వేషములను జూచి వీరు నిక్కువమైన కళాభిరుచిగలవారని యూహించుట యసా ధ్యము. నే నట్లూహించి చాలమాఱులు పొరపడితిని. ప్రేక్షకుల కొకదురభ్యాసము గలదు. అదిదురభ్యాసమే కాదు, దురభిరుచియు. ఒకనటకుఁడు శ్రావ్యముగఁ బద్య మునో పాటనో పాడినవెంటనే (Once more, Once more) అని కేకలువేసి చప్పటలు తట్టుదురు. హల్వా తీపుగానున్నదని అజీర్ణవ్యాధి పుట్టుపఱకు తినవలయునని వీరిమతము కాఁబోలు. ముక్కు ఒకవేళ అందముగా నున్న దని మఱిరెండుముక్కులు చేయించుకొని చెంపలకతికించు కొనుటకు వీ రిష్టపడుదురా? పునరుక్తి యుత్తరకృత్యములం దెంతదోషమో అంతకన్న నాటకకళయందును మహాపాత కము. శ్రుతిచాపల్యముచేత నొకపద్యమునకుఁ జెప్పఁబడిన (Once more)ను మన్నించెదమనుకొన్నను సీనుకంతయు (Once more) చెప్పు ప్రేక్షకుల యభిరుచి మన్నించుటకు వీలుకానిది. అట్లూరు నాటకసమాజమువారు రామదాసు నాటకమును నాగరకులకు ఆకరమైన యొకపురమున ప్రదర్శించినపుడు అచ్చటిప్రేక్షకులు ఆహామరల్ల సీను పునరభినీతము గావలయునని ప్రార్థించిరట!!

నటకుని సద్యః స్ఫురితమైన యభినయములోని యౌచిత్యమును, సౌకుమార్యమును, సూక్ష్మతను గ్రహిం చుటకంటెఁ బాటలోని మాధుర్యమును జవిచూచి యా నందించుట తేలిక. కావునఁ జాలమంది మెచ్చుకోలు పాటపద్యములకు సంబంధించియుండును. నేను జూచి నంతవఱకు మెచ్చుకోదగినఅభినయమునకు(Once more)

చెప్పిన ప్రేక్షకులు చాల యరుదు. చేయికదలింప నేరని నటకుఁడుగూడ రాగయుక్తముగ పాడెనేని ప్రేక్షక మండలి యాతని నద్భుతమైన నటకునిగ శంకించి బంగారు పతకముల దానము చేయుచుండును.

ఇకమీఁద నెన్నఁటికైనను కవినటకప్రేక్షకుల సహకారసాహాయ్యముల చేతనే నాటకశిల్పము సంస్కరింపఁబడవలయును. అభ్యున్నతినొందవలయును. ఈ ముప్వురును వారివారి బాధ్యతను జక్కఁగ గుర్తెఱిఁగి ప్రవర్తింతురేని నాటకకళకు మంచిదినములు రానున్నవని నా తలంపు.

ఈ వ్యాసమునందలి నాయభిప్రాయములు నాట్యశిల్పమును నిబద్ధీకరించు బిరుసు సిద్ధాంతములు గావు. స్నేహపూర్వకమైన సలహాలు; కావుననే దిద్దికొనుట కనుకూలములు.

# నెరపూర్ణమ్ము

## సుకవి

### శ్రీ శేషాద్రిరమణ కవులు

కాల వాహినిలోపలఁ గలసిపోవు
  రమ్యతరమైన యుత్తమ రత్నములను
పద్యసూత్రములందునఁ బదిలపఱుచు
నీదు నేర్పు మెచ్చ వర్ణింతు సుకవి!

సమధికవిశాలమగు ప్రపంచంబునందు
నిరవధిగనున్న కాల వేణికలయందు
నెన్నఁడో వెలుఁగొందిన దృశ్యములను
తెలుపు లేఖిని నుతింపఁగలనె సుకవి!

జనులహృదయాంతరస్థమా తృత్రరక్త
మవసర మెఱింగి మాతృసేవాంజలులకు
ధారవోయించు కవితాకుమారి కొసఁగు
యువకులనమస్సులీ వందుమోయి సుకవి!

బాహ్యలోకంబు గాఢాంధపటలమునకు
గైవసంబైన సంవర్తకాలమందు
జనులభావాంతరములఁ బ్రచ్ఛన్నమైన
నీదు సందేశములను వర్ణింతు సుకవి!

జాతిగర్భాంతరస్థమై చాటుపడిన
యువకుల స్వమాతృభక్తి భావోదయంబు
కలముతో గుండెఁజీల్చి లోకమున నిలుపు
గడుసరివి నీవు మనుజమాత్రుఁడవె సుకవి!

# సప్తమాంధ్ర ఆయుర్వేద మహాసభ

[27-3-1925—చెన్నపురి]

## వైద్యరాజ దంటు సుబ్బావధాని గారి అధ్యక్షోపన్యాసము

శ్లో. నమామి ధన్వంతరి మాదిదేవం, సురాసురై ర్వందిత పాదపద్మమ్;
లోకే జరా రుగ్భయ మృత్యునాశం, దాతార మీశం వివిధౌషధీనామ్.

ప్రజాపత్యశ్వి, బలభి, ద్ధన్వంతరి, చరక, సుశ్రుత, వాగ్భటాద్యాయుర్వేదాచార్యులకు వందనంబులు. పాణిని, కాత్యాయన, పతంజలి ప్రముఖుల కిదే యంజలి ఘటించితి. యోగంబున చిత్తంబును, వ్యాకరణంబున వాక్కును, వైద్యంబున కాయంబును, పవిత్రంబు జేసిన మునిప్రవరుడు సహస్రవదనుండు న న్ననుగ్రహించుగాక. శ్రీమద్గోవింద భగవత్పాదనాగార్జునాది రసతంత్రసిద్ధుల స్మరణంబు, నన్ను శుద్ధుంజేసి, వారి ప్రసాదంబున నిమ్మహాసభ సమావేశమైన యాధునిక విద్వద్వైద్యబృందము నన్ను కరుణంగాంచుగాక.

అకారణ స్నేహంబున నిమ్మహా సభాధిపనంబున నన్నుం బెద్దజేసి మన్నించిన మీ యనుగ్రహంబు నెంతని గొనియాడుదును. తల్లులారా, విదుషీమతల్లులారా! ఆర్యులారా! ఆయుర్వేదాచార్యులారా! మీ యాశీర్వచన బలంబే బలంబుగా, మీయంగీకారమే యధికారముగా, మీసంతోషమే సమర్థతగా, నీ వేదికపై మీవాడనై నిలువంబడిన నాచేత నమృతహస్తులగు మీరెల్లరు మీమీ కార్యంబులు సఫలంబు లొనర్చుకొందురుగాక.

ఆహా యేమి నాపుణ్యము! మిమ్ముం గొనియాడి పూర్వాచార్యుల భావనా బలంబున స్మరియించుచు నీపీఠంబున నిలువంబడియున్న నా కిప్పు డేమి తోచుచున్నది! అల్లదె హిమాలయము. అదె పాంచాలదేశము. అవె సింధునదీతీరాశ్రమారామంబులు. ఇదె గంగాభవాని. వారె జగత్పితరులు, రసవిద్యాఫలప్రదులు, పార్వతీపరమేశ్వరులు. ఇదె వింధ్యాచలము. ఎదుట శర్మదయై యతివేగంబున నర్మద పశ్చిమంబుననున్న సముద్రనాథుం గలియబోవుచున్నది. ఇదె నాసికామహాక్షేత్రము. ఈప్రకాశించునదె యాంధ్రభూమికి ముత్యాలకంఠమాల గౌతమీగంగ. ఇదె కలిమలవిధ్వంసకుండైన మావేంకటేశుని నిలయము, శ్రీశేషాచలము. వారె యత్ర్యాది మహామునులు. నిత్యముక్తులు సంధ్యోపాసనంబు గావించుకొని ఆకాశగంగ నుత్తమాంగంబులదాల్చి శ్రీనివాసుని సుప్రభాతసేవ కరుగుచున్నారు. అదె కర్పూరహారతి వెలుగుచున్నది. సహస్రాంధ్రవైద్యహృదయపీఠముల నలంకరించి, సహస్రాంధ్ర వైద్యగ్రంథంబుల కృతినందిన దివ్యమూర్తి, యోగిమానసవర్తి, జగద్గురుమూర్తి. భుజంగభూషణుడై, లక్ష్మీవిరాజమానవిశాలవక్షుండై, యభయముద్రాంచిత దక్షిణహస్తుండై కన్నులపం డొడసూపుచున్నవాడు. శేషాచలంబుంబట్టి పోవంబోవ ననేక కోటిజన్మపరంపరలమాన్పజాలి యెదుటగాన్పించునదేమి. ఓహో యిది శ్రీశైలశిఖరము. ఆకసంబున నీ తేజంబీరవంబీ కోలాహలంబేమి? విమానోత్తమంబులు తండోపతండంబులుగాఁ గొండపై వచ్చి వ్రాలుచున్నవి. అమృతకలశహస్తుండగు ధన్వంతరి. యోగదండంబు మహాభాష్యంబు నమృతవల్లియు గొనివచ్చునాతండు చరకాచార్యుండు. శస్త్రహస్తుండై యవతరించు నీతండె సుశ్రుతుండు. సిద్ధవైద్యసహస్రసంసేవ్యమానుండై దక్షిణమునుండి రయంబున వచ్చునతం డగస్త్యుం

డు. రసలింగాంచితహస్తుండై యర్ధనిమీలిత లోచనంబున యర్ధేందుమౌళిం గొనియాడుచువచ్చు నీమహాభాగుం డెవ్వండగునో, ఈతండు నాగార్జునుండు. వీరె వ్యాలాచార్యుండు, చంద్రసేనుండు, సుబుద్ధి నరవాహనుండు, రత్నఘోషుండు, సురానందుండు, యశోధనుండు, ఇంద్రధుమ్నుండు, మాండవ్యుండు, చరటి, కుమారసేనుండు, కాపాలికుండు, కామారి, తాంత్రికుండు, శంభుండు, అంకుండు, లంపటుండు, శారదుండు, బాణాసురుండు మునిశ్రేష్ఠుండగు గోవిందుండు, కపిలుండు, బలిమొదలగు రససిద్ధులు, మహాసత్వసంపన్నులు. వీరె గోసేవాపరాయణులు, వీరె వృక్షసేవానిష్ఠులు, ఆవచ్చువారె నేతి ధౌతి, నస్యాదియోగసాధకులు, ఈసంపుటేమి? విద్యార్థులు. ఆచార్యులకృష్ణాజినంబులుకొందఱు, తాళపత్రగ్రంథంబుల గొందఱు, రసగంధకాది పేటికల గొందఱును, డమరుకాదియంత్రములు గొందరును, మూషలం గొందరును వాహుకొని యుత్సాహవశంబున సశ్రమంబున నిఘంటుశ్లోకంబుల సంతజెప్పుకొనుచు వచ్చుచున్నారు.

నెత్తిమోపులతో, పాలకావిళ్లతో, దుంపలు, వేళ్లు, ఆకులు, పట్టలు మొదలగువానితో, భయభక్తులతో వడివడివచ్చు నీగుంపులోనివారెవరు? వీరె చెంచులు, యానాదులు, కోయలు, బోయలు, నెఱుకలు, వనౌషధముల నామరూపస్థానంబు లెఱింగినవారు. ఈమహాసమావేశమున కేమిఫలమో; నేడేమి యాశ్చర్యము లిచ్చట జూడంగనగునోకదా! "రసమునకు 18 సంస్కారములు కలవనుట నానాగ్రంథములనుండి ప్రమాణములను సేకరించి వ్రాసి ప్రకటించితిని గాని యవియన్నియు నేటివారి కనుభవములోనికివచ్చి రసవిద్యఫలించునట్లు తోచలేదను మాటలు గంభీరస్వరముతో వినబడుచున్నవి." గోపాలాచార్యా! నీకీభ్రాంతివదలినట్లు లేదు. కాలస్వరూపము మారినది. విద్యలయందు పరమార్థదృష్టితగ్గినది. ఆప్తవాక్యమందు ప్రామాణ్యబుద్ధి నశించినది. ఈవిషయము నేను గ్రహించియే నారసప్రదీపికయందు 18 టికి 8 శుద్ధులుమాత్రమువివరించి "కడమశుద్ధులు మేలు శ్రీకంఠుడెఱుగు"నని వ్రాసియుంటిని. ఈతడు రసప్రదీపికాగ్రంథకర్తయగు శ్రీముడుంబై వేంకటాచార్యుండు. వీరలు కొందరకొందరగా నేమేమోమాటలాడుకొనుచు బోవుచున్నారు. వృద్ధత్రయమునకుదరి సూత్రవ్యాఖ్యానంబులు, చదివినవారలకని నేను చింతామణియును, నీవు నీపేరన బసవరాజీయంబును వ్రాసియుండగా, సామర్థ్యమేఱుంగలేక "అనుక్తమన్యతో గ్రాహ్య"మనునట్లు శాస్త్రమునందు చెప్పబడని విషయంబులు దానిసంబంధముగల యితరగ్రంథములనుండి గ్రహింపవలయునను నియమ్మంబును గుఱుతెఱుంగక నేటియలసులు మనకృతులకు గళంకమాపాదించుచున్నారు. "సాధుసాధు వల్లభాచార్యా! నేనును నానిదానమందు నానాతంత్రవిహీనానాం భిషజా మల్పమేధసాం" అని వ్రాసియుంటినని మాధవాచార్యుండనుచున్నాడు. ఎంతరమణీయముగానున్న దీచూతవనము! సమమగు వనాంతరమున నీచిక్కనిమావిగున్నలనీడలో బ్రహ్మతేజంబున విరాజిల్లు నీమునిప్రవరులు స్నానానులిప్తులై కృతాచమనులై కొందరుదర్భాసనంబులం గొందరు కృష్ణాజినంబులం గొందరారగ్రికీటంబులతో సమానమగు రత్నకంబళముతో చేయబడిన చిత్రాసనంబులం గొందరు నుపవిష్టులైరి. మహానుభావులారా! రసవిద్యామర్మంబులం బ్రసాదింపుడని శిష్యులు వేడుకొనుచున్నారు. ధన్వంతరియనుమతంబున నాగార్జునుండిట్లు పల్కుచున్నాడు. "ఛాత్రవరులారా! నానాత్వమునకేకత్వము నిరూపించి బ్రహ్మజ్ఞానముం బ్రసాదించుటకు నజరామరత్వసిద్ధింగలిగించి యీకాయంబును తపోయోగ్యమొనరించుటకు నేర్పడిన దీరసవిద్య. గురుశుశ్రూషాపరాయణుండు, మంత్రదీక్షాక్రమకోవిదుండు, భక్తిబలసంపన్నుండు, గురుసంతోష సంపాదనైకశీలుండునగు వాడే యాత్మసిద్ధికొఱకు రసవిద్యను సంపాదింప నర్హుండు. గురుమంత్రంబు గురుమర్మంబు మాతృగుహ్యంబువోలె సర్వదాగోప్యంబు. హస్తమస్తకయోగంబున గురుమూర్తివలన వరంబువడసి సాధించు పుణ్యశీలున కీరసవిద్య సిద్ధించును. ధనాశచే వంచకులై రసవిద్యావ్యసనంబునం దవులునీచులు సిద్ధింగాంచలేరు సరికదా యర్థంబు బుద్ధియుం గోల్పోయి పాపంబార్జింతురు. "రసధస్యకలానాస్త్యేవ సాధకా భావాదుపదేశాభావాత్" ప్రకృతిబీజధర్మిణియగుటచే విత్తనంబులనుంగా నెందేని సాధకులు, బోధకులున్నను స్థూలదృష్టిచే కలియుగమున లేరనియే చెప్పవచ్చును.

"భవేద్వీర్యవతీగుప్తా నిర్వీర్యాచప్రకాశనాత్."

"అన్యథాయోవిమూఢాత్మామంత్రదీక్షాక్రమాద్వినా;
నాస్యాసిద్ధి మాప్నోతి యత్నకోటిశతైరపి."

ఈమహావాక్యము లాలించుటకై గుంపునుండి తోసికొని వచ్చువారు వీరెవ్వరు. ప్రతీహారు లెఱింగించుచున్నారు: వీరు ప్రాశ్నికులు, వీరు నిమిత్తశాస్త్రకోవిదులు, వీరు శకునాగమవిదులు, వీరుస్వరశాస్త్రనిపుణులు; వీరు గణితశాస్త్రప్రవీణులు, యథార్హంబులగు నాసనంబులు వీరలెల్ల రలంకరించి సుఖోపవిష్టులైరి. అప్పుడు నాగార్జునుండు వారల దిక్కు మొగంబై యిట్లు పల్కుచున్నాడు. "శాస్త్రవిదగ్రణులారా! మీకెల్లరకు స్వాగతము, ఈతాపసపుంగవ పరిషత్తునందు మీ రెల్లగను పూజార్హులు. మహానుభావులారా! ఈ ఋషికుమారులందఱు నాత్మసిద్ధికొఱకు పరమార్థదృష్టితో నాయురామ్నాయం బర్థించుచున్నారు. కావున వారలయెడ కరుణించి మీమీ శాస్త్రసారంబుల వారల కుపదేశింపుడు. రసము ఖల్వమునందు వేయునపుడును, ఓషధుల వనము నుండి త్రవ్వునపుడును, పుటము, పాకము ప్రారంభించునపుడును, రోగికి చికిత్స యుపక్రమించునపుడును, దూతవచనాకారాదులబట్టి, రోగియొక్క క్షేమాదులు నిర్ణయించునపుడును, సాధ్యాసాధ్యంబుల చర్చించునపుడును, క్షేమోలక్షణంబులు మరణచిహ్నంబులు నిరూపించునపుడును, మీమీ వాక్యదీపంబులు, జిజ్ఞాసువులకు మార్గదర్శకంబులగు నట్లాశీర్వదింపుడు. అప్పుడు సుశ్రుతాచార్యుని యామోదంబున కళ్యాణకారక గ్రంథకర్త ఉగ్రాదిత్యాచార్యుండు యేదియో శ్లోకము పఠింపుచున్నాడు. ఏమని:

"శ్లో. ప్రశ్నైర్నిమిత్త విధినా శకునాగమేన
జ్యోతిర్విశేషతర లగ్నశశాంక యోగాత్;
స్వప్నైశ్చ దివ్య కథితైరపి చాతురాణాం
ఆయుఃప్రమాణ మధిగమ్య భిష గ్యతేత.

శ్లో. రిష్టైర్వినానమరణం భవతీహజంతోః
స్థానవ్యతిక్రమణ తో౽తిసుసూక్ష్మతో వా;
కృచ్ఛ్రాణ్యపిప్రథిత భూత భవన్త్యవిష్యత్
రూపాణి యత్నవిధి నాత్ర భిష క్ప్రపశ్యేత్."

మహాప్రసాదము, మహాప్రసాదమని శిష్యులెల్ల జయజయధ్వానంబులు చేయుచున్నారు. ధన్వంతరి సమాధి చాలించి, యర్థముకుళములైన నేత్రాంబుజముల వికసింపఁజేసి, సభామంటపమునం దెల్లయెడల దన చల్లని చూపులు వెదచల్లుచున్నాడు.

ధగధగాయమాన పరతేజోవిరాజమానుండగు నాధన్వంతరిమూర్తి కిరుగడల నిలుచుండబడి సురటీలు వీసరుచున్న, బసవరాజ, వల్లభాచార్యులుచ్చైస్స్వరంబున "వినుండు వినుండు. ప్రభువు లాజ్ఞాపించుచున్నారు, హెచ్చరిక" యనుచున్నారు. "తాపసశ్రేష్ఠులారా! అభక్ష్యభక్షణంబున కేమిఫలము?" అని ధన్వంతరి ప్రశ్నించెను. వైద్యశ్రేణినుండి "రోగము రోగమ"ని సమాధానము వినంబడుచున్నది. "రోగము కాదు, పాపము, పాపము" అని ధర్మశాస్త్రజ్ఞుల శ్రేణినుండి మను పరాశర శంఖలిఖితాదు లైకకంఠ్యంబుగా సమాధాన మొసంగిరి. "ఆకులులేక వట్టి పోకలు నమలిన పాండురోగము కలుగుచున్నది". దీనికి ధర్మశాస్త్రజ్ఞు లేమందురు? "ఆకులు లేక వట్టిపోకలు నమలిన, నంతమందు హరిస్మరణము లేమియు, రౌరవాదినరకంబును ప్రాప్తించు" నని ధర్మవాదులు సమాధానము చెప్పిరి. "శాంతింపుడు, శాంతింపుడు, ఇరువురును సత్యమే పలికిరి. రోగమే పాపము, పాపమే రోగము.

"శ్లో. పూర్వజన్మ కృతంపాపం వ్యాధిరూపేణబాధతే,
తచ్ఛాంతి రౌషధైర్దానైః జపహోమార్చనాదిభిః."

పూర్వజన్మమునం దొనరించిన పాపమే యీజన్మమున, రోగముగా పరిణమించి బాధింపుచున్నది. ఔషధములు, జపములు, హోమంబులు, నర్చనంబులు, మొదలగునవి యందు శాంతిసంధాయకంబులగును. ఒక్కొకతరి నత్యుత్కటంబులైన, పుణ్యపాపంబులకు, 3 ఏడ్లనో 3 మాసంబులనో, 3 పక్షంబులనో, 3 దినంబులనో, నంతకంటె శీఘ్రముగనో ఫలంబుప్రాప్తించుటగూడవిందుము. అభిప్రాయ మభయపక్షములవారి దొక్కటే యగుట మీమీవాదంబులు సమరసభావంబున సమన్వయించుకొనునది. "ఇట్లనే రజస్వలానియమంబులును, రజస్వలాగమనాది నిషేధంబులును, పాకశుద్ధికొఱకు గావింపఁబడు వైశ్వదేవాది కర్మంబులును ద్రవ్యరక్షణ శోధనార్థముపదేశింపఁబడిన అన్నరక్షాది ప్రకరణంబులు నుభయవాదులు సమరసంబున సమన్వయించుకొనునది" అని గంభీర

భాషణంబుల ధన్వంతరి బోధించి విరమించెను. పరాకు పరాకు, కపిలగౌతమమహర్షులేతెంచి జనసమూహమున కావల నిలువంబడియున్నారను ప్రతీహారి వాక్యంబులు వినవచ్చుచున్నవి. అదిగో వారుభయులు చరక సుశ్రుతులతో నేకాసనంబున నాదరించబడిరి. ధన్వంతరియిట్లు పలుకుచున్నాడు. "మహాభాగులారా! ఈకపిలగౌతమమహర్షుల యాగమనంబున నీమహాసభ పరిపూర్ణమైనది. ఆదిశేషావతారంబును త్రికరణశోధనకరణసమర్థం బగు యోగవ్యాకరణవైద్యతంత్రంబులకుం గర్తయు నగు నీ చరకాచార్యుండును, మదనుగ్రహలబ్ధ సకలాయుర్వేద జ్ఞాన సంపన్నుండు, ననన్య సాధారణంబగు పదార్థ విజ్ఞానముగలవాడు, శస్త్రవైద్యనిష్ణాతుండు నగు నీ సుశ్రుతుండును సాంఖ్యకర్తయగు కపిలుండును, న్యాయ ప్రవక్తయగు గౌతమియు నొక్కకడ విరాజిల్లుట నయనానందకరము" అని వారలనుగ్గడించి సదస్యులగనుంగొని "శిష్టసమ్మతులారా! రసగుణ వీర్యవిపాక ప్రభావంబుల శాస్త్రీయ మేమి?" వైద్యశ్రేణినుండి, "ద్రవ్యము ద్రవ్యము; ఆయ్యది పంచభూతాత్మక" మని వినవచ్చెను. తర్కశాస్త్రజ్ఞుల గోష్ఠినుండి యొక్కరిట్లనుచున్నారు. "మాశాస్త్రములోనిపదము మీరెట్లు వాడుకొనుచున్నారు. ద్రవ్యగుణకర్మసామాన్య, విశేషసమవాయాభావంబులు సప్తపదార్థంబులనియు, నందు పృథివ్యాది పంచమహాభూతంబులు కాలదిగాత్మమనస్సులును నీతొమ్మిదియు ద్రవ్యంబులని మా శాస్త్రమున సంకేతించబడినది." అంతలో సాంఖ్యగోష్ఠినుండి యొక్కండు, ప్రకృతిమహదహంకారంబులననేమో, పంచతన్మాత్రలననేమో, వాని విశేషములైన పంచమహాభూతము లేమో సాంఖ్యులము మేము చెప్పవలసియుండగా ఆ పంచమహాభూతంబుల మీరెట్లు వినియోగించెద" రనుచున్నాడు. చరకాచార్యుడు కపిలునితో, చూచితివా యెంతలేసి పండితులుకాని, సమరసభావమలవడుట కష్టము సుమీ! వారందరు వీరిపట్టుదలలు చూచి, మందహాసము చేయుచున్నారు. అప్పుడు ధన్వంతరి, యిట్లు పల్కుచున్నాడు. "విద్వాంసులారా, మీ మీ పట్టుదలలు మానుడు. శాస్త్రములయందది వేరు నిది వేరనియు నది మాది యిది మీదియనియు భేదదృష్టి దొడ్డది కాదు. సకలశాస్త్రములు మానవుని కొరకేర్పడినవి, లోకమంతయు పంచభూతవికారము; మానవ శరీరమును పంచభూతమయమే. కఠిన భాగములు పార్థివములు; ద్రవంబులుదకమయంబులు; ఉచ్ఛ్వాసనిశ్వాసరూపమంతయు వాయవ్యంబు; ఉష్ణమంతయు నాగ్నేయంబు; లోపలి భాగముల, నుదరగోళంబునను, కర్ణవివరంబులను, వదనగహ్వరంబుననుండునది యాకాశము. ఈభూతంబుల తత్త్వంబులు న్యాయమున వివరించినను సాంఖ్యంబున ప్రపంచించినను, యోగంబున నెఱింగినను వైద్యంబున, చక్కజేసినను, వీని నన్నిటి వినియోగమీశరీరమునకే కావున, సమరస భావంబున సకల శాస్త్రంబులను స్థూలశరీర విజ్ఞానమునకో సూక్ష్మ శరీర విజ్ఞానమునకో, వినియోగించికొని, వాతపిత్త శ్లేష్మ వికారజన్యంబులగు జ్వరాతిసారరోగంబులు వారించుకొనుటకును, సత్వరజస్తమోవికారజంబులగు రాగాదుల వారించుకొనుటకును, ప్రయత్నించుట సాధుసమ్మతము." అని మేఘగంభీర నిస్వనంబున బోధించి "ఆనందకంద" తంత్ర కర్తయగు భైరవాచార్యుని వంక చూచెను. ఆతండును వినీతుండైలేచి, సభాసదులకు నమస్కరించి, "ప్రభువులాజ్ఞాపించినవారుగావున సర్వతంత్ర స్వతంత్రులగు నీ తాపస పుంగవులందఱెఱింగియున్న విషయమునే యీబుద్ధికుమారులకై ప్రకటించెదను. మహాభాగులారా! ప్రభువులాజ్ఞాపించినచందంబున పంచభూతంబుల తెఱంగట్టిదియే. రసాయనంబులును పంచభూతాత్మకంబులు. పృథగ్భూతంబులు నాబడునవికూడ, తద్భూతబహుళంబులే. వానియందితర భూతంబులు గూడ కొంచెము కొంచెము చేరియుండును. పార్థివ ద్రవ్యంబులలో, పృథివీ భాగమెక్కువ యుండునే కాని తదితరభూతంబులుగూడ కొంతకొంత చేరియుండును. దీని కుదాహరణంబు పార్థివ శరీరములే. అట్లులే, ఉదక ప్రధాన శరీరంబులు వరుణలోకంబున, వాయవ్య ప్రధాన శరీరంబులు, వాయవ్యలోకంబునను, తేజోప్రధాన శరీరంబులును, ఆదిత్యలోకంబునను నయ్యైయెడల గానంబడుచుండును.

రసాయనంబులును పంచ భూతాత్మకంబులు. గుడూచీమండీత్రిఫలాదులు పార్థివ రసాయనంబులు, స్నానంబులు, సుమధుపానంబులు నాప్యరసాయనంబులు, ప్రాణాయామంబనగా, పవనాభ్యాసము వాయవ్యరసాయనంబు. మహామంత్ర పఠనంబునం జేయుతపంబు తేజో

మయంబైన రసాయనంబు నిరాలంబంబగు సమాధియు నాభసరసాయనోత్తమంబు. ఇవియన్నియు వారాయోపినకొలందిని పరమేశ్వరానుగ్రహంబున నస్మత్తంత్రంబున, వివరించియుంటిని. అనన్యదుర్లభంబులగు నియ్యర్థంబులు శ్రద్ధాళువులై యాకర్ణింపుఁడు. ఈ సిద్ధులం బ్రసాదింపుటకుం దగిన యాచార్యుండు జ్ఞానవంతుండు, శీలవంతుండు, గుణవంతుండు, ధర్మజ్ఞుండు, సత్యసంధుండు వేదవేదాంగతత్వజ్ఞుండు, నిర్మలుండు, మంత్రసిద్ధుండు, మహావీరుండు, దేవతాయాగ తత్పరుండు, ఖేచరీ భూచరీ విదుండును గావలయు జుఁడీ." వీరలును గురుభజనకుశలురై, సదాచారసంపన్నులై, లోభమాయా వివర్జితులై నిస్పృహులై, నిరహంకారులై సత్యముంబల్కుచు, నాలస్యంబు విడనాడుచు, స్వధర్మంబనుష్ఠింపుచు, గురుమార్గనిరతులై సిద్ధింగాంతురు. ఇమ్మార్గంబు దుర్లభంబు. వంచకులై సిద్ధకృతతంత్రంబులలోనిమాటలు మాత్రము వాడుకొనుచు, దానికిఁదగిన యనుష్ఠానముగాని, వానిలోఁ జెప్పంబడిన విశేష శోధనాది విధానంబులుగాని యనుసరింపక పరద్రవ్యాపహారులై ప్రవర్తిల్లు కుక్షింభరులైన దాంభికులకు, వాణిజ్యము వార్తయుం బెంపగునేగాని ఫలంబుచేకూరదు. మూఢు లవ్వానిం దవిలి మోసపోవుదురు. సిద్ధనామంబునం బ్రసిద్ధిగాంచు నీనిషిద్ధులకు ద్రవ్యసిద్ధి ఘటించునేకాని పరమార్థంబు సిద్ధింపదు. వారి యౌషధంబులును బ్రకటనాబలంబునఁ బ్రాచుర్యంబు సిద్ధించునేగాని వీర్యంబు గుణంబుసిద్ధింపదు గావున గురుపుత్రులగు మీరయ్యల్పమార్గంబులం బోవకుఁడు.

## నామ ధారులు

సిద్ధతంత్రంబులందు నధికారులైన బుద్ధిమంతులకొక్కయుపాయంబు జెప్పెద. అయ్యది నిరపాయంబు. ఆ సమయంబున ప్రతీహారియొకఁడు వచ్చి నమస్కరించి నిలువంబడియెను. భైరవాచార్యుం డుపన్యాసము చాలించి వానికై చూచుచున్నాఁడు. మహాప్రభూ! "భావమిశ్రాచార్యులు వచ్చియున్నారు." భాగ్యము. సత్వరము తోడ్కొని రండనుచున్నాఁడు. బసవరాజును వల్లభాచార్యులును తమచేతి సురటీలు గోపాలాచార్యునకును వెంకటాచార్యునకు నొసంగి సత్వరము పోయి భావమిశ్రుని తోడ్కొనివచ్చి భైరవాచార్యునకు నాతి దూరంబుగా సుఖోపవిష్టునింజేసి తామును నాతనిపజ్జ కూర్చుండిరి. భైరవాచార్యుం డుపన్యసించుచున్నాఁడు. "సిద్ధవిద్యాధికారములేని బుద్ధిమంతులకీమువ్వురుమూర్తులు, చింతామణితంత్రకర్తయగు వల్లభాచార్యులు, స్వనామప్రతిష్ఠితగ్రంథరచయిత యీబసవరాజునట్టులే స్వనామప్రకాశితపుస్తకప్రచారకుండగు నీభావమిశ్రాచార్యుండును మార్గదర్శకులు. నానాతంత్రవిహీనులయ్యును న్యాయంబుగ నార్తుల కుపకరించు సద్బుద్ధిగల వైద్యులకు వీరలు విశిష్టముగా గతికల్పించిన మహానుభావులు. అందలి విధానంబులు సక్రమంబుగ నాచరించిరేని, రోగములు నిరాటంకముగా సాధింపగలుగుదురు. అందుకు పాలుమాలిన వైద్యులు శిష్టసమ్మతులు కారు. రసాయన విధానంబుల శోధింపఁబడిన రసాదులును, కల్పోక్తవిధానంబుల నుద్ధరింపఁబడి సేవింపంబడిన గుహాచూర్ణాదులును, రోగములను గూడ సంహరింప సమర్థంబులయ్యుండుంగాని రోగమును శమింపజేయు విధానంబుల మాత్రము శోధనాదులు గాంపంబడిన రసంబులు, నౌషధులు, రసాయన మహాఫలము నొసంగజాలవు. రసాయనంబులనగా సామాన్యంబులు గావు. అజరామరత్వంబు, లణిమాద్యష్టైశ్వర్యంబులు, బ్రహ్మజ్ఞానంబు, శివసాయుజ్యంబు సంపాదింప నోపియుండును. ప్రామాణ్యబుద్ధిగల భక్తునకు సకలంబుగలదు. ప్రామాణ్యబుద్ధిలేని పండితమాత్రులకు వాగాడంబరంబు, పటాటోపంబు, భేషజంబు, వార్తాప్రాబల్యముకంటె సారతరమైన దేదియులేదు. భ్రాతృవరులారా! జగత్పితరులగు పార్వతీపరమేశ్వరుల సంవాదరూపములైన రసతంత్రంబులన్నియు సత్యంబులు ప్రమాణంబులు. ప్రకృతిపురుషులన్నను, నాదబిందువు లన్నను, రసగంధకంబులన్నను నాలోకవంద్యులరూపంబులే. ఆరసతంత్ర సిద్ధిసత్యత్వంబునకు మా యనుభవమే ప్రబలసాక్ష్యము. గంభీరనినాదంబున శాస్త్రప్రామాణ్య ముద్ఘోషించు నా భైరవాచార్యుని వాక్యంబులకు సభాసదు లెల్లరు నిశ్చేష్టులై యాలకించుచున్నారు. చూతవనంబున చల్లని గాడ్పు మెల్లగ విసరుచు దివ్యకుసుమవర్షం బమ్మహాభాగునిపై యామహాసభపై కురియించుచున్నది. ఏమి యీ యాశ్చర్యము! భైరవాచార్యుండు లోచనంబులు ముకుళించుకొని ధ్యాననిష్ఠుం డగుచున్నాఁడు. ఆహా! చిత్రముగా నాతని జటాజూటంబున నర్ధచంద్రుండు వెలుంగ

చున్నాడు. సభాసదులెల్లరు 'హరహర మహాదేవ' యని కరతాళధ్వనులు చేయుచు జయవెట్టుచున్నారు. ఫాలంబున దేదీప్యమానంబగు లోచనంబు వెలుంగుచున్నది. ముఖంబున నొకవైపు మీసంబు నొకవైపు ముక్కెరయు మెరయుచున్నవి. ఒక్కవైపున విపులపృథుతర వక్షోర్ధంబున భస్మరేఖలు. నొక్కవైపున పీనోన్నత స్తనోపరి విరాజమాన కౌశాయాంశుకంబును శోభిల్లుచున్నవి. ఒక్కకరంబున నాగాభరణంబును, కపాలంబును, వన్యకరంబున మణిగణరుచిరంబగు కంకణంబును, లీలాపంకజంబును, మెఱయుచున్నవి. 'ధన్యావయం ధన్యావయం.' మహర్షులెల్ల రానందాశ్రుబిందుపూరముఖారవిందులై యానందించుచున్నారు. ధన్వంతరి లేచివచ్చి సాంబశివునకుం బ్రణమిల్లి, ఆశ్రిత రక్షాదక్షా! శిక్షిత దక్షా! విరూపాక్షా! దాక్షాయణీ నిక్షిప్తశృంగార లీలా కటాక్షా! భక్తుండగు భైరవాచార్యుని సత్యవచనుం గావింప సర్వమంగళాసమేతంబైన భవద్దివ్య మంగళ విగ్రహంబుతో సాక్షాత్కరించి రసరసాయన విద్యాసిద్ధి నీభక్తగోష్ఠికెల్ల కటాక్షించితివి. నిన్ను గీర్తింప మేమెంతటివారమని సాష్టాంగదండప్రణామం బాచరించె. శృంగియు నావిర్భవించి వ్యాఘ్రాసనంబమర్చె. పరమేశ్వరుండు సుఖోపవిష్టుం డయ్యె. నెల్లరు నిరుకెలంకుల యథోచిత దూరసామీప్యంబుల సుఖాసీనులయిరి. అర్ధనారీశ్వరుండు కొలువు నలుగడల గనుంగొని 'నాకును నాభక్తున కంతరంబున్నదే. నేన యెల్లకాలంబుల గురుస్వరూపుండనై నన్నుపాసించు శిష్యులకు సకలార్థసిద్ధి నొసంగుచుందును. మద్భక్తిరహితులై మదాయత్తులై మత్తంత్రంబుల విత్తోపార్జనకై మాత్రము వినియోగించు మూఢులంజూచి వినోదించుచుందును. మీరెల్లరు మద్భక్తపరాయణులు. స్వధర్మానుష్ఠానంబునకై యాయుర్వేదంబుల రసవాదంబుల నుపాసించు పుణ్యపురుషులు. ఈ దివ్యసభలో సమావేశమై మన్నామస్మరణంబును సచ్చింతనంబును మద్బోధిత గ్రంథవ్యాఖ్యానంబును గావించు మీకు మదనుగ్రహంబున సర్వకాలంబు భద్రంబగు. క్రియాసిద్ధియు ప్రసిద్ధియుం గలుగు 'శ్లో. నాత్మార్థం నాపి కామార్థం అథభూతదయాం ప్రతి, యోవర్తతే చికిత్సాయాం స సర్వమతిరిచ్యతే.'' అని బోధించి విరమించెను.

"ధన్యోస్మి". ఏమి నాపుణ్యము! ఏమి యీదివ్యదర్శనము! రివ్వురివ్వున విమానంబు లాకసంబున కెగయుచున్నవి. అన్నియు నిటువైపునకే పారి వచ్చుచున్నవి. విమానంబులు దిగి మహాభాగులెల్లరు సాంబసహితులై అదిగో యీసభాభవనమంతయునిండిరి. అదృశ్యులైరి. ఏమి యీచిత్రము! మిగిలినది మీరు నేను.

## సంపర్కదోషము

ఆర్యులారా! రోగంబులు సంపర్కంబున సంక్రమించుచున్నవి. సంపర్కము మహాదోషంబు. సాంక్రామిక వ్యాధులను నూతనముగా కనిపెట్టినారట. సంపర్కము దోషమని పాశ్చాత్యులు క్రొత్తగా తమపరిశోధనలచే తెలిసికొని మనకుం బోధింతురట. హనుమంతునిముందు కుప్పిగంతులన్నట్లు, తాతకు దగ్గులు నేర్పినట్లు, కమ్మరి వీధికి సూదులమ్మబోయినట్లు, సకల మెఱింగిన యీ పండితగోష్ఠిలో, కించిజ్ఞుడనైన నేను బోధింపనెంచిన ట్టిమాటలు పరిహాసపాత్రంబులు గావా!

"సంపర్కాద్దోషః"
"తస్యతదితర సంయోగాద్దోషో భవతి"
"అపిచ కేవల సంపర్కాద్దోషోస్తున"
"తస్య తదీయస్యచ సంయోగాదానందో జాయతే"

(గురుబోధామృతమ్)

ఈ సంపర్కదోషము భరతఖండమున వేదముతో పాటు బోధింపబడియే యున్నది. ఆయుర్వేదమున కిది నూతనవిషయమా? కాదు కాదు. దోషమనగా సంపర్కమే, మరేమియుం గాదు. ఆత్మకు జీవత్వ ముపాధి. "సోపాధికో దోషః" ఆత్మకు జీవత్వ సంపర్కము దోషమని తేలినది. సారాంశము సచ్చిదానంద స్వరూపుండగు నాత్మకు జీవత్వమను నుపాధితో కలిగిన సంపర్కదోషమే సకలసంసారరూప దుఃఖమునకు నిదానము "సంపర్కాద్దోషః" ఆత్మకు దుర్ఛేద్యమగు నీజీవత్వసంపర్కదోష ముండుటచేతనే వాగ్భటాచార్యుండు "రాగాదిరోగాన్ సతతానుషక్తాన్" అని వచించి యున్నాడు. రాగాదిరోగంబులు సతతము వెంటనంటియుండు ననుచున్నాడు. ఆత్మకు జీవత్వము, జీవమునకు కాయము విడిపించుకొన దుస్సాధ్యములగు లంకెలు. కావున నే

సంపర్కంబున సూక్ష్మశరీరమునకు రాగద్వేషాదులు, స్థూలశరీరంబునకు జ్వరాతిసారాదిరోగంబులు సతతానుషక్తంబులై జన్మజరావ్యాధిమరణరూపంబులైన నిఖిల దుఃఖంబులకు కారకంబు లగుచున్నవి. కావున శరీరంబు కేవల గృహప్రాయంబుగనెంచి యందాత్మ, క్షేత్రజ్ఞుండు; కర్త గృహస్థునిం బోలె యందంటకుండ సమాధి బలంబున పరమేశ్వరతాదాత్మ్యముం బొందుచు శరీరసంపర్కదోషము లేక సంచరించు స్థితి యుత్తమోత్తమంబు. సమస్తబాహ్యాంతర రోగరహితంబగు నాజీవన్ముక్తావస్థ యీశ్వరుం డొక్కడే ప్రసాదింపగలడు గావున వాగ్భటుండు పరమేశ్వరు నపూర్వవైద్యుండని వర్ణించెను.

"తస్యతదితరసంయోగాద్దోషోభవతి" పురుషుండు సచ్చిదానంద స్వరూపుండు. జీవన్ముక్తుండగు యోగియు సచ్చిదానంద స్వరూపుండు. సర్వదృశ్యరహితంబగు "నది"యే నేనను యోగి సమాధి బలంబున సర్వాతిరిక్తుండు సర్వసంపర్కరహితుండై దోషనిర్ముక్తుండై సదాసుఖం బనుభవింపుచుండు. అట్టి రాజయోగికి తదితరు లగు సామాన్యజనులతో సంపర్కంబున దోషంబు వాటిల్లుచుండు. "స్వేతరశ్చావచ్ఛిన్న పురుషైః సంగం త్యక్త్వా సుఖీ భవేత్ జ్ఞానీ యోగీచ" తనతో నైక్యంబొందని విమూఢుల సంపర్కం బవ్వానికి దోషంబుగావున నట్టివారి సంపర్కంబు వర్జించి జ్ఞానియు యోగియు సుఖంబుందు రని సూత్రార్థంబు. "నాకుఁ సఖ్యము పుణ్యశ్లోకులతోఁ గాని తత్వశూన్యులు సంసారైకవిమోహులతోడఁ గాకుండ నొనర్పుమయ్య కంజదళాక్ష" "అపిచ కేవల సంపర్కాద్దోషోస్తున" సంపర్కమాత్రంబు దోషంబుగాదు. తనకంటె నితరమైనదానితో సంపర్కంబు దోషంబగును. "తస్య తదీయస్యచ సంయోగా దానందో జాయతే" తనకుతనదగు దానితో సంయోగంబున నానందం బుదయించు. "ముక్తులు ముక్తుల గలియుట యుత్తమ." గురుశిష్యులు మాతాపితరులు పార్వతీ పరమేశ్వరులు, వీరల సమాగమంబు సంపర్కంబు దోషంబుల గలిగింపక యానంద సంధాయకంబగును. సమానత్వము లేనివాని సంయోగము దోషము. మానంబు సౌఖ్యసంధాయకంబు. సంపర్కరహితంబు. శిష్య బోధంబు సంపర్క సహితంబయ్యును దోషయుక్తంబు గాదు "తస్యతదీయసంబంధం" బానందసంధాయకంబగును. బ్రహ్మచర్యంబు సౌఖ్యదం బగును. సంపర్కరహితంబు. అనురక్తయు, నింగితజ్ఞయు పతిదైవతయునగు నిల్లాలితో పొత్తు సంపర్కసహితంబయ్యు దోషరహితంబు. "వృద్ధిస్సమానైస్సర్వేషాం" సమానమైనవాని చేరిక వృద్ధిహేతువని వాగ్భటాచార్యుండు బోధించె. సంపర్కదోషము బాగుగ గుర్తించినవారగుటచేత మన పెద్దలు సదాచారము లన్నింటియం దద్దాని సూచించియున్నారు. మడికట్టుకొనిన యిద్దరొండొరుల దాకినచో సంపర్కదోషము వాటిల్లునని మనవారి యభిప్రాయము. మైలగానున్న యిద్దరు రజస్వలలైన స్త్రీలొండొరులదాకిన దోషమని ధర్మశాస్త్ర ముద్ఘోషింపుచున్నది. అసాత్మ్యేంద్రియార్థ సంపర్కంబు దోషంబు. తనప్రకృతికి భిన్నంబగు దేశకాలాహారాదులతోడి సంపర్కంబున దోషంబులు సంక్రమించును. తనశరీరముతో సంపర్కంబున తనకేదోషము గలుగునని గ్రహించిన యార్యులు, తనతో సామాన్యములేని యితరుల సంపర్కమువలన దోషములు సంక్రమించుననుట యెఱుంగరన్నమాట పాటిసేయరాదు.

"హీనమిథ్యాతిమాత్రకం"బగు కాలార్థకర్మంబుల సంపర్కమే సర్వరోగముల సంక్రమింపఁ జేయునని యాయుర్వేదాచార్యు లుద్ఘోషింపుచున్నారు. ఇట్టులయ్యు మందబుద్ధులకొరకు కొన్ని రోగంబులు సాంక్రామికంబులని వ్రాసిరేకాని యెందును సంపర్కమే దోషకారణంబు. ఈ బోధనం బాంగ్లేయసిద్ధాంతు లెఱింగిరేని తారె యీ సంపర్కదోష జ్ఞానబోధకు లను నభిమానము వీడుదురు. దేహికి ననురూపమగు నాహారవిహారంబుల తోడి సంపర్కంబె పథ్యంబు. పథ్యంబున సర్వరోగజయంబును సర్వసంపర్కదోషనిరాసంబును సిద్ధించు. ఇదియ యాయుర్వేదాచార్యుల పరమబోధంబు. రోగిని రోగి నుండి వేరుచేయుట. ప్రతికూలమగు దేశమునుండి యనుకూలమగు దేశములకు రోగులను పంపుట మొదలగునవి యన్నియు సంపర్కదోషము లెఱుంగుటబట్టియే కలుగుచున్నవి. "తస్య తదీయ" సంపర్కంబున పథ్యంబు. తస్య తదితరసంపర్కంబున నపథ్యంబును గాంచందగు. క్రిములను సంహరించిన లాభంబేమి? దోషవైషమ్యము చక్కంజేసిన క్రిములు తమంతటతామే నశించును. ఆయుర్వేద చికిత్సలయందును, క్రిమిహరములగు నౌషధంబుల వినియోగమే ప్రధానముగా నడుచుచున్నది. అయ్యది ఫలప్రదంబు నగుచున్నది. మానవశరీరతత్వంబును జగత్తున ద్రవ్యతత్వంబు నాయుర్వేదాచార్యులు విపులముగ వర్ణించిరి. ఆత్మానాత్మ వివేచనంబు గలిగి జ్ఞానులాత్మీయంబగు వానితో కలసి, యనాత్మీయములగువాని సంపర్కము విడనాడు చందంబున మానవులు పథ్యాపథ్యవివేచనంబు గలిగి ప్రమాణంబు లెఱిగి ద్రవ్యగుణంబు లెఱిగి ఆత్మానుకూలంబగు ద్రవ్యంబులతోడి సంపర్కంబున నానందంబును ప్రతికూలంబులగు ద్రవ్యంబులతోడి సంపర్కంబున దుఃఖంబును గాంతురు.

# తుమ్మెద

మిత్తింటి అన్నప్పసోమయాజులు గారు

[కవితానికేతనము]

కోదమతుమ్మెదరాక గోపాలురాక
గొనబునల్లనిమేను గోవిందుమేను
కాణాచికంఠంబు వేణుగానంబు
గోపికాయువతులు కుసుమకోమలులు.

హిమబిందుశృంగార మింపారువేళ
బంగారుకిరణాలు ప్రసరించువేళఁ
జల్లనివాయువుల్ చనుదెంచువేళ
విరివిగఁ బూవులు వికసించువేళఁ
బావనభానముల్ ప్రభవించువేళఁ
బక్షులు కలకల పలికెడువేళ

నర్ఘ్యప్రదానంబు లర్పించువేళ
నల్కుమ్రుగ్గులసొంపు లమరెడువేళఁ
బాల్ద్రావి తువ్వాయి పరువెత్తువేళ
నుగ్గుపెట్టిన పిల్ల లూఁగాడువేళ
విశ్వకల్యాణుని వినుతి పూరించి
మెల్లఁగఁ జల్లఁగ మేల్కాంచి లేచి
చక్కని ఱెక్కల సవరించుకొనుచుఁ
జెట్టుచెట్టున కేఁగి క్షేమంబు లడిగి
యత్తిల్లుచొచ్చిన యల్లునిమాడ్కి
శాఖశాఖకుమధ్య సంచరింపుచును
బత్త్రపత్త్రంబును బావ! బావ! యని
కూర్మిఁ జెంతకుఁజేరి కుశలమ్ము లడిగి
తనరాక కెదురయి తపియించుచున్న
వేనవేలకు మీఱు విరికాంతలెల్ల
రావయ్యా!! రావయ్యా!! ప్రాణేశ!! వేగ

రావయ్యా!! రావయ్యా!! జీవితస్వామి!!
దయచేయవయ్యా!! యుదారగుణాబ్ధి!!
కడకంటఁజూడక కరుణింపవయ్యా!!
కనులు తెఱచికొని కనిపెట్టుకుంటి;
మువ్వేళులూరుచు నుంటిమి నాథ!!
తనివి తీఱంగను దరిచేరవయ్యా!!
మనసార నోరార మాటాడవయ్యా!!
ముచ్చటతీరఁగ ముద్దాడవయ్యా!!
కఱవు తీరంగను గౌఁగి లీవయ్యా!!
పరుమోము చూడని పడఁతులమయ్యా!!
నాథుఁడ వీవంచు నమ్మితిమయ్యా!!
రక్షింపకుండిన బ్రతుకు లేదయ్యా!!
పాలింపకున్నను బ్రాణ మేలయ్యా??
తడవుచేసిన నింకఁ దాళలేమయ్యా!!
రావయ్యా!! రావయ్యా!! ప్రాణేశ!! వేగ
నంచును విరహార్తి యగ్గలంబెల్ల
నేత్రావధానంపు నేర్పునుజూపి
హావభావప్రకటాకార మొనసి
యటునిటుఁ గదలుచుఁ గటకటపడగ
హిమబిందుపాద్యాల యేపును జూచి
తళతళదళముల తళుకులఁ గాంచి
మిసిమి కింజల్కాల మిలమిలఁజూచి
పుష్పాడిగందాల యొప్పులఁగాంచి
మకరందబిందుల మాధుర్యమెంచి
ముఖబింబబింబిత మోహమ్ము చూచి

వీక్షణముద్రిత విరహమ్ము గాంచి
యాటోపసంసూచితాసక్తిఁ జూచి
మురిసిమురిసిపోవు ముచ్చటఁ దలఁచి
కనఁగానె కలిగిన కలకల మెంచి
పొడచూపఁ బొందినపొంగును గాంచి
చూడంగఁ బూనిన సొంపును జూచి
నగుపడఁ గల్గిన యానంద మెంచి
వీక్షింపఁ జెందిన వెఱ్ఱిని గాంచి
దరిచేరఁ బుట్టిన తందరతలఁచి
పట్టఁగారాని బల్వంతఘటింప
గుఱిచూచి మీటిన గోరుండరీతి
నారావవిస్ఫూర్తి గారకాయవలె
మానససంచార యానంబుతోడ
పరితాపసంతోష వదనంబుతోడ
నాకంపితాఖిలాంగావళితోడ
స్వీయసతీత్రాణ శీలంబుతోడఁ
దగులమ్ము హృదయానఁ దాండవింపంగఁ
బ్రేమమనోవీథి విడియాడుచుండ
వలపు కడుపులోనఁ గలఁత పెట్టంగ
మోహమ్ము తలకెక్కి ముందడుగేయ
విరికాంతలకు మధ్య వేవేగ నిల్చి
ఒకదానిఁ జేయి పట్టి; ఒకదానిఁ దట్టి;
ఒకదాని చెఱఁగూని; ఒకదాని ముట్టి;
ఒకదాని దరిఁజేరి; ఒకదానిఁ జీరి;
చన్నీటి పన్నీట జలకంబులాడి;
పుష్పాడిగందాలు పూఁతలుపూసి
మకరందపానమ్ము మత్తుకల్పింపఁ
దమకమ్ము తలకెక్కి తత్తరమిడఁగ
మోహపూరంబులో మునిఁ గాడుకొనుచుఁ
బువ్వుపువ్వున కేఁగి ముద్దాడుకొనుచు
ముద్దాడిముద్దాడి మోహమ్ముచనక
పలుకుచుఁ గులుకుచు వలపు లూరించి
ఆడుచుఁ బాడుచు నాదరమిచ్చి
ముట్టుచుఁ దట్టుచు ముచ్చట లాడి
గిలిగింతలను బెట్టి కేరింతలాడి
గుసగుసలను జెప్పి కులుకుపుట్టించి
ఆనందపారవశ్యంబునఁ దేల్చి
జుఱ్ఱుజుఱ్ఱునఁ దేనె జుఱ్ఱులు కొనుచు
విడలేక విడలేక విలపించువిరుల
మోమున మోమాని ముద్దులు పెట్టి
ఈసట్ల బూసట్ల నింపు ఘటించి
అచ్చట్ల ముచ్చట్ల నాస గల్గించి
దీపాన ధూపాన దిటము నిర్మించి
నకనకమాటల నవ్వు పుట్టించి
కులికించి కులుకుచుఁ గొంత వారించి
చనలేక చనలేక సాగిపోవుచును
శృంగారమూర్తియై చెలువొందునట్టి
పుష్పకాంతలలోని ముద్దుకృష్ణమ్మ!
చిగురుకొమ్మలలోని చిన్నికృష్ణమ్మ!
నల్లకాంతులు చిమ్ము గొల్లకృష్ణమ్మ!
గానమయముచేయు వేణుకృష్ణమ్మ!
భ్రమరకంఠీరవుఁ బ్రస్తుతించెదను.



# శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులు

### శ్రీ. ద్వై. కోటేశ్వర శర్మ శాస్త్రి గారు

శ్లో. శాస్త్రం శారీరమీమాంసా దేవస్తు పరమేశ్వరః,
ఆచార్య శ్శంకరాచార్యః సంతుమే జన్మజన్మని.

వైశాఖ శుద్ధపంచమి తిథియందు శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యు లవతరించినటులు శృంగేరిపీఠము మున్నగు జగద్గురుపీఠములవా రంగీకరించి జయంత్యుత్సవముల జరిపించుచున్నారు. శ్రీమదాచార్యులవారి చరిత్రమునుగూర్చి యీభారతియందు (౧ వ సంపుటము—౬ వ సంచిక, రక్తాక్షి జ్యేష్ఠమాసము) కొంత వ్రాసియున్నారము. ఇప్పుడు ఆచార్యులవారి ముఖ్యసిద్ధాంతమునుగూర్చియు కాలమును గూర్చియు సంగ్రహముగ వ్రాసి తెలిపినంతవఱకు ఆచార్యులవారిపేర ప్రసిద్ధినందిన గ్రంథనామముల నిటఁ జేర్చుచున్నాఁడను.

శ్రుతిస్మృతులయందు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాదివర్ణములవారికి విధించియున్నకర్మలన్నియు నిష్కామబుద్ధితో ఆయావర్ణములవారు ఆచరించవలయుననియు, అటు లాచరించుటచేత చిత్తగతములగు మలినవాసనలన్నియు క్రమముగనశించి చిత్తనైర్మల్యము జెంది సత్సహవాసమున ఇహపరలోకసుఖములయందు అభిలాష నశించుననియు, పిదప శమదమాది సద్గుణసంపత్తిగలిగి ముముక్షువగుననియు,పిదప సదాచార్యు నాశ్రయించి క్రమముగ దృఢవైరాగ్యసిద్ధికి వలయు సాధనసంపత్తిని గ్రహించుననియు సోపానపంచకమునందు క్రమముగ నిరూపించియున్నారు.

ఆచార్యులవారి పాండిత్యప్రకర్షనుగూర్చిపూర్వాచార్యులుచెప్పిన యొకశ్లోకము నుదహరించుచున్నాఁడను.

శ్లో. వేదేబ్రహ్మసమ స్తదంగనిచయే గర్గోపమ స్తత్కథా, తాత్పర్యార్థ వివేచనే గురుసమ స్తత్కర్మ సంకీర్తనే, ఆసీ జ్జైమినిరేవ సూత్రనిచయ స్యార్థోపసంవర్ణనే, వ్యాసేనైవ సమ స్సశంకరగురు ర్జేజీయతాం మానసే.

[తా.—వేదములందు చతుర్ముఖబ్రహ్మతో తుల్యుఁడు. వేదాంగములయందు గర్గునితో సమానుఁడు, వేదార్థబోధచేయుటయందు బృహస్పతితో సమానుడు, వైదికకర్మల మర్మముల దెలుపుటయందు జైమినితో సరియగువాఁడు, బ్రహ్మసూత్రముల తాత్పర్యము వివరించుటయందు వ్యాసునితో పోల్చఁదగినవాడు నగు శ్రీశంకరగురువర్యుఁడు నాచిత్తమునందు ప్రకాశించుచుండుఁగాక.]

## శ్రీమచ్ఛంకరాచార్య జన్మకాల విచారణ

నిరీహులును, జనులనుండి గౌరవమును కీర్తిని అభిలషింపకయే శరీరపాతపర్యంతము విశ్రాంతి యనునది యెట్టిదియో యెఱుంగని మనపూర్వులందఱు తమతమ శక్తికొలఁది దేశమునకు మతమునకు భాషకు తాముచేయవలసిన సేవను చేసియే కృతకృత్యుల మయితిమని భావించునట్టి స్వార్థశూన్యులగుటచేత ముల్లోకములందు ప్రసిద్ధినందిన మహనీయులగూర్చి విచారించినను "ఎప్పుడు పుట్టెను? ఎవరికి పుత్రుఁడయి జన్మించెను? ఎచ్చట జన్మించెను? మొదట ఏకార్యమును ప్రారంభించెను?" అను విషయమునుగూర్చి మనము విచారింప మొదలిడితిమేని నిస్సంశయముగు సమాధానమునుమాత్రము మనము పడయఁజాలము. ౧. జగద్విలక్షణమయినా వ్యాకరణశాస్త్రమును రచించిపెన్నె కెక్కిన పాణినిమునియొక్కయు, ౨. లోకోత్తరమయిన భాష్యమును ఆపాణినిసూత్రములకు రచించి

మహాభాష్యకర్తయను శ్రీమద్భాష్యమును రచించిన పతంజలియొక్కయు, ౩. పాణినిసూత్రములమీద వార్తికములనురచించిన కాత్యాయనమునియొక్కయు, ౪. న్యాయవైశేషికయోగశాస్త్ర కర్తలయొక్కయు, ౫. నిరుక్తకారుడగు యాస్కాచార్యునియొక్కయు కాలమును గూర్చిన నిర్ణయ మిదమిత్థమని నేటివఱకెవ్వరును చెప్పవలనుపడకేడుగదా. అట్లే జగద్గురు శంకరభగవత్పాదాచార్యులవారి కాలమునుగూర్చియు స్పష్టమయిన నిర్ణయము నొనర్చుట శక్యముకాదు. కనుక ప్రాచ్య, పాశ్చాత్య పండితులు విమర్శించి విమర్శించి తేల్చిన సారాంశములను కొన్నింటి నిట ప్రదర్శించుచున్నాడను. మనపూర్వులు తమచేత శక్యమయినంతవఱకు లోకోపకార మొనర్చుటకే ప్రయత్నించిరికాని స్వఖ్యాతినిగూర్చి చెప్పుకొనుట కిష్టపడకపోయిరి. ఆచార్యులవారి కాలనిర్ణయమునుగూర్చి చర్చించువారు మొత్తముమీద మూడుతెరగతులను జేరుచున్నారు.

౧. కొందఱు క్రీ. శ. ప్రారంభమునకు పూర్వము ఒకశతాబ్దము మొదలుకొని ౪, ౫, శతాబ్దములవఱకు ఆచార్యులవారిజన్మను తమకు తోచిన యుపపత్తులతో నిర్ణయించుచున్నారు. ౨. మఱికొందఱు క్రీ. ౬ వ శతాబ్ది మొదలుకొని ౮వశతాబ్దము దనుక ఆచార్యులవారి జన్మకాలమును నిర్ణయించుచున్నారు. ౩. మఱికొందఱు క్రీ.శ. పూర్వమొకశంకరాచార్యుడును, క్రీ.శ. తరువాత ౬వ ౮వ శతాబ్దములకు మధ్యకాలమున ఇంకొక శంకరాచార్యుడును జన్మించెననియు, ప్రస్థానత్రయభాష్యములను రచించినది ఒకఆచార్యుడనియు, శ్వేతాశ్వతర, నృసింహతాపిన్యాదిభాష్యములను, త్రిశతిసహస్రనామభాష్యాదికమును రచించినది మఱొక శంకరాచార్యుడనియు, ఉభయులు భిన్నకాలీయులనియు కొందఱు తలంచుచున్నారు.

## ౧. ప్రథమకక్ష్యకు చేరినవారి

## ౧. ద్వారకాపీఠాధిప ప్రేరితవృత్తాంతము

యుధిష్ఠిరశకము: ౨౬౩౧ వైశాఖ శుద్ధ పంచమియందు శంకరునిజననము. ౨౬౩౬ చైత్రశుద్ధనవమియందు ఉపనయనము. ౨౬౩౯ కార్తికశుద్ధఏకాదశియందు సన్యాసాశ్రమస్వీకారము. ౨౬౪౦ ఫాల్గుణశుద్ధ ద్వితీయయందు గోవిందపాదులవారికడ తత్త్వోపదేశము. అదిమొదలుకొని ౨౬౪౬ జ్యేష్ఠబహుళ అమావాస్యపర్యంతము బదరికాశ్రమమునందు ౧౬ భాష్యముల నొనర్చుట. ౨౬౪౮ మార్గశిర కృష్ణద్వితీయయందు మండనమిశ్రునితోడ వాదారంభము. ౨౬౪౯ చైత్రశుద్ధచతుర్థియందు మండనమిశ్రపరాజయము ౨౬౪౯ చైత్రశుద్ధ షష్ఠియందు మండనమిశ్రపత్నియగు సరస్వతితోడ వాదారంభము. ౨౬౪౯ చైత్ర బహుళ అష్టమియందు (అమరుకరాజదేహమునందు) పరకాయప్రవేశము. ౨౬౪౯ కార్తికశుద్ధ త్రయోదశియందు మఱల స్వదేహమునందు ప్రవేశము. ౨౬౪౯ కార్తికబహుళపాడ్యమియందు సరస్వతీపరాజయము. ౨౬౪౯ కార్తికబహుళపంచమియందు ద్వారకయందు సరస్వతీస్థాపనము. ౨౬౪౯ మాఘ శుద్ధసప్తమి సురేశ్వరాచార్యులవారిని ద్వారకాపీఠమునందు అభిషేకమొనర్చుట. ౨౬౪౯ ఫాల్గుణశుద్ధనవమియందు శృంగేరియందు సరస్వతీస్థాపనము.

౨౬౫౦ చైత్రశుద్ధ తృతీయనుండి ౨౬౬౦ పుష్యబహుళ అమావాస్యవఱకు దిగ్విజయము. ౨౬౫౪ పుష్యశుద్ధ పూర్ణిమయందు దిగ్విజయ సందర్భమున శృంగేరియందు హస్తామలకాచార్యులవారి నభిషేకమొనర్చిరి. ౨౬౬౨ మాఘశుద్ధ పాడ్యమి మొదలుకొని ౨౬౬౩ కార్తికశుద్ధ పూర్ణిమవరకు కాశ్మీరదేశమునందలి శారదాపీఠమునందు నివసించిరి. ౨౬౬౩ కార్తికశుద్ధ పూర్ణిమయందు బ్రహ్మాది దేవతా ప్రార్థితులై స్వదేహముతోడ కైలాసము చేరిరి.

౨. కుంభకోణ కామకోటి పీఠస్థ వృత్తాంతమ నను సరించి,

శ్లో. ఈశోఽప్య భూత్సముద విద్య దశేష్యదర్ప
సర్పాహితుండికవిదగ్ధ సహస్రసేవ్యః
విద్యాధిపత్య పరనామ్ని కులే శివాఖ్యా
దార్యాపతే రవి సహస్రరుచిః కుమారః.
"తిష్యప్రయాత్యనిల(౩) శేవధి(౯) బాణ(౫) నేత్ర(౨)
యోనందనే దినమణా వుదగధ్వభాజి [౨౫౯౩
రాధేఽదితే రుడుని నిర్గత మస్త్రలగ్నే
ప్యాహూతవా న్శివగురుస్సచ శంకరేతి.
[జగద్గురు రత్నమాలికా స్తోత్రవ్యాఖ్యానమ్.]

కలియుగమునందు ౨౫౯౩ సం. సరియగు నందన సంవత్సరం ఉత్తరాయణ వైశాఖశుద్ధ పంచమి పునర్వసూ నక్షత్రము ధనుర్లగ్నమునందు (అనగా క్రీ. పూ. ౫౦౯ సంవత్సరము, శ్రీమచ్ఛంకరాచార్యులవారు జన్మించిరి.

౩. శృంగేరి శంకరపీఠము ననుసరించిన వృత్తాంతమునందు విక్రమశకము. ౧౪ వ సం. సరియగు ఈశ్వరనామ సంవత్సర వైశాఖ శుద్ధపంచమియందు శంకర భగవత్పాదాచార్యులవారు అవతరించినటులు నిర్ణయింపబడినది.

౪. మహారాష్ట్రభాషయందుగల 'అర్వాచీనకోశ' మను గ్రంథమునందు తద్గ్రంథకర్త జినవిజయమనుజైన గ్రంథమునుండి ప్రమాణశ్లోకముల నుదహరించి శ్రీశంకరుని జననసిద్ధికాలముల నిర్ణయించియున్నాఁడు.

శ్లో. ఋషి(౭) ర్బాణ స్తథాభూమి (౧) ర్మర్త్యాక్షౌ(౨)
[వామమేళనాత్ ౨ (౨౧౫౭)

ఏకత్వేన భవే దంక స్తాంమాత్తు స్తద్ధి వత్సరః.

*    *    *    *

ప్రసూతా సర్వలోకస్య తారణాయ జగద్గురుమ్
.........మాఘే కృష్ణే శుభేదినే;
చతుర్దశ్యాం నిశీథేతు పుష్పవంతౌ తథా శుభే.
..........................
నందో వసు ర్భూమినేత్రే మేలనే శాకఉత్తమః;
జ్ఞాతవ్యః పాండుపుత్రస్య జాతో వామేనవై తదా.
దుర్ముఖే మార్గశీర్షే చ శుక్లపక్షే త్రయోదశీ,
సోమప్రదోషే సాయాహ్నే కైలాసం శంకరోగతః.

[తాత్పర్యము:—యుధిష్ఠిరశక ౨౧౫౭— రక్తాక్షిసం. మాఘబహుళచతుర్దశి సోమవారమురాత్రి శంకరాచార్యుల జననము. యుధిష్ఠిరశకం ౨౧౯౦ సం. దుర్ముఖిసం, మార్గశిరశుద్ధత్రయోదశీ సోమప్రదోషమున శంకరుఁడు కైలాసమునకు చేరెను.]

౫. సదానందస్వామికృత శంకరవిజయమునందు, ఇట్లున్నది:—

శ్లో. ధర్మే ద్వావింశతిశతే సప్తాశ ద్విసహస్రకే,
అబ్దే సర్వజితే జాత స్సహైవ పంచమీ దినే.
సుముహూర్తే శుభే లగ్నే హ్యుచ్చస్థే గ్రహపంచకే,
సా సతీ సుషువే బాలం శంకరాఖ్యం జగద్గురుమ్.

౨. ద్వితీయకక్ష్యకు చెందినవారి సిద్ధాంతములు

శ్లో. దుష్టాచారవినాశాయ ప్రాదుర్భూతో మహీతలే,
స ఏవ శంకరాచార్యః సాక్షాత్కైవల్యనాయకః;
నిధినాగేభవహ్న్యబ్దే(౩౮౮౯)విభవే శంకరోదయః,
అష్టవర్షే చతుర్వేదాన్ ద్వాదశే సర్వశాస్త్రకృత్;
షోడశేకృతవాన్భాష్యం ద్వాత్రింశేమునిరభ్యగాత్,
కల్యబ్దే చంద్రనేత్రాంక వహ్న్యబ్దే (౩౯౨౧) గుహాప్రవేశః; వైశాఖే పూర్ణిమాయాంతు శంకర శ్శివతామగాత్.

అభిప్రాయము:— కలివర్షములు ౩౮౮౯ విభవ సంవత్సరమున (క్రీ. శ. ౭౮౮) శంకరుని జననము. కలివర్షములు ౩౯౨౧ నందు (క్రీ.శ. ౮౨౦) కైలాసగమనము. ఇదేకాలమును మరికొన్ని గ్రంథములందు గల.

శ్లో. ప్రసూతతిష్యశరదా మతియాతవత్యా
మేకాదశాధికశతేన చతుస్సహస్ర్యామ్;
సంవత్సరే విభవనామ్ని శుభే ముహూర్తే
రాధేఽసితే శివగురోర్గృహిణీ దశమ్యామ్.

అనుశ్లోకముకూడ బలపఱుచుచున్నది. కాని వైశాఖశుద్ధ దశమితిథియందు జననమనిమాత్ర మీశ్లోకమున నధికముగ తెలుపఁబడినది. కాని కాశీనాథతెలాంగు మున్నగు విమర్శకులీకాలమును అంగీకరింపక గ్రంథాంతర్గతప్రమాణములచేత ఇంతకు పూర్వమునందే శ్రీశంకరుఁ డవతరించియుండవలయునని నిర్ణయించుచున్నారు.

౧. ఆచార్యులవారు సూత్రభాష్యమున ౨.౧.౧౭వ సూత్రముయొక్క భాష్యమునందు పాటలీపుత్రనగరమును గూర్చియుపూర్ణవర్మ యను ప్రభువునుగూర్చియు ప్రశంసించియుండుటచేతను, పాటలీపుత్రనగరము క్రీ.శ. ౫౭౬ సం. ప్రవాహవేగమునఁబడి నశించియుండుటచేతను, పూర్ణవర్మ క్రీ.శ. ౬వశతాబ్దమున రాజ్యమును చేసియుండుటచేతను శ్రీమచ్ఛంకరాచార్యులవారు కూడ క్రీ. శ. ౬వ శతాబ్దమునందే జన్మించి యుండవలయునుగాని వెనుక జెప్పినప్రకారము క్రీ. శ. ౭౮౮ సం. జన్మించిరనుట ప్రమాణముకాదు అని తెలాంగుగారి యభిప్రాయము.

౨. ఈశ్వరకృష్ణసాంఖ్యకారికలకు శ్రీగౌడపాదాచార్యులవారు భాష్యమునొనర్చిరి. ఆభాష్యమును చీనాభాషయందు క్రీ. శ. ౫౩౦ సంవత్సరమునందు చీనాదేశమునందు భాషాంతరీకరించిరి. గౌడపాదాచార్యులవారు శ్రీమచ్ఛంకరాచార్యులవారికి గురువులగు గోవిందభగవత్పాదులవారికి గురువులు. గౌడపాదాచార్యులవారు రచించిన గ్రంథము లోకమునందు వ్యాపించి తత్ప్రసిద్ధిదేశాంతరములకు తెలిసి దాని భాషాంతరీకరణము సలుపుటకు కొంతకాలము కావలయునుగదా! ఎంతప్రయత్నించినను క్రీ.శ. ౫౩౦ కంటె ఇవతలకు ఆచార్యులవారి జన్మకాలమును నిర్ణయించుటకు శక్యము కాజాలదు.

ఆచార్యులవారు ప్రస్థానత్రయ భాష్యమునందు ప్రమాణముగా నుదహరించిన గ్రంథములు:

## శ్రుతి గ్రంథములు

౧. ఋగ్వేదసంహిత, ఋగ్వేదబ్రాహ్మణములు: ఐతరేయ బ్రాహ్మణము, కౌషీతకి బ్రాహ్మణము: ఋగ్వేద ఆరణ్యకము, ఐతరేయారణ్యకము.

౨. కృష్ణయజుర్వేదసంహిత, తద్బ్రాహ్మణము, తదారణ్యకము.

3. శుక్లయజుర్వేద సంహిత, తద్బ్రాహ్మణము: శతపథ బ్రాహ్మణము, కాణ్వ, మాధ్యందిన శాఖలు రెండును.

౪. సామవేదసంహిత, తద్బ్రాహ్మణములు: పైంగీబ్రాహ్మణము, ఆర్షేయబ్రాహ్మణము, వంశబ్రాహ్మణము, తాండ్యబ్రాహ్మణము.

౫. అథర్వవేదసంహిత, తద్బ్రాహ్మణము: గోపథ బ్రాహ్మణము.

౬. మైత్రాయణీసంహిత.

౭. కాఠకసంహిత.

ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకములను దశోపనిషత్తులనుండియు శ్వేతాశ్వతర, కైవల్య బ్రహ్మబిందు, జాబాలి, అగ్నిరహస్య, నారాయణోపనిషత్తులనుండియు, ప్రమాణవచనముల నుదహరించిరి.

## సూత్ర గ్రంథములు

ఆశ్వలాయన, కాత్యాయన, ఆపస్తంబ, జైమిని సూత్ర, పాణినిసూత్ర, యోగసూత్ర, సాంఖ్యసూత్ర, వైశేషికసూత్ర, న్యాయసూత్రములనుండియు,

## స్మృతి గ్రంథములు

మనుస్మృతి, మహాభారతము, శ్రీమద్రామాయణము, మార్కండేయ పురాణము, విష్ణుపురాణము, గౌడపాద కారికలు మున్నగు దాదాపు ౫౪ గ్రంథముల నుండియు ప్రమాణవచనముల నుదహరించిరి.

విష్ణుసహస్రనామభాష్య, శ్వేతాశ్వతరభాష్య, త్రిశతిభాష్యాదిగ్రంథములయందు అనేక పురాణముల యొక్కయు, ధర్మశాస్త్రములయొక్కయు వచనము లనేకము లుదహరించిరి. కాని అవకాశము లేకపోవుటచేత ఇట వాని వివరము నంతయు తెలుపలేదు.

## శ్రీశంకరాచార్యకృత గ్రంథములు

### భాష్యగ్రంథములు

౧. బ్రహ్మసూత్రభాష్యము. [దీనికి శారీరక మీమాంసా భాష్యమని ప్రసిద్ధనామము)

౨. దశోపనిషత్ భాష్యము, (ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండ, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకములను ౧౦ ఉపనిషత్తులకు 'దశోపనిషత్తులు,' అని ప్రసిద్ధనామము.)

3. భగవద్గీతాభాష్యము, (ఈ మూడుగ్రంథములను ప్రస్థానత్రయమని వైదికసంప్రదాయవేత్తలు పలుకుదురు.

౪. శ్వేతాశ్వతరోపనిషద్భాష్యము.

౫. నృసింహతాపిన్యుపనిషద్భాష్యము.

౬. త్రిశతిభాష్యము.

౭. సనత్సుజాతీయ భాష్యము.

౮. విష్ణుసహస్రనామభాష్యము.

## మూలగ్రంథములు ౨౪

సర్వవేదాంత సిద్ధాంతసారసంగ్రహము, ఉపదేశసాహస్రి, వివేకచూడామణి, మహావాక్య వృత్తిదర్ప

ణము, వాక్యవృత్తి, వాక్యసుధ, అపరోక్షానుభూతి, పంచీకరణము, ఆత్మబోధ, స్వాత్మనిరూపణము, వేదాంత సారము, వేదాంత ముక్తావళి, హరిమీడేస్తుతి, శతశ్లోకి, తత్త్వానుసంధానము, ప్రశ్నోత్తర రత్నమాల, అద్వైత కౌస్తుభము, అద్వైతానుభూతి, ప్రబోధ సుధాకరము, మహావాక్య వివరణము, యోగతారావళి, రాజయోగము, శివానందలహరి, సౌందర్యలహరి, దక్షిణామూర్తి స్తోత్రము.

## వేదాంతబోధక లఘుస్తుతులు ౨౮

పరామానసికపూజ, ఆత్మషట్కము, విజ్ఞాననౌక, మనీషాపంచకము, సాధనపంచకము, కౌపీనపంచకము, కాశీపంచకము, వైరాగ్యపంచకము, రత్నపంచకము ఆత్మపంచకము, నిర్వాణషట్కము, నిర్వాణదశకము, సప్తశ్లోకీగీత, చర్పటమంజరి, వాక్యసుధ, ద్వాదశమంజరి, హరినామమాల, ఆత్మబోధకస్తుతి, షట్పది, కనకధారాస్తుతి, ఆత్మచింతనము, లఘువాక్యవృత్తి, వివేకాదర్శము బాలబోధిని, నవరత్నమాలిక, ఆనందలహరి, నీలకంఠశైవ సంవాదము, కల్యాణవృష్టిస్తవము.

## స్తోత్రములు మున్నగునవి ౮౧

సువర్ణమాలాస్తుతి, శివమానసపూజ, విష్ణుమానసపూజ, భవానీమానసపూజ, భగవన్మానసపూజ, జీవబ్రహ్మైక్యస్తోత్రము, బ్రహ్మనామావళీస్తోత్రము, కాశికాస్తోత్రము, శివభుజంగప్రయాతస్తోత్రములు ౨ విధములు విష్ణుభుజంగ ప్రయాతస్తోత్రము, శివపంచాక్షర స్తోత్రము దేవీభుజంగప్రయాతస్తోత్రము, శివాపరాధక్షమాపణ స్తోత్రము, గౌరీదశకము, చంద్రమౌళీశ్వరస్తోత్రము, లక్ష్మీనృసింహస్తోత్రము, రామభుజంగ ప్రయాతస్తోత్రము, నారాయణస్తోత్రము, మంత్రమాతృకా పుష్పమాలాస్తవము, త్రిపురసుందరీస్తోత్రము, సుబ్రహ్మణ్య భుజంగస్తోత్రము, అన్నపూర్ణాస్తోత్రము, భవానీభుజంగస్తోత్రము, విష్ణుపాదాదికేశాంతవర్ణనస్తోత్రము, దత్తాత్రేయ సహస్రనామస్తోత్రము, శివసర్వోత్తమ స్తోత్రము, దక్షిణామూర్తివర్ణమాలాస్తోత్రము, దశావతారస్తోత్రము, నారాయణస్తోత్రము, లలితాస్తవరాజము, త్రివేణీ స్తవము, శారదాస్తుతి, విఠ్ఠలస్తోత్రము, రామలక్ష్మణస్తోత్రము, వేదసారశివస్తోత్రము, అపరాధభంజనస్తోత్రము, కృష్ణతాండవస్తోత్రము, దేవ్యపరాధక్షమాపణస్తోత్రము, శివపాదాదికేశాంతవర్ణన స్తోత్రము ౨ విధాలు, కాశీవిశ్వనాథస్తోత్రము, అర్ధనారీనటేశ్వర స్తోత్రము.

## అష్టకములు వగైరా ౨౯

అంబాష్టకము, పాండురంగాష్టకము, శివనామావల్యష్టకము, కాలభైరవాష్టకము, అచ్యుతాష్టకము ౨ విధములు, కృష్ణాష్టకము, జగన్నాథాష్టకము, యమునాష్టకము ౨ విధములు, ధన్యాష్టకము, శివరామాష్టకము, గంగాష్టకము, మణికర్ణికాష్టకము, గోవిందాష్టకము, భైరవాష్టకము, కామాక్ష్యష్టకము, ఉమామహేశ్వర స్తోత్రము, సాంబాష్టకము, శివాష్టకము, మీనాక్షీపంచరత్నము, మీనాక్షీ స్తోత్రము, భ్రమరాంబాష్టకము, లలితాపంచకము, శారదాభుజంగ ప్రయాతాష్టకము, లక్ష్మీనృసింహ పంచరత్నము, నిర్గుణమానస పూజాస్తోత్రము, త్రిపురసుందరీస్తోత్రము, విశ్వనాథనగరీ స్తోత్రము, ఇంకను మఱికొన్నియు నుండవచ్చును.

ఆచార్యులవారి పేర లోకమునందు వ్యాపించియున్న స్తోత్రములు, అష్టకములు మున్నగు లఘుప్రబంధములన్నియు ప్రస్థానత్రయభాష్యకర్తయగు ఆద్యశంకరాచార్యవర్యులే రచించిరని దృఢముగా జెప్పుటకు వలనుపడకపోయినను ఈస్తోత్రము ఆద్యశంకరాచార్యకృతమనియు, ఇదికాదనియు చెప్పుటయును అశక్యమేయని మన మంగీకరించి తీరవలయును.

# సాభిప్రాయ విశేషములు

కీ. శే. సర్ పిట్టీ త్యాగరాయ శెట్టి గారు

కీర్తిశేషులైన విలియము స్టెడు మహాశయు డొక చిన్ని పుస్తకమును వ్రాసెను. దానిపేరు "నీవువానిస్థితియందున్నటు లూహింపుము" (Put yourself in his place). పరుల శీల స్వభావములను ఖండించెడివారల కీగ్రంథార్థము జ్ఞానోదయమును గలుగజేయగలదు. పరుల స్వభావమును గనుగొనుట దుష్కరము. స్వీయ స్వభావ సంస్కారముల కనుగుణ్యముగను పరుల గుణావగుణములను నిర్ణయించుట లోకమునందు పరిపాటియైనది. పరులస్థితియందు తానున్నపుడె వారికిగల సాధకబాధకములను గ్రహించుట సాధ్యమగును. కీర్తిశేషులైన సర్ పిట్టి త్యాగరాయ శెట్టిగారి జీవిత మీధర్మార్థమును విశదము చేయుచున్నది. స్వలాభాడంబరములు లేకను 73 ఏండ్లు జీవయాత్రను గడిపి ప్రజాగౌరవమునకు పాత్రులైన త్యాగరాయ శెట్టిగారు ధన్యులు. త్యాగరాయ శెట్టిగారి స్వాతంత్ర్యము, సేవాపరాయణత్వము, స్వసంఘాభిమానము, కార్యదీక్ష శ్లాఘ్యములుగ గనుపడినను బ్రాహ్మణేతరోద్యమనాయకత్వము దురభిప్రాయములకు గారణంబగుట సంతాపకరముగనున్నది. త్యాగరాయ శెట్టిగారి స్వాతంత్ర్యప్రియత్వమునందును, స్వసంఘాభిమానమునందును, కులవృత్తుల యభిమానమునందును వారి మహత్వమునకు మూలమైన బ్రాహ్మణేతరోద్యమ నాయకత్వ బీజములును గలవు.

త్యాగరాయ శెట్టిగారు పట్టపరీక్షయందు కృతార్థులయ్యును నుద్యోగముల నభిలషించలేదు. ఆంగ్ల విద్యావిశారదులయ్యును కులవృత్తిని, వేషభాషాచారములను, నిరసింపకను గౌరవించి నాయకత్వమునకు పాత్రతను గడించిరి. ప్రభుత్వోద్యోగమె పరమార్థమని నమ్మిన దేశమునం దేబదేండ్లకుపూర్వము పట్టపరీక్షయందు తీర్ణులైన త్యాగరాయ శెట్టిగారు ప్రభుత్వోద్యోగ స్వర్ణపాశబద్ధులుగాకుండుట వారి విశాలహృదయమునకు నిదర్శనముగ నున్నది. ప్రభుత్వోద్యోగములందిటీవల దేశభక్తులకు గలిగిన నిరసనభావము శెట్టిగారి కేబదేండ్లకు పూర్వమె కలుగుట వారి యుదారప్రవృత్తిని విశదముచేయుచున్నది. ప్రభుత్వోద్యోగములను నిరసించియును నిరంతరోద్యోగపరాయణులై జీవితాంతమును సేవాదీక్షను వహించి యుద్యోగవ్యామోహమునందు మునిగిన విద్యాధికులకు సేవావిధానమును విశదముచేసిన త్యాగ

రాయ శెట్టిగారు శ్లాఘ్యులు. స్వదేశ వ్యాపార పరిశ్రమలను, ముఖ్యముగను నేతపరిశ్రమలను ఉద్ధరించుటకు విశేష వ్యయప్రయాసములకు లోనై శెట్టిగారుచేసిన కృషి వారికార్యదీక్షను చాటుచున్నది. త్యాగరాయ శెట్టిగారి విశాల జీవితమె బ్రాహ్మణేతరోద్యమనాయకత్వమున కర్తృతను గలుగజేసినది. కులాభిమానమునకును,నుద్యోగాభిమానమునకును, విద్యాభిమానమునకును నిలయమైన దక్షిణ దేశమునందు త్యాగరాయ శెట్టిగారు బ్రాహ్మణేతరోద్యమరూపమునను జీవిత పరమార్థమును విశదముచేసిరి. విద్యాకులోద్యోగాభిమానములు జీవితతరంగములను సంకుచితముచేసినవి. సంఘమునందు కులాభిమానము ప్రబలినది. విద్యాభిమానము మితిమీరినది. ఉద్యోగారాధనము పరమార్థమైనది.

ఆంగ్లవిద్యాసంస్కారమునకుఫలమైనయీ యభిమానత్రయమును నిర్మూలము చేయుట కాంగ్లవిద్యాసంస్కారులయిన త్యాగరాయ శెట్టిగారు సకలవిధములను సగియుండిరి. గాంధి మహాత్ముడు త్యాగసాధనమున సాధింప బూనిన ప్రయోజనమును త్యాగరాయ శెట్టిగారు సామాన్య ప్రజాదరణమునకు పాత్రమైనలాభసాధనమునను సాధించుటకు బూనుకొనిరి. త్యాగరాయ శెట్టిగారి ప్రయత్నములు, నిందలకును, దురభిప్రాయములకును, దురభిమానమునకునుగారణంబైనను బ్రాహ్మణేతరసంఘములందు పురోవృద్ధికి సాధనములయిన యాత్మగౌరవ విశ్వాసములను గలుగజేసి దేశాభ్యుదయమునకు దోడ్పడినవి. ఉన్నతాదర్శములంచును స్వప్రయోజన పరాయణత్వము ప్రబలి ద్వేషాసూయాభావములు తలయెత్తుట సహజము. స్వప్రయోజన పరాయణులైన వారియనుచరులందు ప్రబలిన రాగద్వేషోద్రేకములకు శెట్టిగారిని బాధ్యులనుజేయుట యనుచితము. వివిధసంఘములవారును జాతి మత కులభేదములు లేకను త్యాగరాయ శెట్టిగారికి సమర్పించుచున్న స్తోత్రాంజలులు వారి మహత్వమును విశదముచేసినవి.

వేలమంది నడుమను త్యాగరాయ శెట్టిగారి స్వరూపాకారములు ప్రేక్షకుల దృష్టి నాకర్షించుచుండినవి. ఒకసారి చూచిన వారు వారిని తిరిగి మరువజాలకుండిరి. తెల్లనిబట్టలు, చందననిర్మాల్యము, సౌమ్యమైనను నుత్సాహభరితమైనస్వభావము, మందహాసము, సాధు శీలము, కార్యపరత్వము, విద్యాసంపదలు, స్వాతంత్ర్యేచ్ఛ, సేవాభిలాష సర్. పిట్టి త్యాగరాయ శెట్టిగారికి చెన్నపురియందును నితరప్రాంతములందును నఖండ గౌరవమును నొడగూర్చుటకు గారణంబులైనవి. త్యాగరాయ శెట్టిగారి జీవిత పరమార్థోపదేశములను సార్థకముచేయుటకు బ్రాహ్మణేతరులును బ్రాహ్మణులును వారిమాటలను చేతలను జేయుటకు పనిబూని సార్థకమైన సంస్మరణప్రతిష్ఠాపనమును జేయుచు కృతకృత్యు లగుదురు గాక !

* * * *

రాజ్యాంగరంగము

నీలమేఘావృతమైన రాజ్యాంగరంగము నందు విద్యుల్లతలు మెరయుచున్నవి. విద్యుల్లతలను గర్జనము సహజముగ ననుగమించుచున్నది. బర్కెను హెడు ప్రభువునకును దేశబంధు దాసునకును రాయబారములు నడుచుచున్నటులు ప్రతీకలు వెడలుచున్నవి. కార్మికపక్షపత్రిక డెయిలి హెరల్డు సారాంశమును ప్రకటించినది. దేశబంధు ఫరీదుపురమునందు జేసిన యధ్యక్షోపన్యాసము హెరల్డు ప్రకటించిన సూచనల కనుకూలముగనున్నది. నిరంకుశప్రభుత్వము పశ్చాత్తాపమును జూపినయెడలను స్వరాజ్యపక్షము సహకారనీతి నవలంబించుట కభ్యంతరముండదని దాసుగారు దెలిపిరి. సహకారమార్గావలంబనమునకు 1. నిర్బంధితులవిమోచనము; 2. బ్రిటీషు సామ్రాజ్యాంతర్గత స్వపరిపాలనము; 3. మంత్రుల బాధ్యతను వృద్ధిచేయుట; 4. మంత్రులను, కార్యనిర్వాహకసభ్యులను నాయకనిర్వాచితులను నియమించుట. 5. వెంటనే స్వరాజ్యనిర్మాణ సాధనములను ప్రభుత్వమును వివిధజాతులును కలిసి నిర్ణయించుట మొదలగు సాధనములను నిర్ణయించెను. దౌర్జన్యమును సంపూర్ణముగ నిరసించుచు శాంతిసాధనమునె కీర్తించెను. సంధి సాధ్యముగానపుడు శాసనోల్లంఘనమే శరణ్యమని దాసుగారు తెలియబల్కిరి.

ఆంగ్లో ఇండియను పత్రికలు దాసుగారి సంభాషణమును ప్రస్తుతించుచు దేశక్షేమమునకు సహకారనీతి నవలంబించుటకు దేశబంధు దాసుగారిని హెచ్చరించుచున్నవి. నిరంకుశవిధానమును నిర్మూలనముచేయుటకు కంకణమును గట్టిన దాసుగారు సహకారవిధానమును దెలుపుచున్నారు. దాసుగారి యుపన్యాసము సత్వరస్వరాజ్యమును వెనుకకునెట్టినటులూహింపదగియున్నది. బిజెంటమ్మగారి పత్రిక న్యూఇండియా దాసుగారు స్వరాజ్యమును వెనుకకు నెట్టిరనియును సహకారనీతి నవలంబించుట ధర్మమనియును హితోపదేశము చేయుచున్నది. స్వరాజ్యపక్షమవలంబింపదలచిన ప్రతిష్టంభనవిధాన మనుష్ఠానయోగ్యము గాదనియును స్వరాజ్యపక్షనాయకులు మంత్రిపదవులను స్వీకరించుటసంభవమనియును పరిస్థితులు విశదముచేయుచున్నవి.

లిట్టను ప్రభువవలంబించిన దానభేదదండోపాయములు కొంతవరకు విజయమును బడసినను ప్రభుత్వము నడువవలసినమార్గ మంధకారబంధురముగ నున్నది. న్యాయబద్ధ ప్రభుత్వమున కలవాటుపడిన బర్కెను హెడు ప్రభువునకు నిరంకుశవిధానము భయసంభ్రమములను గలుగజేసియుండును. బర్కెను హెడు సంప్రతింపుల కిదియె కారణమైయుండును. దాసు బర్కెనుహెడుగారలసంప్రతింపులు గోప్యముగ నున్నను వారలకు సంప్రతింపులు జరుగుచున్న విధమును పత్రికలు తెలుపుచున్నవి. సంప్రతింపులఫలము ముందంజవేయుటయొ వెనుకంజవేయుటయొ దురూహ్యముగ నున్నది. మెస్టను ప్రభువు చచ్చిన ద్వంద్వప్రభుత్వమునె కొనియాడుచున్నాడు. ఓడ్వాయరువర్గము కాఠిన్యవిధాన

మును నుపదేశించుచున్నవి. పౌరసేవో ద్యోగములకు యువకుల నాకర్షించుటకు విశ్వ ప్రయత్నములు జరుగుచున్నవి. ముడ్డిమను కమిటి రిపోర్టుగతి యేమైనదియును దెలియ కున్నది. నిరంకుశధ్వజారోహకులు శ్వేత భవనమునందు సమావిష్టులై భారత రాజ్యాంగగతిని యథేచ్ఛను నిర్ణయించు చున్నను సన్నిహితసంబంధముగల భారతీయులకుమాత్రము జోక్యమును గలుగజేసి కొనుట కవకాశములు గనుపడవు.

రాజ్యాంగసమయజ్ఞుల దృష్టి దేశబంధు దాసుగారిమీదను లగ్నమగుచున్నది. స్వీయ మిత్రానుచరులు నిర్బంధితులై స్వపక్షావలంబనులుభిన్నాభిప్రాయులైఅనారోగ్యమునుగలిగి విషమస్థితియందున్న దేశబంధుదాసుగారేమి చేయ నున్నదియును కాలము తెలుపగలదు. నామమాత్రావశిష్టమైన అసహాయోద్యమమునకు ఫరీదుపురపు సంప్రతింపులును, దాసు బర్కెనుహెడు సంప్రతింపులును, రీడింగు బర్కెనుహెడు మంత్రాంగములును, నిపరుల మందలింపులును, ప్రజల నిరుత్సాహమును మంగళహారతి నిచ్చుటయందు విచిత్రము గనుపడదు.

* * * *

గాంధిదాసుల యొడంబడికలు

గతసంవత్సరమునందు ఉభయులకును జరిగినయొడంబడిక కనురూపముగను గాంధి మహాత్ముడు ప్రవర్తించుచు నుభయపక్షముల కును ధర్మారాధన విధానమును ప్రత్యక్షము చేయుచున్నాడు. మీర్జాపురము పార్కునందు గాంధిమహాత్ముడు రాజ్యాంగశాఖను దేశబంధు స్వాధీనము చేసినటులును వారిప్రయత్నములకు సంపూర్ణమైన సహాయమును జేయదలచినటులును తెలియజేసెను. అవసరమైనపుడు వారిప్రయత్నములకు దోడ్పడుటకును నంగీకారమును సూచించెను. గాంధి మహాత్ముని సంచారము స్వరాజ్యపక్ష ప్రచారమున కనుకూలముగాని ప్రతికూలము గాదని విశదముచేసెను. రాజ్యతంత్రనిపుణులయిన యధికారులతో సంధి ప్రయత్నములను జేయుటకు దనకు సామర్థ్యములేదని మహాత్ముడు తెలియజేసెను. ఆ సామర్థ్యము భరతవర్షమునకు గలుగుటకు నిర్మాణ విధానావసరమును విశదముచేసెను. రూసారోడు మందిరవిషయమునను దేశబంధుదాసుగారి విషయమునను మహాత్ముడు దెలిపిన విషాదము సామాన్యప్రచారకులపట్ల ననేక రెట్లుగను నన్వయించుచున్నది. త్యాగనిర్ణయమును దశాస్థితులభేదము ననుసరించకను నిర్ణయింపదగియున్నది. ప్రచారకులెందరోపడుచున్నపాట్లును, పనిలేక పరితపించుటయును వర్తమాన విషాదస్థితికి గారణమని యనుభవజ్ఞులకు దెలిసియున్నది. దాసుగారి సంస్మరణమునందె మహాత్ముని లక్ష్యమునందీ త్యాగపురుషులందరును గలరని మహాత్ముని భావములు విశదముచేయుచున్నవి. ప్రజలును ప్రచారకులును నిరుత్సాహభరితులయి కర్తవ్యము దోచకను పరితపించుచున్నవిధమును నిత్యవ్యవహారానుభవము విశదము చేయుచున్నది.

ఫరీదుపురము సంప్రతింపులకును వంగదేశ పర్యటనమునకును ఫలమేమైనను దేశబంధు దాసుగారి వ్యవహారాచరణమునకు మహాత్ముం డభయహస్త మొసంగునని వారి ప్రసంగాచరణములు విశదము చేయుచున్నవి. వివాదములకు మూలమైన యఖిలభారత జాతీయోపసంఘమును సమావేశము చేయక పోవుటయె మహాత్ముని సహనశీలమును కార్యదీక్షను విశదముచేయుచున్నవి. మహాత్ముడు తన విశ్వాసము నిర్మాణవిధానము నందు లగ్నమైనను దేశబంధు దాసుగారి కధికారవర్గముతో రాయభారమును నడుపుటకు సంపూర్ణ స్వాతంత్ర్యము నొసంగుటయును సహజము. సకలవిధములను రాజ్యాంగ రంగమునందు నూతనరంగ మాసన్నముగ నున్న విధమును దేశపరిస్థితులు విశదముచేయుచున్నవి. మహాత్ముని పర్యటనము ఫరీదుపురము సంప్రతింపులు దాసు బర్కెనుహెడు రాయబారములు రాజ్యాంగరంగమునందు నూతనాభినయమును గలుగజేయుట సంభవము.

* * * *

**నిర్మాణవిధానము**

గాంధిమహాత్ము డేప్రాంతమునకు బోయినను ఖద్దరుసందేశమునే పూరించుచున్నాడు. స్వరాజ్యసిద్ధికి అస్పృశ్యతానివారణము, వివిధ సంఘములకు సంయోగము, ఖద్దరున కండలుగనున్నవి. త్రివిధములైన సాధనములును ననుభవ సిద్ధము గానంతవరకును స్వరాజ్యము దుర్లభమని నిత్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. మహాత్ముడు దాసుగారితో జేసిన నియమానుసారముగను రాజ్యాంగాందోళనభాగమును స్వరాజ్యపక్షాధీనముచేసి వారివ్యవహారక్రమమున కేవిధమైన యాటంకములును గలుగకుండునటులు ప్రవర్తించుచున్నాడు. మహాత్మునకు దాసు నెహ్రూగారల పట్లగల భక్తివిశ్వాసములు స్వరాజ్యపక్షము పట్లగల భక్తివిశ్వాసములను విశదముచేయుచున్నది. దేశమోక్షమునకును స్వరాజ్యప్రాప్తికిని నిర్మాణవిధానమే శరణ్యమని దేశబంధు దాసుగారును వారియనుచరులును నంగీకరించినను వారిలక్ష్యము శాసనసభలమీదను స్థానికసంస్థలమీదను లగ్నమై నిర్మాణవిధానము దుస్తరమగుచున్నది. కాలమంతయును స్థానికసంస్థలందును ఖండనమండనములందును వినియోగపడునపుడు నిర్మాణవిధానమునందు మహాత్ముడు కోరునటు లుత్సాహముతో నిమగ్నమగుట యసంభవము. కాంగ్రెసుప్రచారకులు క్రమముగను వెనుకబడుచు స్వరాజ్యపక్షావరణమునందు జేరుచున్న విధమును దేశపరిస్థితులు విశదము చేయుచున్నది.

గాంధిమహాత్ముడు త్యాగధైర్యములును నాత్మవిశ్వాసమును గల కార్యపరతంత్రులు చేయగలది విశేషమున్నను లేకుండుటకు విచారమును దెలుపుచున్నాడు. మానవులకు నిష్కామకర్మను జేయుట యుత్తమమైనను ప్రయోజనములేకను కర్మనుజేయుట దుర్లభముగనున్నది. నాయకులు ప్రచార

కులు స్వరాజ్యపక్షావరణమునందు జేరుటకుగల కారణము ప్రయోజనాపేక్షయని విశదమగుచున్నది. ఉద్రేకపూరితులైన యువజనులయందు సన్న్యాసశీలమును గనుగొనుట దుస్తరము. నిర్మాణవిధానము ప్రబలుటకును సఫలమగుటకును ప్రచారకులకు ప్రయోజనమును సయితము గలుగజేయుట యవసరమని దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి.

ఈయవసరమును గ్రహించి దేశబంధుదాసు వహించిన స్వరాజ్యపక్ష నాయకత్వమునకు గాంధిమహాత్ము డభయహస్తము నొసంగుచున్నను నుద్యమప్రాబల్యమునకు ప్రయోజనవ్యాపన మవసరంబగుచున్నది. ఇతర ప్రయోజనములందు లక్ష్యమును నిలుపజాలని వారలలక్ష్యము ధిక్కారతిరస్కారములందును, నిందాక్షేపణలందును, రంధ్రాన్వేషణములందును, నిమగ్నమగుచు విషాదమయమైన దేశమునందు సంక్షోభమునకు గారణంబగుచున్నది. దృష్టిని నితరులలోపములను, వ్యవహారములను పరిశీలించుటకు వినియోగించుట దేశాభివృద్ధికి ప్రయోజనకరముగాదు. గాంధిమహాత్మునియాస్తివిషయమై ప్రశ్నించుటగాని, యితరుల యుద్దేశములను శంకించుటగాని, తప్పుల నెన్నుటగాని, సంక్షోభమునకు సాధనంబగుచున్నదిగాని బలశాంతులకు సాధనంబగుటలేదు. ప్రజలీసందర్భములను గ్రహించి వారిదృష్టిని స్వధర్మారాధనమునకు వినియోగించుట శ్రేయస్కరము. దేశావృతంబైన సంక్షోభమును బాపుటకు దేశబంధుదాసు గాంధిమహాత్ముడు చేయుచున్న విశ్వప్రయత్నమును ప్రజలు పాలించి స్వీయసంస్కారమునకనురూపముగను స్వధర్మారాధనమును జేసి కృతకృత్యులగుదురు గాక!

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7 Thambu Chetty Street, G. T. Madras.